ృద్భిరననుష్ఠితం ప్రాగ్భిర్బ్రాహ్మగోత్రమహిత్రైర సంస్కృతం వైదికైర్మం
త్రైః కించిదన్యద్గ్రాహ్యమితి నతత్రాస్త్యధికం లేఖనీయమిత్యాద్యస్య
రస్మనశ్శ్రౌతతానవద్యేతి సర్వంసమంజసం.

అథచ ద్వితీయస్య రుద్రాక్షధారణస్య. శ్రౌతతావిషయే విద్వ
న్నైస్సమాధేయాః ప్రశ్నాః (౧) కిమిదంధారణం రుద్రాక్షాణాం విధీ
యతే నిగమేషు (౨) కిమయం నిత్యోవిధిః (౩) శ్వేతానామేవవిహిత
యాకథ మివాశ్వేతాధార్యాస్స్యుః (౪) కింతద్ధారణం నిగద్యతే
స్మృతిషు (౫) కింతత్ప్రశస్యతే పురాణేతిహాసాభ్యాం (౬) కిమిదమ
నాపితం విద్యాస్థానేషు (౭) కిమిదంమోక్షజనకం (౮) అథ కిమిదం
ష్టై రనుష్ఠితమితి. చోపక్రమాద్వివృత్య ప్రశ్నానిరస్యంతే.

---

త్రజులైన శిష్టులచే యననుష్ఠితమై వైదిక మంత్రములచే య సంస్కృతమైనది
దియో గ్రాహ్యమని అందువిషయమై విశేషముగా వ్రాయ పనిలేదు. ఇందువలన
యవటిదగు భస్మకు శ్రౌతత్వము దుర్నిభేద్యమైనది.

ఇక రెండవదగు రుద్రాక్షధారణకు శ్రౌతత్వవిషయమై విద్వజ్జనులచే సమా
ధేయములగు ప్రశ్నలు [౧] ఈ రుద్రాక్ష ధారణ వేదముల యందు విధించ
బడుచున్నదా [౨] ఈ విధి నిత్యవిధియా ఏమి [౩] శ్వేతరుద్రాక్షలే విధించబడు
చే అశ్వేతము లెటుల ధారణయోగ్యములగు [౪] ఈ రుద్రాక్ష ధారణ
స్మృతులయందు విధించబడుచున్నదా ఏమి [౫] పురాణేతిహాసములచే ప్రశంసింప
బడినదా [౬] విద్యాస్థానములయందు అనిషిద్ధమైనదా [౭] ఇది మోక్షజనకమైనదా
[౮] ఇక నిది శిష్టులచే యనుష్ఠింపబడెనా ఏమి యనునవి. ఉపక్రమమునుండి వివ
రించి ప్రశ్నలు నిరసింపబడుచున్నవి.

తత్రచాయ మాద్యోయథా (౧) కిమిదం ధారణం రు... ణాంవిధీ యతే నిగమేష్వితి. అస్యాయమాశయః. విద్యానాం స్థా... మపి మూలభూత తయాధర్మ మూలతయాచ నిగమానాం యది... ప్రతిపాద్యేత ప్రకృతస్య శ్రౌతతా దుర్నివారేతి. అస్యేదం సమా... భస్మజాబాలే యథాస్థానం భస్మనా త్రిపుండ్రం శ్వేతేనైవధృత్వా... క్షాన్ శ్రౌతాన్ బిభృయాన్న తత్రసమ్మర్శ ఇతి. తథాపు ద్రాక్షజాబ్య... ర్యావిక్రమాదు ద్రాక్షాన్ ప్రశస్యంతే. బృహజ్జాబాలవ దేవమంత్ర... స్మృతాః. బిభృయాదితి తద్ధరణస్య విధిర్బోధితః తథా రామరహస్య... హ్రైమమంత్ర పురశ్చరణవిధౌ చతుర్థాధ్యాయే పద్మాక్ష తులసీ...

---

ఇందు మొదటి ప్రశ్న యెటులనగా (౧) ఈ రుద్రాక్షధారణము వేదములు... విధించబడుచున్నదా ఏమి. అనగా వేదములు సర్వవిద్యలకును మూలభూతము... ధర్మమూలములు నగుటచే నావేదములయందు రుద్రాక్షధారణము ప్రతిపాదించ... జేని ప్రకృతమగు రుద్రాక్షధారణకు, శ్రౌతత్వము నిరసింప శక్యముగా... ప్రాయము.

ఇందుకు సమాధానము. భస్మజాబాలమునందు. శ్రు; యథాస్థాన... మర్శః. స్థానము నతిక్రమించకుండునటుల శుద్ధమగు భస్మచే త్రిపుండ్రము... ములగు రుద్రాక్షలను ధరించవలయునని జెప్పంబడియె. అటులనే, రుద్రా... లమునందునను ఉపక్రమము మొదలుగా రుద్రాక్షలను ప్రశంసించిరదను బృహ... మునందువలె మంత్రములు పఠించబడినవి. ఇచట బిభృయాత్ అనే లిఙ... నీరుద్రాక్షధారణకు విధిబోధించబడినది. అటులనే రామరహస్యమున... పురశ్చరణవిధియందు చతుర్థాధ్యాయములో పద్మాక్ష తులసీకాష్ఠరుద్రా...

రుద్రాక్షకృతమాలయా ఇతి. రుద్రాక్షాణాం మాలా రామమంత్ర సాధనమిత్యపి గృహీతా. యద్యప్యత్ర తులసీకాష్ఠస్య సహానివేశ కృతః తథాపి తస్యాధార్యత్వాత్. రుద్రాక్ష సాహచర్యేణ ప్రకృత రామమంత్ర సాధనత్వ మనేన బోధ్యత ఇతి ధ్యేయం. రుద్రాక్ష ధారణస్య అన్యత్ర విధానాదీ హానకశ్చిద్విరోధః అతఏవ సర్వజపా వృత్తిగణన వినియోజ్యాక్షమాలా పరిగణనైదంపర్య ప్రవృత్తాయా మత్ర మాలికాయా ముపనిషది. ప్రవాళ మౌక్తిక స్ఫటిక రజితాష్టా పదచందన పుత్ర జీవికాబ్జ రుద్రాక్షా ఇతి నతులసీకాష్ఠస్య పరిగణనం. తథా బృహజ్జాబాలే రుద్రాక్షా నధికృత్య. సఏష భస్మజ్యోతీ రుద్రా

---

క్షమాలయా. పద్మాక్షలు తులసీకాష్టములు రుద్రాక్షలును వీటిచే కూర్చబడిన మాలికచే ననుశ్లోకముచేత రుద్రాక్షమాలిక. రామమంత్రసాధనమనియును గ్రహించబడినది. ఇచట తులసీకాష్ఠముయొక్క చేరికయును జెప్పంబడినది. ఐనను తులసీకాష్ఠముధరించ నర్హముగావున రుద్రాక్షలతో జేర్చినయడల ప్రకృతమగు రామమంత్ర జపమునకు సాధనమని యూహించవలయు. రుద్రాక్షధారణము వేరొకచో విధించబడుటవలన ఇచట విరోధశంక గలుగనేరదు. కావుననే సర్వవిధములగు మంత్రములయొక్క జపావృత్తిని లెక్కించుటయందు వినియుక్తములగు అక్షమాలికల పరిగణనమునకై తాత్పర్యమున ప్రవర్తించిన అక్షమాలికోపనిషత్తునందు శ్రు. ప్రవాళ ... రుద్రాక్షాః. పవ ళములు, ముత్యములు, స్ఫటికములు, రజితఘుటికలు, సువర్ణఘుటికలు, చందనకాష్ఠము. పుత్రజీవికాబీజములు, తామరసబీజములు, రుద్రాక్షలును. అను మంత్రమునందు తులసీకాష్ఠమునకు పరిగణనము లేదు. అటులనే బృహజ్జాబాలమునందు రుద్రాక్షల

షు ఇతి. ఏవం చతుర్భిరుప నిషద్భిరుపపాదితా ఇతి శ్రౌతతాచాస్య తద్ధారణస్య సుదృఢా ఇతి.

అథ ద్వితీయః ప్రశ్నః (౨) కిమయం నిత్యోవిధిరితి అస్యాయ మాశయః. విధీయతాం ప్రశస్యతాంచేదం నిగమేషు యదీదంస్యా న్నిత్యం తర్హి స్యాద నివార్యమితి. అస్యేదం సమాధానం బృహజ్జాబాలోపనిషది. అష్టమ బ్రాహ్మణే తృతీయఖండే అథభుసుండిర్జాబాలో మహాదేవం సాంబం ప్రణమ్యపునః పప్రచ్ఛ కింనిత్యం బ్రాహ్మణానాం కర్మకర్తవ్యం యదకరణే ప్రత్యవైతి బ్రాహ్మణః ఇత్యనేన నిత్యతయా బ్రాహ్మణానాం కింకర్మ కర్తవ్యమితి ప్రశ్న ముపన్యస్య యథాస్థానం భస్మనా త్రిపుండ్రం శ్వేతేనేత్యుక్త్వా తదుపరి రుద్రా

---

క్షనుద్దేశించి సవిష భస్మజ్యోతి రుద్రాక్షః. అయిూభస్మజ్యోతిస్సు గదా రుద్రాక్షము అని చెప్పబడియుండెను. ఇటుల నాలుగు యుపనిషత్తులచే ప్రతిపాదింపబడుటను ఈ రుద్రాక్ష ధారణకు శ్రౌతత్వము దృఢమైనది.

ఇక రెండవ ప్రశ్న (౨) ఇది నిత్యవిధియా యేమి. అనునది. అనగా ఇది వేదములయందు విధించబడి ప్రశంసించబడుగాక, ఇకను నిత్యవిధియగుచో నీ యల్లరకుననివార్యమగునని యభిప్రాయము.

ఇందుకు సమాధానము. బృహజ్జాబాలమున అష్టమ బ్రాహ్మణమునందు తృతీయఖండమములో శ్రు. అథభుసుండిర్జాబాలో ... బ్రాహ్మణః. అనంతరమున జాబాలుడను మహర్షి పార్వతీసహితుడగు మహాదేవుని ప్రణమిల్లి తిరుగా పృచ్ఛజేసె. బ్రాహ్మణులకు నిత్యమగు కర్మమెద్ది. యేకర్మము నాచరించకున్న బ్రాహ్మణుడు ప్రత్యవాయమును జెందు అనువచనముచే బ్రాహ్మణులు నిత్యముగా జేయదగినకర్మ యేదియని ప్రశ్నము నుపన్యసించి. శ్రు. యథాస్థానం... నైవతత్ర సమ్మర్శః. స్థానము నతిక్రమించకుండునటుల శుద్ధమగు విభూతిచే త్రిపుండ్రమును ధరించవలయునని వచించి యనంతర

ష్ఠా శ్వేతావా౽శ్వేతావానైవ తత్రసమ్మర్శ ఇతి నిత్యతయానుష్ఠేయ ధర్మేష్వేవాస్యాపి రుద్రాక్షధారణస్య పరిగణనాదస్యాకరణే ప్రత్య వాయ జనకత్వరూప నిత్యవిధిత్వం సిద్ధం ఇతి.

అథచాయం తృతీయః ప్రశ్నః (3) శ్వేతానామేవ విహితతయా కథమివా౽శ్వేతా ధార్యాస్స్యురితి. అస్యేదమాకూతం రుద్రాక్షాణ్ శ్వేతానేవ బిభృయాదితి. బ్రాహ్మణో బిభృయాచ్ఛ్వేతా నిత్యాదినా శ్వేతాదీనామేవ విధానాత్. తేషాంప్రకృతే అలాభాచ్చ తద్ధారణం నసంభవతీతి. అస్యాయం విదళన పరిపాటీ విప్రేషుక్లాతు మృచ్ఛౌచే రక్తాక్షత్రేవిధీయతే. హారిద్రవర్ణా వైశ్యేతు శూద్రే కృష్ణాం వినిర్దిశే దితి పరాశర మాధవీయగత వచన విహితాయా శ్వేతాయాశ్శౌచ

---

మున. రుద్రాక్షలు తెల్లనివైనను గాకుండినను ధరించవలయును. ఇందువిషయమై విచారణ యనవసరమని నిత్యముగా యనుష్ఠింపదగిన ధర్మములయందే పరిగణనమువలన నీ రుద్రాక్షధారణకు జేయకున్న ప్రత్యవాయజనకమను నిత్యత్వము సిద్ధమైనది.

ఇకమూడవప్రశ్న (3) శ్వేతరుద్రాక్షలే విధింపబడుటచే తదితరము లెటుల ధారణార్హములగు. ననునది అనగా, ప్రశ్న. రుద్రాక్షాణ్ శ్వేతానేవ బిభృయాత్. తెల్లనగు రుద్రాక్షలనే ధరించవలయును. బ్రాహ్మణో బిభృయాచ్ఛ్వేతాణ్. బ్రాహ్మణుడు తెల్లనగు రుద్రాక్షలనే ధరించవలయునను నీ మొదలైన వచనములచే తెల్లనగు రుద్రాక్షలే విధింపబడినవి గావున. నవి ప్రస్తుతము లేకుండుటచే. నారుద్రాక్షధారణను సంభవించదని యభిప్రాయము.

ఇందుకుసమాధానము. శౌచవిషయమై విప్రునకు శ్వేతమృత్తును క్షత్రియునకు రక్తమృత్తికయు, వైశ్యునకు పీతమృత్తికయు, శూద్రునకు కృష్ణమృత్తికయు విధించబడియున్నను.

పరాశర మాధవీయగతమగు వచనముచే విహితమైన. శ్వేతమగు శౌచమృత్తు

మృదశితాదృగలాభే. గుణలోపేచ ముఖ్యస్యేతి న్యాయేన యథా సంభవం మృత్తికాయా గ్రహణం తథైవ తేనైవన్యాయేన తతోపి శ్వేత రుద్రాక్షాణామలాభేపి యథాసంభవం రుద్రాక్షధారణస్యైవ న్యాయ్యత్వాత్, అతఏవ విప్రాదీనాంక్రమాచ్ఛ్వేతం రక్తంపీత మథాసితం తథాలాభే యథాలాభం ధారణీయ మదూషిత మితి శివపురాణ వచనమపిసంగచ్ఛతే. యత్త్వత్రోక్తం బ్రాహ్మణో బిభృయాదిత్యాది వచన విరుద్ధస్య తథాలాభే యథాలాభ మిత్యాది వచనస్యా ప్రమాణత్వా దితి, తదపి శ్రుత్యంతరా పరిజ్ఞానమూలం. బృహజ్జాబాలోపనిషది అష్టమబ్రాహ్మణే తృతీయఖండే. రుద్రాక్షాశ్శ్వేతావా అశ్వేతావానైవ

---

లభించకున్నరు. గుణలోపేచముఖ్యస్య గుణము లోపించినను ముఖ్యమునకు త్యాగము లేదను న్యాయముచే యథా సంభవముగా మృత్తికా గ్రహణ మెటులనో అటులనే అదే న్యాయముచేత ప్రాకృతమనను శ్వేతరుద్రాక్షలు లభించకున్నను యథా సంభవమున రుద్రాక్షధారణమే న్యాయమను. కావుననే శ్లో॥ విప్రాదీనాం ... అదూషితల విప్రులు మొదలగు వారలకు శ్వేతాదులు క్రమమున ధారణార్హములగు యటులనగా, విప్రలకు శ్వేతములును క్షత్రియులకు రక్తములును వైశ్యులకు పీతములును శూద్రులకు కృష్ణములును యని యభిప్రాయము. అటుల దొరకకుండినయడల యథాలాభమున ధరించవలయునను శివపురాణ వచనమున్ను సంగతమగుచున్నది. ఇందు విషయమై బ్రాహ్మణుడు శ్వేతరుద్రాక్షలనే ధరించవలయునను నీ మొదలైన శ్రుతి వచనములకు విరుద్ధమగు తథాలాభే యథాలాభం. అటుల దొరుకకున్న యథాలాభమున ధరించవలయునను నీపురాణవచనము. అప్రమాణమగునను నేపూర్క్తిగలదో అనియనిన్. శ్రుత్యంతరము నెరుగకుండుటచే జెప్పంబడినది, బృహజ్జాబాలోపనిషత్తునందు, అష్టమబ్రాహ్మణమున, తృతీయఖండములో రుద్రాక్షలు తెల్లనివైనను గాక

త్ర సమ్మర్శ ఇతి. భస్మజాబాలేపి రుద్రాక్షాన్ శ్వేతానేవ బిభృ యాన్న తత్ర సమ్మర్శ ఇత్యనేనచ రుద్రాక్షేషు శ్వేతాశ్వేత విమర్శనం వినానిత్యతయా ధార్యత్వస్య ప్రతిపాదనాత్. కించ తామ్రాస్స్నిగ్ధా వృత్తాస్థూలా ఇత్యాదినా తామ్రాదీనామపి విధానాత్. శ్వేతాదీనాం వృత్తపర్యాయత్వాచ్చ నతరామయం ప్రశ్నస్సంగత ఇతి.

అథ చతుర్థః ప్రశ్నః (౪) కింతద్ధారణం నిగద్యతే స్మృతిష్వితి. అస్యాయమాశయః స్మృతీనాం ధర్మనిర్ణయార్థం తాదర్థ్యేన ప్రవృత్త తయా యదితాసు ప్రతిపాద్యేత తర్హ్యనవద్యంస్యాదితి. అస్యేదం సమాధానం. బహుశ్రుతి ప్రతిపాదితస్యాస్య రుద్రాక్షధారణస్య నైవస్మృత్యపేక్షా, తథాపి ప్రదర్శ్యతే. హారీతః శంఖరూప్య మయీమాలాకాంచ నీభిరథోత్పలైః పద్మాక్షైరపి రుద్రాక్షైః విద్రుమైర్మణి మౌక్తికై రితి.

---

స్సను ధరించవలయు, ఇంక వివేచన యనవసరమని చెప్పబడియె, భస్మజాబాల మందునను తెల్ల రుద్రాక్షలనే ధరించవలయునని తెల్లనివేయను అర్థమునందు నియమములేదని చెప్పుటచేతను రుద్రాక్షల విషయమై శ్వేతాశ్వేత విచారమును వదలి నిత్యముగా ధరించతగినవనుటయే ప్రతిపాదించబడుచున్నది. మరియును తామ్రాస్స్నిగ్ధాః అని ఈ మొదలుగా గల రుద్రాక్షలును విధింపబడియుండుటవలనను శ్వేతాది శబ్దములు వృత్తపర్యాయము లగుటవలనను ఈ ప్రశ్న సంగతమైనదికాదు.

ఇకనాలవప్రశ్న (౪) ఈరుద్రాక్షధారణ స్మృతులయందు చెప్పబడుచున్నదా అనునది. అనగా స్మృతులు ధర్మనిర్ధారణకొరకై ప్రవర్తించిన వగుటచేత ఈరుద్రాక్షధారణ స్మృతులయందు చెప్పబడెనేని శ్రేష్ఠమగునని యభిప్రాయము. ఇందుకు సమాధానము అనేకశ్రుతులచే ప్రతిపాదింపబడిన ఈ రుద్రాక్షధారణకు స్మృత్యపేక్ష యుండకను అయినను గనుపరచుచున్నారము. హారీతుడు శంఖ ... మౌక్తికైః శంఖములచేతను వెండిచేతను సువర్ణముచేతను తామరపీజములచేతను రుద్రాక్షలచేతను పగడములచేతను మణులచేతను ముత్తెములచేతను జపమాలిక ఏర్పరచతగినదని వచించె.

గౌతమస్తు మాలా సు తారతమ్యం వదన్ పద్మాక్షైర్దశలక్షంతు సౌవర్ణైః కోటిరుచ్యతే. కుశగ్రంథ్యాచ రుద్రాక్షై రనంతఫలముచ్యతే. ఇత్యన్యేపి స్మర్తారః ప్రశంసంతి రుద్రాక్షం. యద్యపి ప్రహ్లాదస్మృతౌ నధారయంతి యేమాలాం తులసీకాష్ఠ సంభవాం. నరకాన్న నివర్తంతే దగ్ధాః కోపాగ్నినాహరే రితివచనేన సర్వైస్తులసీకాష్ఠ ధారణం కర్తవ్యమితి తదప్యాశామాత్రం. అశ్రౌతత్వాదస్యా ఆసుర్యాస్స్మృతేః క్వాపినిబంధనే కేనాపినిబంధార్ అగ్రహణాత్. అశిష్ట పరిగ్రహాత్ అనార్షత్వాత్ అననుష్ఠాపకతా అథమన్యాసుహే. ప్రకృతాం సైద్ధాంతికీం పద్ధతిం అనుకల మవలంబమానానాంస్మృతిం కథంకారంచనభగవతః కమలాక్షస్య యదుకులపతేః. క్షిపామ్యహం హితాన్మూర్ఖానాసురీష్వేవయో

---

గౌతముడును జపమాలికలయందు ఎచ్చుతగ్గును చెప్పదలంచినవాడై. పద్మాక్షైః ... ఉచ్యతే. తామరవిత్తులచేత జపించెనేని దశలక్షగుణితమగు ఫలంబును సౌవర్ణములచేత జపించెనేని కోటిగుణితమగు ఫలంబును దర్భముడి చేతను రుద్రాక్షలచేతను అపరిమితంబగు ఫలంబును కలుగునని చెప్పె. ఇటుల నితరులగు స్మృతికర్తలును రుద్రాక్షను విశేషముగా ప్రశంసించుచున్నారలు. ప్రహ్లాదస్మృతియందు. నధారయంతి ... హరేః. తులసీకాష్ఠములచే రచింపబడిన మాలికను యెవరలు ధరించరో వారలు విష్ణుయొక్క కోపాగ్నిచే దహించబడినవారలై నరకమునుండి తిరుగా రాబోరను వచనముచేత నందరును తులసీకాష్ఠమును ధరించవలయునని చెప్పుటయు యుక్తముగాదు. ఈ రాక్షసస్మృతి అవైదికమగుటవలనను యే నిబంధనమునందు యేనిబంధనకర్తచేతను గ్రహించబడకుండుటవలనను శిష్టులచే పరిగ్రహించబడకుండుటవలనను ఆర్షముగాకుండుటవలనను అనుష్ఠాపకమైనదిగాదు. ఇక ప్రకృతమగు సిద్ధాంతపద్ధతి నవలంబించినవారలకు, అట్టిమూర్ఖులను రాక్షసయోనులయందే బడవేయుచున్నానను

స్మృతివచనస్స్వవిషయే కుర్వాత్. అథ కథంవోపాలబ్ధ సనకస్మృతౌ. సుహృత్తులసీకాష్ఠధారణం సజీవతపనసత్సంప్రదాయ ప్రవర్తకవచనమణి మాలామంజుళయోః వృద్ధహారీత వైష్ణవసనకవ్యపదేశ వచనరూపయోః స్మృత్యోరితి కించతులసీకాష్ఠ సంభూతాం స్కంధేమాలాంబిభర్తియః సశూద్రవద్బహిష్కార్య స్సర్వస్మాద్ద్విజకర్మణః. ఇత్యాదినాబహుస్మృతి నిందితత్వాత్. ద్విజాతిరిక్తాధికారికమేవేతిసిద్ధం స్కంధేతులసీకాష్ఠ ధారణనిషేధస్యాపి త్వదుదాహృతవచనస్య కంఠేతన్నిషేధకత్వా సంభవా దితి. తదపి వినాసంధానపంగం అత్యంతాశ్లీలఫలప్రాపకం. అపిన విదితంనవ్య సైద్ధాంతికై స్త్రికాలజ్ఞై స్స్మర్తృభిః. స్కంధేకంఠే శిఖాయాంవాయస్తుధారయతేమణీన్ దైవేకర్మణి పిత్ర్యేచతం విప్రందూరత స్త్యజేదితికంఠగ్రహేణాపి తద్ధారణస్యనిషేధః. తత్రచేదుక్తం నథా.

---

శ్రీకృష్ణమూర్తియొక్క వచనము స్వవిషయమెట్లుగాకుండేని. ఇక సజీవదహనమను సత్సంప్రదాయమునకు ప్రవర్తకములగు వచనమణి మాలికలచే మనోహరములగు వృద్ధహారీతసనక స్మృతులయందు తులసీకాష్ఠధారణను స్నేహితుడనుయటుల స్వవిషయముగా జేసుకొనకుండేని. మరియును తులసీకాష్ఠమువలన జేయంబడిన మాలికను స్కంధము నందు ధరించుచున్నట్టి అట్టినరుడు సమస్తములగు ద్విజకర్మలనుండీ శూద్రుడువలే బహిష్కృతుండగునని ఈమొదలుగా బహుస్మృతులచే నిందింపబడుటవలన ఈ తులసీకాష్ఠధారణకు ద్విజేతరులే యధికారులగుదురని తాత్పర్యము. మరియును స్కంధమున తులసీకాష్ఠధారణనిషేధింపబడినను కంఠమున ధరించుటకు నిషేధములేదుగదాయన్న పక్షవచనమునకలదో అదియును స్కంధమునబడకుండునటుల కేవలముకంఠమునందేవుంచిన యడల మిగుల నశ్లీలమైనఫలమునకు ప్రాపకమగును ఇదియునుంగాక త్రికాలజ్ఞులగుస్మృతికర్తలచే స్కంధేకంఠే...దూరతస్త్యజేత్. స్కంధమునందుగాని కంఠమునందుగాని ధరించునరుని దూరముగావిడువవలయునని కంఠగ్రహణముచేతను తులసీకాష్ఠధారణకు నిషేధము జెప్పంబడియె. ఇచట యవరలు తులసీకాష్ఠమాలికను ధరించరో అను

రయంతి యే నూలాం తులసీకాష్ఠసంభవా. మిత్యాదివచన పర్యాలోచన యాత్వదుదాహృత వచనస్య తులసీమణి ధారణ వ్యతిరిక్త మణిధారణ విషయత్వాత్. అతఏవ రుద్రాక్షధారిణం విప్రం సదాభస్మాను లేపినం సకులంతంత్యజేన్నిత్యం సర్వకర్మ బహిష్కృతమితీతి. తదప్యాత్మనో శ్రౌతత్వప్రకాశకమేవ. పూర్వోక్త ప్రహ్లాదస్మృతివచనస్య ద్విజాతిరిక్తాధికారికత్వస్య పురతఏవ నిరూపితత్వాత్. కించ కాసాంచిత్ స్మృతీనాం శ్రౌతమణిధారణ దూషణపరత్వాంగీకారే చావంపరిబిభావయిషూణాం శలభానామివస్వేషాం స్వరూపాసిద్ధేః దుర్నివారత్వాత్. బహుశ్రుతి స్మృతీతిహాస పురాణ ప్రతిపాదితానాం రుద్రాక్షాణాం దూషకంయద్వచనం తత్సంగచ్ఛత ఇతి వక్తుర్హృదయస్య వైశద్యేన విస్ఫుటితత్వాత్. ధారణం రుద్రాక్షాణాం బహుస్మృతి సంప్రతిపన్నమితి.

---

నీ మొదలైన వచనములయొక్క పర్యాలోచనచే స్కంధేకంఠే అను శ్లోకమునకు తులసీకాష్ఠధారణకంటె నితరములగు మణులయొక్క ధారణవిషయముగా చెప్పబడినది. కావుననే రుద్రాక్షధారియు నెప్పుడును భస్మానులేపనంబు నాచరించు విప్రుడు సర్వకర్మబహిష్కృతుడుగావున వంశంబుతోడ వానిని త్యజించవలయునని జెప్పబడెననుటయేదిగలదో అదియు తమకవైదికత్వమును ప్రకటనజేయును పూర్వమునందు చెప్పబడిన ప్రహ్లాద స్మృతివచనమునకు ద్విజేతరులే అధికారులని పూర్వమే నిరూపించబడియె కొన్నిస్మృతివచనములకు వైదికములగు మణులయొక్క ధారణవిషయమై దూషకత్వ మంగీకరించినయెడల. కారుచిచ్చును పరిభవింపదలచిన మిడుతలకువలె తమకే స్వరూపనాశనము దుర్నివారమైనది. అనేకములగు స్మృతీతిహాసపురాణములచే ప్రతిపాదింపబడిన రుద్రాక్షులను దూషించెడువచనము న్యాయసిద్ధమైనదిగానేరదు ఇందుచే రుద్రాక్షయొక్క ధారణము బహుస్మృతి సంప్రతిపన్నమైనదని జెప్పబడియె.

అథ పంచమః ప్రశ్నః (౫) కింతత్ర్పశస్యతే పురాణేతిహాసాభ్యాం ఇతి. అస్యేదం సమాధానం యద్యప్యయమపి ప్రశ్నో బల్బజః బహుశ్రుతి స్మృతి ప్రతిపాదితత్వాత్. తథాపి ప్రతిపాద్యతే పురాణేతిహాసయోః యథా స్కాందే లక్షకోటి సహస్రస్య లక్షకోటి శతస్యచ. జపేచల భతేపుణ్యం నాత్రకార్యావిచారణా. ఉచ్ఛిష్టోవావికర్మస్థ స్సంయుక్త స్సర్వపాతకైః లిప్యతేనసపాపేన రుద్రాక్షస్యతుధారణాత్. కంఠే రుద్రాక్షమాలాంయ ధృతాతుక్రియతేయది సోపిరుద్రత్వమాప్నోతి కిం పునర్మానుషాదయ ఇతి. తత్రైవప్రదేశాంతరే భక్తిహీనో థవాభక్తో మూర్ఖో మూర్ఖతరోపివా. రుద్రాక్షం ధారయేద్యస్తు ముచ్యతే పాత కైరయం మహావ్రతమిదం ప్రాహుర్మున యస్తత్వదర్శినః రుద్రాక్షధారణ పుణ్యం కేనవాసదృశంభవేత్. ఇత్యాది ప్రతిపాదితం తథా లైంగకౌర్మా దిషుచ పురాణేషు శివరహస్యేప్యనంతం వచనజాతమితి. పురాణేతిహాస యో స్సర్వోత్తరా ప్రశంసాసిద్ధా ఇతి,

---

ఇక నైదవప్రశ్న (౫) ఈ రుద్రాక్షధారణ పురాణేతిహాసములచే ప్రశంసింప బడునా అనునది. ఇందుకు సమాధానము- ఇదివరకు అనేకములగు శ్రుతిస్మృతులచే ప్రతిపాదింపబడుటవలన పురాణాదులలో జెప్పబడునా అనుప్రశ్నయే బల్బజమైనది. అయినను పురాణేతిహాసములయందున్ను గనపరచుచున్నాగము స్కాందమునందు లక్ష కోటి ... మానుషాదయః. రుద్రాక్షలతో జపించగా లక్షకోటి సహస్రగుణితంబును లక్షకోటి శతగుణితంబును పుణ్యముగలుగు నందుకు సందియములేదు పతితుండుగాని సర్వపాతకయుతుండుగాని రుద్రాక్షధారణవలన పాపముచే స్పృశించబడడు కంఠ మున రుద్రాక్షమాలికను ధరించెనేని. రుద్రత్వమునుజెందు భక్తిహీనుడుగాని భక్తుం డుగాని. అతిమూర్ఖుండుగాని విశేషజ్ఞుడుగాని రుద్రాక్షనుధరించెనేని సర్వపాతక వినిర్ముక్తుండగు. యథార్థవిదులగు మునులు యీ రుద్రాక్షధారణను గొప్పవ్రతముగా వచించిరి యీ రుద్రాక్షధారణతోడ నేదియు సమానముగాదని జెప్పంబడియె. ఇట్లు లైంగకౌర్మాది పురాణాదులయందును శివరహస్యమునందునను విశేషమగు వచనజా తము రుద్రాక్షధారణను ప్రశంసింపుచున్నది. ఇందుచే పురాణేతిహాసములయందునను రుద్రాక్షధారణయొక్క ప్రశంసప్రసిద్ధమైనది.

అథషష్ఠః ప్రశ్నః (౬) కిమయం మోక్షజనక ఇతి. అస్యేదమా కూతం పురుషార్థేషు చతుర్ష్వపి చరమస్యైవ నిత్యానందకారణతయా తస్యైవప్రార్థనీయత్వాత్. యదీదంస్యాత్తజ్జనకం తర్హి తదవశ్యమనుష్ఠేయంస్యాదితి. అస్యేదంసమాధానం యద్యప్యయమపి ప్రశ్నో౽సంగతః యతః నిత్యతయావిహితస్య సమనుష్ఠేయత్వం సిద్ధరపలపం తథాపి సమాధీయతే బ్రహ్మకైవర్తే. కిం సూక్తైర్బహుభిస్సమంత్రకమిదంస్వాంగే సదాధారకః సంసారంనపునః ప్రయాతి మనుజో వక్ష్యేనవద్యైతవ రుద్రాక్షద్రుమపుష్పపల్లవ ఫలస్పృష్టానిల స్పర్శనాత్. దూరస్థాస్తరవస్తృణాన్యపిలతాయాం త్యక్షయంతత్ఫలం. తత్సంభవ్యద్రుమజాత లక్షణమణిం బిభ్రత్యజస్రం నరోముంచేత్సంసృతిబంధనాదితిపునశ్చిత్రంనకించిత్ప్రియే. ఇత్యాదినా ప్రతిపాదితం ఏవం రుద్రాక్షజాబాలాద్యుపనిషత్సు బహుష్వపి పురాణేషుచ ముక్తిజనకత్వమస్య నిర్వివాదమితి.

---

ఇక నారవప్రశ్న (౬) ఇది మోక్షజనకమైనదా. అనునది, అనగా నాలుగు పురుషార్థములయందు చివరదగు పురుషార్థమే నిత్యానందకారణమగుటచే నదియే కోరదగినదగుటచేతను ఈరుద్రాక్షధారణ మోక్షజనకమగునేని అవశ్యమనుష్ఠించతగినదని యభిప్రాయము. ఇందుకు సమాధానము. నిత్యముగా విధించబడినధర్మము అనుష్ఠించితీరవలెగావున మోక్షజనకమగునేని అవశ్యమనుష్ఠించతగినదను ప్రశ్నయసంగతమైనది. అయినను మోక్షజనకత్వమును గనుపరచుచున్నారను బ్రహ్మకైవర్తమునందు కిం సూక్తైః ... నకించిత్ప్రియే ఈ రుద్రాక్షను సమంత్రకముగా శరీరమున ధరించినవాడు సంసారమును తిరుగా పొందడని విశేషముగా నేమిజెప్పవలయు. రుద్రాక్షవృక్షముయొక్క పుష్పపల్లవ ఫలములను స్పృశించిన వాయువుయొక్క స్పర్శమువలన దూరస్థములగు వృక్షగుల్మ లతాదులును అక్షయమగు సుకృతమును జెందు. అట్టిపుణ్యవృక్షమున జనించిన రుద్రాక్షలను ధరించిన మనుజుడు సంసారబంధమును విడుచునుట చిత్రముగాదని ఈమొదలుగా చెప్పంబడినది. ఇట్లు రుద్రాక్షజాబాలము మొదలగు ఉపనిషత్తులయందునను అనేకములగు పురాణములయందునను ఈ రుద్రాక్షధారణము ముక్తిజనకత్వము వివాదరహితమైనది.

అథ సప్తమః ప్రశ్నః (౭) అథకిమిదం శిష్టైరనుష్ఠితమితి, అస్యేదంహృదయం శ్రుతిస్మృతి పురాణేషు విధీయతామిదంనిత్యతయా ప్రశస్యతాంచ ముక్తిజనకత్వేన తథాపి యదీదంస్యాచ్ఛిష్టైరనుష్ఠితం తర్హిస్యాత్సర్వైస్సమనుష్ఠేయం ఇతి. అస్యేదం సమాధానం రుద్రాక్ష ధారిణో మహర్షయః సనత్కుమార సమరనిదాఘ కాత్యాయనదత్తాత్రేయ భరద్వాజ కపిలవశిష్ఠ పైప్పలాదముఖాః. రుద్రాక్షజాబాలాది షూపనిషత్సు ప్రశంసితాః తథాపాద్మేచ. అథ రామగిరౌరామః పుణ్యే గోదావరీతటే భూతి భూషిత సర్వాంగో రుద్రాక్షాభరణైర్యుత ఇతి. శ్రీరామస్యాపి తద్ధారణంస్మృతం. సూతసంహితాయాం ఏతస్మిన్నంతరే శ్రీమాన్ మహాకారుణికోత్తమః కృష్ణాజినోత్తరీయశ్చ ఆషాఢేనవిరాజితః భస్మోద్ధూళిత సర్వాంగశ్శుద్ధ తిర్యక్త్రిపుండ్రధృక్. రుద్రాక్ష

---

ఇక నేడవప్రశ్న (౭) ఈ రుద్రాక్షధారణ శిష్టులచే యనుష్ఠింపబడెనా అనునది. అనగా శ్రుతిస్మృతి పురాణేతిహాసములయందు నిత్యముగా విధింపబడుగాక ముక్తిజనకముగా ప్రశంసింపబడుగాక అయినను ఇది శిష్టులచే అనుష్ఠింపబడెనేని యల్లరకు ననుష్ఠేయమగునని యభిప్రాయము. ఇందుకు సమాధానము. రుద్రాక్షధారులైన మహర్షులు సనత్కుమారుడు సమరుడు నిదాఘుడు కాత్యాయనుడు దత్తాత్రేయుడు భరద్వాజుడు కపిలుడు వశిష్ఠుడు పైప్పలాదుడు ఈ మొదలగువారలు రుద్రాక్షజాబాలము మొదలగు ఉపనిషత్తులయందు ప్రశంసింపబడిరి. నటుల పద్మపురాణమునందు అథ రామగిరౌ ... యుతః. అనంతరను పుణ్యమగు గోదావరీతీరమున చిత్రకూటమునందు రామచంద్రుడు భస్మచేయలంకరింపబడిన సర్వాంగములు గలవాడై రుద్రాక్షాభరణయుతుండును యనుచు శ్రీరామునకు రుద్రాక్షధారణ చెప్పబడినది సూతసంహితయందు ఏతస్మిన్నంతరే ... స్వయమాగతః ఇట్టిసమయమున మిగులదయాశాలియు, కృష్ణాజినము నుత్తరీయమునుగా ధరించినవాడును. పలాశదండముచే శోభిల్లువాడును, భస్మచే సర్వాంగోద్ధూళన మాచరించినవాడును. శుద్ధభస్మచే తిర్యక్త్రిపుండ్రమునుధరించి రుద్రాక్షమాలికలే ఆభరణములుగాగలవాడై పంచాక్షరిని జపించుచు

మాలాభరణోజపన్ పంచాక్షరంముదా. శిష్యైస్తాదృగ్విధైర్యుక్తో
మహాత్మా స్వయమాగత ఇతి. సత్రావసానే సన్నద్ధా ఇతి. ప్రస్తుత్య
ఋషివర్ణనావసరే ఋషయోమృదవస్స్వస్థా స్సర్వద్వంద్వ వివర్జితాః
రుద్రాక్షమాలాభరణా స్సితభస్మావకుంఠితాః ఇతి. విశిష్టధర్మ గ్రహ
ణార్థినస్స్నాపనీయాన్ ఋషీన్ ప్రస్తుత్య భస్మోద్ధూళిత సర్వాంగా
స్త్రిపుండ్రాంకితమస్తకాః రుద్రాక్షమాలాభరణాః జటావల్కలధారిణ
ఇతి. పురా శ్వేతాదిరిష్యంతా మునయోమునిసత్తమాః సంఖ్యాచశతమే
తేషాం సహద్వాదశసంఖ్యయా. తపతే భస్మదిగ్ధాంగా స్త్రిపుండ్రాంకిత
మస్తకాః. రుద్రాక్షమాలాభరణాః రుద్రారాధనతత్పరాః. ఇతిచ ప్రతి
పాదితం తథా బహుష్వపిపురాణేషు బహవస్తద్ధారిణః ప్రశంసితా ఇతి.
మహతీయమనుష్ఠాతృ ప్రశంసా. తదేవం ప్రకృతస్య రుద్రాక్షధార
ణస్య బహుశ్రుతిస్మృతి పురాణేతిహాస ప్రతిపాదితత్వాత్. నిత్యత్వాచ్చ

---

ఆత్మతుల్యులగు శిష్యులతోడ పూజ్యుండగు మహానుభావుండు జనుదెంచెననియు సత్రా
వసానే సన్నద్ధాః అనియును ప్రస్తావించి ఋషులవర్ణించు నవసరమున ఋషయః...
తత్పరాః, శమదమాదిగుణసంయుక్తులును సమస్తమగు ద్వంద్వదోషమును విడచినవార
లును రుద్రాక్షమాలికలే ఆభరణములుగా గలవారనియును మరియును ప్రదేశాంత
రమున విశిష్టధర్మగ్రహణార్థులును స్తోత్రార్హులైన ఋషులను ప్రస్తావించి భస్మో
ద్ధూళిత సర్వాంగులును రుద్రాక్షమాలాభరణులును జటావల్కలధారులనియును పూ
ర్వము శ్వేతుడు మొదలుకొని రిషిపర్యంతము నూటపన్నిద్దరగు మహర్షులున్ను భస్మ
దిగ్ధాంగులును త్రిపుండ్రాంకిత మస్తకులును రుద్రాక్షమాలికలే ఆభరణముగా గలవా
రును రుద్రారాధనయం దాసక్తులనియును చెప్పబడియున్నది. ఇట్లు అనేకములగు
పురాణములయందు అనేకులు రుద్రాక్షధారులు ప్రశంసింపబడిరి. గావున యనుష్ఠాత
లయొక్క ప్రశంస విస్తారముయినది. ఈప్రకారము ప్రకృతమగు రుద్రాక్షధారణ
మనేకములగు శ్రుతి స్మృతి పురాణేతిహాసములచే ప్రతిపాదింపబడుటవలనను నిత్యవిధి

సర్వజన సమనుష్ఠేయత్వం దురపహ్నవమితి ద్వితీయస్య రుద్రాక్షధారణస్య శ్రౌతతా సిద్ధా.

అథ తృతీయస్య శివలింగస్య శ్రౌతతా మీమాంస్యతే. ప్రకృతస్యహి ధారణే పూజనేచ వినియోగః ధారణమధికృత్య శ్రౌతమేవహి ధారణం లింగస్యేతి ప్రకరణాంతరమారబ్ధం, తత ఏవ తద్విషయక ప్రశ్న తద్వివరణ తత్సమాధానాదికంచ భవతీతి విజ్ఞేయం ప్రకృతేహి పూజనమధికృత్య ప్రశ్నోత్తరావళీ నిగద్యతే.

౧. కింలింగం. ౨. తత్కిం మూర్తముతామూర్తం. 3. అథ కిమిదమంగముతాంగి. ౪. కిమిదం ప్రశంస్యతే నిగమేషు. ౫. అథ కిమస్య పూజా సంవిధీయతే శ్రుతిస్మృతిముఖేషు. ౬. కిమిదమర్చార్చనాద్గరీయః, ౭. కిమయం నిత్యో విధిః. ౮. ఉరులింగోద్భవతః పురాపి కిమస్తి తదర్చనం. ౯. పరమేశ్వరావమంతౄన్ మహర్షీనుద్దిశ్యహిత దర్చనం స్మృతం తదిహాప

---

అగుటవలనను సర్వజనులకు సమనుష్ఠేయమనుట దురపహ్నవమైనదని రెండవదగు రుద్రాక్షధారణకు శ్రౌతత్వము సిద్ధించినది.

ఇక మూడవదగు శివలింగమునకు శ్రౌతత్వము విచారింపబడుచున్నది ఈ లింగమునకు ధారణయందు పూజయందు ననువిని యోగము కలదు ధారణనుద్దేశించి శ్రౌతమేవహి ధారణం లింగస్య అని ప్రకరణాంతర మారంభించబడినది ఆప్రకరణమునందే ఆంతద్విషయమైన ప్రశ్న సమాధానాదులు తెలుసుకొనందగినవి ప్రస్తుతము పూజనుద్దేశించి ప్రశ్నోత్తరావళి చెప్పబడును.

[౧] లింగమనగా నేమి [౨] అది మూర్తమా లేక అమూర్తమా [3] ఇకనిది అంగమా లేక అంగియా (౪) ఇది నిగమములయందు ప్రశంసింపబడునా [౫] ఈ లింగముయొక్క పూజ శ్రుతిస్మృతులు మొదలగు వాటియందు విధించబడునా [౬] ఈలింగార్చన ప్రతిమార్చనకంటె శ్రేష్ఠమయినదా (౭) ఈ లింగార్చన నిత్యవిధియా ఏమి [౮] ఈ లింగార్చన ఉరులింగోద్భవముకంటె పూర్వమందు కలదా [౯] శివాపరాధమును నాచరించిన మహర్షుల నుద్దేశించి శివలింగార్చన విధింపబడెగదా అట్టి

ర్వస్య వైథంకథమివస్యాజ్జనస్య. ౧౦. కిమిదంకల్పేసమాఖ్యాతం. ౧౧. కిమస్యలక్షణం. ౧౨. కిమస్యప్రయోజనం. ౧౩. అథకేతేతదనుష్ఠాతారః. ౧౪. ఇత్యేషాహి ప్రశ్నావళ్యా మూలాన్వివృత్య నిరస్యతే. ౧. కింలింగం. ఇతి. అస్యాయమాశయః. లింగంనామనకశ్చిద్దేవతావిశేషః. నతస్యాస్తిలోకాదికమపిసుప్రసిద్ధం అథచేదిదం కస్యచిచ్చిహ్నమభిదధ్యాత్ తర్హి తద్వానేవ నకథం ప్రధానీ భూతస్స్యాత్. యతశ్చభవతోంకాంకి నావయుతసిద్ధా. కారణం నిరంకమితి పక్షేస్యాల్లింగమవస్తు. సాంకమితిపక్షేపి. నఖలువిశేష్యమనభిసంక్రమ్య విశేషణమాత్ర మాశ్రయణీయంస్యాత్.

తదతోఽనిర్ణీతస్వ పదార్థకమసహేతుప్రయోజనకంచ. వస్తునమహాతామాలంబనంభవేదితి. అస్యేదంనిరసనం. లింగంనామ మహేశితుః

---

లింగార్చన సమస్తజనులకు విధిసిద్ధమెటులగు [౧౦] ఇది కల్పసూత్రమందు చెప్పబడెనా [౧౧] ఈ లింగమునకు లక్షణమేమి (౧౨) ఈ శివలింగార్చనకు ప్రయోజనమేమి (౧౩) ఇకదీని నాచరించినవారలెవరు. అను నీప్రశ్నలు మొదటినుండి వివరించి నిరసింపబడును.

అందుమొదటిప్రశ్న (౧) లింగమనగానేమి, అనునది అనగా లింగమని ఒకానొక దేవుడులేడుగదా అట్టివానికి ప్రసిద్ధమగు లోకమున్నులేదు. ఇక నీలింగపదము ఒకానొకని చిహ్నను జెప్పెనేని. అపుడు అట్టిచిహ్నగలవాడే యందుచే ప్రధానపరచబడకుండేని యందువలన చిహ్నమున్ను చిహ్నముగలవాడున్ను వేరుగాయుండరో కారణవస్తువు నిరంకమనుపక్షమునందు లింగము ఒకపదార్థమేకానేరదు. సాంకమనుపక్షమందునను విశేష్యమునుగల వక విశేషణమాత్రమెటుల నాశ్రయింపతగేని. అందువలన అనిర్ణీతమగు స్వపదార్థముకలిగి సహేతువైన ప్రయోజనమున్ను లేని పదార్థము పెద్దలకు ఆధారముగాకుండేని అని అభిప్రాయము. ఇందుకు సమాధానము లింగమనగా మహేశ్వరునియొక్క ఒకానొకమూర్తివిశేషమని లోకవేదములయందు ప్రసిద్ధికలదు

కశ్చన మూర్తివిశేష ఇతి లోకవేదప్రసిద్ధిః. లింగం చిహ్నమితి పక్షేపి సచ్చిత్సుఖలక్షణస్య తస్య గుణగుణినోరభేదాధ్యవసాయేన తదభేదదృష్ట్యా తత్త్వేనచ గృహ్యత ఇతి న కాపి క్షతిః- ఏతేన లోకాదికమపసు ప్రసిద్ధమేవన ఖలు విశేషణమాత్రమేవ సంగృహీతమితి నిరస్తః కుతర్కః.

అథ ప్రశ్నాంతరం (౨) తత్కిం మూర్తముతామూర్తం. ఇతి: అస్యే దశభిః ప్రేతం ఇయం హి లైంగిమూర్తిర్న ఖలు కరచరణాది సన్నివేశోపలక్షితా తతశ్చ నేదం రూపం మూర్తం. అతోపి యత్కించిదవయవ వైశిష్ట్యేన నైవ స్యాదమూర్తమపి. మూర్తామూర్తాత్మకరూపద్వితయమేవ దేవ కారణమితి సిద్ధాంతదృష్ట్యా ప్రకృతస్యానుభయకోట్యాం తద్బాహ్యతయా నేదం కారణరూపమితి. అస్యేదం విదళనం. పూర్వైరుక్తం హి లింగం నామ కశ్చన్మహేశితుర్మూర్తివిశేష ఇతి. మూర్తివిశేషో హి సంభవతి రూపే మూర్త ఏవ. కించ కరచరణాది సన్నివేశోపలక్షితమేవ మూర్తమితి న నియ

---

లింగమనగా చిహ్నమను పక్షమందునను సచ్చిత్సుఖములే లక్షణముగాగల అద్వైతతత్వమునకును ఆతని లక్షణములగు సచ్చిత్సుఖములకును గుణగుణులకు అభేదదృష్టిచే పరతత్వముగానే గ్రహించబడుననని ఏలాటిబాధయును లేదు ఇందుచే లోకాదికమును ప్రసిద్ధమయినది. విశేషణమాత్రమే గ్రహించబడలేదని ఈకుతర్కము నిరసింపబడియె.

ఇక రెండవప్రశ్న (౨) అదిమూర్తమా లేక అమూర్తమా. అనునది; అనగా ఈలింగమూర్తిగదా కరచరణాది సన్నివేశముతో గూడినదిగాదు అందువలన నిదిమూర్తముగాదు అనంతరము యేదో ఒకానొకవిధమయిన రూపములుగల దేకారణవస్తువను సిద్ధాంతరీతిచేత ప్రస్తుతము ఈలింగము రెంటియందు జేరకుండుటచే నిదికారణరూపముగా నేరదని యభిప్రాయము; ఇందుకు సమాధానము లింగమనగా మహేశ్వరునియొక్క ఒకానొకవిధమయిన మూర్తి విశేషమని ఇదివరకే చెప్పబడియె. మూర్తివిశేషము మూర్తరూపమునందెగదా సంభవించును. ఇదియునుగాక కరచరణాది సన్నివేశముతో గూడినదె మూర్తమని నియమము లేదు యేదో ఒకానొక

మః యత్రకించి దవయవవైశిష్ట్యేనాపి మూర్తత్వమవిరుద్ధం. అవయవ వైశిష్ట్యమేవహి మూర్తత్వస్యలక్షణం. అతశ్చేదంపంచ సూత్రోపలక్షితం మూర్తంమహేశ తూరూప మితినిరవద్యం. ఇతి.

అథతృతీయః ప్రశ్నః (3)కిమిదమంగముతాంగి. ఇతి. అస్యేదమాకూతం. అవయవవిశేష వాచకోపిలింగశబ్దః తతశ్చానేన బోధ్యతేనాంగీ.కించ. శివలింగమభ్యర్చ్యం. శివలింగాయనమ ఇత్యాదా యది శివలింగ శబ్ద ద్వితయంధర్మి వాచకంతర్హి తస్యోభయస్యాపి విశేష వచన తయా సామానాధి కరణ్యం నప్రసజ్యేత. అవయవ విశేష వాచకం లింగమితి పక్షే శివస్యలింగ మితియుజ్యతే.

షష్ఠీ సమాసః తదా తదిద మవయవ విశేష మేవాభిదధ్యాత్ యద్యేవమభిదధ్యాత్. తర్హిప్రకృతస్య హేయతయా అప్రధాన తయా

---

విధమయిన అవయవ వైశిష్ట్యముండినను మూర్తత్వము సంక్రమించకుండుట అవయవ వైశిష్ట్యమేగదా మూర్తత్వమునకు లక్షణము. ఇందువలన ఈ లింగము పంచసూత్రోపలక్షితమయిన మహేశ్వరునియొక్క మూర్తరూపమని సిద్ధాంతాభిప్రాయము.

ఇకమూడవప్రశ్న [3] ఇది అంగమా లేక అంగియా. అనగా లింగశబ్దము అవయవవిశేషమును వచించు అందువలన ఈశబ్దముచే అంగిబోధింపబడదు మరియును శివలింగమభ్యర్చ్యం శివలింగాయ నమః అను నీ మొదలైన స్థలములయందు శివలింగమను సమస్తపదములోని శివశబ్దము లింగశబ్దము ఈ రెండున్ను ధర్మివాచకములైనేని రెంటికి సామానాధికరణ్యము గలుగనేరదు లింగపదము అవయవవిశేషమును జెప్పునను పక్షమునందు శివస్యలింగం అని షష్ఠీ సమాసము యుక్తమగును. అప్పుడు ఈ లింగశబ్దము అవయవవిశేషమునే జెప్పును. ఇట్లు జెప్పగా ప్రకృతమగు ఈ లింగపదవాచ్యము హేయమున్ను అప్రధానమున్ను అకారణమున్ను అగుటచేత సేవ

అకారణ తయాచనిఖిలస్య భవతి తదనర్చ్యం. ఇతి. అస్యేదం సమాధానం. కృష్ణ శబ్దోహిగుణ వచన ఇతి నసర్వత్ర కార్ష్ణ్యమేవాభి దధాతిగుణం. హరిశబ్దోహిక పివాచక ఇతి నసర్వత్ర కపిమేవాభిదధాతి. పరంతు. కృష్ణశబ్దో గుణిన మభిసధాతిసిష్ణం, తద్వైనహరిశబ్దోపి వివక్షయావిష్ణుమపి. తతశ్చైకజాతీయస్యైక ఏవార్థ ఇతిననియమః లింగపదంహి. లీయతేగమ్యతేయస్మిన్ యతస్సర్వం చరాచరం, యస్మిన్ లీయతే యతశ్చగమ్యతే ప్రపంచ ఇత్య వయవార్థేన కారణ వాచకం సముదాయార్థేన పంచసూత్రో పలక్షితే మహేశితుర్మూర్తి విశేషేరూఢం వ్యవహారేణ లోక వేదయోరితినాస్య అవయవ విశేష వాచకత్వ శంకావకాశః. శివలింగ మభ్యర్చ్యమిత్యాదౌ శివస్య లింగమితిషష్ఠీ సమాస ఏవనశరణం

---

పూజార్హ మైనది గా నేరదని యభిప్రాయము. ఇందుకుసమాధానము, కృష్ణశబ్దము గుణవాచకమని అంతటను నలుపునే బోధించదు. హరిశబ్దము కపివాచకమని అంతట కపినే జెప్పదుగదా. ఇకను కృష్ణశబ్దము గుణియగు విష్ణువును బోధించు ఆటులనే హరిశబ్దమున్ను వివక్షచే విష్ణువునున్ను వచించు. అందువలన నేకజాతీయమగు పదమునకు యొకటే యర్థమని నియమము లేదు లింగపదము లీయతే ... చరాచరం. ప్రపంచము దేనియందు లయమును జెందునో దేనినుండి బయలువెడలునో అను అవయవార్థము చేత కారణవాచకమైనది. లోకవేదములయందలి వ్యవహారమువలన సముదాయార్థముచేత పంచసూత్రోపలక్షితమగు మహేశ్వరునియొక్క మూర్తివిశేషమందు రూఢమైనదిగావున నీ పదము అవయవ విశేషవాచకమను శంకకు అవకాశమేలేదు. శివలింగమభ్యర్చ్యం అని ఈ మొదలైన ప్రదేశములయందలి శివలింగం అను సమస్తపదమునకు శివస్యలింగం అని షష్ఠీసమాసమే గతిగా నేరదు సమానాధికరణ సమాసమున్నూ యుక్తమేను పూర్వస

యుజ్యాతే స్త్రీః సామానాధికరణ్యం నిషాదస్థపతిన్యాయేన తదేవయుజ్యత ఇతి వక్ష్యామః. తత్రహి. కిం నిషాదస్థపతిర్యస్యేతి బహువ్రీహిః ఉత నిషాదస్యస్థపతిరితి షష్ఠీసమాసః. ఆహోస్విత్. నిషాదశ్చాసౌస్థపతిశ్చేతి కర్మధారయః ఇతి త్రేధావికల్ప్య అన్యపదార్థప్రాధాన్యేన బహువ్రీహే ర్వైయధికరణ్యేన షష్ఠీసమాసే గౌరవేణ లక్షణయాచ తదుభయము పేక్ష్య నిషాదశ్చాసౌస్థపతిశ్చేతి కర్మధారయ ఏవేత్యుక్తం తేనైవన్యాయేన ప్రకృతేపి కర్మధారయో యుక్తః. విశేషవచనయోర్ధర్మిణోశ్శివలింగశబ్దయోరుభయోరపి సామానాధికరణ్యానన్వయాత్వాపిమందం. శివశబ్దస్య దేవతావిశేషవచనత్వేపి తల్లీలాంచలింశక సామాన్యవచన

---

పూర్వతంత్రమున నిషాదస్థపత్యధికరణమునందు చెప్పబడిన న్యాయముచేత సమానాధికరణసమాసమే యుక్తమని చెప్పుదుము. ఆనిషాదస్థపత్యధికరణమునందు నిషాదః స్థపతిర్యస్య నిషాదుడు యెవరికి యాజకుడో అని బహువ్రీహిసమాసమా లేక నిషాదస్యస్థపతిః నిషాదునియొక్క యాజకుడని షష్ఠీసమాసమా ఇదిగాకున్న నిషాదశ్చాసౌస్థపతిశ్చ ఈ యాజకుడు నిషాదుడని కర్మధారయ సమాసమా అని ఈ తీరున మూడువిధము వికల్పించి బహువ్రీహియందు అన్యపదార్థము ప్రధానమగుటచే గౌరవను దోషమ యును షష్ఠీసమాసమందు వైయధికరణ్యముండుటచే లక్షణాదోషమనియును రెంటి యుపేక్షించి నిషాదశ్చాసౌస్థపతిశ్చ ఈయాజకుడు నిషాదుడని కర్మధారయ సమాసమే యుక్తమైనది అని చెప్పబడినది. అదేన్యాయముచేత ప్రకృతమునను కర్మధారయ సమాసమే యుక్తమైనది. ఇకను ధర్మిబోధకములగు శివలింగశబ్దములు రెండూ విశేషవచనములగుటచే ఈ రెంటికి సామానాధికరణ్యము గలుగదనుటయు యుక్తియుక్తముగాదు శివశబ్దము దేవతా విశేషవాచకమైనను ఆద్దేవుని లీలా ప్రపంచ లింగకము

త్రయా లింగశబ్దస్య తన్మూర్తి విశేష వచనతయాచ. సామాన్య విశేష వచన యోశ్శివలింగశబ్ద యోస్సామానాధి కరణ్యేన సమాసః మూర్తివి శేషస్య అన్యదీయత్వ శంకావ్యావృత్త్యామూర్త్యంతరవ్యావృత్త్యాచ తదుభయ పదసార్థక్యం శివస్యలింగం మూర్తి విశేష ఇతిరాహోశ్శిర ఇతివత్ అభేదేషష్ఠ్యుపచారాత్ శివాభిన్నంలింగమితివాషష్ఠీ సమాసేఽపి నకాపి సిద్ధాంతలవక్షుతిః. ఇతి.

అథతురీయః ప్రశ్నః (౪) కిమిదంప్రశంస్యతేనిగమేషు. ఇతి. అస్యాయమభిప్రేతం. లింగంహి ప్రశంసంతి శివాగమాః ననిగమాః అతశ్చ తత్రతాంత్రికాణామేవ గౌరవం, నవైదికానాం. యదీదం ప్రశంస్యేత నిగమేషు తర్హితద్వైదికాః పరిష్టుయురస్మితి. అస్యేదంసమాధానం. ప్రశం

---

సామాన్యవచనమగుటచే లింగశబ్దము లీలా విశేషవచనమగుటచేతను సామాన్యవిశేష వచనములగు శివలింగశబ్దముల రెంటికిని సామానాధికరణ్యముచేత సమాసముయుక్తమైనది మూర్తి విశేషము అన్యదీయమను శంకావ్యావృత్తిచేతను మూర్త్యంతరవ్యావృత్తిచేతను శివలింగపదముల రెంటికిని సార్థక్యముగలదు. శివస్యలింగం శివునియొక్క మూర్తివిశేషమని షష్ఠీ సమాసము జెప్పినను రాహోశ్శిరః రాహువుయొక్క శిరస్సు అనే ప్రదేశమంచు రాహువే శిరస్సు అని చెప్పబడేవిధమున అభేదమునందే షష్ఠీవిభక్తి ఉపచరించుటవలన శివునికంటె అభిన్నమగు లింగమని షష్ఠీ సమాసమంచునను సిద్ధాంతలేశమునకున్ను యేవిధమైన బాధయులేదు.

ఇక నాలవప్రశ్న (౪) ఇది వేదములయందు ప్రశంసింపబడునా అనునది అనగా శివాగమములుగదా లింగమును ప్రశంసించుచున్నవి. నిగమములు యటను ప్రశంసించుటలేదు. అందువలన అట్టి లింగమునందు తాంత్రికులకే గౌరవముండుగాని వైదికులకు గౌరవము గలిగియుండనేరదు. ఇక నిది నిగమములయందు ప్రశంసింపబడెనేని దీనిని

సంత్యేవ భూయాంసశ్శివాగమా లింగం. నస్తాద్వా తత్రతదీయేఽపి పస్తు పరేషాం విశ్వాసః. నతావతోభయోర్వస్తునోః ప్రామాణ్యలవక్షతిః. అ భ్యుపేత్యైవ పరేస మాధీయంతే విపశ్చిదః. యతశ్చభూయాంస్యాని గమ రశ్చుత దభిష్టువంతిలింగం. యథా. రుద్రయత్తేజనిమచాచు చిత్రమితి. ఊ ర్ధ్వాయనమః ఊర్ధ్వలింగాయనమ ఇత్యాది సర్వలింగస్థాపయత్యంతే నశివలింగస్య ప్రశంసా భూయసీసిద్ధా.

అథాఽయంపంచమః ప్రశ్నః (౫) అథకిమస్య పూజనం విధీయతే శ్రుతిస్మృతి ముఖేష్వితి. అస్యాయమాశయః. యదిలింగస్యార్చనం శ్ర త్యాది షు ప్రతిపాదితం తర్హి తస్యాచ్ఛ్రౌతానామావశ్యకమితి. అస్యే దం సమాధానం. బృహజ్జాబాలే. నిత్యంత్రిసంధ్యం శివలింగమభ్యర్చ్య

---

వైదికులుచు గొనియాడుదురని యభిప్రాయము. ఇందుకు సమాధానము శివాగమము లనేకములు లింగమును ప్రశంసించుచున్నవి. అట్టి శివాగమములయందు ఆ శివాగమస్థ ములగు సదార్థములందునను ఇతరులకు నమ్మిక లేకుండుగాక ఇంతమాత్రముచే నా రెంటికిని ప్రామాణ్యలేశము లోపించదు. అభ్యుపేత్యవాదముచే పరపండితులను సమాధానపరచు చున్నారము. యెందువలన ననేకములగు నిగమవాక్యములును లింగమును స్తవించుచున్న వో యటులనగా రుద్రయత్తే జనిమచారుచిత్రం. ఓ రుద్రుడా యే నీయొక్క లింగము గలదో అనియును ఊర్ధ్వాయనమః ఊర్ధ్వలింగాయనమః అని మొదలుకొని సర్వలింగస్థాపయతి అనేవాక్య పర్యంతము శివలింగముయొక్క ప్రశంస విశేషముగా సిద్ధమైనది.

ఇక నైదవప్రశ్న [౫] ఇక నీ లింగముయొక్క పూజ శ్రుతిస్మృతులు మొదలగు వాటియందు విధించబడుచున్నదా అనునది అనగా లింగముయొక్క పూజ శ్రుతులు మొదలగువాటియందు ప్రతిపాదింపబడెనేని వైదికుల కావశ్యకమగునని యభిప్రాయ ము. ఇందుకుసమాధానము. బృహజ్జాబాలమునందు నిత్యంత్రిసంధ్యం శివలింగమభ్యర్చ్య నిత్యమున్ను మూడగు సంధ్యాకాలములయందు శివలింగమును పూజించవలయునని యు

మితి. కల్పేషుచ బోధాయనేన. అథాతో మహాదేవస్య అహరహః పర్యావిధిం వ్యాఖ్యాస్యామ ఇతి. తథా శాతాతపాదిస్మృతిషుచ బహుళంవిధి వచనాని త్రియంబకం యజామహే ఇత్యాదిమంత్రాశ్చ గద తే శివార్చనమతశ్చేదం శ్రౌతానామావశ్యకమితి.

అథ షష్ఠః ప్రశ్నః (౬) కిమిదమర్చార్చనాద్గరీయ ఇతి. అస్యాయమభిప్రేతం. అర్చైవ సమర్చ్యతాం కిమనేనావయవసన్నివేశేన లింగేనేతి. అస్యేదం సమాధానం ఆనుశాసనికే జన్మకర్మ తపోయోగాస్తయోస్తవచ పుష్కలాః. తాభ్యాం లింగేర్చితో దేవస్త్వయార్చాయాం యుగే యుగే. ఇతి అర్చార్చకస్య అశ్వత్థామ్నః పరాజయోపదేశేన లింగార్చకయోః కృష్ణార్జునయోః జయ్యత్వోపదేశేన వ్యాసేన. అర్చార్చనాద్గరీయస్త్వం లింగార్చనస్య ప్రతిపా

---

కల్పములయందు బోధాయనునిచే ఇక ననుదినము మహాదేవునియొక్క పూజావిధిని వివరించుచున్నారమనియును అటులనే శాతాతపాది స్మృతులయందునను విస్తారముగా విధి వచనములుగలవు త్రియంబకం యజామహే త్రిలోచనుని పూజించుచున్నారమను నీ మొదలైన మంత్రములును శివార్చనను జెప్పుచున్నవి. ఇందువలన నీ లింగార్చనము వైదికుల కావశ్యకమైనది.

ఇక నారవ ప్రశ్న [౬] ఈ లింగార్చన ప్రతిమార్చనకంటె శ్రేష్ఠమైనదా అనునది. అనగా ఈశ్వరునియొక్క అవయవ సన్నివేశములేని ఈలింగముతోడనేమి ప్రయోజనము పరమేశ్వరునియొక్క సర్వావయవ సన్నివేశముగల ప్రతిమయే పూజింపబడుగాక యని ప్రశ్నాభిప్రాయము. ఆనుశాసనికమునందు జన్మకర్మ ... యుగే యుగే జన్మకర్మ తపోయోగములు కృష్ణార్జునులకును నీకును సమృద్ధములు ఐనను ప్రతియుగమునను ఆకృష్ణార్జునులచే మహాదేవుడవు [illegible] ప్రతిమయందర్చితు

దితం. లింగం హ్యాసీ శ్శావయవ సంస్థాన మిత్యపినసాధు. తదవయవో ప లక్షితా యాః ప్రతిమాయాః అపేక్షయా. తదవయ వానుపలక్షితస్య లింగస్యతదవయవధ్యాన దార్ఢ్యసాధనా నుకూలత్వాత్ అర్చాపర్చనాత్ లింగార్చ నాయాగరీయ స్త్వంసిద్ధమితి.

అథ సప్తమః ప్రశ్నః (౭) కిమయంనిత్యోవిధిరితి. అస్యేదము క్తం పఠీయతామిదం శ్రుత్యాదిషు సమనుష్ఠియతాంచకైశ్చి దధికా భిః. అథ యదీదం నిత్యంతర్హి సర్వైస్సమనుష్ఠీయేతేతి. అస్యేదంసమాధా నంనిత్యంత్రిసంధ్యం శివలింగమభ్యర్చ్య మిత్యత్ర నిత్యశబ్ద ఘటితవచనవిష యత్వేన అథాతో మహాదేవస్య హరహస్సపర్యావిధిం వ్యాఖ్యాస్యా

---

జయ్యేనని ప్రతిమార్చకుడగు అశ్వత్థామకు పరాజయమును జెప్పుటచేతను లింగార్చకు లగు కృష్ణార్జునులకు అజయ్యత్వమును బోధించుటచేతను వ్యాసునిచేత ప్రతిమార్చనకంటె లింగార్చనకు శ్రైష్ఠ్యము ప్రతిపాదింపబడినది. లింగము ఈశ్వరునియొక్క సర్వావయ వసన్నివేశము కలదిగాదనుట యేదిగలదో అదియును యుక్తముగాదు. ధ్యానార్హ మైన అవయవములుగల మూర్తినిజూచి అవయవములను ధ్యానించుటకంటె అట్టి అవయవ ములులేని మూర్తినిజూచి అవయవములను ధ్యానించుట ధ్యానదార్ఢ్యమునకు సాధనమై దిగావున లింగమునందే ఈశ్వావయవధ్యానము యుక్తమైనది. ఇందువలన ప్రతిమార్చన కంటె లింగార్చనకు శ్రైష్ఠ్యము సిద్ధించినది.

ఇక నేడవ ప్రశ్న [౭] ఇది నిత్యవిధియా ఏమి అనునది. అనగా ఈ లింగార్చ శ్రుతులు మొదలైన వాటియందు విధించబడుగాక కొందరధికారు లనుష్ఠింతురుగా ఇక నీ లింగార్చనవిధి నిత్యవిధియగునేని అపుడు యెల్లరచే యనుష్ఠింపబడునని యభి ప్రాయము. ఇందుకు సమాధానము నిత్యంత్రిసంధ్యం శివలింగమభ్యర్చ్యం నిత్యము త్రికాలములయందూ శివలింగమును పూజింపవలయు ననుచోట నిత్యశబ్దఘటితమగు వచనమునకు విషయమగుటచేతను కల్పమునందు బోధాయనునిచే అథాతో మహాదేవ స్య హరహస్సపర్యావిధిం వ్యాఖ్యాస్యామః ఇకననుదినము మహాదేవునియొక్క

ఇతి బోధాయనకల్పే అహరహరితి వీప్సాఘటితవచన విషయత్వేన. భుంజీ తనేశార్చనమప్యకృత్వా భుంజీతచేత్పాప మయంచ భుంక్తేనరాధమో సాముసిభిస్స ఉక్తస్సనారకీవిట్ క్రిమికీట భుక్సః. ఈశార్చనావర్జసభోజ్య మన్నం కీటంమలం తత్కుణపంవదంతి. బహిష్కృతస్సర్వ జనైశ్చపాపీ ఘోరాన్ ప్రయాయాన్నరకాన్ సమస్తాన్. వహ్నిప్రవేశో వరముగ్ర శస్త్రైర్వధోవరం సాధుమలస్యభుక్తిః. నేశార్చనాయాం విరతిర్వరిష్ఠా సంసారచక్రే భ్రమతోనవద్యే. అపిప్రాణాపదం ప్రాప్యనత్యాజ్యం శివ పూజనం. ఇత్యాదినా పురాణేష్వకరణే ప్రత్యవాయ జనకవచన విషయ త్వేనచ లింగార్చనస్య నిత్యత్వమభేద్యమితి.

అథాయ మష్టమః ప్రశ్నః (౮) ఉరులింగోద్భవతః పురాపికిమస్తి తదర్చనం ఇతి. అస్యేదమాకూతం బ్రహ్మవిష్ణ్వోః కలహసమయేఖలు

---

పూజావిధిని వివరించుచున్నారమనుచోట అహరహః దినదినము అను వీప్సాఘటిత మగు వచనమునకు విషయమగుటచేతను. భుంజీత ... అనవద్యే శివలింగము నర్చించక భుజించగూడదు భుజించెనేని పాపము నేభుజించినవాడగు యిట్టినరుడు నరకములజెంది నవాడై మలమును క్రిమికీటములను దినువాడగునని మునులచే జెప్పంబడియె శివలింగ మునర్చించక భుజింపబడెడి అన్నమును భుజించు మనుజుడు సర్వజనులచే బహిష్కరిం పబడినవాడై భయంకరములగు సమస్తములైన నరకములను పొందును మరియును అగ్ని ప్రవేశముగాని తీవ్రములగు శస్త్రములచే యాత్మహననముగాని మలభక్షణగాని శ్రేష్ఠ మైనది సంసారచక్రమున భ్రమించువానికి శివలింగార్చనయందు ఉపేక్షశ్రేష్ఠమైనది గాదని ఈ మొదలైన వచనములచే పురాణములయందు జేయకున్న ప్రత్యవాయమును బోధించు వచనమునకు విషయమగుటచేతను లింగార్చనకు నిత్యత్వ మభేద్యమైనది.

ఇక నెనిమిదవ ప్రశ్న (౮) ఈ లింగార్చన ఉరులింగోద్భవమునకన్న పూర్వ మందు కలదా అనునది. అనగా బ్రహ్మ విష్ణువులయొక్క కలహ సమయమందు గదా ఉరులింగముద్భవించినది అంతకు పూర్వములింగోద్భవలీలయే లేకుండుటవలన. అపుడు

ఉపలింగముద్భూతం నతతః పురాస్తిహి లింగార్చనం లింగోద్భవలీలా యాఏవ అభావాత్. తర్హి తదర్చనం కథమివస్యాన్నిత్యమితి. అస్యేదం సమాధానం ప్రపంచ సర్గాత్ప్రాక్కాల ఏవలింగావిర్భావః యతఏవ ప్రపంచోత్పత్తిః తతశ్చా ప్రపంచో దయాత్ లింగార్చన మస్త్యేవ బ్రహ్మ విష్ణ్వోః కలహసమయే తచ్ఛాంత్యర్థం పూర్వాం స్థితస్యైవ లింగరూపస్య దర్శనం కృతంతథాచ స్కాందే శివతత్త్వ సుధానిధౌ. పూర్వమేకార్ణవే ఘోరే నష్టేస్థావర జంగమే మధ్యే సముత్థితం లింగ మైశ్వరం తైజసంపరం. జ్వాలామాలావృతం దివ్యమప్రమేయ మనామయం. కల్పాంతేతత్రలీయంతే వర్ణంతేతత్రదేవతాః. దక్షిణేలీయతే బ్రహ్మ వామతశ్చజనార్దనః హృదయేచైవగాయత్రీ సర్వదేవోత్తమోత్తమా. లీయతేమూర్ధ్నిచై వేదాస్సషడంగపదక్రమాః జఠరేలీయతేసర్వం

---

లింగార్చనలేదుగదా ఇకను ఈ లింగార్చన నిత్యమెటులగునని అభిప్రాయము. ఇందుకు సమాధానము ప్రపంచసృష్టికంటె పూర్వముననే లింగావిర్భావముగలిగె. యేలింగము నుండె ప్రపంచోత్పత్తిగలిగెనో. అందువలన ప్రపంచోత్పత్తి మొదలుకొని లింగార్చన యుండేయున్నది బ్రహ్మ విష్ణువులయొక్క కలహసమయమున వారికలహము శాంతి చుటకు అంతకు పూర్వమునుండిన లింగరూపమే గనుపరచబడినది అట్లు స్కాందమున శివతత్త్వ సుధానిధియందు పూర్వ ... చరాచరం. పూర్వము చరాచరాత్మకమగు ప్రపంచము లయమునుజెందగా అనంతరము ఏకార్ణవమగు సముద్రముయొక్క మధ్య భాగమందు పరంజ్యోతి స్వరూపంబును జ్వాలామాలావృతంబును దివ్యంబును అప్ర మేయంబునైన ఈశ్వరలింగంబావిర్భవించె కల్పాంతమున. నందు దేవతలు లయమును జెందియుందురు. దక్షిణభాగమున బ్రహ్మదేవుండు లయమును జెందియుండు. వామ భాగమున జనార్దనుడును హృదయమున సర్వదేవోత్తమురాలగు గాయత్రియు శిరోభా గమున షడంగపద క్రమములతోగూడిన వేదంబులును జఠరంబున జంగమస్థావరాత్మక

జగత్స్థావరజంగమం. పునరుత్పద్యతేయస్మాత్ బ్రహ్మాద్యాశ్చ చరాచర మిత్యాదికం ద్రష్టవ్యం ఇతి.

అథాయం నవమః ప్రశ్నః (౯) పరమేశ్వరావమంత్రూన్ దారు కావనస్థాన్ మహర్షీనుద్దిశ్యాపి తదర్చనం స్మృతంతదిహసర్వస్య వైధం కథమివస్యాజ్జనస్య ఇతి. అస్యేదం హృదయం. స్కాందే శివతత్త్వ సుధా నిధౌ. తిష్ఠతిష్ఠసదా స్త్రీణాం మోహకోస్యధ మాధమలింగమే తత్సము త్పాట్య అనయాభార్యయావినా. కృత్వాకర్మ సదాచారో వనేస్మిన్ విహరాధమ. సహాందః ఇత్యుక్తస్తు తదా శంభుః తేషాం మధ్యే తథాకరోత్ లింగముత్పాట్య సంత్యజ్య తయాచాంతర్హితోఽభవత్. తల్లింగం తద్వ నం సర్వం దదాహాశ్రమమండల మిత్యాదనాతదీయం మహాత్మ్యం నిర్వర్ణ్య తతో బ్రహ్మాణం ప్రతి. కశ్చిత్స భార్యశ్శాంతాత్మా నగ్నో వికృత వేష

---

మగు ప్రపంచంబును లయమును జెందియుండుచురు తిరుగా దేనినుండి బ్రహ్మాదిదేవతలును చరాచరాత్మకమగు ప్రపంచంబును ప్రభవిల్లునో అని మొదలుగా చెప్పంబడియుండె గావున సందుజూడవలయు.

ఇక తొమ్మిదవప్రశ్న (౯) శివాపరాధము సాచరించిన దారుకావనమునందలి మునుల నుద్దేశించి లింగార్చనము జెప్పబడెగదా. అట్టి లింగార్చన సమస్తజనంబునకు నెటులనియతమగుననునది. అనగా స్కాందమున శివతత్త్వసుధానిధి యందు, తిష్ఠ ... ఆశ్రమమండలం. స్త్రీమోహకుండవగు అధమాధముడా జనందగదు. భార్యనువిడచి లింగంబును పెరికివేశినవాడవై సత్కర్మంబు నాచరించి సదాచారుండవై ఈవనంబున విహరింపుమా. అని ఈప్రకారను మునులు బలుకువరకు శంభుండు వారలనడుమ లింగంబును పెరికివైచి భార్యతోడ నంతర్ధానంబును జెందె. నంత నాలింగము, ఆవనంబు నాశ్రమమండలంబు నంతయును దహించెనని మొదలుగా నామహాత్మ్యంబును వర్ణించి. అనంతరమున బ్రహ్మదేవు నుద్దేశించి. కశ్చిత్ ... గతః. భార్యాయుతుండును శాంతరూపుండును దిగంబరుండును. వికృత వేషధారియు వర్ణాశ్రమ ధర్మనిహీనుండు

దృత్. వర్ణాశ్రమవిసర్జనాక్తో దేవదారువనంగత ఇతి. స్వకీయంలింగము త్పాట్యత్యక్త్వాచ భువిపద్మజ త్యక్త్వాచభార్యయాసార్ధంతుణాదంతర్హి తో౽భవత్. ఇత్యాదినా ఋషీణాం ప్రశ్నముపన్యస్య తతః మునీన్ప్రతి అహో మహేశ్వరస్సాక్షాత్ సర్వలోకైకనాయకః. విష్ణునాసహసంప్రా ప్తో దేవదారువనంబుధాః ఇత్యాదినామునీనాం వస్తుస్థితింనివేద్య ఇతః పరం మునిశ్రేష్ఠా శ్శీఘ్రంగచ్ఛత తద్వనంతస్మిన్ భవద్భిర్యద్దృష్టం లింగం భూమౌనిపాతితం తల్లింగంసమ్యగాదాయతత్ర శ్రద్ధాపురస్సరం సంస్థాప్య విష్ణుయో నౌతుపూజయధ్వం మునీశ్వరాః. ఇతిచ బ్రహ్మ ణోవచనేనేదం లింగార్చనం పరమేశ్వరావమంత్రూణాం దారుకావనస్థ మృషీనుద్దిశ్యవిహితం తదిదం కథమివ సర్వస్యనియతం భవతీజనస్యేతి అస్యేదంసమాధానం న్యాయ్యమిదంచ దండన మేషాం పరమేశ్వరావ మంత్రూణాం అన్యేషాంతు పూజనీయం లింగం సమనంతరాధ్యాయే

---

నగు నాకానాకందు దేవదారువనంబుజొచ్చెననియు తనలింగంబును దెంచి యచట ప త్యజించి క్షణంబున భార్యతోడ నంతర్హితుండాయెనని మొదలుగా మునులగూర్చి అహో... బుధాః సర్వలోకైకనాయకుండగు సాక్షాన్మహేశ్వరుండు మహావిష్ణుతో దేవదారువనంబునుపొందెనని మొదలుగా మునులకు వాస్తవంబు నెరింగించి, ఓముని శ్రేష్ఠులారా ఇకను మీరు శీఘ్రముగా ఆవనంబునకుజని అచట పుడమియందు పడ యంబడిన నేలింగంబు మీచేజూడంబడెనో ఆలింగంబును విష్ణుయోనియందునుంచి శ్ర తోడ పూజింపవలయునను బ్రహ్మదేవునియొక్క వచనముచే నీలింగార్చనము మహే శ్వరావమానకారులగు దారుకావనస్థులైన మునుల నుద్దేశించి విధింపబడె. అట్టిలింగా ర్చనము సమస్తజనులకెట్టుల కర్తవ్యమగునని యభిప్రాయము- ఇందుకు సమాధానము శిక్షాపరాధకర్తలగు నీ మహర్షులకు. ఈదండనము న్యాయ్యమైనది. ఇతరులకు పూ

బ్రహ్మావిష్ణ్వోః కలహశాంత్యర్థం జ్వాలారూపేణ సముపన్యస్తం జగత్సర్గాదికారణత్వేనచ సమాఖ్యాత మన్యదేవేతి.

అథాయం దశమః ప్రశ్నః (౧౦) కిమిదంకల్పే సమాఖ్యాతం ఇతి అస్యేదం హృదయం. యానికర్మాణ్యావశ్యతః కార్యాణి తానికల్పే సమాఖ్యాతాని నైతత్తు దృశ్యతేతత్ర యద్యపివిధీయతాంచనామ బోధాయనే సతథాపి తదావశ్య కంతత్సూత్రవతాం నఖల్వాపస్తంబాదీనాం తదావశ్యక మితి. అస్యేదం సమాధానం బోధాయనేన అథాతో మహాదేవస్యాహరహస్సపర్యావిధిం వ్యాఖ్యాస్యామ ఇత్యేనేనోక్తం అనుక్తమన్యతోగ్రాహ్య మిత్యనుశాసనాత్ స్వస్వగృహ్యేష్వనుక్తమప్యాపస్తంబాదీనామావశ్యకం. యథాచ యజ్ఞోపవీతం భవతి గ్రాహ్యానన్యేనైవోక్తరయేతి.

---

హమైన లింగము. అనంతరాధ్యాయమునందు. బ్రహ్మవిష్ణువులయొక్క కలహశాంతికై, జ్వాలారూపముచే యుపన్యసించబడినదియును. జగజ్జన్మాదికారణముగా ప్రశంసించబడినదియును, ఇతరమగు లింగమే యగుచున్నదియని సిద్ధాంతాభిప్రాయము.

ఇక పదవ ప్రశ్న (౧౦) ఈ లింగార్చన కల్పసూత్రమునందు జెప్పబడెనా అనునది. అనగా యేయేకర్మలు అవశ్యముగా జేయదగినవో అవి కల్పసూత్రమునందే జెప్పబడినవి అందు ఇదిజూడంబడదు ఇక బోధాయనకల్పమునందు విధించబడుగాక. అయినను బోధాయనసూత్రము గలవారలకే అందు విశ్వాసము. ఆపస్తంబాదులకు అది ఆవశ్యకముగాదని యభిప్రాయము. ఇకసమాధానము బోధాయనుడు, అథాతో ... వ్యాఖ్యాస్యామః. ఇకననుదినము మహేశ్వరుని పూజావిధిని వివరించుచున్నారమని వచించె. అనుక్తమన్యతోగ్రాహ్యం స్వసూత్రమున జెప్పంబడకున్నను అన్యసూత్రోదితమైన ధర్మమును గ్రహించవలయునను అనుశాసనమువలన తమతమ గృహ్యసూత్రములయందు జెప్పబడకున్నను. ఈబోధాయనునిచే జెప్పంబడిన యజ్ఞోపవీతమెటుల గ్రాహ్యమగునో. అటులనే ఇదియునావశ్యకమగును.

అథాయ మేకాదశః ప్రశ్నః (౧౧) కిమస్యలక్షణమితి. అస్యాయ మాశయః లోకేకిల సమర్చయంతి కేచన పంచసూత్రోపలక్షితం లింగం అన్యేత్వశక్తికమపి. ఏవంచ ఉభయత్ర ఏకవిధమేవేతి నియమోస్తి వాన వా ఇతి. అస్యేదం సమాధానం శాస్త్రేషు శివాగమముఖ్యేషు సశక్తికస్యైవ ప్రాధాన్యేన నిర్దేశాత్ శివతత్వసుధానిధౌ. మల్లింగం శక్తిసహితం పూజయేత్సర్వదాశుచిః శక్తిహీనంతు మల్లింగంపూజనాదఫలం భవేదితి వచనోపన్యాసాత్ నాగరఖండే పిండికారహిత లింగార్చనస్యైవ రావణపరాజయ హేతుత్వాభివర్ణనాత్ సర్వేష్వపి క్షేత్రేషు సపిండికస్యైవ లింగస్య దృశ్యమానత్వాచ్చ సశక్తికమేవ సమర్చనీయం భవతీతి సిద్ధాంతస్థితిః ఇ॥.

అథాయం ద్వాదశః ప్రశ్నః (౧౨) కిమస్య ప్రయోజనమితి. అస్యేదమభిప్రేతం ప్రయోజన మనుద్దిశ్యనమందోపి ప్రవర్త ఇతి న్యాయా

---

ఇక పదునొకండవప్రశ్న (౧౧) ఈలింగమునకేమిలక్షణమనునది. అనగా లోకమునందు కొందరు పంచసూత్రోపలక్షితమైన లింగమును పూజించుచుందురు. వరికొందరు, శక్తిరహితమగు లింగమునారాధించుచుందురు. ఈ రెంటియందు. ఒకవిధమైనదే పూజ్యమని నియమముకద్దా లేదాయని యభిప్రాయము. ఇందుకు సమాధానము. శివాగమములు మొదలగు శాస్త్రములయందు ప్రధానముగాసశక్తికమైనదే నిర్దేశింపబడియె శివతత్వసుధానిధియందునను. మల్లింగం ... అఫలంభవేత్. పరిశుద్ధుండై శక్తిసహితమగు లింగమును పూజింపవలయు శక్తిరహితమగు లింగమును పూజించుటవలన నిష్ఫలమగునని జెప్పబడుటవలనను నాగరఖండమునందు రావణునిచే పూజింపబడెడి లింగమునకు పీఠిక లేకుండుటయే. తనకు పరాజయము కలుగుటకు హేతువగా జెప్పబడుటవలనను సర్వక్షేత్రములయందునను లింగము సపిండికముగానే చూడబడుటవలనను సపిండికమగు లింగమే పూజార్హమగునని సిద్ధాంతాభిప్రాయము.

ఇక పండ్రెండవప్రశ్న (౧౨) ఈ లింగార్చనకేమిప్రయోజనమనునది. అనగా ప్రయోజనమునుజూడకమందుడును ప్రయత్నించడను న్యాయముచేత. నీ లింగార్చనకు గొప్పదగు ప్రయోజనముండెనేని ముఖ్యముగా ననుష్ఠింపదగినదని ప్రశ్నాభిప్రాయము

త్ యదిస్యాదస్య మహత్ప్రయోజనం తర్హ్యస్యాన్ముఖ్య మనష్ఠేయ మితి. అస్యేదం సమాధానం పురుషార్థేషు సర్వేష్వపి మోక్షస్యైవ ముఖ్యతయా త్రియంబకం యజామహ ఇత్యాది మంత్రేషు మోక్షఫలకత్వేనైవామ్నానాత్ సర్వేషామపి భవత్యావశ్యకం. కించసౌరపురాణే క్రమేణ లభ్యతేన్యేషాంముక్తి రారాధనాద్విజాః ఆరాధనాన్మహేశస్య తస్మిన్ జన్మనిముచ్యతే ఇత్యుక్తం. ఓంకారస్య ప్రసాదేన విష్ణోశ్చైవ ప్రసాదతః రుద్రారాధనవాంఛస్స్యాత్త దారాధనతత్పరః జ్ఞాన మద్వైవతే మానందం పరంబ్రహ్మాధిగచ్ఛతీతి. సూతసంహితాయామపి సాక్షాన్మోక్షజనకత్వముక్తం. తథా అసార సంసార వనాంతరాళే త్రితాపఘర్మే భ్రమతో జనస్య శివార్చనాకల్పలతా పురస్తాత్ సంసార సంతాప హారిణీచాన్యా. ఇష్టాపూర్తి విమోహితో యది శివంసాంబం నచాభ్యర్చయేద్యోనీనాంబహుకోటిమేతి వివిధాద్దుఃఖాద్బహిర్నిస్సరేత్. నిర్ధారద్రవిణో నిర

---

ఇందుకుసమాధానము పురుషార్థములన్నిటియందును మోక్షమే ముఖ్యమగుటచే త్రియంబకంయజామహే. ఈ మొదలైన మంత్రములయందు మోక్షఫలకముగానే ఈలింగార్చన చెప్పంబడుటవలన నెల్లరకు నావశ్యకమగును. మరియును సౌరపురాణమునందు క్రమేణ ... ముచ్యతే. అన్యదేవతారాధనమువలన క్రమముగా ముక్తిలభించు. శివారాధనమువలన నాజన్మయందే ముక్తుడగునని జెప్పబడియె. ఓంకారస్య ... అధిగచ్ఛతి. ప్రణవముయొక్క ప్రసాదమువలనను. విష్ణువుయొక్క యనుగ్రహమువలనను. శివారాధనతత్పరుండై పరంబ్రహ్మను జెందునని సూతసంహితయందునను సాక్షాత్తుగా మోక్షజనకమని చెప్పబడినది. ఇదియునుంగాక. అసార ... గచ్ఛతి. అసారమగు సంసారమనెడి శుష్కవనమధ్యమున తాపత్రయమను వేసవియందుభ్రమించు జనునకు శివార్చనయను కల్పలతయే, సంసార సంతాపహారియగునుగాని, వేరుమార్గములేదు కామాసక్తుండై యేమనుజుడు శివునారాధించకుండునో. అట్టివాడు బహుకోటి యోనులయందు వివిధములగు దుఃఖములవలన జనించు మరియు ద్రవ్యకళత్రాది శూన్యుడును

స్న, జఠరోసః క్షేత్రదాసీపశుః భ్రాంతశ్చిత్త విపర్యయేణచరతిక్ష్మామండలంకాకవత్. భక్త్యా యశ్శివమర్చయే దనుదినం లింగేసమాప్నోతిసదా నానాంతప సాం త్రివిష్టపమహా తీర్థాప్లుతీనాంఫలం పాపాన్యాశు వినాశ్య శంకరగణశ్రైష్ఠ్యం సమాప్నోత్యసౌ విజ్ఞానాత్పరిహృత్య మోహ మఖలం జ్ఞానంపరంగచ్ఛతి. ఇత్యాదినాచ పురాణేషూద్ఘోషితం ప్రయోజనమస్యేతి.

అథాష్టమంత్రయోదశః ప్రశ్నః(౧౩) అథ కే తేతదనుష్ఠాతారఇతి. అస్యైదంహృదయం యదీదంశిష్టైరనుష్ఠితం తర్హి సమనుష్ఠేయం సర్వేషామితి. అస్యేదంసమాధానం ఆనుశాసనికే. యస్య బ్రహ్మాచ విష్ణుశ్చత్వైంద శక్రసహామరైః. అర్చయత్యేవసదాలింగం తస్మాచ్ఛ్రేష్ఠతమోహికః ఇతి. తథాస్కాందే శివతత్త్వసుధానిధౌ బ్రహ్మావిష్ణుమహేంద్రాశ్చలోకపాలాశ్చదేవతాః. విద్యాధరా గుహ్యకాశ్చ గంధర్వాశ్చాపికిన్నరాః రాక్షసాదానవాదైత్యా వశిష్ఠాద్యామహర్షయః లింగార్చనం ప్రకుర్వంతి సదా

---

క్షేత్రదార పశురహితుండునై కడుపున కన్నంబునుదొరుకక చిత్తచలనమువలన భ్రాంతుండై కాకమువలె భూమండలమునుచరించు యెవ్వండుభక్తిచే యనుదినంబును లింగమున శివునర్చించునో అట్టినరుడు సర్వవిధంబులగు దానంబులు తపంబులు స్వర్గగా స్నానంబులు మొదలగువాటియొక్క ఫలంబును జెంది శీఘ్రంబున పాపంబుల నాశంజేసి, శంకర గాణాపత్యంబునుపొంది మోహంబునువిడచి యుత్కృష్టంబగు జ్ఞానంబును పొందునని మొదలుగా పురాణములయందు. ఈలింగార్చనకు ప్రయోజనముద్ఘోషింపబడియె.

ఇక పదమూడవప్రశ్న (౧౩) ఇక నీలింగార్చనను జేయువారలెవరనునది. అగా నీలింగార్చన శిష్టులచే యనుష్ఠింపబడెనేని. అపుడు ఎల్లరకను ష్ఠేయమగునని యభిప్రాయము. ఇందుకు సమాధానము. ఆనుశాసనికమున. యస్య ... శ్రేష్ఠతమోహికః బ్రహ్మయు విష్ణువు. దేవతలతోడ నింద్రుడును యద్దేవులింగము నారాధింతురో అట్టికన్న నధికుండెవడు. అని జెప్పంబడియె. అటుల స్కాందమున శివతత్త్వసుధానిధియందు, బ్రహ్మా ... కాః తథా. బ్రహ్మవిష్ణుమహేంద్రులును లోకపాలురును దేవతలును దైత్యులును వశిష్ఠాది మహర్షులును లింగము నర్చించుచుందురు. మనుష్యుల నేమిచె

కాలంద్విజోత్తమ లింగార్చన రతాఏతే మానుషేషుతు కాకథా: ఇత్యాదినాశిష్టా స్సర్వేశివంప్రపన్నాః ఇత్యుపన్యాసే సర్వేపిశిష్టా శ్శివలింగారాధనపరా ఉదాహృతా స్తతఏవా వగంతవ్యాఃఇతి. అథకిమిదం. సాలగ్రామార్చనాది కమివానిగమనిగదిత మకల్పపరిగృహీతమనిత్య మసపురాణపరిష్టు తమనిత్యమ సకలశిష్టజన సమనుష్ఠితంవా: పంచాయతనాది కమివాసంభావిత మూలం వానభవతి. పరంతు సకలవిద్యాస్థాన పరిష్టుతతయా సకల హేతువాద సహతయా సకల శిష్టజన సమనుష్ఠిత తయా చతృతీయస్య శివలింగస్య శ్రౌతతాసిద్ధా ఇతిః

అథతురీయస్య శివనామ జపస్య శ్రౌతతామీ మాంస్యతే తత్రేమే ప్రవర్తంతే ప్రశ్నాః (౧) కిమిహాశివనామ (౨) కిమస్యజపోసిగమేషు విధీయతే (౩) కిమయంసర్వేషువేదేషు ప్రశంస్యతే (౪) అథకింపురాణేతిహాసాదిషు పరికథ్యతే (౫) అథకిమయం నిత్యోవిధిః (౬) అథకిమిదం

---

గలయునని. ఈరీతి శిష్టులందరు శివునేగోల్చిరనే: ఉపన్యాసమున శిష్టులెల్ల రు శివారాధనపరులుగానే యుదాహరింపబడెరి గావున నా ప్రకరణమున నే జూడవలయు.

ఇక నీలింగార్చన సాలగ్రామార్చనవలె నిగమములయందు జెప్పబడకుండెనా కల్పములయందు పరిగ్రహించబడకుండెనా, నిత్యముగాకుండెనా, సకలశిష్టజనులచే యనుష్ఠింపబడకుండెనా, పంచాయతనాదులవలె యప్రామాణికంబాయెనా: ఇకను: సకలవిద్యాస్థానములచే స్తవింపబడుటచేతను, సమస్తహేతువాదసహముగుటచేతను, నిఖిలశిష్టజనులచే యనుష్ఠింపబడుటచేతను,

మూడవదగు శివలింగమునకు శ్రౌతత్వము సిద్ధించినది

ఇక నాలవదగు శివనామజపమునకు శ్రౌతత్వము మీమాంసింపబడును. అందు ఈప్రశ్నలు ప్రవర్తించుచున్నని. (౧) శివనామమనగా నేది (౨) ఈశివనామజపము వేదములయందు విధించబడుచున్నదా (౩) ఇక నన్నివేదములయందు ప్రశంసించబడుచున్నదా (౪) ఇకనది పురాణేతిహాసాదులయందు జెప్పబడునా (౫) ఇది నిత్యవిధే

కర్మసంసిద్ధికారి (౭) కిమిదం మాంగళ్యాపాదకం (౮) అథ కిమస్య ప్రయోజనం (౯) అథ కే తేఽస్య సమనుష్ఠాతారః. (౧౦) ఇత్యామూలాద్వివృత్య ప్రశ్నాస్సమాధాస్యంతే.

తత్రాయమాద్యో యథా (౧) కిమిహ శివనామేతి. అస్యాయమాశయః. శివస్య ఖల్వభిధేయాన్యనంతాని సిద్ధాంతరీత్యా సర్వాణ్యపి తస్యైవ భవంతి వాచకాని. ఏవం స్థితే నామస్వనంతేషు సర్వేషామపి తుల్యబలతయా న కానిచిదేవ నియంతుం యుజ్యతే న ఖల్వనంతాన్యప్యనుష్ఠితుం శక్యంతే చ. ఏవం చ. సహస్రవర్షాధ్వర విధివదనుపలభ్యమానాధికారికోఽయమపి భవేచ్ఛివనామవిధిః. ఏవమదృష్టకర్తృకస్యాస్య విధిః కీదృగపి న భవతి కార్యాయ తతోఽస్య శ్రౌతత్వాశ్రౌతత్వవిచారో న మంజుల ఇతి. అస్యేదం సమాధానం. సూతసంహితాయాం యజ్ఞవైభవఖండే సర్వశబ్దవాచ్యా

---

రయా (౬). ఇకనిది కర్మసంసిద్ధికరమైనదా (౭) ఈ శివనామజపము మాంగళ్యాపాదకమైనదా [౮] దీనికేమి ప్రయోజనము [౯] ఇకదీని ననుష్ఠించువారలెవరు. అనే ప్రశ్నలు మొదటనుండి వివరించి సమాధానపరచబడుచున్నవి.

ఇందు మొదటి ప్రశ్న [౧] శివనామమనగా నేది యనునది. అనగా శివునకు నామధేయముల నంతములుగదా సిద్ధాంతరీతిచే నన్ని శబ్దములును శివునకే వాచకములై వప్పదగియున్నది. ఇటులుండియుండగా అనంతములగు నామములయందు నన్నియు సమానములగుటచే కొన్నిటినిమాత్రము జపించవలయునని నియమించుటకు వీలుకలుగదు అనంతనామములను జపించుటకున్ను శక్యముగాదు. ఇందుచే వేయువత్సరములాచరింపదగిన యజ్ఞముయొక్క విధివలెనే ఈ శివనామ జప విధియును అధికారిరహితమైనదే యగును. ఇకను చేయువాడు గనుపించకుండుటచే నీ శివనామ జపవిధి యేలాటిదైనను కార్యకారిగానేరదు. అందువలన నిందువిషయమై వైదికావైదికత్వ విచారము యుక్తమైనదికాదని యభిప్రాయము. ఇందుకు సమాధానము సూతసంహితలో యజ్ఞవైభవ

త్వం మహేశితుర్నిర్ధార్య తదనంతరం. నామాని సర్వాణ్యపి కల్పితాని స్వమాయయా నిత్యసుఖాత్మరూపే. తథాపి ముఖ్యాస్తు శివాదిశబ్దాః భవంతి సంకల్పనయా శివస్య ఇతి.

ముఖ్యశబ్ద జపతో మునీశ్వరా స్సద్య ఏవ స మహేశ్వరో భవేత్ తస్య వక్త్రకమలే సదా శివో నృత్యతి స్మ పరమేశ యా సహేత్యాది నానాము న సర్వేష్వపి శివాదినామ్నాం ముఖ్యత్వం స్మృతం తద్వాచకేషు శివరుద్రమహేశ్వరాదిశబ్దేషు శివశబ్దస్య ముఖ్యత్వం సిద్ధం వ్యవహారేణ లోకవేదయోః. కించ య ఓంకారస్స ప్రణవ ఇత్యాదినా అథర్వశిఖాయాం క్లేశకర్మ విపాకాశయై రపరామృష్టః పురుషవిశేష ఈశ్వర ఇత్యాదిక ముక్త్వా తస్య వాచకః ప్రణవః తజ్జపస్తదర్థభావనమితి పాతంజల యోగ సూత్రేపి. నశివస్యాణవో బంధః కార్మో మాయేయ ఏవ వా ఇత్యాద్యారభ్య ప్రణవో వాచకస్తస్య శివస్య పరమాత్మనః. శివరుద్రాదిశబ్దానాం ప్ర

---

ఖండయందు మహేశ్వరునకు సర్వశబ్దవాచ్యత్వమును నిర్ణయించి అనంతరము నామాని... శివస్య నిత్యానందరూపుండగు మహేశ్వరునియందు సర్వవిధములగు నామధేయంబులును స్వమాయచే కల్పింపబడినవి. అటులైనను శివసంకల్పముచే శివాదిశబ్దములు ముఖ్యములగుచున్నవని జెప్పబడియున్నది. ముఖ్యశబ్ద ... పరమేశయా సహ. ఓ మునీశ్వరులారా ముఖ్యశబ్ద జపమువలన తత్క్షణముననే జపించువాడు మహేశ్వరుండగు అట్టి నరునియొక్క ముఖకమలమందు కాత్యాయనితోడ సదా శివుండు నటించుచుండునను మొదలైన వచనముల చేత సర్వవిధములైన నామములయందునను శివాదినామములకు ముఖ్యత్వము స్మరింపబడినది. ఆ శివ రుద్ర మహేశ్వరాది శబ్దములయందు శివశబ్దమునకు ముఖ్యత్వము లోకవేదములయొక్క వ్యవహారముచే సిద్ధమైనది. ఇంతియేగాక అథర్వశిఖయందు య ఓంకారస్స ప్రణవః. ఓంకారమనునది యేదిగలదో అదే ప్రణవమను మొదలైన వచనములచేతను పాతంజల యోగసూత్రమందునను క్లేశ ... ఈశ్వరః క్లేశకర్మ విపాకాశయములచే పరామర్శింపబడని యొకానొక పురుషుడు ఈశ్వరుడనంబరగుచున్ని

ణావస్తు పరస్స్మృతః శంభోః ప్రణవవాచ్యస్య భావనా తజ్జపాదపి యాసి ద్ధిస్సా పరా ప్రాప్యా భవత్యేవ న సంశయ ఇత్యాదినా వాయుసంహితో త్తరభాగేచ పఠితైర్వచనైః ప్రణవస్యాపి శివనామసు సర్వోత్కృష్టత్వం ప్రతిపాదితం. ఏవంచ మూలవ్యాఖ్యానాత్మకస్య ప్రణవపంచాక్షరస్య సర్వోత్తమ్యం సిద్ధం. ఏతేన విధివిచారస్సార్థక ఏవేతి.

అథ ద్వితీయః ప్రశ్నః (౨) అథ కిమస్య జపో నిగమాంతేషు విధీ యత ఇతి. అస్యాయమాశయః శివాగమేష్వేవ ప్రకృతస్య విధానదర్శనాత్ శ్రౌతత్వా శివనామ్నస్సందిగ్ధేతి. అస్యేదముత్తరం. తస్మై నమ ఇత్యుపాసీత. తత్ శివశబ్దితం బ్రహ్మ నమ ఇత్యేన నమశ్శబ్ద పూర్వకముపాసీత ఇత్యనేన. ఓ

---

ప్రారంభించి తస్య ... భావనం. ఆ యీశ్వరునకు వాచకము ప్రణవము ఆ ప్రణవా భావనమే జపమనియును మొదలైన వచనముల చేతను వాయుసంహితోత్తర భాగమున ను నశివస్యా ... ఏవవా. శివునకు ఆణవమాయిక కార్మికంబులను బంధంబులును లేవని యారంభించి ప్రణవో ... నసంశయః. అట్టి పరమేశ్వరునకు ప్రణవము వాచకమగును శివరుద్రాది శబ్దములలో ప్రణవముత్కృష్టంబగును. ప్రణవవాచ్యుండగు శంభునియొక్క జపమువలనను ధ్యానమువలనను ప్రాప్యమగు నే సిద్ధిగలదో అది యుత్కృష్టంబగునది. ఇందు సందియము లేదు. ఈ మొదలైన వచనముల చేతను ప్రణవమునకు సర్వోత్కృష్ట ము ప్రతిపాదింపబడినది. ఇందుచే మూలవ్యాఖ్యానరూపంబగు ప్రణవ పంచాక్షరమునకు సర్వోత్తమ్యము సిద్ధమైనది. ఈ కారణము చేత విధివిచారము సార్థకమైనది.

ఇక రెండవ ప్రశ్న [౨] ఈ శివనామ జపము వేదములయందు విధించబడుచున్న దా అనునది. అనగా శివాగమములయందే శివనామ జప విధియుండుటవలన శివనామమునకు శ్రౌతత్వము సందిగ్ధమైనదని ప్రశ్నాభిప్రాయము. ఇందుకు సమాధానము తస్మై నమ ఇత్యుపాసీత. తత్ ఆ శివసంజ్ఞితమగు బ్రహ్మను నమ ఇతి నమశ్శబ్ద పూర్వకము

ఖలిహ్య గోవ్యాహరేన్నమ ఇతిపశ్చాత్తత్శివాయేత్య క్షరత్రయ మి తిజాబాలామ్నానేన శైవ షడక్షరస్య విధిస్స్పష్టం నిగమాంతేష్వా మ్నాత ఇతి.

అథతృతీయః ప్రశ్నః (3) అథకిమయం సర్వేషు వేదేషు ప్రశం స్యత ఇతి. అస్యేదమభిప్రేతం. యద్యయం సర్వేషు వేదేషు ప్రశంస్యేత త ర్హిసర్వస్మా దపివైదికాత్కర్మణ శ్శ్రైష్ఠ్యంభజేతేతి. అస్యేదంసమాధా నం. ఋక్షుతుశివనామ విధయోయథా. ప్రబభ్రవేవృషభాయస్విత్రీచే మ హామహీం సుష్టుతి మీరయామి. నమస్యా కల్మలీకినం. నమోభిర్గృణే మసిత్వేషం రుద్రస్యనామ. ఇదంపిత్రే మరుతాముచ్యతేవచః స్వాదోస్వా దీయో రుద్రస్య వర్ధనం ఇమారుద్రాయస్థి రధన్వనేగిరః. ఇతి. తథా ఏక శతం హ్యధ్వర్యు శాఖాభవంతి తాసుచశ్రీ రుద్రస్య నియమేనపాఠాత్, శతేశాఖాసు పఠితం హీదం శతరుద్రీయ మామనంతి. తత్రాపి శుక్ల కృష్ణ

---

గానుపాసించవలయుననుటచేతను ఓం ... త్రయం. ఓం అని మొదలు వక్కాణించ వలయు. అనంతరము నమః అనియు ఆవల శివాయ అని అక్షరత్రయంబును అనియు జాబాలమున జెప్పబడుటచేతను శైవ షడక్షరమునకు విధి స్పష్టముగా నిగమాంతములయందు జెప్పంబడియె.

ఇక మూడవ ప్రశ్న [3] ఇక నన్ని వేదములయందు ప్రశంసించబడునా యను నది, అనగా ఈ శివనామ జపవిధి అన్ని వేదములయందు ప్రశంసింపబడియెనేని సమస్త మగు వైదికకర్మలకంటే శ్రేష్ఠమగునని యభిప్రాయము. ఇందుకు సమాధానము ఋక్కులయందు శివనామ జపవిధు లెట్టులనగా, ప్రబభ్రవే ... గిరః. ఈ రుద్రుని నామ మును నమస్కారములతోడ నుచ్చరించుచున్నారము దేవ జనకుండగు మహేశ్వరుని ప్రీతికై వచింపబడునని మొదలగునవి జూడదగినవి. మరియు నూరున్నొకటి యజుశ్శా ఖలు గలవు. అన్నిశాఖలయందునను శ్రీ రుద్రము నియమముగా పఠించబడుటవలన నూరుశాఖలయందునను పఠించబడినది గావున. శత రుద్రీయమని పేరిడిరి. ఆరుద్రము నందుగదా. శుక్ల కృష్ణ యజుస్సులలో గిరిశాచ్ఛావదామసి. ఓ గిరీశా, నిను స్వచ్ఛము

యజుషోః గిరిశాచ్ఛావదామసీతి శ్రూయతే. తథా త్రముష్టుహియస్స్వి ష్టుస్సుధన్వా ఇతి. స్తుహిశ్రుతంగర్తసదంయు వానమిత్యాదికం తథా సామస్సు రుద్రసంహితాయా మనంతం శివనామ భజన మహిమాభివర్ణనం. తథా ఆథర్వణే అథర్వశిరశ్శిఖాదిషు యోవైరుద్రస్స భగవాన్ సఏకస్స ఏకోరుద్రస్స ఈశానస్స భగవాన్ సమహేశ్వరస్స మహాదేవ ఇత్యాదిక మపరిమితం ద్రష్టవ్యం ఇతి.

అథాయం చతుర్థః ప్రశ్నః (౪) అథకిమిదం పురాణేతిహాసాదిషుకథ్యత ఇతి. అస్యైవమాకూతం వేదోపబృంహణరూపత్వాత్ పురాణేతిహాసయోః యదిదం తత్ర ప్రశంసితం తర్హ్యనవద్యంస్యాదితి. అస్యేదంసమాధానం స్కాందే శివతత్త్వసుధానిధౌ. నామ్నోస్తి యావతీ శక్తిః పాపనిర్హరణే హ్వజ తావత్పాపాని కర్తుంవాశక్తఃకోవాకలాయుగే

---

గా స్మరింతుమనియును అటులనే త్రముష్టుహి ... యువానం యవ్వాండు శ్రేష్ఠంబగు విల్లును బాణంబునుగలవాఁడో, అట్టి మహాదేవుని స్తవించుమా ? అటులనే సామమందు రుద్రసంహితలో శివనామభజన మహిమాభివర్ణన మనంతముగా జెప్పబడినది. మరియును ఆథర్వణమున అథర్వశిరశ్శిఖాదులయందు యోవై ... సమహాదేవః అతఁడే రుద్రుండును ఈశానుండును మహాదేవుండనియు మొదలుగా నపరిమితముగా జెప్పబడినదిగావున నందు జూడఁదగును. ఇందుచే నన్నివేదంబులయందును శివనామ జపము గనుపరచబడినది.

ఇక నాల్గవ ప్రశ్న [౪] ఇక నిది పురాణేతిహాసాదులయందు జెప్పఁబడుచున్నదనునది. అనగా పురాణేతిహాసములు వేదోపబృంహణరూపము లగుటవలన వాటియందు ఈ శివనామ జపవిధి జెప్పబడియుండెనేని శ్రేష్ఠంబగునని ప్రశ్నాభిప్రాయము. దీనికు సమాధానము స్కాందమున శివతత్త్వ సుధానిధియందు నామ్నోస్తి ... యావతీ ఈ శివనామమునకు యెన్నిపాపముల నశింపజేయు శక్తిగలదో అన్ని పాపముల జేయ

ఇతి. తథా నామాసియే మహేశస్యాగృణం త్యజ్ఞానతోపివా తేషామపి శివోముక్తిందదాతికిమతఃపరం: జ్ఞాత్వాయః కీర్తయేచ్ఛంభోః నామా న్యమిత తేజసః ముక్తిఃకరతలేతస్యస్థితేతి మునయోజగురితి. తథాసూత సంహితాయాం: శివభక్తి విచారాధ్యాయే: మహాదేవ పదాదీనాం శ్రవ ణేచ్ఛామహర్షయః. మహాభక్తిరితిప్రోక్తా మహా మాహేశ్వరైర్జనైరితి: తథాభారతే అనుశాసనికేపి. శివసహస్ర నామప్రస్తావే: నామ్నాంశై వానాం ప్రథమం వేదవేదాంగ సంభవత్వముక్తం. బ్రహ్మ ప్రోక్తైః ఋ షిప్రోక్తైః వేదవేదాంగ సంభవైః. సర్వలోకేషు విఖ్యాతం స్తుత్యంస్తో ష్యామినామభిరితి. తథా. తదేవ శివనామ ప్రస్తుత్య. ఇదంధ్యానమిదం యోగ మిదంధ్యేయమనుత్తమం. ఇదంజప్యమిదంజ్ఞానం రహస్య మిదము

---

టను ఈ కలియుగంబుననైన: శక్తుండెవడు: అనియు నామాని ... మునయోజగుః యే నరులు మహేశ్వరునియొక్క నామంబుల నజ్ఞానంబుననైన స్మరింతురో వారలకును శివుండు ముక్తినొసగు. ఇంతేకు నధికంబెద్ది. మహిమంబునెరిగి మహేశ్వరు నామముల నెవ్వడు కీర్తించునో అట్టి నరుని కరతలంబున ముక్తికలదని మునుఋబలికిరని జెప్పబడి యున్నది. అటులనే సూతసంహితయందు శివభక్తి విచారాధ్యాయమున మహాదేవ ... జనైః మహాదేవాది పదములయొక్క శ్రవణేచ్ఛయే మహాభక్తియని మునులు బల్కిరని జెప్పబడియె: అటుల భారతమున అనుశాసనికమునందునను శివసహస్రనామ ప్రస్తావ మున శివనామములకు మొదలు వేద వేదాంగ సంభవత్వము జెప్పబడినది: బ్రహ్మ ... నామభిః బ్రహ్మదేవునిచేతను ఋషులచేతను జెప్పంబడినట్టియు వేదవేదాంగ సంభ వములైనట్టి నామములచేత సర్వలోక విఖ్యాతుడును స్తోతార్హుడగు శివుని స్తుతిం చుచున్నారమనియు అట్టి శివనామమునే ప్రస్తుతపరచి ఇదంధ్యానం ... ఉత్తమం. ఇదియే ధ్యానను. ఇదియే యోగము, ఇదియే అనుత్తమమగు ధ్యేయనును. ఇదియే జప్యము ఇదియే జ్ఞానము ఇదియే ఉత్తమమగు రహస్యమనియును వర్ణించి జ్ఞాన

త్తమమితి వర్ణయిత్వా భగవతోపమన్యునా భగవంతం వాసుదేవం ప్రతిసిద్ధాంత ఉపదిష్టః యథా. శివమేభిస్తువన్నేవం నామభిః పుష్టివర్ధనైః నిత్యయుక్తశ్శుచిర్భక్తః ప్రాప్నోత్యాత్మాన మాత్మనా. అనేనస్పష్టముక్తి మాత్ర ఫలకత్వమస్యోక్తప్రాయం పరంచ. ఇదం పుణ్యం పవిత్రంచ సర్వదా పాపనాశనం యోగదం మోక్షదంచైవ స్వర్గదం జ్ఞానదం తథా, ఏతద్రహస్యం పరమం బ్రహ్మణో హృదిసంస్థితం ఇతి. తథాన్యత్రభాగవతేపి. యద్ద్వ్యక్షరం నామగిరేరితం నృణాంసకృత్ప్రసంగాదఘమాశుహంతితత్. ఇత్యాదినా ప్రశంసితమితి.

అథాయం పంచమః ప్రశ్నః (౫) కిమయం నిత్యోవిధిరితి. అస్యాయమాశయః నిత్యనైమిత్తిక యోరేవనియతానుష్ఠేయతయా తత్రై

---

వైరాగ్యాది సంపన్నుడగు ఉపమన్యునిచే వాసుదేవు నుద్దేశించి సిద్ధాంతముపదేశింబడియె. శివం... ఆత్మనా బలకరంబులగు నీ నామంబులచే శివు నీరీతి శుచియై నిత్యమును భక్తితోడ స్తుతించు జనుడు పరమాత్మను జెందుననుటచే స్పష్టముగా ముక్తిఫకత్వ మీ శివనామమునకు సిద్ధించె. ఇదియునుంగాక ఇదం ... సంస్థితం. ఇది పుణ్యంబును ఎల్లపుడు పవిత్రంబును పాపనాశనంబును యోగ మోక్ష స్వర్గజ్ఞానంబు నిచ్చెడిదియనగు మరియు నీ పరమరహస్యంబు వేదములకు హృద్గతంబైనదనియు జెప్పబడియుండె. మరియు నితరమగు భాగవతమందునను యద్ద్వ్య... తత్. యద్దే రెండక్షరములగు నే శివనామగలదో అది సకృదుచ్చారణమాత్రంబున సమస్తవిధంపాతకంబు నపహరించునని మొదలుగా ప్రశంసింపబడియె. ఇందుచే పురాణేతిహాసముయందు శివనామ జప మహిమ గనుపరచంబడినది.

ఇక నైదవ ప్రశ్న [౫] ఇది నిత్యవిధియా యేమి అనునది. అనగా నిత్యనైమిత్తికములే నియతముగా యనుష్ఠింపదగుటచేతను అందునను నిత్యవిధి ప్రబలమగుటచేత

నిత్యస్య ప్రబలతయాచ యదీదం నిత్యత్వేనామ్నాతం తర్హి సర్వేషామప్యనుష్ఠేయమితి. అస్యేదం సమాధానం యథాహ్యామ్నాయతే సంహితాస్వాథర్వణానాం ఏకాదశే కాండే ప్రథమానువాకే పంచమ షష్ఠ సప్తమాఖ్యేషు త్రిషుఖండేషు ఏకత్రింశన్మంత్రాత్మా శ్రీరుద్రసంహితా. తత్ర సప్తదశోయంమంత్రః సహస్రాక్షమతిపశ్యం పురస్తాత్. రుద్రమస్యంతం బహుధావిపశ్చితం మోపారరామజిహ్వయేయమానమితి వ్యతిరేకేణ శివభజన విరామస్య అధర్మత్వం నిరూపయన్ ప్రకృతస్యాత్యతాం నిరూపయామాస ఇతి.

అథాయం షష్ఠః ప్రశ్నః (౬) అథకిమిదం కర్మ సంసిద్ధికారి ఇతి. అస్యాయమాశయః ప్రమాదాత్కుర్వతాం కర్మప్రచ్యవత్యధ్వరేషుయత్ స్మరణాదేవ తద్విష్ణోః సంపూర్ణంస్యాదితిశ్రుతిః యజ్ఞేషువిహీనం తత్సంపూర్ణంభవతీతి విజ్ఞాయతే ఇతి స్మృతికల్పాభ్యాం విష్ణునామస్మరణస్యైవకర్మస్యాంగతా దోషనివృత్తి హేతుత్వేన ప్రకృతస్య అనాథాత్వేనచ తదేవావశ్య కర్తవ్యమితి. అస్యేదంసమాధానం శ్రుతిషుస్విష్ట కృద్ధోమ

---

ఈ శివనామజపవిధి నిత్యముగా జెప్పబడియున్నది ఎల్లరకను నుష్ఠేయమగునని ప్రశ్నాభిప్రాయము. ఇందుకుసమాధానము అధర్వణసంహితయందు ఏకాదశకాండమున ప్రథమానువాకములో పంచమ షష్ఠమ సప్తమములనెడి మూడు ఖండములయందును ముప్పదియొక మంత్రములుగల రుద్రసంహితయందు పదునేడవమంత్రము సహస్రాక్ష ... ఈ యమానం ఈ మంత్రము. రుద్రుని నాలుకచే స్మరించుచు తృణమైనయుపరమించవలను వ్యతిరేకోక్తిచే శివనామభజన విరామమునకు అధర్మత్వమును నిరూపించుచు ప్రకృతము శివనామజపమునకు నిత్యత్వమును నిరూపింపజేసె ఇందుచే నిత్యత్వమన్న సిద్ధమైనది.

ఇక నారవ ప్రశ్న [౬] ఇక నిది కర్మసంసిద్ధికరమైనది అనునది. అనగా ప్రమాదాత్ ... విజ్ఞాయతే యజ్ఞములయందు ప్రమాదమువలననే కర్మలోపించునో విష్ణునామస్మరణమువలననే అట్టి కర్మ సంపూర్ణమగుననియు యజ్ఞములలో లోపించిన కర్మ సంపూర్ణమగునని తెలియదగిన దనియును స్మృతికల్పములయందు విష్ణునామస్మరణమే కర్మలోపదోషనివృత్తికై హేతువుగా జెప్పబడుటచేతను ప్రస్తుతమగు శివనామము అట్టిదిగాకుండుటచేతను విష్ణునామజపమే అవశ్యముగా జేయదగినదని ప్రశ్నాభిప్రాయము. ఇందుకుసమాధానము శ్రుతులయందు స్విష్టకృద్ధోమమను కర్మ

స్యైవ కర్మవ్యంగతా దోషనివృత్తి హేతుత్వవిధానాత్. ఏవమయం మంత్రః యదస్యకర్మణోఽత్యరీరిచం యద్వాన్యూనమిహాకరం అగ్నిష్టత్స్విష్టకృద్విద్వాన్ సర్వం స్విష్టం సుహుతం కరోతుమే. ఇతి. అత్రమంత్ర లింగాదేవ కర్మన్యూనతాతి రేకయోః ప్రాయశ్చిత్తత్వేన స్విష్టకృద్ధోమసిద్ధే. యేషున ప్రాయశ్చిత్తం ప్రాతస్వికం జ్ఞాతమజ్ఞాతం హాతన్స్మృతే స్మృతేస్తాత్పర్య వర్ణనౌచిత్యాత్. శ్రుతివిరుద్ధార్థస్మృతే స్తాత్పర్య కల్పనస్యాశిష్ట సంమతత్వాత్. వికల్పాదేశ్చతుల్య బలవిషయత్వాత్. విప్రతిషిద్ధ ధర్మాణాం సమవాయే భూయసాంస్యా త్సధర్మత్వమితి జైమిన్యుక్తేః రుద్రస్య స్విష్టకృత్త్వస్య వా సర్వశ్రుతిసమ్మతస్య స్మృతిబలానుమిత శ్రుత్యపేక్షయా ప్రాబల్యస్యావశ్య మంగీకార్యత్వాచ్చ నను స్విష్టకృదగ్నిర్నామన రుద్ర ఇత్యనేన కింభవతస్సిద్ధం శివనామ మాహాత్మ్యమితిచేత్ రుద్రోఽగ్నిస్స్విష్టకృత్. ఇతి బహుషుస్థలేషు రుద్రస్యస్విష్టకృత్సంజ్ఞకత్వాభిధానాత్. తథా యజుష్షుచ దేవావై యజ్ఞాద్రుద్రమంతరాయన్

---

లోపదోష నివృత్తి హేతువుగా విధించబడియె. ఈప్రకారము గదా మంత్రము యదస్య ... కరోతుమే ఈ కర్మకు యొద్ది యధికమాచరించితినో యెద్దియేని న్యూనమాచరించితినో ఆయాకర్మను అగ్నిరూపుండును స్విష్టకృత్సంజ్ఞుండునగు రుద్రుండు పూర్ణముగా జేయుగాక యని ఇచట మంత్రలింగమువలననే కర్మన్యూనాధిక్యములకు ప్రాయశ్చిత్తముగా స్విష్టకృద్ధోమను సిద్ధించుచుండగా యేకర్మలయందు ప్రాయశ్చిత్తము స్పష్టముగా తెలిసి తెలియకయుండునో అందువిషయమై ఆ స్మృతికి తాత్పర్యవర్ణనముచితమగుటవలనను శ్రుతి విరుద్ధార్థమునందు స్మృతికి తాత్పర్యకల్పనను శిష్టసమ్మతముగాకుండుటవలనను వికల్పాదులు సమాన బల విషయములగుటవలనను విరుద్ధధర్మములకు సమవాయముకలుగగా నెక్కుడు వచనములకు స్వార్థమునందు తాత్పర్యమను జైమిని వచనమువలనను రుద్రునకు స్విష్టకృత్సంజ్ఞకత్వంబు సర్వ శ్రుతి సమ్మతమగుటచే స్మృతి బలమున ననుమానితమగు శ్రుతిద్వారా ప్రాబల్యమవశ్య మంగీకరించదగుటవలనను శివనామజపము కర్మలోప ప్రాయశ్చిత్తార్థమైనదిగాదు. ఇకను స్విష్టకృత్ అనగా అగ్నిదే గాని రుద్రుడుగానేరడు. ఇందుచే నీకేమి శివనామ మహిమ సిద్ధించెనంటివేని రుద్రోఽగ్నిస్స్విష్టకృత్ స్విష్టకృత్ అగు అగ్ని రుద్రుడేనని బహుస్థలములయందు రుద్రునకు స్విష్టకృత్సంజ్ఞకత్వము జెప్పబడుటవలనను అటులనే యజుర్వేదమునందు దేవావై ...

సయజ్ఞమవిధ్యత్తం దేవా అభి సమగచ్ఛంత కల్పతాంన ఇదమితి తే బ్రువన్ స్విష్టంవైన ఇదంభవిష్యతి యదిమంరాధయిష్యామ ఇతి. తత్స్విష్టకృత స్స్విష్టకృత్త్వం. ఇతి స్విష్టకృతశ్చనామ రుద్రస్య నిర్లజ్జముద్ఘుష్య యజనం కంఠరవేణవిహితం యథా యజుషాం బ్రాహ్మణేషు శ్రూయతే. ఉచ్చైస్స్విష్టకృత ముత్సృజతి యథానష్టం విత్త్వా ప్రాహాయమితి తాదృగేవతత్. ఇత్యనేన సంభావితన్యూనాతిరేక సమీకరణేన సుష్ఠుయాగంసంపాద్యాను గృహ్ణాతి పరమేశ్వరోయ మలజ్జ భజనతుష్ట ఇతి శ్రుతేర్హృదయం స్విష్టకృత్సంజ్ఞక రుద్ర హ్వానమస్యైవ ప్రాయశ్చిత్తత్వేన నిగమ నిగదితతయాయస్య నప్రాయశ్చిత్తం ప్రాతిస్వీకం. తస్యాపి శివనామభజనమేవ అవశ్యతః కార్యమితి శ్రుతి హృదయస్వారస సిద్ధోర్థః. ఏతేనకర్మ సంసిద్ధికారిత్వం శివనామ్న ఏవసిద్ధమితి.

అథాయం సప్తమః ప్రశ్నః (౭) కిమిదం మాంగళ్యాపాదకం. ఇతి అస్యేదం హృదయం అమంగళ వృత్తత్వాదస్య రుద్రస్య తన్నామ

---

కృత్త్వం దేవతలు యజ్ఞమునుండి రుద్రుని పరిత్యజించిరి. ఆ రుద్రుండు యజ్ఞమును వేధించె అంత దేవతలు ఈ రుద్రు నారాధించితిమేని మనలకు స్విష్టంబుగలుగునని రుద్రు నాశ్రయించిరి. అందుచే రుద్రునకు స్విష్టకృత్సంజ్ఞ గలిగెనని చెప్పుటచే స్విష్టకృత్ అనగా రుద్రుడే యగును స్విష్టకృత్సంజ్ఞకుండగు నీ రుద్రుని నామము ఉద్ఘోషముతోడ భజించుట కంఠరవముతోడ విధించబడినది. యజుర్వేద బ్రాహ్మణమునందు ఉచ్చైః ... తత్ స్విష్టకృత్తును ఉచ్చైస్స్వరముతోడ నుచ్చరించుచున్నారు. యటుల నష్టద్రవ్యము నెరిగి ఇదుగోయని బలుకు అటులనే యుచ్చరించవలయుననుటచే అలజ్జ భజనతుష్టుండగు పరమేశ్వరుండు సంభావితములగు న్యూనాతిరేకములను సమానపరచుటచేతను యాగమును సుష్ఠుగాసంపాదించి యనుగ్రహించునని శ్రుతియొక్క తాత్పర్యము స్విష్టకృత్సంజ్ఞకుడగు రుద్రుని హ్వానమే కర్మలోప ప్రాయశ్చిత్తముగా నిగమములయందు జెప్పబడుటచే యేకర్మకు ప్రాయశ్చిత్తము జెప్పబడలేదో ఆకర్మకును శివనామజపమే అవశ్యముగా జేయదగినదని శ్రుతి హృదయస్వారస్యముచే నీ యర్థము సిద్ధమైనది. ఇందుచే కర్మ సంసిద్ధికరత్వము శివనామమునకు సిద్ధమైనది.

ఇక నేడవ ప్రశ్న [౭] ఈ శివనామజపము మాంగళ్యాపాదకమైనదా అనునది. అనగా రుద్రుడు అమంగళచర్య గలవాడగుటచే రుద్రుని నామస్మరణము మాంగ

శివనస్యైకథం మాంగళ్యాపాదకత్వమితి. అస్యేదం సమాధానం ష్ట మాతృకాక్షరాత్మకమూలమంత్రోపనిషద్వ్యాఖ్యానోచ్యతే. ఓం శంకార సర్వప్రద పవిత్రితమ త్ర్యత్వారింశే క్షేత్రే ప్రతిష్ఠ. ఓం వంకార సర్వాప్యాయన కర నిర్మల పంచచత్వారింశే క్షేత్రే ప్రతిష్ఠ ఓం అంకార మృత్యుంజయ సర్వవ్యాపక ప్రథమే క్షేత్రే ప్రతిష్ఠ. ఓం ఇంకార పుష్టిద అక్షోభకర తృతీయే క్షేత్రే ప్రతిష్ఠ, ఇతి. అనేన. శకారే కార వకారాకార సముదాయరూపస్య శివనామ్నోర్థః ప్రతిపాదితః. తథా మంత్రశాస్త్రేపి శవర్ణస్య శుభప్రదత్వం వంబీజస్య అమృత బీజత్వంచ ప్రతిపాదితం. అథవానంత కల్యాణ గుణైకనిధిరీశ్వరః. శివఇత్యుచ్యతే సద్భిశ్శివ తత్త్వార్థకోవిదైరితి వాయుసంహితాయాముక్తం అతఏవ భాగవతేపి యద్ద్వ్యక్షరం నామగిరేరితం నృణాంసకృత్ప్రసంగాదఘమాశుహంతి తత్. పవిత్రకీర్తిం తమలంఘ్యశాసనం భవానహో ద్వేష్టి శివంశివేతరఃఇతి. తత్రైవ. యస్యావ

---

ళ్యాపాదక మెట్లగునని ప్రశ్నాభిప్రాయము. ఇందుకుసమాధానము అక్షమాతృకోపనిషత్తునందు ఇట్లు జెప్పబడుచున్నది. ఓం శంకార ... ప్రతిష్ఠ సర్వప్రదవగు ఓ శకారమా నీవు నలుబదియారవ అక్షముసందుండుము, సర్వాప్యాయన కారివగు ఓ వకారమా నీవు నలుబదినైదవ అక్షమునందుండుము, మృత్యువినాశివగు ఓ అకారమా, నీవు మొదలవదగు అక్షమునందుండుము, పుష్టిప్రదవగు ఓ ఇకారమా మూడవదగు అక్షమునందుండుము, అనుటచే శకారేకార వకారాకార సముదాయరూమగు శివనామముయొక్క అర్థము స్పష్టీకరించబడినది. అట్లు మంత్రశాస్త్రమునందనను శవర్ణమునకు శుభప్రదత్వమును వం బీజమునకు అమృత బీజత్వమును ప్రతిపాదింపబడినది. అనంత కల్యాణ గుణనిధియగు ఈశ్వరుడు శివతత్త్వార్థ కోవిదులగు సుజనులచే శివుండని జెప్పంబడునని వాయుసంహితయందును జెప్పంబడియుండె. గావుననే భాగవతమందునను యద్ద్వ్యక్షరంనామ ... శివేతరః యద్దేవుని రెండక్షములగు శివనామము వాక్కుచే సకృదుచ్చారణ మాత్రంబున సర్వవిధంబగు పాతకబు నపహరించు పవిత్రకరంబగు కీర్తిగలిగి అలంఘ్యశాసనుండగు శివుని శివేతరుడగు నీవు ద్వేషించుచున్నాడవు. అనియు జెప్పంబడియుండె. మరియు నా గ్రంథమందనే యస్యా... బిభేత్యసౌ యద్దేవుని యనపద్యంబగు చరితంబును అవిద్యాసట

ద్యం చరిత్రం మనీషిణో గృణంత్య విద్యాపటలం బిభిత్సవః. ఇత్యాదినా, హ
సంతి యస్యా చరిత-హి దుర్భగా ఇత్యాదినా చ శివస్య మంగళకరత్వం త
ద్ద్వేషిణాం శివేతరత్వ దుర్భగత్వాది కమపి ప్రతిపాదిత మితి మాంగళ్యా
పాదకత్వం సిద్ధమస్యేతి.

అథాయ మష్టమః ప్రశ్నః (౮) కిమిదం తారకమితి. అస్యాయమా
శయః. రామమంత్ర ఏవ హి తారకో భవతి. తారకో నామ తారయతీతి. త
థా. కలిసంతరణో పనిషద్యామ్నాయతే. ద్వాపరాంతే నారదో బ్ర
హ్మాణం జగామ. కథం భగవన్ గాం పర్యటన్ కలిం సంతరేయమితి స హో వా
చ బ్రహ్మా సాధు పృష్టోఽస్మి. సర్వశ్రుతి రహస్యం గోప్యం తచ్ఛృణు. యేన క
లిసంసారం తరిష్యసి. భగవత ఆదిపురుషస్య నారాయణస్య నామోచ్చా
రణ మాత్రేణ నిర్ధూతకలిర్భవతి. నారదః పునః పప్రచ్ఛ నామ కిమితి స
హోవాచ హిరణ్యగర్భః. హరే రామ హరే రామ రామ రామ హరే హరే
హరే కృష్ణ హరే కృష్ణ కృష్ణ కృష్ణ హరే హరే. ఏతత్ షోడశకం నా

---

బును భేదించదలచి పండితులు స్మరించుచున్నారో అని మొదలిడి హసంతి ... దుర్భ
గాః యద్దేవు చరిత్రంబును, దుర్భగులగు జనులు హసింతురో యనుటచేతను శివునకు
మంగళకరత్వంబును శివద్వేషులకు, అమంగళత్వ దుష్టభగోత్పన్నత్వాదులును, ప్రతి
పాదింపబడినవి గావున. శివనామజపమునకు మాంగళ్యపాదకత్వము సిద్ధమైనది.

ఇక యెనిమిదవ ప్రశ్న (౮) ఇది తారకమూ ఏమి అనునది, అనగా రామమం
త్రమే గదా తారకమగును తరింపజేయునది గావున తారకమని చెప్పబడును. కలిసం
తారణోపనిషత్తునందు, ద్వాపరాంతే ... నాశనం, ద్వాపరాంతమున నారదుడు
బ్రహ్మదేవు నుద్దేశించి జని, ఓ పితామహా భూమిని జరించుచు కలి నెట్లుల తరింతునని
వచించె. అంత సర్వశ్రుతిరహస్యంబు గోప్యంబగు రహస్యంబును వచించెదను వినుము. దేనిచే
కలిసంసారమును తరింతువో. భగవంతుండును ఆదిపురుషుండునగు నారాయణుని
యొక్క నామోచ్చారణ మాత్రముచే కలివినిర్ముక్తుండగును నారదుండు తిరుగా
యా నామం బెద్దియని యనంతరమున హిరణ్యగర్భుండు వచించె. హరేరామయను

మ్నాం కలికల్మషనాశన మితినారాయణ నామజప ఫలశ్రుతేః. నారాయ
ణనామ్నైవతారకంభవతీతి. అస్యేదంసమాధానం. నారాయణ నామ
జపఫలశ్రుతేః. కార్కోటకస్య నాగస్య దమయంత్యా నలస్యచ ఋతుప
ర్ణస్య రాజర్షేః కీర్తనం కలినాశన మిత్యస్యేవ. కలికల్మష నాశకత్వ మా
త్రమేవా స్యవాచ్యంభవతి. కలికల్మషాత్తారయతీతి తన్నిబంధనైవాస్య
తారకత్వ నిరుక్తిరపి రామరహస్యాదౌ. ప్రకృతస్యతావత్. శివనామ్నః
జాబాలేతు వేదాంతే, అథహైనం బ్రహ్మచారిణ ఊచుఃకింజప్యేనా మృత
త్వంనో బ్రూహీతి. సహోవాచ యాజ్ఞ్యవల్క్యశ్శత రుద్రీయేణేతి.ఏతా
నిహావా అమృతస్య నామధేయాని. ఏతైర్హ్వావా అమృతో భవతి. ఇతిము
క్తిఫలకత్వస్యా స్యనిరూపితతయా. అథర్వశిఖాదౌ. తత్తారమితి. అథక
స్మాదుచ్యతే తారమిత్యాది నానమస్తారాయన మశ్శంభవేచ ఇతి శతరు

మొదలుగా పదునారు నామంబులును కలికల్మష నాశనమని నారాయణ నామ
ఫలశ్రుతివలన నారాయణ నామమే తారకంబగునని యభిప్రాయము. ఇందుకు
సమాధానము. నారాయణనామజప ఫలశ్రుతికి కార్కో... నాశనం. కర్కోటక
సర్పము, నలుడు మొదలగు వారియొక్క నామము కలినాశనమగు ననువచనమున
వలె, కలికల్మషనాశకత్వమాత్రమే. ఈ కలిసంతారణోపనిషత్తునందలి వచనమునకు
ఫలము జెప్పదగినది. కలికల్మషమువలన తరింపజేయునది యని. ఈ తాత్పర్యముచే
రామమంత్రమునకు రామ రహస్యాదులయందు తారకత్వ నిరుక్తి జెప్పబడినది.
ప్రకృతమగు శివనామమునకును జాబాలవేదాంతమునందు, అథ ... భవతి. అనగా
రను యాజ్ఞ్యవల్క్యు నుద్దేశించి, ఏ జపముచే మోక్షముగలుగునో మాకు జెప్పుమా
యని బ్రహ్మచారులుబలుక, యాజ్ఞ్యవల్క్యుండు. శతరుద్రీయ జపముచే ముక్తుండగు.
ఈ శతరుద్రీయమందలి యభిధేయములు అమృతపదవాచ్యుండగు పరమేశ్వరుని నామ
ములు. ఈ పరమేశ్వరుని నామములచేతగదా ముక్తుండగునని ముక్తిఫలకత్వము నిరూ
పించుటచేతను, అథర్వశిఖాదులయందు, తత్తారం. అదితారమనియు. అథ కస్మా
దుచ్యతే తారం. తారమని ఎందువలన జెప్పబడుననియు నమస్తారాయన మశ్శంభవేచ
అని శతరుద్రీయమున శివనామవిశేషణముగానే జెప్పబడుటవలనను, బృహజ్జాబా

త్రిమే శివనామవిశేషణత్వే నైవాస్య నిరుక్తయః. బృహజ్జాబాలే. శ్రీశైవషడక్షరస్యైవ తారకసంజ్ఞకత్వామ్నానేనచ తారకత్వమస్యైవ శివనామ్నస్సిద్ధమితి.

అథనవమః ప్రశ్నః (౯) అథకేతే తదనుష్ఠాతారఇతి. అస్యేదం హృదయం. యదీదంమహద్భిరనుష్ఠితం తర్హి సర్వస్యాపి భవేజ్జప్యం జనస్యేతి. అస్యేదం సమాధానం. ఆనుశాసనికే. నామవిద్యాపరం పరాయాం. బ్రహ్మప్రోవాచ శక్రాయ శక్రః ప్రోవాచ మృత్యవే. మృత్యుః ప్రోవాచ రుద్రేభ్యో. రుద్రేభ్యస్తండిరాప్తవాన్. తండిః ప్రోవాచ శుక్రాయ గౌతమాయచ భార్గవః. వైవస్వతాయమనవే. గౌతమః ప్రాహమానదః. నారాయణాయసాధ్యాయ మనురిష్టాయధీమతే. యమాయ ప్రాహభగవాన్ సాధ్యో నారాయణోచ్యుతః. నాచికేతాయ భగవానాహవైవస్వతో యమః. మార్కండేయాయ వార్ష్ణేయ నాచికేతోభ్యభాషత. మార్కండేయాన్మయాప్రాప్తః నియమేనజనార్దన. తనాప్యహమమిత్రఘ్నస్తవంద్యాహి విశ్రుతం. స్వర్గ్యమారోగ్యమాయుష్యం ధన్యంవేదేనసమ్మితం. ఇత్యంతం. ఆబ్రహ్మణః ఆచకమలాక్షాచ్చతుర్దశాచార్యాని రదిశ

---

మనెను. శ్రీశైవ షడక్షరమునకే తారకసంజ్ఞకత్వమును జెప్పుటవలనను తారకత్వము శివనామమునకే సిద్ధంబైనది.

ఇక తొమ్మిదవప్రశ్న (౯) ఇకదీని ననుష్ఠించువారలెవరనునది. అనగా, ఈశివనామము పెద్దలచే యనుష్ఠింపబడియున్నయేని సమస్తజనమునకు జప్యమగునని ప్రశ్నాభిప్రాయము. ఇందుకు సమాధానము. ఆనుశాసనికమున నామవిద్యాపరంపరయందు, బ్రహ్మ ... వేదేనసమ్మితం. బ్రహ్మదేవుండు, ఇంద్రునకు జెప్పె. ఇంద్రుండు మృత్యువకును. మృత్యువు రుద్రులకును. రుద్రులు నందికిని నందీశుండు శుక్రునకును శుక్రుండు గౌతమునకును గౌతముండు, వైవస్వతమనువు కొరకును, వైవస్వతమనువు నారాయణునకును, నారాయణుండు యమునకును, యముండు నాచికేతునకును. నాచికేతుండు మార్కండేయునకును, మార్కండేయుండు నాకునుదెలిపె. నేనును స్వర్గమును, ఆరోగ్యమును, ఆయుష్యమును గలుగజేయు వేదసమ్మితమైన. ఈస్తవమును నీకొసగుదు. అనుపర్యంతము బ్రహ్మమొదలు కమలాక్షుని పర్యంతము పదునలుగురు. ఆచార్యులు నిర్దేశింపబడిరి. సమనంతరాధ్యాయమున నితరులగు శివనామజపసిద్ధులైన

షత. అన్యేచశివనామ జపసిద్ధా స్సమనంతరాధ్యాయే. కృష్ణద్వైపాయ, సకపిలచారుశీర్ష వాల్మీకి జామదగ్న్య విశ్వామిత్ర దేవలగృత్స మదము ఖాబహవోనిరూపితాః. హరివంశేపి. భాస్వత్త్రిపుండ్ర ఇత్యాదినాషం చ జజాపవర్ణ్ణానిత్యంతే నశ్లోకేన ముకుందస్య శ్రీశైవ పంచాక్షర జపప రాయణత్వం ప్రతిపాదితం. తథాస్కాందేపి. అగస్త్య రామాదిభిరాదృ తత్వాదముష్య మంత్రస్యచ వైదికత్వాత్. పరస్య తత్వస్యచ వాచ కత్వాన్నమశ్శివాయేతి సదాజపేద్విమితీ మహిమాశైవస్య పంచాక్షరస్య సునిరూపితః.

ఏవంచకిమిదం. నారాయణాష్టాక్షరమివ. క్రూరార్ణబంధురం హ రేరామేత్యాదికమివచ కలికల్మష మాత్రనాశకం వాభవతిపరంతు. స ర్వవేదప్రతి పాద్యస్య నిత్యస్యాస్య శివనామ జపస్య శ్రౌతతాయుక్తత్రై వేతి. తురీయస్య శివనామ జపస్య శ్రౌతతాసిద్ధా.

---

వారలు కృష్ణద్వైపాయనుడును కపిలుడును చారుశీర్షుడును వాల్మీకియు జామదగ్న్యు డును విశ్వామిత్రుడును దేవలుడు గృత్సమదుడు మొదలుగువారలు నిరూపింపబడిరి హరివంశమునను భాస్వ ... వర్ణా భస్మత్రిపుండ్రముచే భాసిల్లువాడై శైవ పంచా క్షరమును జపించెనను శ్లోకముచే శ్రీ విష్ణునకును శైవపంచాక్షర జపపరాయణత్వ ము ప్రతిపాదింపబడినది. అటుల స్కాందమునను అగస్త్య ... జపిత్వం ఈమంత్రము అగస్త్య రామాదులచే యనుష్ఠింపబడుటవలనను వైదికమగుటవలనను పరతత్త్వమున కు వాచకమగుటవలనను నమశ్శివాయయని ఎల్లపుడును జపించుడను వచనముచే శైవ పంచాక్షరముయొక్క మహిమ విశేషముగా నిరూపింపబడియె.

ఇందుచే నీ శైవ పంచాక్షరము నారాయణాష్టాక్షరమువలె రేఫాది క్రూరా క్షర విశిష్టమైనదా హరే రామేత్యాది నామములవలె కలికల్మషమును మాత్రమే నశిం జేయునా ఇకను సర్వవేదశాస్త్ర ప్రతిపాదితంబును నిత్యమున్నగు నీ శివనామజపము నకు శ్రౌతత్వము యుక్తమేయని నాలవదగు శివనామజపమునకు శ్రౌతత్వము సిద్ధించినది.

అథ పంచమస్య బిల్వస్య శ్రౌతతా మీమాంస్యతే. అస్యహిసదార్చనే వినియోగః. ఏనమధికృత్య సమాధేయాః ప్రశ్నాః (౧) కిమస్య విధిశ్శ్రూయతే నిగమేషు (౨) కిమయం నిత్యో విధిః (౩) అథ కిమస్య ప్రయోజనమితి.

తత్రాయమాద్యో యథా (౧) కిమస్య విధి శ్శ్రూయతే నిగమేషు. ఇతి. అస్యాయమాశయః. బిల్వం హి వినియుజ్యతే శివపూజాయాం. యథా తులసీదళం విష్ణ్వారాధనే. కిమత్ర విశేషః. యద్యస్య విధిర్నిగమేష్వామ్నాయేత తర్హి సర్వైరూరీక్రియేతేతి. అస్యేదం సమాధానం. శ్రు. త్రిసుపర్ణమయాచితం బ్రాహ్మణాయ దద్యాత్. అః విష్ణుః. ఆ. లక్ష్మీః. తద్యాచితం ప్రాప్తం. తవ వృక్షోథ బిల్వ ఇతి లక్ష్మీసూక్తే బిల్వస్య లక్ష్మీవృక్షత్వామ్నానాత్. తథావిధం- త్రిసుపర్ణం. త్రీణి. త్రిసంఖ్యాకాని సుష్ఠూని. కీటచ్ఛిద్రాద్యనాక్రాంతాని పర్ణాని యస్య తత్త్రిసుపర్ణం. బి

---

ఇక నైదవదగు బిల్వమునకు శ్రౌతత్వము విచారింపబడు. ఈబిల్వమునకు లింగార్చనయందు వినియోగము. దీని నుద్దేశించి సమాధానపరచదగిన ప్రశ్నలెట్టివన [౧] ఈ బిల్వార్చనకు విధి నిగమములయందు జెప్పబడునా [౨] ఇది నిత్యవిధియా యేమి [౩] ఇక నీ బిల్వార్చన కేమి ప్రయోజనము, అనునవి.

అందు మొదటి ప్రశ్న [౧] ఈ బిల్వార్చనకు విధి వేదములయందు జెప్పబడునా అనునది. అనగా బిల్వముగదా శివారాధనమునందు వినియోగపరచబడుచున్నది. తులసీదళ మెటుల విష్ణ్వారాధనయందు వినియోగించబడునో. బిల్వమునందేమి విశేషము. ఇక నీబిల్వార్చనకు విధి వేదములయందు జెప్పబడియున్నేని. అవుడెల్లరచే యనుష్ఠింపబడునని ప్రశ్నాభిప్రాయము. ఇందుకు సమాధానము. త్రిసుపర్ణం ... దద్యాత్. అః. విష్ణు ఆ లక్ష్మీ తవవృక్షోథబిల్వః అను శ్రీసూక్తమంత్రమునందు, బిల్వము లక్ష్మీవృక్షముగా జెప్పబడియె గావున. ఆయా లక్ష్మీదేవిచే, ఉతంప్రాప్తమైనట్టియు. త్రీణి మూడగు సుష్ఠూని కీటచ్ఛిద్రాదిరహితములైన, పర్ణాని, దళములు, దేనికో. అట్టిది.

ల్వస్య త్రిపర్ణత్వ దర్శనాత్. తత్ బిల్వదళం బ్రాహ్మణాయ. త్వందే
వేషు బ్రాహ్మణా ఇతి శ్రుత్యా బ్రాహ్మణోభగవాన్ రుద్ర ఇతి పురాణో
క్త్యాచ మహేశితుః బ్రాహ్మణత్వ కథనాత్. తస్మై దద్యాత్. సంద
దీత. ఇత్యనేన శివముద్దిశ్య బిల్వ వినియోగః స్పష్టమామ్నాతః. నచతద
నంతరం. యే బ్రాహ్మణా స్త్రిసుపర్ణం పఠంతీతి వచనేన. బిల్వస్య పఠనా
యోగ్యత్వాత్. త్రిసుపర్ణపదం బిల్వపరం నభవతీతి శంక్యం. తత్రపఠ
ధాతోః అభిష్టుతిపరత్వాత్. యేతావత్. శివోద్దేశేన బిల్వదళం సంద
దీరన్. యేచ బ్రాహ్మణాః బిల్వమభిష్టువీరన్. తే ఉభయేపి. సోమం. శివం
ప్రాప్నువంతీ త్యుత్తరార్థ సందర్భానురోధః శ్రుతి య ఆదిత్యోజాయత
తతోబిల్వ ఉదతిష్ఠ దిత్యస్య త్రాపి ప్రశంసితః. సూ. బైల్వోవాఖాదిరోవా
పాలాశోవా. ఇతి బైల్వేన బ్రహ్మ వర్చసకామ ఇత్యనేనచ కల్పేన బ్రహ్మ

---

త్రిసుపర్ణము. అనగా మూడుదళములుగలది బిల్వమేగావున. అట్టిబిల్వమును బ్రాహ్మ
ణాయ. అనగా త్వందేవేషు బ్రాహ్మణః, నీవు దేవతలయందు బ్రాహ్మణుడవను
శ్రుతిచేతను, బ్రాహ్మణోభగవాన్ రుద్రః. భగవంతుడగు రుద్రుడు బ్రాహ్మణు
డను. పురాణవచనముచేతను పరమేశ్వరుడే బ్రాహ్మణుడని జెప్పబడుటవలన. అట్టి
పరమేశ్వరునికొరకు దద్యాత్. సమర్పించవలయునని శివునుద్దేశించి. వినియోగముచే
బిల్వవిధి స్పష్టముగా జెప్పబడియె. ఇకను, అనంతరమున యే బ్రాహ్మణా స్త్రిసుపర్ణం
పఠంతి. యే బ్రాహ్మణులు త్రిసుపర్ణమును పఠింతురో. అను వచనముచే బిల్వము ప
నయోగ్యము గాకుండుటవలన త్రిసుపర్ణ పదము బిల్వపరము గాదంటివేని ఏమన
ఇచట పఠధాతువు స్తుతిని బోధించును. యెవరలు శివునుద్దేశించి బిల్వము నర్పింతురో
యేబ్రాహ్మణులు బిల్వమును స్తుతింతురో తేసోమం ప్రాప్నువంతి. తే, వారలు భయు
లును. సోమం, ఉమాపతిని. ప్రాప్నువంతి, పొందుదురని. ఉత్తరార్థ సందర్భాను
రోధము. శ్రు. య, ఆదిత్య ... ఉదతిష్ఠత్. ఆదిత్యుండను జెనినుండిజనించెనో దాని
నుండియే బిల్వము ప్రభవిల్లెనని శ్రుత్యంతరమునను బిల్వము ప్రశంసింపబడినది. సూ
బైల్వోవా ... కామః. బైల్వముగాని, ఖాదిరముగాని, పాలాశముగాని, యూప
ము కర్తవ్యము, బ్రహ్మవర్చసకాముడు. బైల్వయూపము చేతననియు. కల్పో

వర్చ స్సంపాదకత్వే నాప్యుపవర్ణిత మితిశ్రుతి కల్పాదిష్వస్య ప్రశంసాసు నిరూపితేతి. సమాహితోఽయం ప్రశ్నః.

అథద్వితీయః ప్రశ్నః (౨) కిమయం నిత్యోవిధిరితి. అస్యాయమాశయః యద్యస్య. విద్యాస్థానేషు నిత్యతాస్యాత్ప్రతిపాదితా. తర్హి ప్రశస్యేత సర్వస్మాదపీతి. అస్యేదముత్తరం. శివతత్త్వసుధానిధౌ. యోనక్షుర్యాద్బిల్వదళై రర్చనం శంకరస్యతు. శతాయుః పురుషోవాపి తస్య జన్మ నిరర్థకమితి. బిల్వపత్ర విహీనాయా సాపూజా నిష్ఫలాభవేదితి వచనేన చ. తదకరణే నిందారూపేణ నిత్యతాస్యనిరూపితా ఇతి.

అథాయం తృతీయః ప్రశ్నః (3) అథకిమస్య ప్రయోజనం. ఇతి. అస్యేదమభిప్రేతం. యద్యస్య స్యాన్మహత్ప్రయోజనం తర్హి స్యాత్సర్వైస్సమనుష్ఠేయం. ఇతి. అస్యేదముత్తరం. శివతత్త్వసుధానిధౌ. బహుజన్మార్జితైః పుణ్యైః బిల్వపత్రార్చనంలభేత్. బిల్వపత్రార్చన-కృత్వా నపునర్జన్మభాగ్భవేత్. శుష్కైః పర్యుషితైర్వాపి వస్త్రైర్బిల్వదళైరపి. పూ

---

యందు బ్రహ్మవర్చస్సంపాదకముగా వర్ణించబడినదగుటచే, శ్రుతికల్పాదుల యందు బిల్వమునకు ప్రశంసయు విధియును గనుపరచబడినది.

ఇక రెండవప్రశ్న (౨) ఇది నిత్యవిధియా ఏమి అనునది. అనగా, ఈ బిల్వమునకు విద్యాస్థానములయందు నిత్యత్వము ప్రతిపాదింపబడియుండెనేని అపుడన్నికర్మలకంటె ప్రశస్తంబగునని ప్రశ్నాభిప్రాయము. ఇందుకు సమాధానము శివతత్త్వసుధానిధియందు. యోన ... భవేత్. యెవ్వండు బిల్వదళములచే శివునర్చించడో, నూరువత్సరంబులు బ్రతుకువాడైనను వానిజన్మవ్యర్థంబగు. బిల్వపత్రరహితంబగు శివారాధనంబు నిష్ఫలంబనియును జేయకున్న నిందారూపముగా, బిల్వపత్రార్చనకు నిత్యత్వంబు నిరూపింపబడియె.

ఇక మూడవప్రశ్న (3) ఈబిల్వార్చనకు ప్రయోజనంబేమియనునది. అనగా ఈ బిల్వార్చనకు గొప్పదగు ప్రయోజనము గలిగియుండెనేని, అపుడెల్లరకనుష్ఠేయమగునని ప్రశ్నాభిప్రాయము. ఇందుకు సమాధానము శివతత్త్వసుధానిధియందు. బహుజన్మ...నవిద్యతే. బహుజన్మార్జితములగు పుణ్యములవలనబిల్వార్చనలభించు. బిల్వపత్రంబులచే శివునర్చించెనేని మరుజన్మము లేకుండును. శుష్కములు పర్యుషితములైనను బిల్వద

జయేద్గిరిజా నాథం ముచ్యతే సర్వపాతకైః. సత్యం సత్యం పునస్సత్యం బిల్వపత్రార్చనం పరం. బిల్వపత్రార్చనేనైవ పునర్జన్మనవిద్యతే. ఇత్యాదినా ముక్తిఫలకత్వమస్య సునిరూపిత మితి సమాహితోఽయం ప్రశ్నః.

ఏవంచ కిమిదం తులసీ దళమివ. శ్రుతిశోణానాకర్ణితమితి. నిగమ విహితస్య. శ్రుతికల్ప పురాణాది ప్రశంసితస్య ముక్తిమాత్రఫల కస్యాస్య బిల్వదళస్య శ్రౌతతా సిద్ధా. ఇతి. సర్వంశివం.

ఇతి శ్రీమద్భారద్వాజ కులజలధి కౌస్తుభ శ్రీ శ్రౌతశైవాచార్య
శ్రీ మదుద్భటారాధ్య వంశావతంస శ్రీ మద్భగవన్మాహే
శ్వర శ్రీమద ఘోరనాథారాధ్యతనూభవేన శ్రీ జ్వా
లాంబాగర్భశుక్తిముక్తాఫలేన దేశిక శ్రీ వీరే
శ్వరారాధ్య చరణ సేవాపరాయణేన శ్రీపర
సమయ పంచాననపాంచజన్య శ్రీశ్రీని
వాసపుభవశాను శిష్యేన ప్రత్యగ
ర్థపరశివనిష్ఠాపర పారమే
శచరణసరోజరజ స్త్ర
సరేణునా
శ్రీ నా గ లిం గ శా స్త్రి ణా వి ర చి తా యాం
శ్రీ శ్రౌతశైవ ప్రకాశికాయాం శ్రౌతాన్యేవ శైవ
చిహ్నానీతి మహానుపన్యాసః శ్రీపరమేశ్వర
కృపయా సంపూర్తిమగమత్.

---

శముల చే పార్వతీపతిని పూజించెనేని సర్వపాతకముల చే వినిర్ముక్తుండగు, బిల్వపత్రార్చనము ముమ్మాటికిని శ్రేష్ఠంబైనది, బిల్వపత్రార్చన చేతనే పునర్జన్మ గలుగదు. అని మొదలుగా ముక్తిఫలకత్వము నిరూపించబడె గావున నీ ప్రశ్న సమాధానపరచబడియె.

ఇందుచే నీ బిల్వదళము తులసీదళమువలె శ్రుతులయందు చెప్పటను వినబడకుండెనా ఇకను నిగమవిహితంబై శ్రుతికల్పపురాణాది ప్రశంసితంబై ముక్తిమాత్ర ఫలకంబైన ఈ బిల్వదళార్చనకు శ్రౌతత్వము సిద్ధించినది. ఇట్లు సర్వము శివము.

శ్రౌతంబులేకదా శైవచిహ్నంబులను
యుపన్యాసము.
సంపూర్ణము.

శ్రీశివాయగురవేనమః.

# శైవసిద్ధాంతసంగ్రహము.

శ్లో॥ నిలయీకృతశైలాయ వలయీకృతభోగినే
విలయంగమితాశేష జగతేశంభవేనమః॥

అర్థము॥ నిలయీకృతశైలాయ=నివాసముగా జేయబడిన పర్వతముగలిగినట్టియు, వలయీకృతభోగినే=కంకణముగా జేసికొనబడిన సర్పముగలిగినట్టియు, విలయంగమితాశేషజగతే=విలయమును పొందింపబడిన సమస్తప్రపంచముగల, శంభవే=శివునికొరకు, నమః=నమస్కారము.

శ్లో॥ నత్వాగురుపదద్వంద్వం శోధిత్వాశాస్త్రజాలకం
కథ్యతేసుఖబోధాయ శైవసిద్ధాంతసంగ్రహః॥ ౨॥

అర్థము॥ గురుపదద్వంద్వం=దేశికునియొక్కచరణయుగమును, నత్వా=నమస్కరించియు, శాస్త్రజాలకం=శాస్త్రజాలమును, శోధిత్వా=శోధించియు, సుఖబోధాయ=సులభముగాబోధయగుటకై, శైవసిద్ధాంతసంగ్రహః=శైవసిద్ధాంతసంగ్రహమను గ్రంథము, కథ్యతే=చెప్పబడుచున్నయది.

## శివుడేజగత్కర్తయనుట.

శ్లో॥ అసంప్రథమమేకోహ మిత్యథర్వశిరోగిరా
కేవలశ్శివఏవేతి శ్వేతాశ్వతరవాక్యతః॥ ౩॥

శ్లో॥ విశ్వాధికోరుద్రఇత్యాద్యనంతశ్రుతిశాసనాత్
ప్రమీయతేపురాణోపబృంహితాత్కారణంశివః॥ ౪॥

అర్థము॥ అహం=నేను, ఏకః=ఒక్కడనే, ప్రథమం=సృష్టికిపూర్వము, ఆసం=ఉంటిని, ఇతి=అను, అథర్వశిరోగిరా=అథర్వశిరోవచనముచేతను, శివః=శివుడు, కారణం=జగత్కారణము, అథర్వశిరస్సనంయు—దేవాహవై స్వర్గంలోకమగమన్, తే

దేవారుద్రమపృచ్ఛన్, కోభవానితి సోఽబ్రవీత్ అహమేకః ప్రథమమాసం వర్తామిచ భవిష్యామిచ నాన్యఃకశ్చిన్మత్తోవ్యతిరిక్తఇతి.

దేవాహవై=దేవతలు, స్వర్గం=అపరిమితసుఖస్వరూపమగు, లోకం=కైలాసమునుగూర్చి, అగమన్=పోయిరి, తే=ఆ, దేవాః=దేవతలు. రుద్రం=రుద్రుని, భవాన్=నీవు, కః=ఎవరు, ఇతి=అని, అపృచ్ఛన్=అడిగిరి, సః= ఆరుద్రుడును, అహం=నేను, ఏకః=ఒకడనే, ప్రథమం=మొదలు, ఆసం=ఉంటిని, వర్తామిచ=ఇప్పుడున్నవాడను. భవిష్యామిచ = ముందు ఉండువాడను, మత్తః=నాకంటె, వ్యతిరిక్తః=వేరగువాడు, అన్యః=ఇతరుడు, కశ్చిత్=ఒకానొకడును, న=లేడు, ఇతి=అని అబ్రవీత్=పలికెను. ఇందు మూడుకాలములయందును అబాధ్యమగు నిత్యసత్తాస్వరూపుడని చెప్పడినది గాపున శివుడే జగత్కారణమని యభిప్రాయము.

మఱియును. శివఏవ=శివుడే, కేవలఇతి=ఒకడుగలడను, శ్వేతాశ్వతర వాక్యతః=శ్వేతాశ్వతరోపనిషత్తుయొక్క వాక్యమువలనను, శివః=శివుడు, కారణం=జగత్కారణము. శ్వేతాశ్వతరోపనిషత్తునందు యదాతమస్తన్నదివానరాత్రిర్నసన్నచాసచ్ఛివఏవ కేవలః తదక్షరం తత్సవితుర్వరేణ్యం ప్రజ్ఞాచ తస్మాత్ప్రసృతా పురాణీ యదా=ఎప్పుడు, తమః=తమస్సుండెనో, తత్=అప్పుడు, నదివా నరాత్రిః=దివారాత్రిభాగములేదు, నసన్నచాసత్=సదసద్విభాగములేదు, శివఏవ=శివుడే, కేవలః=ఒకడు, తత్=ఆశివుడు, అక్షరం=అక్షరతత్వము. తథాక్షరాద్వివిధాస్సోమ్య భావాః అని యీమొదలగు శ్రుతులయందు జీవోత్పత్తిస్థానముగా జెప్పంబడిన యక్షరతత్వము శివుడేయనియభిప్రాయము.

తత్సవితుర్వరేణ్యం. తత్=ఆశివుడు. సవితుః=సూర్యునకు. వరేణ్యం = ఉపాస్యుడు. ఇందుచే గాయత్రీమంత్ర ప్రతిపాద్యుడని తాత్పర్యము.

ప్రజ్ఞాచతస్మాత్ప్రసృతాపురాణీ. తస్మాత్=ఆశివునివలన. పురాణీ = పురాతనియగు. ప్రజ్ఞాచ=ప్రజ్ఞాశక్తియు. ప్రసృతా=వెడలినది. ఇందుచే సఈక్షతలోకాన్నుసృజాఇతి, సోకామయతబహుస్యాంప్రజాయేయేతి అని యీ మొదలగు శ్రుతులచే సృష్టిమొదలగు సృజించదగిన వస్తుజాతముయొక్క యాలోచనమును జెప్పుచున్నది యింటుచే జగత్కర్త శివుడేయని యభిప్రాయము.

విశ్వాధికోరుద్రఇత్యాద్యనంతశ్రుతిశాసనాత్=విశ్వాధికోరుద్రః అని యీమొదలగు ననేకశ్రుతులయొక్క శాసనమువలనను. శివః=శివుడే. కారణం=జగత్కారణము. నారాయణోపనిషత్తునందు విశ్వాధికోరుద్రోమహర్షిః. రుద్రః=రుద్రుడు.

ధికః=ప్రపంచముకన్న నధికుడు. ఈరుద్రుని యంశామాత్రంబున ప్రపంచం బుండుటచేత శ్వరుడు విశ్వాధికుడని యభిప్రాయము. ఆదిశబ్దముచే. ఏకఏవరుద్రో నద్వితీయాయ తస్థే. రుద్రుడు ఒకడే యుండెనను నీమొదలగు ప్రమాణములవలన ననియు యూహించనగును.

పురాణోపబృంహితాత్=పురాణవచనములచేత నుపబృంహింపజేయబడిన వెనుకటి శ్రుతివచనములవలనను. శివః=శివుడు. కారణం=జగత్కారణము.

అథర్వశిరోవచనమునకు నుపబృంహణము, సూతసంహితయందు.

పురావిష్ణ్వాదయో దేవాస్సర్వేసంభూయకారణం. విచార్యజగతో విప్రాస్సంశయావిష్టచేతసః. అతీవసుఖదంశుద్ధం రౌద్రంలోకంసమావిశన్. తేషాంమధ్యేమహాదేవః సంసారద్రావకోహరః. రుద్రఃపరమకారుణ్యాత్స్వయమావిరభూద్ద్విజాః. అదృష్టపూర్వం తందృష్ట్వాదేవావిష్ణుపురోగమాః. ప్రణిపత్యమహాదేవమపృచ్ఛన్కోభవానితి. సోఽబ్రవీద్భగవాన్రుద్రః పశూనాంపతిరీశ్వరః. వర్తామిచభవిష్యామినమత్తోన్యోస్తికశ్చన. మన్మాయాశక్తిసంక్లృప్తం జగదేతచ్చరాచరం.

హేవిప్రాః—ఓ బ్రాహ్మణులారా. పురా=మున్ను. విష్ణ్వాదయః=విష్ణుమూర్తి మొదలగు. దేవాః=దేవతలు. సర్వే=అందరును. సంభూయ=గుంపుజేరి. జగతః=జగత్తుయొక్క. కారణం=కారణవస్తువును. విచార్య=విచారించి - సంశయావిష్టచేతసః=సంశయగ్రస్తచిత్తులై. అతీవ=మిక్కిలిన్ని. సుఖదం=సుఖకరమగు. రౌద్రం=రుద్రునిసంబంధమైన. లోకం=లోకమును. అనగా, కైలాసమును, సమావిశన్=ప్రవేశించినవారైరి. తేషాం=వారలయొక్క. మధ్యే=నడుమ. మహాదేవః=మహాదేవుండును. సంసారద్రావకః=సంసారమును ద్రవింపజేయువాడునగు. రుద్రః=రుద్రుడు. పరమకారుణ్యాత్=దయాతిశయమువలన. స్వయం=తనంతట. ఆవిరభూత్=ఆవిర్భవించెను. విష్ణుపురోగమాః=విష్ణ్వాదులగు. దేవాః=దేవతలు. అదృష్టపూర్వం=మున్ను జూడబడని. తం=ఆదేవుని. దృష్ట్వా=చూచి. ప్రణమ్య=నమస్కరించి. భవాన్=నీవు. కః=ఎవరు. ఇతి=ఈలాగని. అపృచ్ఛన్=అడిగిరి. సః=ఆ. భగవాన్=షడ్గుణైశ్వర్యసంపన్నుడును, పశూనాంపతిః=పశువులగు బ్రహ్మాదులకు పతియునగు. రుద్రః=రుద్రుడు. అబ్రవీత్=పలికెను. వర్తామిచ=ఉంచున్నవాడను. భవిష్యామిచ=ఉండువాడను నేను. మత్తః=నాకంటె వ్యతిరిక్తః=వేరగువాడు. అన్యః=ఇతరుడు. కశ్చిత్=ఒకానొకడును. న=లేడు. ఏతత్=ఈ. జగత్=జగత్తు. మన్మాయాశక్తిసంక్లృప్తం=నాయొక్క మాయాశక్తిచేత వ్యాప్తమయినది అనియిట్లు యథర్వశిరోవచనమునఁజెప్పంబడినయుక్తార్థము ఉపబృంహింపబడినది.

ఇట్లు శ్రుతివచనములచేతను పురాణోపబృంహణములచేతను శివుఁడేజగత్కా...
మని స్పష్టీకరించఁబడినది.

### శివునకు సర్వోపాస్యత్వము.

శ్లో॥ ధ్యాయీతేశానమిత్యేవమారభ్యాశిఖయా పరః।
సర్వమన్యత్పరిత్యజ్య సర్వైశ్వర్యసమన్వితః॥

శ్లో॥ ధ్యేయస్తు శివఏవైక స్సమాప్తాథర్వణీశ్రుతిః.
ఇత్యతశ్శివఏవైక స్సముపాస్య ఇతీర్యతే॥

అర్థము॥ శిఖయా=అథర్వశిఖయనునుపనిషత్తుచే. ధ్యాయీత ఈశానమితి=ఈశా...
నుని ధ్యానముచేయవలయునని. ఆరభ్య=ఆరంభించి. అన్యత్=ఇతరమగు. సర్వం=స...
స్తమయిన దేవతాజాతమును. పరిత్యజ్య=వదలి. పరః=పరుండును. సర్వైశ్వర్యస...
తః=సర్వైశ్వర్యయుతుండునగు. శివః=శివుఁడు. ఏకఏవ=ఒకఁడే. ధ్యేయః=ధ్యా...
చేయదగినవాఁడు. ఆథర్వణీ=అథర్వణమను. శ్రుతిః=వేదము. సమాప్తా=సంపూర్ణ...
యినది. ఇత్యతః=ఇట్లు చెప్పుటవలన. శివః=శివుఁడు, ఏకఏవ=ఒకఁడే. సముపాస్యః...
ఉపాసించదగినవాఁడని, ఈర్యతే=చెప్పఁబడుచున్నది.

అథర్వశిఖయందు కింతద్ధ్యానం కోవాధ్యాతా కశ్చధ్యేయః అను ప్రశ్నలలో ...
రిని ధ్యానముచేయవలయునను ప్రశ్నయొక్క సమాధానావసరమున ధ్యాయీతేశా...
ప్రధ్యాయితవ్యం సర్వమిదంబ్రహ్మవిష్ణురుద్రేంద్రాస్సంప్రసూయంతే. సర్వాణిచే...
యాణిసహభూతైర్న కారణంకారణానాంధాతాధ్యాతా కారణంతుధ్యేయ స్సర్వై...
సంపన్నస్సర్వేశ్వరశ్శంభురాకాశమధ్యే శివఏకోధ్యేయశ్శివ శంకరస్సర్వమన్యత్పరిత్యజ్య స...
ప్తాథర్వశిఖా.

ఈశానం=ఈశానుని, ధ్యాయీత=ధ్యానము చేయవలయును, ప్రధ్యాయి...
వ్యం=మిక్కిలిధ్యానముచేయవలెను, ఇదం=ఈ, సర్వం=సమస్తమగు ప్రపంచ...
బ్రహ్మవిష్ణురుద్రేంద్రాః=బ్రహ్మవిష్ణురుద్రేంద్రులును, సర్వాణి=సమస్తమగు ...
యాణిచ=ఇంద్రియములును, భూతైస్సహ=భూతములతోఁడ - సంప్రసూయంతే=...
చే పుట్టింపఁబడుచున్నారో. కారణం=కారణస్వరూపుఁడగు శివుఁడు. న=ఇతరు...
ట్టించఁబడుటలేదు. కారణానాం=కారణములగు కాలాకాశాదులను. ధాతా=...
వాఁడును. ధ్యాతా=సృష్ట్యాదులనాలోచించువాఁడును. కారణం=కారణస్వరూపుఁ...
సర్వైశ్వర్యసంపన్నః=సర్వైశ్వర్యములతోఁగూడినవాఁడును. సర్వేశ్వరః=సర్వే...

నీ నామముగలవాడునగు. శంభుః=శంభుడు. ఆకాశమధ్యే = చిదాకాశమధ్యమునను ధ్యేయః=ధ్యానముచేయదగినవాడు. అన్యత్=ఇతరమగు. సర్వం=సమస్త దేవతాజాతమును. పరిత్యజ్య=వదలి. శివంకరః = శివునిగా జేసికొనువాడగు. శివః=శివుడు. ఏకః=ఒకడే. ధ్యేయః=ధ్యానముచేయదగినవాడు. అథర్వశిఖా=అథర్వశిఖయనునుపనిషత్తు. సమాప్తా=సంపూర్ణమయినది.

ఇచట విరమించుటచేతనే యుపనిషత్తుసమాప్తమయినదని తెలియనగుచుండగా సన్నివేదములకుకొనయగు నథర్వణవేదంబునను అందున చివరయగు నథర్వశిఖోపనిషత్తుచేత నింతకంటె నిక చెప్పవలసిన యర్థము లేదు. సర్వవేదములు శివుని ధ్యానముచేయవలయునను యర్థమునందు పర్యవసానమును జెందినవని తాత్పర్యము.

ఇట్లు శివునినే ధ్యానముచేయవలయునని స్పష్టీకరించుటచే శివోపాసనమే ముఖ్యమని సిద్ధాంతీకరింపబడినది.

శ్లో॥ విహితత్వాత్సర్వవేదైస్సోపనిషద్భిశ్శాస్త్రజాలకైః
పురాణైరితిహాసైశ్చ విముక్తిఫలకత్వతః॥ ౭॥
శ్లో॥ శిష్టైరనుష్ఠితత్వాచ్చనిత్యత్వాద్ధర్మమూలతః
వైదికైర్భస్మసంధార్యంసర్వపాపప్రణాశనం॥ ౮॥

అర్థము॥ సర్వవేదైః=సమస్తవేదములచేతను. ఉపనిషద్భిః=ఉపనిషత్తులచేతను. శాస్త్రజాలకైః=ధర్మశాస్త్రములచేతను. పురాణైః=పురాణములచేతను. ఇతిహాసైః=ఇతిహాసములచేతను. విహితత్వాత్=విధింపబడినదగుటవలన. వైదికైః=వైదికులగు జనులచే భస్మ=విభూతి. సంధార్యం=ధరించదగినది.

ఋగ్వేదమున గాథపతిం మేధపతిం రుద్రం జలాషభేషజం ఉన్నోవీరానర్పయభేషజేభిర్భిష క్తమంత్వాంభిషజాంశృణోమి॥ అనుసీరుక్కులలోని భేషజశబ్దము—

త్వమాద్యోభిష క్భేషజం భస్మశంభో సముల్లాఘ యస్మాన్వపు ర్లాఘవాయ. హేశంభో=ఓ శంకరుడా. త్వం=నీవు. ఆద్యః=మొదటివాడగు. భిషక్=వైద్యుడవు. భేషజం=ఔషధము. భస్మ=విభూతి. అస్మాన్=మమ్ములను. వపుర్లాఘవాయ=శరీరలాఘవమునకై. సముల్లాఘయ=లఘూకరింపజేయుమా యని శంకరాచార్యులవారిచే భస్మార్థకముగా వ్యాఖ్యానము జేయబడినది.

అట్లుయజుర్వేదమున—భూత్యైనప్రమదితవ్యం. భూత్యై=భస్మధారణకొరకు. నప్రమదితవ్యం=ప్రమాదపడతగదు.

అగ్నేర్భస్మాసి — హేభస్మ=ఓభస్మమా. అగ్నేః=అగ్నివలన. అసి=కలిగితివి. భస్మనాపదమభివపతిశాంత్యై — శాంత్యై=శుద్ధికొఱకు. భస్మనా=భస్మచేత. పదం=స్థానమును. అభివపతి=చల్లుచున్నాడు. అనియు సామవేదమునందు జాబాల్యా ద్యుపనిషత్తులయందంతటను అథర్వణంబునదథర్వశిరస్సు మొదలగునుపనిషత్తులయందును అగ్నిరితిభస్మ వాయురితిభస్మ అగ్నిరితి=అగ్నియన. భస్మ=భస్మము. వాయురితి=వాయువన. భస్మ=భస్మము. అని యీ మొదలగు వచనంబులును భస్మధారణమును విధించుచున్నది.

ఉపనిషత్తులయందును కాలాగ్నిరుద్రమున తిర్యక్తిస్రోరేఖాః ప్రకుర్వీత తిర్యక్=అడ్డముగా. తిస్రః=మూడగు. రేఖాః=రేఖలను. ప్రకుర్వీత=చేయవలయు ననియు. బృహజ్జాబాలమున మానస్తోకేతిమంత్రేణ మంత్రితం భస్మధారయేత్. మానస్తోకేతి=మానస్తోకయను. మంత్రేణ=మంత్రముచేత, మంత్రితం=మంత్రించబడిన. భస్మ=భస్మమును ధారయేత్=ధరించవలసినది అని యీవిధమున విధించబడినది.

ధర్మశాస్త్రములయందును కల్పమున బోధాయనునిచే అథాతోద్విజాతీనామహరహస్త్రిపుండ్రవిధిం వ్యాఖ్యాస్యామో భూత్యై నప్రమదితవ్యమితి హ్యామ్నాయతే. అథ=అనంతరము. అతః=అందువలన. ద్విజాతీనాం=ద్విజులకు. అహరహః అనుదినము. త్రిపుండ్రవిధిం=భస్మత్రిపుండ్రవిధిని. వ్యాఖ్యాస్యామః=వివరించుచున్నారము. భూత్యై=భస్మధారణకొఱకు. నప్రమదితవ్యం=ప్రమాదపడతగదు. ఇతిహి=అనిగదా. ఆమ్నాయతే=పఠింపబడుచున్నది అనిచెప్పంబడియున్నది.

స్మృతులయందును—భారద్వాజస్మృతియందు. తిర్యక్త్రిపుండ్రవిధినా లలాటే హృదయేగళే। ధృత్వాగ్నిహోత్రజేనైవ భస్మనాతుప్రసన్నధీః। పంచభిర్బ్రహ్మభిర్వాపి కృతేనభసితేనచ ధృతమేతత్త్రిపుండ్రంస్యాత్సర్వకర్మసుసాధనం। అతోగ్నిహోత్రజేనైవ భస్మనాతుత్రిపుండ్రకం। నిత్యంద్విజోప్రమాదేన కుర్యాత్కర్మవివృద్ధయే। అన్యథాసర్వకర్మాణి నఫలంతికదాచన॥

ప్రసన్నధీః=నిర్మలచిత్తముగలజనుడు. తిర్యక్త్రిపుండ్రవిధినా=తిర్యక్త్రిపుండ్రవిధిచేత. అగ్నిహోత్రజన్యమగు భసితేన=భస్మచేత. లలాటే=ముఖమందును. హృదయే=హృదయమందును. గళే=కంఠమందును. పంచభిర్బ్రహ్మభిర్వాపి = పంచబ్రహ్మమంత్రములచేతను. కృతేన=చేయబడిన. భసితేన=భస్మచేత. ధృతం=ధరించినది. ఏతత్=ఈత్రిపుండ్రము. సర్వకర్మసు=సమస్తకర్మలయందును. సాధనం=సాధనమయినది. స్యాత్=గలదు. అతః=అందువలన. అగ్నిహోత్రజేనైవ=అగ్నిహో

న్యాయము—భసితేన—భస్మచేత- ద్విజః—బ్రాహ్మణుడు- నిత్యం—ఎల్లప్పుడును- త్రిపుండ్రం—త్రిపుండ్రమును- అప్రమాదేన—ప్రమాదములేక- కుర్యాత్—చేయవలసినది- అన్యథా — లేకున్న. సర్వకర్మాణి—సమస్తకర్మలును, కదాచన—ఒకప్పుడును. సఫలం న—ఫలించవు.

కాత్యాయనుడును, శ్రాద్ధేయజ్ఞే జపే హోమే వైశ్వదేవే సురార్చనే। ధృతత్రిపుండ్రః పూతాత్మా మృత్యుం జయతి మానవః। త్రిపుండ్రం యద్యధృత్వా తు కుర్యాద్యత్కర్మ తద్వృథా॥

శ్రాద్ధే—శ్రాద్ధమునందును, యజ్ఞే — యజ్ఞమునందును, జపే — జపమునందును, హోమే—హోమమునందును, వైశ్వదేవే—వైశ్వదేవమునందును, సురార్చనే—దేవతార్చనమునందునను, ధృతత్రిపుండ్రః—త్రిపుండ్రమును ధరించిన. పూతాత్మా — పుణ్యాత్ముడు. మృత్యుం—మృత్యువును. జయతి—జయించుచున్నాడు. త్రిపుండ్రం—త్రిపుండ్రమును, అధృత్వా—ధరించక. యత్—ఏకర్మను. కుర్యాత్—చేయునో. తత్—ఆ. కర్మ—కర్మ. వృథా—వ్యర్థమైనది అనియు చెప్పంబడినది.

శాతాతపస్మృతియందు, సత్యం శౌచం జపో హోమ స్తీర్థం దేవాదిపూజనం తస్య వ్యర్థమిదం సర్వం య స్త్రిపుండ్రం న ధారయేత్.

సత్యం—సత్యంబును, శౌచం—ఆచారంబును, జపః—జపంబును, హోమః—హోమంబును. తీర్థం—తీర్థసేవయు, దేవాదిపూజనం—దేవతాపూజాదికంబును, యః—ఎవ్వండు. త్రిపుండ్రం—త్రిపుండ్రమును న ధారయేత్—ధరించడో. తస్య — వానికి. ఇదం — ఇయ్యది. సర్వం—అంతయు, వ్యర్థం—నిరర్థకమైనవి, అనియు చెప్పంబడియున్నది.

ఇట్లు స్మృతులయందు భస్మధారణము విశేషముగా విధింపబడినవి. పురాణములయందును, శివతత్వసుధానిధియందు, ఉద్ధూళనం త్రిపుండ్రం చ శ్రద్ధయా నాచరంతి యే తైస్సమాచరితం సర్వం విపరీతం న సంశయః। బ్రాహ్మణానామయం ధర్మో య స్త్రిపుండ్రస్య ధారణం। మంత్రధ్యానాదిసంయుక్తం నైవ వర్ణాంతరస్య తు॥ భస్మనా వేదమంత్రేణ త్రిపుండ్రమవకుంఠనం। రుద్రలింగార్చనం చైవ మోక్షేణాపి న సంత్యజేత్॥ పంచాక్షర జపం భస్మస్నానం లింగార్చనం త్రయం। కదాచిదపి న త్యాజ్యం యథాశక్తి సమాచరేత్। భూతైర్వోద్ధూళనం తిర్య క్త్రిపుండ్రస్య చ ధారణం। నైవ ప్రమదితవ్యం వై భ్రమాదపి కదాచన॥

ఉద్ధూళనం—ఉద్ధూళనంబును, త్రిపుండ్రం—త్రిపుండ్రంబును, యే—ఎవరలు. శ్రద్ధయా—శ్రద్ధచేత. నాచరంతి—ఆచరించరో. తైః—వారిచేత. సమాచరితం — ఆచరింపబడిన, సర్వం—సమస్తంబును, విపరీతం—విపరీతఫలప్రదమగు, నసంశయః — సందియము

లేను. మంత్రధ్యానాదిసంయుక్తం=మంత్రధ్యానాదులతోఁ గూడిన. త్రిపుండ్రస్య=త్రిపుండ్రము యొక్క. ధారణం=ధారణము, యత్=ఎద్దిగలదో. అయం=ఇయ్యది. బ్రాహ్మణానాం=బ్రాహ్మణులయొక్క. ధర్మ=ధర్మము, వర్ణాంతరస్య=జాత్యంతరునియొక్క, ధర్మః=ధర్మము, నైవ=కాదు, వేదసిద్ధేన=శ్రుతిసిద్ధమగు, భస్మనా=భస్మచేత, త్రిపుండ్రం=త్రిపుండ్రంబును, అవకుంఠనం=అవకుంఠనంబును, రుద్రలింగార్చనం=శివలింగార్చనమును, మోహేనాపి=మోహముచేతనైనను, నసంత్యజేత్=విడువతగదు, పంచాక్షరజపం=పంచాక్షరజపంబును, భస్మస్నానం=భస్మస్నానంబును, లింగార్చనం=లింగార్చనమును, త్రయం=మూడిటిని, కదాచిదపి=ఒకానొకప్పుడును, నత్యాజ్యం=విడువతగదు, యథాశక్తి=శక్త్యనుసారముగా, సమాచరేత్=ఆచరించవలయు, భస్మనైవ=భస్మచేతనే, ఉద్ధూళనం=ఉద్ధూళనంబును, తిర్యక్త్రిపుండ్రస్య=తిర్యక్త్రిపుండ్రముయొక్క, ధారణం=ధారణంబును, భ్రమాదపి=భ్రమమువలనను, నప్రమదితవ్యం=ప్రమాదపడవలదు అనియు.

అట్లు సూతసంహితయందును॥ త్రిపుండ్రంధారయేన్నిత్యంగృహస్థాశ్రమమాశ్రితః । ధారయేద్భిక్షుకోనిత్యమితిజాబాలికీశ్రుతిః॥

గృహస్థాశ్రమం=గార్హస్థ్యమును, ఆశ్రితః=ఆశ్రయించినవాడు, త్రిపుండ్రం=త్రిపుండ్రమును. నిత్యం=ఎల్లపుడు=ధారయేత్=ధరించవలయును, భిక్షుకః=యతి, త్రిపుండ్రం=త్రిపుండ్రమును, ధారయేత్=ధరించవలసినది, అనియును.

ఎల్లపుడు ధరించవలసినదనుట సూతసంహితయందు, ఉద్ధూళనంత్రిపుండ్రంచయైస్సదాచరితంముదా । తఏవశిష్టవిద్వాంసో నేతరేమునిపుంగవాః॥

ఉద్ధూళనం=ఉద్ధూళనంబును. త్రిపుండ్రం=త్రిపుండ్రంబును, యైః=ఎవరిచే సదా=ఎల్లపుడు. ఆచరితం=ఆచరించబడినదో. తఏవ=వారలే. శిష్టవిద్వాంసః=శిష్టులును విద్వాంసులును అగుదురు. ఇతరే=ఇతరులు. న=కారు.

ఈభస్మధారణకునలంఘనీయత్వంబును సూతసంహితయందే. త్రిపుండ్రంధారయేద్భక్త్యామనసాపినలంఘయేత్ । శ్రుత్యావిధీయతేయస్మాత్తత్త్యాగీపతితోభవేత్.

త్రిపుండ్రం=త్రిపుండ్రమును. భక్త్యా=భక్తిచేత. ధారయేత్=ధరించవలయు మనసాపి=మనస్సుచేతనైన. నలంఘయేత్=అతిక్రమించతగదు. యస్మాత్=ఎందువలన శ్రుత్యా=శ్రుతిచేత. విధీయతే=విధించబడుచున్నదో. తత్=అందువలన. తత్త్యాగీ=భస్మమునువదలినవాడు. పతితః=పతితుడు. భవేత్=అగును. అనియును చెప్పం యున్నది.

పరాశరపురాణమందును. భస్మనా వేదసిద్ధేన త్రిపుండ్రం దేహకుంతనం । రుద్రలింగార్చనంచాపి మోహాతో వాపినత్యజేత్॥

వేదసిద్ధేన=శ్రుతిసిద్ధమగు. భస్మనా=భస్మచేత. త్రిపుండ్రం=త్రిపుండ్రంబును. దేహకుంతనం=అవకుంఠనంబును. రుద్రలింగార్చనం=శివలింగార్చనమును. మోహాతోవాపి=మోహామువలనను. నత్యజేత్=విడువతగదు.

అట్లు కూర్మపురాణమునందును త్రిపుండ్రంబ్రాహ్మణోవిద్వాన్ మనసాపినలంఘయేత్ । శ్రుత్యావిధీయతేయస్మాత్తత్త్యాగీపతితోభవేత్॥

విద్వాన్=విద్వాంసుడగు బ్రాహ్మణుడు. త్రిపుండ్రం=త్రిపుండ్రమును. మనసాపి=మనస్సు చేతనైనను. నలంఘయేత్=తిరస్కరించదగదు. యస్మాత్=ఎందువలన. శ్రుత్యా=శ్రుతిచేత. విధీయతే=విధించబడునో. తత్=అందువలన. తత్త్యాగీ=అభస్మధారణమువదలినవాడు. పతితః=పతితుడు. భవేత్=అగును.

అటులవాయుసంహితయందు. భూతప్రేతపిశాచాద్యారోగాశ్చాతీవదుస్సహాః। భస్మనిష్ఠస్యసాన్నిధ్యాద్విద్రవంతినసంశయః॥ భూతప్రేతపిశాచాద్యాః = భూతప్రేతపిశాచాదులును. అతీవ=మిక్కిలి. దుస్సహాః=సహింపతరముగాని. రోగాః=రోగములును. భస్మనిష్ఠస్య=భస్మనిష్ఠునియొక్క. సాన్నిధ్యాత్=సామీప్యమునుండి. విద్రవంతి=పరుగిడుచున్నవి, నసంశయః=సందియము లేదు అని యిట్లు పురాణములయందు భస్మవిధిగనుపరచబడినది,

ఇతిహాసములయందును భారతమున ఆనుశాసనికమునందు రక్షార్థంమంగళార్థంచ పవిత్రార్థంచభామినీ। లాంఛనార్థంచభక్తానాం భస్మదత్తంమయాపురా॥ మంగళార్థం=మంగళముకొరకును, రక్షార్థం=రక్షణకొరకును, పవిత్రార్థం = పావిత్ర్యముకొరకును, భక్తానాం=భక్తులయొక్క, లాంఛనార్థం=లాంఛనముకొరకును, మయా = నాచేత, భస్మ=భస్మము, దత్తం=ఇవ్వబడినది అనిచెప్పంబడినది, శివరహస్యమునను అనంతమగు వచనజాతము భస్మధారణమునువిధించుచున్నది, ఇట్లు ఇతిహాసములచే భస్మత్రిపుండ్రము విధించబడినది.

విము క్తిఫలకత్వాతః=ము క్తిప్రయోజనముగాగలదిగావునను, భస్మ = భస్మ, వైదికైః=వైదికులచేత, సంధార్యం=ధరించదగినది.

ము క్తిఫలకత్వమును బృహజ్జాబాలమునందు, సర్వపాపనాశకో మోక్షహేతుః, భస్మత్రిపుండ్రవిధి- సర్వపాపనాశకః = సమస్తపాతకములనశింపజేయునదియు- మోక్షహేతుః=ము క్తిహేతుకమైనదియునగు, ఇందుచే భస్మత్రిపుండ్రము ము క్తిఫలకమయినదని స్పష్టము.

శిష్టైః=శిష్టులచేత- అనష్ఠితత్వాచ్చ=అనుష్ఠింపబడినదియగుటవలనను- భస్మ=భస్మ- వైదికైః=వైదికులచే- సంధార్యం=ధరించతగినది.

సర్వశిష్టానుష్ఠితత్వము- బృహజ్జాబాలమునవిష్ణ్వాదులను- ప్రస్తావించి- సర్వేతేభస్మదిగ్ధాంగాః- తే=ఆ- సర్వే=సమస్తదేవతలును- భస్మదిగ్ధాంగాః=భస్మానలిప్తసర్వాంగులు- అనుటచే ఇంద్రాదులకుభస్మధారణము దండాపూపన్యాయముచేతనేసిద్ధించినది- అంగిరస్సుమొదలగు దివ్యశిష్టులకుభస్మధారణము పురాణములయందు చెప్పబడినది- శ్రీరామునకు రామరహస్యోపనిషత్తుయందు-రామంత్రిణేత్రంసోమార్ధధారిణం శూలినంపరం। భస్మోద్ధూళితసర్వాంగంసుప్రసన్నమనుస్మరన్॥ త్రిణేత్రం=మూడునేత్రములుగలిగినట్టియు- సోమార్ధధారిణం=చంద్రఖండమునుధరించినట్టియు- శూలినం=త్రిశూలముగలిగినట్టియు- భస్మోద్ధూళితసర్వాంగం=భస్మోద్ధూళనము చేయబడినసర్వాంగములుగల- రామం=శ్రీరాముని- అనుస్మరన్=స్మరించువాడై- అనుటచే సిద్ధించినది, శ్రీకృష్ణునకుహరివంశమునందు- భాస్వత్త్రిపుండ్రో భస్మైస్సితస్రక్ మౌనీజటీవల్కలవాన్ముకుందః। భాస్వత్త్రిపుండ్రః=ప్రకాశించుచున్న త్రిపుండ్రములుగలవాడై- భస్మైః=భస్మముచేత, సితస్రక్=తెల్లనిమాలగలట్టియు- మౌనీ=మౌనముసుధరించినట్టియు, జటీ=జడలనుధరించినట్టియు- వల్కలవాన్=నారచీరలనుధరించిన- ముకుందః=శ్రీకృష్ణమూర్తి యనుటచే సిద్ధించినది- అటులనే సమహర్షులకు- విభూతిధారణము- ఋషిపంచమీపూజయందు ధ్యానమునపఠించుటవలనసిద్ధించినది- ఋభునిదాఘాదులకు భస్మధారణము- బృహజ్జాబాలమున తత్రసంవర్తకారుణిశ్వేతకేతు దూర్వాస ఋభునిదాఘజడభరతదత్తాత్రేయరైవతకభుసుండప్రభృతయోవిభూతిధారణాదేవముక్తాః సంవర్తకారుణియు శ్వేతకేతువు దూర్వాసుడును ఋభువు నిదాఘుడు జడభరతుడు దత్తాత్రేయుడు రైవతకుడు భుసుండియు మొదలుగాగలవారు విభూతిధారణవలననే ముక్తులైరియనుటచే సర్వశిష్టానుష్ఠితత్వముసిద్ధించినది.

నిత్యత్వాత్=నిత్యమగుటవలనను- భస్మ=భస్మ- సంధార్యం=ధరించదగినది.

బృహజ్జాబాలమునందు- నిత్యోయంధర్మోబ్రాహ్మణానాం- అయం=ఈ- ధర్మః=ధర్మము- బ్రాహ్మణానాం=బ్రాహ్మణులకు- నిత్యం=నిత్యమైనది.

కల్పములయందుబోధాయనునిచేత అథాతోద్విజాతీనామహరహస్త్రిపుండ్రవిధిః అనుచోట అహరహః అనుదినముఅనుటచేతను నిత్యత్వముచెప్పబడినది.

బృహజ్జాబాలమునందు ఏతదకరణేప్రత్యవైతిబ్రాహ్మణః. ఏతత్=ఈభస్మధారణము- అకరణే=చేయకున్న- బ్రాహ్మణః=బ్రాహ్మణుడు- ప్రత్యవైతి=ప్రత్యవాయమును పొందుచున్నాడు- అనుటచేతను నిత్యత్వముస్పష్టమయినది.

ధర్మమూలతః=సర్వధర్మములకు మూలమగుటవలనను. భస్మ=భస్మము, సంధా ర్యం=ధరించదగినది

సర్వధర్మమూలత్వము- బృహజ్జాబాలమునందు ప్రమాదా త్త్యక్త్వాన గాయత్రీంజపే న్న జుహుయాదగ్నౌనతర్పయేద్దేవా నృషీంశ్చపితౄన్॥ ఈభస్మధారణమును- ప్రమా దాత్=ప్రమాదమువలన- త్యక్త్వా=వదలి- గాయత్రీం=గాయత్రిని- నజపేత్=జపించ తగదు. అగ్నౌ=అగ్నియందు. నజుహుయాత్=హోమముచేయదగదు. దేవాన్= దే వతలను. ఋషీన్=ఋషులను. పితౄన్=పితరులను. నతర్పయేత్=తర్పణముజేయ ద గదు. ఇట్లు భస్మధారణములేకనే కర్మయననుష్ఠించ తగదనుటచేత నీభస్మధారణము సర్వధర్మములకు మూలమనియు నియ్యదియాచరింపకున్న నితరధర్మములు విపరీత ఫలప్ర దములనియు తాత్పర్యము.

సమస్తపాతకముల పోగొట్టునదియనుట భవిష్యత్పురాణమునందు. మహాపాతక యుక్తోవా యుక్తోవా సర్వపాతకైః। భస్మస్నాన నిషేవేణ ముచ్యతే సర్వపాతకైః॥ మ హాపాతకయుక్తోవా=మహాపాతకములతో గూడినవాడుగాని. సర్వపాతకైః=సమస్తపా తకములతో గూడినవాడుగాని. భస్మస్నాననిషేవేణ=భస్మస్నానమును సేవించుటచే సర్వపాతకైః=సమస్తపాతకములతోడ. ముచ్యతే=విముక్తుడగు ననియు.

కల్పసూత్రమున శాతాతపునిచేతనుమద్యంపీత్వా గురుదారాంశ్చగత్వా స్తేయంకృ త్వా బ్రహ్మహత్యాంచరిత్వా। భస్మచ్ఛన్నో భస్మశయ్యా శయానో రుద్రాధ్యాయీ ముచ్యతే సర్వపాపైః.

మద్యం=సురను. పీత్వా=పానముజేసినను, గురుదారాన్=గురుపత్నిని. గత్వా= పొందియు. స్తేయం=స్వర్ణస్తేయమును. కృత్వా=చేసియు, బ్రహ్మహత్యాం =బ్రహ్మహ త్యను. చరిత్వా=ఆచరించియు, భస్మచ్ఛన్న=భస్మాంగుని ప్రసర్వాంగుడై. భస్మశ య్యాశయానః=భస్మశయ్యయందుశయనించినవాడై. రుద్రాధ్యాయీ=రుద్రాధ్యాయ మును పారాయణజేయువాడగుచు. సర్వపాపైః=సమస్తపాతకములచే. ముచ్యతే=విము క్తుడగు నని యిట్లు సమస్తపాపహరణము భస్మధారణమని చెప్పబడినది. ఇట్లుచెప్పం బడిన హేతువులచేత భస్మత్రిపుండ్రధారణము ముఖ్యానుష్ఠేయమని సిద్ధాంతీకరింప బడినది.

శ్లో॥ శ్రుతిస్మృతివిధానాచ్చ పురాణవిహితత్వతః

ముక్తిప్రదత్వాన్నిత్యత్వాచ్ఛివేనైశ్చానుష్ఠితత్వతః॥ ౯॥

శ్లో॥ సర్వమంత్రజపార్హాణాం ముఖ్యత్వాద్దక్షిజన్మనః

ధార్యాసదాద్విజైర్భక్త్యారుద్రాక్షఫలమాలికా॥ ౧౦॥

శ్లో॥ శ్వేతా నాంవిహితాత్త్వపితదలాభేపరాణవా

ధార్యాణీశుణలో పేచముఖ్యస్యోత్త్యోక్తశాసనాత్॥ ౧౧॥

అర్థము—శ్రుతిస్మృతివిధానాచ్చ=శ్రుతిస్మృతులవలనవిధింపబడుటవలనను, రు ద్రాక్షఫలమాలికా=రుద్రాక్షమాలిక, ద్విజైః=ద్విజులచేత. ధార్యా=ధరించదగినది.

శ్రుతులచే విధింపబడుట బృహజ్జాబాలమునందు తత్రయథాస్థానం భస్మనా త్రిపు ణ్డ్రం శ్వేతేనైవ ధృత్వారుద్రాక్షాన్ శ్వేతాన్ బిభృయాన్నత్రసంశయః॥ యథాస్థానః =స్థానములయందు, శ్వేతేన=తెల్లనగు. భస్మనా=భస్మముచేత, త్రిపుణ్డ్రం=త్రిపుండ్ర మును. ధృత్వా=ధరించి. శ్వేతాన్=తెల్లనగు. రుద్రాక్షాన్=రుద్రాక్షలను. బిభృయా త్=ధరించవలసినది. అనియు నిట్లు రుద్రాక్ష జాబాలోపనిషత్తుల యందును వి పబడినది.

స్మృతులచే విధింపబడుట హారీతస్మృతియందు—శంఖరౌప్యమయీమాలాం కా ఞ్చనైరథోత్పలైః । పద్మాక్షైరపి రుద్రాక్షైర్విద్రుమైర్మణిముక్తికైః । శంఖముల తను వెండిపూసలచేతను బంగారుపూసలచేతను ఉత్పలబీజములచేతను తామరసబీజము చేతను రుద్రాక్షలచేతను విద్రుమములచేతను మణులచేతను ముక్తికములచేతను జపమా లిక రచించవలసినది.

గౌతమునను మాలికలయందు తారతమ్యమును వచించుచు—పద్మాక్షైః ద్దశ లక్షం సౌవర్ణైః కోటిరుచ్యతే ।కుశగ్రంథ్యాచ రుద్రాక్షైరనంతఫలముచ్యతే—పద్మా క్షైః=తామరసబీజములచేత. దశలక్షం=దశలక్షగుణితమగుఫలంబును. సౌవర్ణైః= గపుపూసలచేత కోటిః=కోటిగుణితమగుఫలంబును. కుశగ్రంథ్యాచ=దర్భముడిచేత రుద్రాక్షైః=రుద్రాక్షలచేతను. అనంతఫలం=అపరిమితఫలంబును. ఉచ్యతే=చెప్ప ని వక్కాణింపబడెను. ఇట్లు శ్రుతిస్మృతులయందు రుద్రాక్షధారణ జపాదివిధి స్ప త్తమముగా విధించబడినది.

పురాణవిహితత్వతః=పురాణములచే విధించబడుట వలనను. రుద్రాక్షఫలమా కా=రుద్రాక్షమాలిక. ధార్యా=ధరింపతగినది.

పురాణములలో స్కాందమునందు—లక్షకోటి సహస్రస్య లక్షకోటిశతస్య వే చలభతేపుణ్యం నాత్రకార్యావిచారణా । ఉచ్ఛిష్టో వా వికర్మస్థ స్సంయుక్త స్సర్వపా తైః॥ లిప్యతేనసపాపేన రుద్రాక్షస్యతుధారణాత్ । కంఠేరుద్రాక్షమాలాం యద్ధ

ష్ఠక్రియతేయది । సోపిరుద్రత్వమాప్నోతి కింపునర్మానుషాదయః॥

లక్షకోటిసహస్రస్య=లక్షకోటి వేలయొక్కయు. లక్షకోటిశతస్యచ= లక్షకోటి నూర్లయొక్కయు. జపే=జపమునందు తుల్యమగు. పుణ్యం=పుణ్యమును. రుద్రాక్షల జపించుటవలన లభతే=పొందుచున్నాడు. అత్ర=ఈయర్థమునందు. విచారణా=వి చారణ. నకార్యా=చేయతగదు. ఉచ్ఛిష్టోవా= ఉచ్ఛిష్టుడుండుగాని. వికర్మస్థః=వి రుద్ధకర్మానుష్ఠానము చేయువాడుగాని. సర్వపాతకైః=సమస్త పాతకములతో. సంయు క్తః= కూడినవాడుగాని. రుద్రాక్షస్య= రుద్రాక్షయొక్క. ధారణాత్= ధారణవలన పాపేన=పాపముచేత.నలిప్యతే=లిప్తుడుగాడు.కంఠే=కంఠమునందు, రుద్రాక్షమాలాం= రుద్రాక్షమాలికను.ధృత్వా=ధరించి.యత్=ఏకర్మ.క్రియతే=చేయబడియేనేని.సోపి=ఆక ర్మానుష్ఠానముచేసినవాడును. రుద్రత్వం=రుద్రత్వమును.ఆప్నోతి= పొందుచున్నాడు. అ నిచెప్పంబడియున్నది.

వేరుప్రదేశమునను. భక్తిహీనోథవాభక్తోమూర్ఖోవామూర్ఖతరోపివా । రుద్రా క్షంధారయేద్యస్తుముచ్యతేపాతకైరయం । మహావ్రతమిదం ప్రాహుర్మునయస్తత్వద ర్శినః॥ రుద్రాక్షధారణంపుణ్యంకేననాసదృశంభవేత్।భక్తిహీనః=భక్తిహీనుడుగాని.భ క్తః= భక్తుడుగాని. మూర్ఖః=మూర్ఖుడుగాని. మూర్ఖతరోపివా= అతిమూర్ఖ డుగాని.యః=ఎవ్వడు.రుద్రాక్షం=రుద్రాక్షను.ధారయేత్=ధరించునో.అయం= ఈజను డు. పాతకైః= పాతకములచేత. ముచ్యతే= ముక్తుడగు. తత్వదర్శినః= యథార్థమునె రిగిన,మునయః=మునులు.ఇదం= ఈభస్మధారణను.మహావ్రతం=మహావ్రతమునుగా. ఆ హుః=పలికెరి.పుణ్యం=పుణ్యప్రదమగురుద్రాక్షధారణం=రుద్రాక్షధారణను, కేనవా=దేని తోటి. సదృశం= సమానము. భవేత్= అగును. అనియిట్లుపురాణములయందురుద్రా క్షధారణవిధిగనుపరచబడినది.

ముక్తిప్రదత్వాత్= ముక్తినియిచ్చునది యగుటవలనను. రుద్రాక్షమాలికధరించ వలెను॥ముక్తిప్రదత్వము. బ్రహ్మోక్తైవర్తమునందు. కింసూక్తైర్బహుభిస్సమంత్రకమిదం స్వాంగేసదాధారకః సంసారంనపునః ప్రయాతిమనుజావక్ష్యేననద్యైతవ । రుద్రాక్ష ద్రుమపుష్పపల్లవఫలస్పృష్టానిలస్పర్శనాత్ జాగస్థాస్సరవస్తృణాన్యపిలతాయాంత్య క్షయంతత్ఫలం॥ బహుభిః= అనేకములగు. సూక్తైః= వచనములచేత. కిం= ఏమి. ఇ దం= ఈరుద్రాక్షను, సమంత్రకం= సమంత్రకముగా. స్వాంగే= తనశరీరమునందు. స దా= ఎల్లపుడు - ధారకః= ధరించువాడు. పునః= తిరుగా. సంసారం= సంసారము న ప్రయాతి= పొందడు. హేఅనవద్యే= ఓయనవద్యాంగి. తవ= నీకు. వక్ష్యే=

చెప్పుచున్నాను. రుద్రాక్షద్రుమపుష్పపల్లవ ఫలస్పృష్టానిలస్పర్శనాత్— రుద్రాక్షవృ క్షముయొక్క పుష్పపల్లవములనుస్పృశించినవాయువుయొక్క స్పర్శవలన. దూరస్థాః— దూరమునందున్న. తరవః— వృక్షములును. తృణాన్యపి— తృణములును. లతాః— లతలు ను. అక్షయం— నాశరహితమైన. తత్ఫలం— ఆరుద్రాక్షధారణ ఫలమును యాంతి— పొందు చున్నవి. అనుటచే ముక్తిప్రదము. రుద్రాక్షధారణమనిస్పష్టీకరించబడినది। నిత్యత్వాత్— నిత్యవిధియగుటవలనను. రుద్రాక్షమాలికధరించవలసినది।

బృహజ్జాబాలమునందు. కిం నిత్యం బ్రాహ్మణానాం కర్మకర్తవ్యం బ్రాహ్మణులకు నిత్యముగాచేయదగిన కర్మయేదనిప్రశ్నమునుపక్రమించియథాస్థానం భస్మనాత్రిపుండ్రం శ్వేతేన. యథాస్థానం— విన్యుక్తస్థానములయందు. శ్వేతేన— శుద్ధమగు భస్మనా— భ స్మచేత. త్రిపుండ్రం— త్రిపుండ్రమునుధరించవలెనని చెప్పి అంతనిష్ఠట. రుద్రాక్షాశ్చైవ శ్వేతా వాఽశ్వేతావాస్తైనతత్రసమ్మర్శకాః॥ రుద్రాక్షాః— రుద్రాక్షలు. శ్వేతావా— తెల్లనివిగా ఆశ్వేతావా— తెల్లనివిగాకున్నను. తత్ర— అందు. నసమ్మర్శకాః. విమర్శలేదుఅనినిత్యముగా ననుష్ఠించదగినధర్మములయందే యీ రుద్రాక్షధారణ చెప్పంబడుటచేతనిద్యనిత్యవిధిగ నిస్పష్టీకరించబడినది।

శిష్టైః— శిష్టులచేతను. అనుష్ఠితత్వాత్— అనుష్ఠింపబడుటవలనను. రుద్రాక్షమా కధరించవలసినది।

రుద్రాక్షధారులగుమహర్షులు. సనత్కుమారుడు. సనకుడు. నిదాఘుడు. ర్ణ్యాయనుడు దత్తాత్రేయుడు. భరద్వాజుడు. కపిలుడు. పైప్పలాదుడు. వశిష్ఠుడు దగువారు. రుద్రాక్షజాబాలాద్యుపనిషత్తులయందు ప్రశంసింపబడిరి। పాద్మమునం ధరామగిరౌరామః పుణ్యేగోదావరీతటే. భూతిభూషితసర్వాంగోరుద్రాక్షాభరణై తః। అథ— అనంతరము. రామః— శ్రీరాముడు. రామగిరౌ— చిత్రకూటమునం ణ్యే— పవిత్రమగు. గోదావరీతటే— గోదావరీతీరమునందు, భూతిభూషితసర్వాంగః చేతనలంకరింపబడినసర్వాంగములుగలవాడును. రుద్రాక్షాభరణైః— రుద్రాక్షభూ లతో టి. యుతః— కూడినవాడని శ్రీరామునకును రుద్రాక్షధారణము చెప్పబడి

సూతసంహితయందు. సర్వత్రావసానే సన్నద్ధాః— అనియారంభించి. ఋషయో స్వస్థాః సర్వద్వంద్వవివర్జితాః రుద్రాక్షమాలాభరణాస్సితభస్మావకుంఠితాః॥ ప్ర — శాంతులును. స్వస్థాః— స్వస్థచిత్తులును. సర్వద్వంద్వవివర్జితాః— సమస్తద్వంద్వము లు లేనివారును. రుద్రాక్షమాలాభరణాః— రుద్రాక్షమాలికలుఆభరణములుగాగల సితభస్మావకుంఠితాః— శుద్ధభస్మదిగ్ధాంగులును ఋషయః— మునులు. అని చెప్ప

శ్లోకశ్లాఘాదులయందు రుద్రాక్షధారులయొక్క ప్రశంసావిశేషమైనదిగావున రుద్రాక్ష
కారణము సర్వశ్రేష్ఠానుష్ఠితత్వముగ సూచించబడినది।.
సర్వమంత్రజపార్హాక్షముఖ్యత్వాత్ = సప్తసంత్రముల జపించుటకు సహామ
లు నవమములలో ముఖ్యమగుటచేతను రుద్రాక్షమాలిక ధరించవలయును.

సర్వమంత్రముల జపమున ఉపయోగించతగిన యక్షమాలికల లెక్కించుటయందు
ప్రాధాన్యముగా ప్రవర్తించిన రక్షమాలికోపనిషత్తునందు ప్రవాళ మౌక్తిక స్ఫటిక
శంఖాష్టాపద చందనపుత్ర జీవికాబ్జరుద్రాక్షాః = పవడములు, ముత్యములు, స్ఫటికము
లు, వెండిపూసలు, బంగారుపూసలు, చందనపూసలు, పుత్రజీవికాబీజములు, తామర
బీజములు, రుద్రాక్షలు అని రుద్రాక్షలు లెక్కింపబడినవి. రామమంత్ర జపమునందును,
పద్మాక్షతులసీకాష్ఠ రుద్రాక్షకృతమాలయా, తామరబీజములు తులసీకాష్ఠము రుద్రా
క్షలు వీనిచేత చేయబడిన మాలికచేత జపించవలయునని రుద్రాక్షమాలిక రామమంత్ర
జపాంగమనియు చెప్పబడినవిగాని సర్వమంత్రజపార్హ మాలికలయందు తులసీకాష్ఠము
చెప్పబడియుండలేదు. అందుచే రుద్రాక్షమాలిక సర్వమంత్ర జపార్హమని సిద్ధాంతీక
రింపబడినది.

అక్షిజన్మతః = రుద్రుని నేత్రమువలన జన్మించుటవలనను, ద్విజైః = బ్రాహ్మణులచేత
రుద్రాక్షఫలమాలికా = రుద్రాక్షమాలిక. భక్త్యా = భక్తిచేత. ధార్యా = ధరింపతగినది.
రుద్రాక్షోత్పత్తి = రుద్రాక్షజాబాలమునందు, అథ హైనం భగవంతం కాలాగ్నిరుద్రం భుశుం
డః పప్రచ్ఛ కథం రుద్రాక్షోత్పత్తిః తద్ధారణాత్ కిం ఫలమితి తం హోవాచ స భగవాన్ కాలా
గ్నిరుద్రః పురా త్రిపురవధాయోన్మీలితాక్షోఽహం తేభ్యో జలబిందవో భూమౌ పతితాస్తే రు
ద్రాక్షా జాతాః సర్వానుగ్రహార్థాయ తేషాం నామోచ్చారణమాత్రేణ దశగోదానఫలం
భవతి. దర్శనస్పర్శనాభ్యాం ద్విగుణఫలం భవతి.

అతఊర్ధ్వం వక్తుం న శక్నోమి॥ అథ = అనంతరము. ఏనం = ఈ. భగవంతం = భగ
వంతుడగు. కాలాగ్నిరుద్రం = కాలాగ్నిరుద్రుని. భుశుండః = భుశుండుడు. రుద్రాక్షోత్ప
త్తిః = రుద్రాక్షములయొక్క పుట్టుక, కథం = ఎట్లు, తద్ధారణాత్ = ఆరుద్రాక్షలను ధరిం
చుటవలన. కిం = ఏమి. ఫలం = ఫలము. ఇతి = అని. పప్రచ్ఛ = అడిగెను. సః = ఆ. భగ
వంతుడగు. కాలాగ్నిరుద్రః = కాలాగ్నిరుద్రుడు. పురా = మున్ను. అహం = నేను. త్రిపుర
వధాయ = త్రిపురవధకొరకు. ఉన్మీలితాక్షః = తెరువబడిన నేత్రములుగలవాడను. తేభ్యః =
ఆనేత్రములనుండి. జలబిందవః = అశ్రుబిందువులు. భూమౌ = భూమియందు. పతితాః =
పడినవి. తే = ఆజలబిందువులు. రుద్రాక్షాః = రుద్రాక్షవృక్షములై. సర్వానుగ్రహాయ = స

ర్వలోకానుగ్రహముకొరకు. జాతాః=పుట్టినవి. తేషాం=ఆరుద్రాక్షలయొక్క. నామో చ్చారణమాత్రేణ=నామమునుచ్చరించినమాత్రమున. దశశతగోదానఫలం=పదివేలగోదానములతో పుణ్యమగుఫలము. భవతి=కలుగును. దర్శనస్పర్శనములచేత. ద్విగుణఫలం=రెండుకు ద్విగుణితమగుఫలము. భవతి=కలుగుచున్నది. అతఊర్ధ్వం=ఆ మకుమీద. ధారణాదులకుఫలమును. వక్తుం=చెప్పుటకు. నశక్నోమి=శక్తుడనుగాను. అని చెప్పఁబడిన ప్రకారము. రుద్రనిప్రధానేంద్రియములగు నేత్రములవలన జనించినవిగావున ప్రధానముగా ధరించదగినవని యభిప్రాయము.

శ్వేతానాం=తెల్లనివి. విహితత్వేపి=విధింపబడినను. తదలాభే=అవిదొరుకకుండిన యెడల. పరాణివా=ఎఱ్ఱనివినల్లనివి మొదలయినవియు. గుణాలోపేచముఖ్యస్య=గుణములలోపించినను. ముఖ్యములోపించతగదు. ఇతి=అను. ఉక్తశాసనాత్=చెప్పబడినశాస్త్రమువలన, ధార్యాణి=ధరించతగినవి.

తెలుపుగుణములోపించినను ముఖ్యములగురుద్రాక్షలకుపరిత్యాగయుక్తముకాదను న్యాయమువలన రుద్రాక్షలెయ్యవియైన ధారణార్హములగు.

రుద్రాక్షాః శ్వేతాభిభృయాన్న తత్రసమ్మర్శః అని బృహజ్జాబాలాదులయందు శ్వేతాశ్వేతవిమర్శ చేయతగదని చెప్పఁబడినందుననను రుద్రాక్షసామాన్యము ధారణార్హమగు.

శివపురాణమునందు, విప్రాదీనాంక్రమాచ్ఛ్వేతం పీతం రక్తమథాసితం । తథాలాభే యథాలాభంధారణీయమదూషితం॥ విప్రాదీనాం=బ్రాహ్మణులు మొదలగువారలకు క్రమాత్=క్రమముగా. శ్వేతం=తెల్లనిదియు. పీతం=పచ్చనిదియు. రక్తం=ఎఱ్ఱనిదియు అసితం=నల్లనిదియు. రుద్రాక్షము. ధారణీయం=ధరించతగినది. తథా=అట్లు. అలాభే=దొరకకున్నయెడల. యథాలాభం=దొరికినట్లు. ధారణీయం=ధరించవలసినది. అదూషితం=దోషార్హముగాదు. అని చెప్పబడుటవలనను యథాలాభముగా ధరించవలసినది,

తెల్లనివి అని మొదలుగా చెప్పబడినవర్ణములు వృక్ష పర్యాయములు గావునను తెల్ల రుద్రాక్షవృక్షములవలన కలిగినవని యభిప్రాయముగావున నేవిధమయిన రుద్రాక్షలయిన ధరించదగినవి.

ఇట్లు సర్వవిధములను రుద్రాక్షధారణనియతానుష్ఠేయమని సిద్ధాంతీకరింపబడినది.

శ్లో॥ సర్వలింగస్థాపయత్యేతి శ్రుత్యావిహితత్వతః।
బహుశాస్త్రానుగీతత్వాదర్థవాదపరిష్టుతేః॥ ౧॥

శ్లో॥ విహితత్వాత్సర్వవేదేషూక్తత్వాత్కల్పకేష్వపి।
ధర్మశాస్త్రేషుబహుధాకథితత్వాత్సమంతతః॥ ౧౩॥

శ్లో॥ ఇతిహాసపురాణాభ్యాం స్తుతత్వాన్నిత్యతాశ్రుతేః।
విముక్తిఫలకత్వాచ్చ శిష్టైశ్చానుష్ఠితత్వతః॥ ౧౪॥

శ్లో॥ లింగధారణకం నామవ్రతం శాంభవసత్తమం।
అనుష్ఠేయం ముక్తికామైః శ్రేష్ఠైర్మహాబుద్ధిభిః॥ ౧౫॥

అర్థము. సర్వలింగగ్స్థాపయతీతి=సర్వలింగగ్స్థాపయతిఅను. శ్రుత్యా=శ్రుతిచేత. విహితత్వాతః=విధింపబడుటవలనను. లింగధారణకంనామ = లింగధారణకమను. వ్రతం=నిత్యవ్రతము. అనుష్ఠేయం=అనుష్ఠింపదగినది.

శ్రు॥ ఏతత్సోమస్యసూర్యస్యసర్వలింగగ్స్థాపయతి పాణిమంత్రంపవిత్రం. అనగా సూర్యస్య=సూర్యమండలాంతర్వర్తియగు. సోమస్య=ఉమాపతియొక్క. పాణిమంత్రం=పాణియందుంచుక పూజించుటవలన రక్షించునదియు. పవిత్రం = శుచ్యశుచికాలముల యందెల్లపుడునుపవిత్రమయినట్టియు. సర్వలింగం=సమస్తప్రపంచమునకు నుత్పత్తిలయ కారణమగు లింగమును స్థాపయతి=ధరింపవలసినది.

ఇచట స్థాపయతియనునది లేటంతము గావున విధ్యర్థబోధకమగును. స్థాపయతి యనగా నుంచవలసినదని యర్థము చెప్పినను. ఎచటనను నధికరణాకాంక్ష గలుగగా ప్రతిష్ఠించువాడు శరీరిగావున భూమిపీఠాదులవలె శరీరంబును యుపస్థితంబగుటచే భూమియందా పీఠమందా శరీరమందా యను శంకయందు పృథివీపీఠాదులకన్న కర్తయగు శరీరికి సన్నిధిస్థమై అంతరంగన్యాయముచే శరీరమే యుపస్థితంబగుటవలన శరీరమునందే యుంచవలసినదని యర్థములభించుటచే శరీరమునందగు లింగధారణము సిద్ధించినది.

బహుమంత్రానుగీతత్వాత్ = అనేక మంత్రములచేతననూదింపబడినది గావునను. లింగధారణకంనామ=లింగధారణకమను వ్రతం=నిత్యవ్రతము. అనుష్ఠేయం = అనుష్ఠింప తగినది.

పాణిమంత్రం పవిత్రంఅనునది. స్థాపయతియనువిధికి నర్థవాదము. ఎట్లనగా. ధరించవలసినదియనిచెప్పగా. "ఎచటధరించవలసినదను శంకయందు పాణిమంత్రం= పాణియందుంచుక పూజించుటవలన రక్షించునదియను నర్థవాదముచేత. పాణ్యేకకరణ కమగు పూజస్థావరమందు నప్రసక్తముగావున నిష్టలింగమగువ్యాఖున శరీరమునందు ధరిం

చవలసినదను తాత్పర్యముచేత నిష్టలింగధారణానువాదకత్వమే యేర్పడినది. ఈ వాక్యముచే. శరీరమునందు ధరించగా పూజ చేయుచట ననుసందేహము నివారణమయినది.

పాణిమంత్రంఅనుపదమునకు పాణియందు పూజింపబడునదియనియర్థమును జెప్పకున్న పాణిపదము తప్పకవ్యర్థమగు.

ఎటులనపాణిచే పూజించుటయని యర్థమునుచెప్పగా పూజచేయుచటను పాణిచేతనేగాక పాదాదులచే గానేరదుగావున తిరుగాపాణి చేతనని జెప్పగా పాణిపదము వ్యర్థమగుగదా.

ఇకకొందరు పాణిమంత్రమనగా పాణిచేత నభిమంత్రించబడినదియని యర్థమును జెప్పుదురు. ఎచటనైన. మంత్రాధికరణము నోరుగావున నోటిచేమంత్రించుట కలదుగాని చేతితో మంత్రించుటయు, నోటితోపూజించుటయు, మంత్రోచ్చారణము నెరుంగనివారి కృత్యమేయగుగాని మంత్రజ్ఞులపనిగా నేరదు.

ఇకను శుచికాలమునందు ధరించినను అశుచికాలములయందెటులనను నా శంక యందు పవిత్రం అనుపదము అశుచికాలధారణచేతనగు నపావిత్ర్యమును నిరసించునది యని యభిప్రాయముచే ప్రయోగించబడెనది.

మఱియును అమృతస్యదేవధారణోభూయాసం, అమృతస్య= మోక్షముకొరకు. దేవధారణః=దేవపదవాచ్యుడగుశివునిధరించినవాడను. భూయాసం = అగుదునుగాక. అనుమంత్రంబును లింగధారణను జెప్పుచున్నది.

ఇనియునుంగాకనమోబ్రహ్మణేధారణంమేఅస్త్వనిరాకరణంధారయితాభూయాసం.బ్రహ్మణే=శివునికొరకు. నమః=నమస్కారము. మే=నాకొరకు. ధారణం=లింగధారణము. అస్తు=అగుగాక. అనిరాకరణం=నిరాకరించకుండునటులధారయితా=లింగమునుధరించినవాడను. భూయాసం=అగుదునుగాక. అనుమంత్రంబును లింగధారణమును జెప్పుచున్నది.

ఇటుల ననేకమంత్రములు లింగధారణమును జెప్పుచున్నవి.

అర్థవాదపరిష్టుతేః=అర్థవాదముయొక్క పరిష్టుతివలనను. లింగధారకంనామ= లింగధారణమను వ్రతం నిత్యవ్రతము. అనుష్ఠేయం=చేయదగినది.

నిధనపతయేనమః అనిమొదలు ఏతత్సోమస్యసూర్యస్య అనుపర్యంతమును ఇష్టలింగార్థవాదము. ఇట్టియర్థవాదముచేతను సర్వలింగగ్స్థాపయతి అనునది ఇష్టలింగధారణపరముగావున లింగధారణము నియతానుష్ఠేయమని యేర్పడినది.

సర్వవేదేషు=సమస్తవేదములయందు. నిహితత్వాత్=విధింపబడుటవలనను. లింగధారణము అనుష్ఠించతగినది.

యజుర్వేదమున ప్రథమాష్టకచరమప్రశ్నమున సోమారుద్రాయువమేతాన్యస్మే విశ్వాతనూషు భేషజానిధత్తం. అవశ్యతంముంచతంతన్నో అస్తుతనూషుబద్ధంకృతమేనోఅస్మత్॥ సోమారుద్రౌ=ఘోరాఘోరతనువులుగలిగి సోమరుద్రశబ్దితులగు, యువాం=మీరువురు. అస్మే=మాకొరకు- విశ్వాని=సమస్తమగు. భేషజాని= ఇష్టప్రాణభావములను. తనూషు=మాయొక్క శరీరములయందు. ధర్తుం = ధరించుటకు. నః = మాయొక్క. తనూషు=శరీరములయందు. బద్ధం=లగ్నమగు. కృతం=చేయబడిన- ఏనః=పాపమును. అస్మత్=మానుండి. అవశ్యతం=ముఖ్యముగా. ముంచతం=విడిపింపుడు, అను మంత్రంబున శరీరత్రయంబున ఇష్టప్రాణభావాత్మకంబగు లింగధారణనువిధించుచున్నది.

త్రియంబకంయజామహే, త్రియంబకం=శివుని, యజామహే = సంబంధపరచుకొనుచున్నారము అనుసూత్రముననను యజధాతువు సంగతీకరణార్థకము గావునను లింగధారణము జెప్పంబడినది.

అటులఋగ్వేదంబునను, పవిత్రంతేవితతంబ్రహ్మణస్పతే, ప్రభుర్గాత్రాణిపర్యేషివిశ్వతః, అతప్తతనూర్నతదామోఅశ్నుతే॥

హేబ్రహ్మణస్పతే=లింగమునందుండుపరమశివుడా, తే=నీయొక్క, వితతం=లింగరూపశరీరము, పవిత్రం=శుచ్యశుచికాలధారణయోగ్యమయినది, ప్రభుః=అట్టినీవు, గాత్రాణి=భక్తశరీరములను, పర్యేషి=పొందుచున్నాడవు, అతప్తతనూః= దీక్షాత్రయరహితుడు, ఆమః=అపరిపక్వాంతఃకరణగలవాడై, తత్=ఆపరమశివస్వరూపమును, నాశ్నుతే=పొందడు, అనునీమంత్రంబును, లింగధారణను చెప్పుచున్నది.

ఇందుచే ఋగ్వేదంబునను లింగధారణస్పష్టీకరించబడినది, సామవేదమున జైగీషీయశాఖయందు సదానందోపనిషత్తునందును,

అంతర్ధారణశక్తోవాహ్యశక్తోవాద్విజోత్తమః, సంస్కృత్యగురుణాదత్తంశైవంలింగమురస్థలే, ధార్యంవిప్రేణముక్త్యర్థమేవంవేదాంతవిదోవదంతి॥ అంతర్ధారణశక్తోవా=అంతర్లింగధారణయందుశక్తుడుగాని. అశక్తోవా=అశక్తుడుగాని. ద్విజోత్తమః = ద్విజశ్రేష్టుడు. గురుణా=గురువుచేత. సంస్కృత్య=సంస్కారముచేసి. దత్తం= ఇవ్వబడిన. శైవం=శివునిసంబంధమగు. లింగం=లింగమును. ఉరస్థలే=వక్షస్థలమందుము క్త్యర్థం=మోక్షముకొరకు. ధార్యం=ధరించతగినది. ఏవం=ఇట్లు. వేదాంతవిదః=వేదాంతవిదులు. వదంతి=చెప్పుచున్నారు. అనుమంత్రములింగధారణను విధించుచున్నది.

ఈప్రకారము సామవేదమున లింగధారణము గనుపరచబడినది.

అథర్వణమున ఐశ్వరశాఖయందు యోవామహాస్త్రాప్పితలింగమేకంపరాత్పరంధారయతేవిప్రఃత్రిధాయోవా. తస్యైవలభ్యఃపరమేశ్వరోసౌనిరంజనం పరమంసామ్యముపైతి

దిష్యం॥ విప్రైః=బ్రాహ్మణుడుగాని, క్షత్రియోవా=క్షత్రియుడుగాని. యః = ఎవ్వడు వామహస్తార్పితం=వామహస్తమున నుంచబడినట్టియు. పరాత్పరం=పరాత్పరమయిన, లింగం=లింగమును. ధారయతే=ధరించుచున్నాడో. తస్యైవ=అట్టివానికే. పరమేశ్వరః=పరమేశ్వరుడు, లభ్యః=పొందదగినవాడు, నిరంజనం=సంగరహితమగు, సామ్య=సామ్యమును, ఉపైతి=పొందుచున్నాడు, అను మంత్రము చేతను లింగధారణ విధింపబడినది.

ఇందు చేత నాలుగు వేదములయందును లింగధారణము సిద్ధాంతీకరింపబడినది.

కల్పకేష్వపి=కల్పసూత్రములయందు, ఉక్తత్వాత్=చెప్పబడుటవలనను, లింగము ధరించవలసినది.

బోధాయనగృహ్యపరిశిష్టమునందు, అథాతో ద్విజాతీనామాదేహపాతం మహాపాశుపతదీక్షాం వ్యాఖ్యాస్యామః వ్రతమేతత్పాశుపతం. సర్వేషు వేదేషు వేదవాదిభిరుక్తం భవతి, తత్సమాచరేదితి హ్యామ్నాయతే॥ ఇతి॥ అథ=అనంతరము, అతః=అందువలన, ఆదేహపాతం=దేహావసాన పర్యంతము, ద్విజాతీనాం=ద్విజులకు. మహాపాశుపతదీక్షాం=మహాపాశుపతదీక్షను, వ్యాఖ్యాస్యామః=వివరణ జేయుచున్నారము, ఏతత్=ఈపాశుపతము=పాశుపతమను, వ్రతం=వ్రతము, సర్వేషు=సమస్తమగు, వేదేషు = వేదములయందు వేదవాదిభిః=వేదజ్ఞులచే, ఉక్తం=చెప్పబడినది, ఇతిహి=ఈలాగనిగదా, ఆమ్నాయతే=పఠించబడుచున్నది, అని చెప్పంబడుటవలన కల్పములయందును లింగధారణము విధింపబడినదని స్పష్టము.

ధర్మశాస్త్రేషు=ధర్మశాస్త్రములయందును, సమంతతః = అంతటను, బహుధా=అనేకవిధములు, గదితత్వాత్=చెప్పబడుటవలనను లింగధారణమాచరించతగినది.

శివధర్మశాస్త్రములగు శివాగమములయందు విశేషముగా చెప్పబడినది.

గౌతమస్మృతియందు, ముఖేమంత్రం హృదిధ్యానం మస్తకే లింగధారణం, శిఖాసూత్రం తథా భస్మ హ్యేతద్బ్రాహ్మణలక్షణం॥ ముఖే=ముఖమునందు, మంత్రం=మంత్రంబును, హృది=హృదయమునందు, ధ్యానం=ధ్యానంబును, మస్తకే=శిరమునందు లింగధారణం=లింగధారణంబును, శిఖా=శిఖయు, సూత్రం=యజ్ఞసూత్రంబును, తథా=అట్లు, భస్మ=భూతియు, ఏతత్=ఇయ్యది, బ్రాహ్మణలక్షణం = బ్రాహ్మణ లక్షణము అని చెప్పంబడినది, ఇటుల బోధాయన శాతాతపాది స్మృతులయందు విశేష వచనములుగలవు.

ఇటుచే ధర్మశాస్త్రములయందు లింగధారణవిధి విశేషముగాగనుపరచబడినది, ఇతిహాసపురాణాభ్యాం=పురాణేతిహాసములచేత, స్తుతత్వాత్ = స్తుతించబడినది యగుటవలనను, లింగము ధరించవలసినది.

శివపురాణమున॥ తథా వేదాంతవాక్యేషులింగధారణమీర్యతే। వేదోత్తమే యజుర్వేదేత్రిరీయేవిశేషతః । మోక్షార్థినాంముక్తిహేతుర్లింగధారణముచ్యతే। ఛందోభ్యస్సర్వవేదేభ్యోయోమృతాత్సంబభూవహి॥ ఇంద్రస్తుపరమైశ్వర్యశాలీసాంబస్త్రిలోచనః। మాంమేధయాప్రజ్ఞయాచస్పృణోతుప్రీణయత్వథ । అమృతస్య మోక్షరూపస్య సర్వవేదేషుసర్వదా । దేవస్యలింగరూపస్యశివస్యపరమాత్మనః। ధారణాత్తద్భూతిర్యస్మాత్ దేవధారణమిష్యతే.

వేదాంతవాక్యేషు=వేదాంతవాక్యములయందు, లింగధారణం= లింగధారణము-ఉచ్యతే=చెప్పఁబడుచున్నది, వేదోత్తమే= వేదములలో శ్రేష్ఠమగు, యజుర్వేదమునందు, మోక్షార్థినాం=ముక్తిగోరుజనులకు.ముక్తిహేతుః=మోక్షహేతువగు.లింగధారణం= లింగధారణము. ఉచ్యతే=చెప్పఁబడుచున్నది. యః=ఎవ్వఁడు. అమృతాత్=నిత్యములగు. ఛందోభ్యః=సర్వవేదములవలన. సంబభూవహి=అభివ్యక్తిజెందెనో. ఇంద్రః = పరమైశ్వర్యశాలియు. త్రిలోచనః=మూఁడునేత్రములుగల. సాంబః=శివుఁడు. మాం = నన్ను. స్పృణోతు=బలపరచుగాక. సర్వవేదేషు=సమస్తవేదములయందును. అమృతస్య మోక్షరూపుఁడుగా చెప్పఁబడిన. లింగరూపస్య=లింగరూపుఁడగు. దేవస్య = దేవునియొక్క. ధారణా=ధారణ. దేవధారణః=లింగధారణమని. ఇష్యతే=ఇష్టమయినది. అని. అమృతస్యదేవధారణోభూయాసం అను మంత్రము నుపబృంహింపజేయుచున్నవి.

బ్రహ్మాండపురాణమునందును, నమోస్తుబ్రహ్మణేతుభ్యమాచార్యాయమహాత్మనే। అనిరాకరణంమేస్తుధారణందేశికోత్తమ। వేదశాస్త్రపురాణేషుప్రసిద్ధంకర్ణయోశ్శ్రితం । అహంధారయితాదేవంభూయాసంసర్వకారణం॥ బ్రహ్మణే=శివునికొరకును. మహాత్మనే=మహాత్ముఁడును. ఆచార్యాయ=దేశికుఁడునగు. తుభ్యం=నీకొరకు. నమః=నమస్కారము. అస్తు=అగుగాక. హేదేశికోత్తమ=ఓగురుశ్రేష్ఠుఁడా. మే=నాకొరకు. అనిరాకరణం=నిరాకరణరహితముగాను. ధారణం=లింగధారణము. అస్తు=అగుగాక. వేదశాస్త్రపురాణేషు=వేదములయందు, శాస్త్రములయందు, పురాణములయందును, ప్రసిద్ధం=సుప్రసిద్ధముగా. కర్ణయోః=వీనులయందు. శ్రితం=వినఁబడినట్టియు. సర్వకారణం=సమస్తప్రపంచమునకు కారణభూతుఁడగు. దేవం=దేవుని. అహం=నేను. ధారయితా=ధరించినవాఁడను. భూయాసం=అగుదును గాక. అనుసీవచనంబులు నమోబ్రహ్మణే ధారణంమేఅస్త్వనిరాకరణంధారయితాభూయాసం=అనుమంత్రము నుపబృంహించుచున్నవి.

లింగపురాణంబున యజురప్యాహసర్వంవై లింగంస్థాపయతీతిచ । తస్మాద్ధార్యం మహాలింగంప్రాణమంత్రేతిమంత్రతః॥ ప్రాణౌలింగంవినిక్షిప్యదీక్షాకాలేగురుశ్శివం। యేన స్మరతితంమంత్రంప్రాణమంత్రంవదంతిహి। పవిత్రత్వాన్మహేశస్య శివస్యప్రతిపాదనాత్। పవిత్రీకరణాత్పుంసాంపవిత్రమితికథ్యతే। యజురపి=యజుర్వేదంబును. సర్వంవై=సమస్త ప్రపంచస్వరూపమగు. లింగం=లింగమును. స్థాపయతి=ధరించుచున్నాడు. ఇతి=అని. ఆహ=పలికెను. తస్మాత్=అందువలన. ప్రాణమంత్రేతిమంత్రతః= ప్రాణమంత్రం పవిత్రం అను మంత్రమువలన, మహాలింగం=మహాలింగము. ధార్యం=ధరించతగినది. దీక్షాకాలే= దీక్షనిచ్చు కాలమునందు. గురుః=గురువు, ప్రాణౌ=హస్తమునందు. లింగం = లింగమును, వినిక్షిప్య=ఉంచి. యేన=ఏమంత్రము చేత. శివం=శివుని. స్మరతి = స్మరించుచున్నాడో, తం=మంత్రం=మంత్రమును, ప్రాణమంత్రం=ప్రాణమంత్రమని. వదంతిహి=చెప్పుచున్నారు గదా. పవిత్రత్వాత్=పవిత్రమగుటవలనను. శివస్య=శివుని, ప్రతిపాదనాత్=ప్రతిపాదన జేయునదియగుటవలనను. పుంసాం=పురుషులను. పవిత్రీకరణాత్=పవిత్రము చేయుటవలనను, పవిత్రం=పవిత్రమని. కథ్యతే=చెప్పబడుచున్నది.

లింగపురాణమునందే బ్రహ్మేతిలింగమాఖ్యాతంబ్రహ్మణఃపతిరీశ్వరః । పవిత్రఃతద్ధివిఖ్యాతంతత్సంపర్కాత్తనుశ్శుచిః । ఋగిత్యాహపవిత్రంతేవితతంబ్రహ్మణస్పతే। తస్మాత్పవిత్రంతల్లింగంధార్యంశైవమనామయం।అతప్తతనురజ్ఞోవైహ్యామస్సంస్కారవర్జితః। దీక్షయారహితస్సాక్షాన్నాప్నుయాల్లింగముత్తమం.

బ్రహ్మేతి=బ్రహ్మయని. లింగం=లింగము, ఆఖ్యాతం=చెప్పబడినది, బ్రహ్మణః= లింగమునకు, పతిః=అధిపతి, ఈశ్వరః=ఈశ్వరుడు, తత్=ఆలింగము, పవిత్రం=పవిత్రమైనది, తత్సంపర్కాత్=ఆలింగముయొక్క సంపర్కమువలన, తనుః=శరీరము, శుచి=పరిశుద్ధమైనది. ఋక్=ఋగ్వేదము, పవిత్రంతేవితతం బ్రహ్మణస్పతే=పవిత్రంతేవితతం బ్రహ్మణస్పతే యని, ఆహ=చెప్పెను, తస్మాత్=అందువలన, శైవం=శివునిసంబంధమైనట్టియు, అనామయం=సుఖస్వరూపమగునట్టియు, పవిత్రం=పవిత్రమగు, తత్=లింగము, ధార్యం=ధరించతగినది, అతప్తతనుః=అతప్తతనువనగా, అజ్ఞః=అజ్ఞానియు, ఆమః=అపరిపక్వాంతఃకరణుడనియు, సంస్కారవర్జితః= సంస్కారరహితుడనియు, చెప్పంబడు, సః=ఆజనుడు, దీక్షయా=దీక్షచేత, రహితః=లేనివాడు, ఉత్తమం=ఉత్తమమగు, లింగం=లింగమును, సాక్షాత్=సాక్షాత్తుగా. నాప్నుయాత్=పొందడు, అనియీప్రకారము పవిత్రంతేవితతంబ్రహ్మణస్పతే అను ఋగ్వేదమంత్రము ఉపబృంహింపబడినది.

శంకరసంహితయందును, లింగస్య ధారణంపుణ్యంసర్వపాపప్రణాశనం । ఆదృతం మునిభిస్సర్వైః నిగమార్థవిశారదైః । ఇష్టలింగమిదంసాక్షాదనిష్టపరిహారకం ధారయేద వధానేన లింగంతద్గురుణార్పితం । లింగస్య=లింగముయొక్క, ధారణం= ధారణను. పుణ్యం=పుణ్యమయినదియు, సమస్తపాతకములనశింపజేయునదియు, నిగమార్థవిశారదైః వేదార్థవిదులగు, సర్వైః=సమస్తమైన, మునిభిః=మునులచేత, ఆదృతం=ఆదరించబడి నదియునగు, ఇదం=ఈ, ఇష్టలింగం=ఇష్టలింగము, అనిష్టపరిహారకం = అనిష్టములపహ రించునది, గురుణా=గురువుచేత, అర్పితం=ఇవ్వబడిన, తత్=ఆ, లింగం=లింగమును, అ వధానేన, అప్రమత్తతచేత; ధారయేత్=ధరించవలయును అనియును.

తదేవహస్తాంబుజపీఠమధ్యేనిధాయలింగంపరమాత్మచిహ్నం। ప్రపూజయేదైక్య ధియోపచారైర్నరస్తుబాహ్యాంతరభేదభిన్నైః । బాహ్యపీఠార్చనాదేతత్కరపీఠార్చనం వరం।పరమాత్మచిహ్నం=పరమేశ్వరలక్షకమగు.తదేవ=ఆలింగమును హస్తాంబుజ పీఠమ ధ్యే=కరకమలపీఠమధ్యంబున.నిధాయ=ఉంచి.బాహ్యాంతరభేదభిన్నైః = బాహ్యాంతరభే దములచేత, భిన్నములగు. ఉపచారైః=ఉపచారములచేత.నరః=మనుజుడు. ఐక్యధియా =ఐక్యబుద్ధిచేత. ప్రపూజయేత్=పూజించవలయు. బాహ్యపీఠార్చనాత్= బాహ్యపీఠ మునపూజించుటకంటె. ఏతత్= ఈ.కరపీఠార్చనం=కరపీఠికయందగు. పూజవరం=శ్రే ష్ఠమయినది. అనియును లింగధారణము ప్రశంసింపబడియున్నది.

స్కాందమున యావజ్జీవమిదంలింగంశరీరాన్నవియోజయేత్ । ఇదం=ఈ. లిం గం=లింగమును. యావజ్జీవం=జీవితకాలపర్యంతము. శరీరాత్ = శరీరమునుండి. నవి యోజయేత్=వియోగముచేయతగదుఅని చెప్పంబడియున్నది.

గచ్ఛన్ తిష్ఠన్ స్వపన్ జాగ్రన్నున్మిషన్నిమిషన్నపి । శుచిర్వాప్యశుచిర్వాపిలిం గంసర్వత్రధారయేత్॥ గచ్ఛన్= నడచుచును. తిష్ఠన్= నిల్చినయు. స్వపన్ = నిద్రి చుచును. జాగ్రన్= మేల్కొనియు. ఉన్మిషన్=కనుదెరచియు. కనుమూసియు. శుచి ర్వాపి = పవిత్రుండైయ్యును. అశుచిర్వాపి. అపవిత్రుండైయ్యును. సర్వత్ర= సర్వకాలస ర్వావస్థలయందు. ధారయేత్= ధరించవలసినది । అనిచెప్పంబడియున్నది ।.

మహాభారతమునను. సద్వ్రత్తమపివిజ్ఞాయ లింగినేచేతరాయచ । దేయమాహుః మహారాజఉభౌతౌ తపస్వినౌ॥ సద్వృత్తమపి=సత్ప్రవర్తనననున్న. విజ్ఞాయ= తెలు సుకొని.లింగినే= లింగధారికొరకును. ఇతరాయచ= అలింగికొరకును. దేయం= ఇవ్వ తగినదానిగా. ఆహుః= పలికిరి. హేమహారాజ = ఓధర్మరాజా. ఏతౌ = ఈఉభావ పీ= ఇరువురున్ను. తపస్వినౌ=తపశ్శాలురు ।అనిదానావసరములలోలింగధారిని మొదటిప

క్షముగావ్యవహరించుచున్నవి. । ఇటులశివరహస్యంబునను అనంతమగువచనములింగధారణమునుకొనియాడుచున్నది ।

ఈవిధమున పురాణేతిహాసములయందు లింగధారణవిధిస్పష్టముగాగను పరచబడినవి ।.

నిత్యత్వాచ్ఛ్రుతేః= నిత్యత్వశ్రవణమువలనను. లింగధారణవ్రతననుష్ఠించతగినది।

అనిరాకరణంధారయితాభూయాసం । అనుమంత్రమునందు నిరాకరించకుండునటుల లింగమునుధరించినవాడనగుదుంగాకయని లింగధారణనిరాకరణమునునిషేధించుటచే లింగధారణ నిరాకరణమునందు ప్రత్యవాయమునుబోధించుచూ. ఆకరణేప్రత్యవాయజనకత్వరూపమగునిత్యత్వమును చెప్పుచున్నది ।

ఫలాభిసంధిలేనబడకుండుటచేతను నిత్యత్వముసిద్ధించినది । ఫలముఅనగా. చేయబడుకర్మయొక్క ఫలము. శ్రుతియందుచెప్పంబడుచుండు.కర్మనువిధించునపుడు ఫలంబును ఎందువలనచెప్పంబడుననగా నాఫలమునుగోరినవాడు ఆకర్మచేయుగాకయనునభిప్రాయముచేతనేయని దెలియనగు. అందుచేతనే అయ్యాదికామ్యకర్మయనివ్యవహరింపబడు. ఫలకామము ఉన్నను లేకున్నను సేయకతప్పని కర్మవిషయమై. శ్రుతియందు ఫలముచెప్పబడదు. ఇట్టికర్మనిత్యమనివ్యవహరింపఁబడు. ప్రకృతమున లింగధారణవిధాయకవాక్యములయందు ఫలశ్రుతిలేదుగావున నిత్యాదినిత్యమనుట యందుసందియమెంతమాత్రములేదు.

ఇందుచే లింగధారణకు నిత్యత్వమవ్యాహతమైనది ।

విముక్తిఫలకత్వాచ్చ= ముక్తియేప్రయోజనముగాగలది యగుటవలనను. లింగధారణమనుష్ఠించతగినది ।

అమృతస్యదేవధారణోభూయాసం అనుచోట అమృతస్య అనగా మోక్షము కొరకుయని ముక్తి. యీలింగధారణకు ప్రయోజనముగా చెప్పబడినది.

అథర్వశిరస్సు మొదలగువానియందు వ్రతమేతత్పాశుపతం తత్సమాచరేన్ముముక్షుర్నపునర్భవాయ. ఏతత్=ఈ. వ్రతం=వ్రతము. పాశుపతం=పాశుపతమనునది. తత్=ఆవ్రతమును. ముముక్షుః=మోక్షేచ్ఛగలవాడు. నపునర్భవాయ = పునర్భవరాహిత్యముకొరకు. సమాచరేత్=ఆచరింపవలయు. అనుటచే మోక్షేచ్ఛగలవాడు. పునర్భవరాహిత్యముకొరకు నీవ్రతమునునుష్ఠించవలసినదని చెప్పబడినందున నీలింగధారణకు ముక్తియే ప్రయోజనమని యేర్పడినది. శంకరసంహితయందు లింగాంగ సంగినోవత్స పునర్జన్మనవిద్యతే.యుగపజ్జ్ఞానసిద్ధిస్స్యాత్ తతోమోక్షమవాప్నుయాత్॥ లింగాంగసంగినః—లింగాంగసామరస్యముగలవానికి. పునర్జన్మ=పునర్భవము. నవిద్యతే=లేదు. యుగపత్—ఏకకా

మునందు,జ్ఞానసిద్ధిః=జ్ఞానసిద్ధి, స్యాత్ =కలుగును. తతః=అందువలన, మోక్షం=మోక్షము ను,అవాప్నుయాత్ =పొందునుఅనుటచే,ముక్తిప్రయోజనమనియేర్పడినది.

— ఇందుచే,లింగధారణకు,ముక్తిప్రయోజనమని సిద్ధాంతీకరింపబడినది. శిష్టైశ్చాను ష్ఠితత్వతః-శిష్టైః=శిష్టులచేత,అనుష్ఠితత్వతః=అనుష్ఠింపబడుటవలనను,లింగధారణము ను ష్ఠించవలసినది.

స్కాందమునందు, బ్రహ్మవిష్ణ్వాదయో దేవాఃమునయో గౌతమాదయః, ధారయంతి సదాలింగముత్తమాంగేవిశేషతః॥ బ్రహ్మవిష్ణ్వాదయః=బ్రహ్మవిష్ణు మొదలగు- దేవాః=దే వతలు, గౌతమాదయః=గౌతముడు మొదలగు, మునయః=మునులును, ఉత్తమాంగే=శిర మునందు,సదా=ఎల్లపుడును,లింగం=లింగమును, ధారయంతి=ధరించుచున్నారు.

లింగపురాణమునందు, కశ్యపాత్రిభరద్వాజగౌతమాద్యామహర్షయః, ధారయం తిసదాలింగముత్తమాంగేవిశేషతః, నారాయణోపిభగవాన్ దేవాబ్రహ్మాదయోనఘాం ధారయంత్యుత్తమాంగేషు,శివలింగమనామయం,లక్ష్మీసరస్వతీముఖ్యాస్స్వకిరీటోర్ధ్వదేశకే ధారయంత్యప్రమాదేనలింగంత్రిభువనేశ్వరం॥ కశ్యపాత్రిభరద్వాజగౌతమాద్యామహర్ష యః,కశ్యపుడు,అత్రి,భరద్వాజుడు, గౌతముడు, మొదలగు,మహర్షయః=మహర్షులు ను,ఉత్తమాంగే=శిరమునందు, లింగం=లింగమును-సదా=ఎల్లపుడును,ధారయంతి=ధరిం చుచున్నారు,భగవాన్=భగవంతుడగు, నారాయణోపి=నారాయణుండును, బ్రహ్మాద యః=బ్రహ్మ మొదలగు, దేవాః=దేవతలును, ఉత్తమాంగేషు=శిరములయందు,లింగం= లింగమును, ధారయంతి=ధరించుచున్నారు, లక్ష్మీసరస్వతీముఖ్యాః=లక్ష్మీసరస్వతీ మొ దలగువారలును, స్వకిరీటోర్ధ్వదేశకే=తమకిరీటములయొక్క యూర్ధ్వదేశమునందు,త్రి భువనేశ్వరం=త్రైలోక్యేశ్వరమగు, లింగం=లింగమును, ధారయంతి=ధరించుచు న్నారు.

స్కాందమున, శంకరసంహితయందు, ఉరస్థలేహరిర్లింగం ధృత్వా మూర్ధ్నిపి తామహః, లింగస్థంమాంస మారాధ్యస్వంస్వంపదమవాపతుః, మల్లింగం మస్తకాద్యంగే ధృత్వాశక్రపురోగమాః, దేవామాంలింగమధ్యస్థం సంపూజ్యస్వః పదంయయుః, లక్ష్మీస రస్వతీముఖ్యాదేవ్యో మల్లింగమాదరాత్, ధృత్వానిజాంగే తల్లీనభావాజగ్ముః పరంసు ఖం॥ హరిః=విష్ణుమూర్తి, ఉరస్థలే=వక్షస్థలమందు, లింగం=లింగమును, ధృత్వా=ధరిం చియు, పితామహః=బ్రహ్మదేవుడు, మూర్ధ్ని=శిరమునందు, ధృత్వా=ధరించియు, లిం గస్థం=లింగమునందున్న, మాం=నన్ను, సమారాధ్య=ఆరాధించి, స్వంస్వం=తమతమ, పదం=పదమును, అవాపతుః=పొందిరి, శక్రపురోగమాః=ఇంద్రాదులగు, దేవాః=దేవ

ములు, మల్లింగం=నాయొక్క లింగమును, మస్తకాద్యంగే=శిరస్సు మొదలగునవయవము యందు, ధృత్వా=ధరించి, లింగమధ్యస్థం=లింగమధ్యముననున్న, మాం=నన్ను, సంపూజ్య=పూజించి, స్వంపదః=స్వర్గపదమును, యయుః=పొందిరి, లక్ష్మీసరస్వతీముఖ్యాః=లక్ష్మీసరస్వతీమొదలగు దేవ్యః=దేవతాస్త్రీలు మల్లింగం=నాయొక్క లింగమును ఆదరాత్=ప్రేమవలన నిజాంగే=స్వీయావయవములయందుధృత్వా=ధరించి తల్లీనభావాః అలింగమునందులయించిన చిత్తప్రవృత్తిగలవారలై పరం=ఉత్కృష్టమగు సుఖం=సుఖమును జగ్ముః=పొందిరి అనిచెప్పంబడియున్నది.

సిద్ధాంతాగమమునందునను లక్ష్మ్యాద్యాః శక్తయస్సర్వాః శివభక్తివిభావితాః ధారయంత్యళికాగ్రేషు శివలింగమహర్నిశం॥ సర్వాః=సమస్తమగులక్ష్మ్యాదిశక్తయః=లక్ష్మి మొదలగుశక్తులును శివభక్తి విభావితాః=శివభక్తిగలవారలై అళికాగ్రేషు=ఫాలభాగములయందు శివలింగం=శివలింగమును అహర్నిశం=రాత్రిపగలు ధారయంతి=ధరించుచున్నారు అనియును చెప్పబడినది. అందుచేసమస్తమగు శిష్టజనులులింగమును ధరించినటులగనుపరచబడినది. శాంభవశబ్దితం=శాంభవమనుపేరుగల లింగధారణవ్రతమనుష్ఠించదగినది. కాలాగ్నిరుద్రోపనిషత్తునందు వ్రతమేతచ్ఛాంభవంతత్సమాచరేన్ముముక్షురపునర్భవాయ, ఏతత్=ఈవ్రతం లింగధారణవ్రతము శాంభవం=శాంభవమనుపేరుగలది ముముక్షుః=మోక్షేచ్ఛగలవాడు అపునర్భవాయ=పునర్భవరాహిత్యముకొరకు తత్=అవ్రతమును, సమాచరేత్=ఆచరించవలసినది అని చెప్పంబడియుండుటచేతనీవ్రతమునకు శాంభవమను సంజ్ఞ శ్రుతులయందు వ్యవహరింపడినది.

మొదటినుండి నిరూపింపబడిన ప్రబలహేతువులచేత నీలింగధారణము శ్రౌతమ్మెనది మదుర్భేద్యమైనది.

శ్లో॥ విహితత్వాచ్ఛ్రుతిస్మృత్యోః శ్రేష్ఠత్వాచ్ఛ్రుతిపూర్వతః।
కల్పేషుచపురాణేషు గదితత్వాచ్చసాదరం॥ ౧౬॥

శ్లో॥ నిత్యత్వాన్ముక్తిమూలత్వాత్సర్వశిష్టాదృతత్వతః।
వైదికైః ప్రత్యహం కార్యం త్రికాలం లింగపూజనం॥ ౧౭॥

అర్థము॥ శ్రుతిస్మృత్యోః=శ్రుతిస్మృతులయందు విహితత్వాత్=విధింపబడుటవలనను, వైదికైః=వైదికులచేత, ప్రత్యహం=ప్రతిదినంబును, త్రికాలం=మూడుకాలములయందు, లింగపూజనం=లింగముయొక్కపూజ, కార్యం=చేయతగనది.

బృహజ్జాబాలమునందు నిత్యం త్రిసంధ్యం శివలింగమభ్యర్చ్యం. నిత్యం=యెల్లప్పు

ము. త్రిసంధ్యం=మూడు కాలములయందు. శివలింగం=శివలింగము. అభ్యర్చ్యం=పూజిల్ల వలెగనది: అని త్రికాలములయందును శివలింగారాధనము నిత్యవిధిగా చెప్పబడినది.

అట్లు శాతాతపాది స్మృతులయందును శివపూజా విధాయక వచనము లనేకము లు గలవు.

ఇందుచే శ్రుతి స్మృతులయందు శివపూజావిధానము గనుపరచబడినది.

ప్రతిమార్చతః = ప్రతిమను పూజించుటకంటె. శ్రేష్ఠత్వాత్ = శ్రేష్ఠమగుటవలన ను. వైదికులచేత శివలింగారాధనను చేయతగినది.

ప్రతిమార్చనకంటె లింగార్చనకు శ్రైష్ఠ్యము. భారతమున నానుశాసనిక పర్వమునందు, జన్మకర్మ తపోయోగాస్తయో స్తవచపుష్కలాః । తాభ్యాం లింగేర్చితో దేవ స్త్వర్చాయాం యుగేయుగే। తయోః = ఆ కృష్ణార్జునులకును. తవ=నీకును. జన్మకర్మతపోయోగాః = జన్మకర్మంబులును, తపోయోగంబులును. పుష్కలాః=సమృద్ధంబులు. తాభ్యాం = ఆ కృష్ణార్జునులచేత. యుగేయుగే=ప్రతియుగమునందును. దేవః= ఈశ్వరుడు. లింగే=లింగమునందు. అర్చితః=పూజింపబడియె. త్వయా=నీచేత. అర్చాయాం=ప్రతిమయందు. అర్చితః=పూజింపబడియెనని. ప్రతిమారాధనపరుడగు నశ్వత్థామ కు జయమగలిగినదనియు లింగారాధన పరులగు కృష్ణార్జునులకు విజయ్యాప్తియని చెప్పటచేతను, ప్రతిమార్చనకంటెను లింగార్చనకు శ్రైష్ఠ్యము ప్రతిపాదింపబడినది.

కల్పేషుచ = కల్పసూత్రములయందునను. గదితత్వాత్ = చెప్పంబడుటవలన శివలింగము పూజించదగినది.

కల్పములయందు బోధాయనునిచేతను, అథాతో మహాదేవస్యాహరహస్సపర్యావిధిం వ్యాఖ్యాస్యామః. అథ=అనంతరము. అతః = అందువలన. అహరహః = అనుదినంబును. మహాదేవస్య = మహాదేవుని యొక్క. సపర్యావిధిం = పూజావిధిని వ్యాఖ్యాస్యామః = వివరించుచున్నారము. అని శివపూజావిధినిత్యముగా చెప్పబడినది.

ఈప్రకారము కల్పములయందు లింగపూజావిధి గనుపరచబడినది.

పురాణేషు = పురాణములయందు గదితత్వాచ్చ = చెప్పంబడుటవలనను. శివలింగారాధనము చేయదగినది.

పురాణములయందు నందికేశ్వరుడు । యః ప్రయచ్ఛేద్గవాం లక్షందోగ్ధ్రీణాం వేదపారగే. ఏకాహమర్చయే ల్లింగంతస్యపుణ్యం తతోధికం । సకృత్పూజయతే యస్తుభగవంతముమాపతిం । తస్యాశ్వమేధాదధికం ఫలంభవతి భూసుర.

యః = ఎవ్వాడు. దోగ్ధ్రీణాం = పాలుపితుకు. గవాం = గోవులయొక్క. ల

ఫలం = లక్షను. వేదపారగే = సాంగవేదాధ్యాపకుని యందు. ప్రయచ్ఛేత్ = ఇచ్చు నో. యః = ఎవ్వఁడు. ఏకాహం = ఒకదినము. లింగం = లింగమును. అర్చయే త్ = పూజించునో. తస్య = ఆలింగమును పూజించువానియొక్క. పుణ్యం = పుణ్య ముతతః = ఆలక్షగోవులదానముజేసినవానికంటె. అధికం = అధికమైనది. అనిచెప్పం బడియున్నది.

స్కాందాది పురాణములయందు లింగపూజావిధి విశేషముగాప్రశంసించబడి యున్నది.

నిత్యత్వాత్ = నిత్యవిధియగుటవలనను. శివలింగముపూజించదగినది.

నిత్యం త్రిసంధ్యం శివలింగమభ్యర్చ్యం. నిత్యముమూడు కాలములయందు శివలిం గమును పూజించవలసినదనుచోట. నిత్యశబ్దఘటితవచన విషయముగుటచేతను. అథా తో మహాదేవస్యాహరహస్సపర్యావిధిం అనుబోధాయన కల్పమునందు. అహరహః అని వ్సాఘటితవచన విషయమగుటచేతను. నిత్యత్వముసిద్ధించినది.

ఇదియునుంగాక. శివరహస్యమునందు. భుంజీత నేశార్చనమప్యకృత్వాభుంజీతచే త్పాపమయంచభుజ్జే. సరాధమోసామునిభిస్సఉక్తస్సనారకీవిట్క్రిమికీటభుక్. ఈ శార్చనం = శివారాధనమును. అకృత్వా = చేయక. నభుంజీత = భుజించతగదు. భుం జీతచేత్ = భుజించెనేని. అయం = ఈనరుఁడు. పాపం = పాతకమును. భుంక్తే = భుజించువాఁడగు. అసౌ = ఈనరాధమః = మనుజాధముఁడు. మునిభిః = మునులచే త. నారకీ = నరకములనొందువాఁడనియు. విట్క్రిమికీటభుక్ = మలమును క్రిమికీటా దులనుదినువాఁడనియు. ఉక్తః = చెప్పఁబడియె.

ఈశార్చనావర్జనభోజ్యమన్నం కీటంమలంతత్కుణపంవదంతి. బహిష్కృతస్స ర్వజనైశ్చపాపీఘోరాన్ ప్రయాయాన్నరకాన్ సమస్తాన్.

ఈశార్చనావర్జనం = శివారాధనమునువదలి. భోజ్యం = భుజింపబడు. అన్నం అన్నమును. కీటం = కీటమునుగాను. మలం = మలమునుగాను కుణపం = శవమునుగా ను. వదంతి = చెప్పుచున్నారు. పాపీ = అట్టియన్నమునుదినుపాపాత్ముఁడు. సర్వజనైః సమస్తజనులచే. బహిష్కృతః = బహిష్కరింపఁబడినవాఁడై. ఘోరాన్ = భయంకరము లైన. సమస్తాన్ = సమస్తములగు. నరకాన్ = నరకములను. ప్రయాయాత్ = పొందును.

వహ్నిప్రవేశోవరముగ్రశస్త్రైర్వధోవరం సాధుమలస్యభుక్తిః = నేశార్చ నాయాంవిరతిర్భవేత్తత్సంసారచక్రేభ్రమతోనవద్యే.

వహ్నిప్రవేశః = అగ్నియందుజొచ్చుట. వరం = శ్రేష్ఠమైనది. ఉగ్రశస్త్రైః = భయంకరములగు శస్త్రములచేత. వధః = హత్యయు. వరం = శ్రేష్ఠమైనది. మలస్య = మలముయొక్క భుక్తిః = భోజనము. సాధు = శ్రేష్ఠమైనది. సంసారచక్రే = సంసార చక్రమునందు. భ్రమతః = పరిభ్రమించు. నరస్య = మనుజునకు. ఈశార్చనాయాం = శివలింగార్చనయందు. విరతిః = ఉపేక్ష. వరిష్ఠా = శ్రేష్ఠమైనది. న = కాదు.

అపిప్రాణాపదం ప్రాప్యనత్యాజ్యం లింగపూజనం ప్రాణాపదం = ప్రాణాంతమగుఆపత్తును, ప్రాప్యాపి = పొందియును, లింగపూజనం. శివలింగపూజనము, నత్యాజ్యం = విడువతగినదిగాదు, అనియీవిధమున, అకరణేప్రత్యవాయ జనకత్వమును జెప్పువచనములు గలిగియుండుటవలనను శివలింగపూజనిత్యమైనది. ముక్తిమూలత్వాత్ = మోక్షమునకు హేతువగుటవలనను, శివలింగపూజ, యాచరించదగినది.

శివారాధనకుముక్తి ప్రదత్వము, సూతసంహితయందు. అసారసంసార వనాంతరాళేత్రితాపఘర్మేభ్రమతోజనస్య । శివార్చనాకల్పలతాపురస్తాత్సంసారసంతాపహరీచనాన్యా ॥

అసారసంసార వనాంతరాళే = శుష్కమగు సంసారకానన మధ్యంబున త్రితాపఘర్మే = తాపత్రయమనువేసవియందు, భ్రమతః = పరిభ్రమించు, జనస్య = నరునకు, శివార్చనాకల్పలతా = శివారాధనమనుకల్పలత, సంసార, సంతాపహరీ = సంసారమువలననగు సంతాపమును హరింపజేయు నదియగు, అన్యా = ఇతరమైనది, న = లేదు.

భక్త్యాయశ్శివమర్చయేదనుదినం, లింగేసమాప్నోతిః స దానానాంతపసాం త్రివిష్టపమహాతీర్థాప్లుతీనాం ఫలం, పాపాన్యాశువినాశ్యశంకరగణశ్రైష్ఠ్యంసమాప్నోత్యసౌ విజ్ఞానాత్పరిహృత్య మోహమఖిలం జ్ఞానంపరంగచ్ఛతి.

యః = ఎవ్వడు, భక్త్యా = భక్తిచేత, లింగే = లింగమునందు, శివం = శివుని, అనుదినం = ప్రతిదినంబును, అర్చయేత్ = పూజించుచుండునో, సః = ఆనరుడు, దానానాం = సమస్తదానములయొక్కయు, తపసాం = సమస్తతపస్సులయొక్కయు, త్రివిష్టపమహాతీర్థాప్లుతీనాం = స్వర్గంగాది సమస్తతీర్థస్నానములయొక్కయు, ఫలం = ఫలమును, సమాప్నోతి = పొందుచున్నాడు, అసౌ = ఈమనుజుడు, ఆశు = శీఘ్రముగా, పాపాని = పాపములను, వినాశ్య = నశింపజేసి, శంకరగణశ్రైష్ఠ్యమును, సమాప్నోతి = పొందుచున్నాడు, విజ్ఞానాత్ = విజ్ఞానమువలన, అఖిలం = సమస్తమగు, మోహం = మోహమును, పరిహృత్య = పరిహరించి, పరం = ఉత్కృష్టమగు, జ్ఞానం = జ్ఞానమును, గచ్ఛతి = పొందుచున్నాడు, అని యిట్లు చెప్పంబడుటచేతను సుప్రసిద్ధమైనది.

సర్వాశిష్టాదృతత్వాత్ = సమస్తశిష్టులచేతను, ఆదరించబడుటవలన వైదికైః =

వైదికులచేతను ప్రత్యహం = ప్రతిదినంబును త్రికాలం = మూడుకాలములయందును, లింగపూజనం = లింగపూజ. కార్యంచేయతగినది.

శివారాధనకు సర్వశిష్టానుష్ఠితత్వము. భారతమునయానుశాసనిక పర్వమునందు యస్యబ్రహ్మాచవిష్ణుశ్చత్వంచ శక్రసహామరైః. అర్చయధ్వేసదా లింగం తస్మాచ్ఛ్రేష్ఠత మోహికః.

మహేశక్ర ఓయింద్రుడా. యస్య = ఏద్దేవుని యొక్క...లింగం = లింగమును. బ్రహ్మాచ = బ్రహ్మదేవుడును. విష్ణుశ్చ = విష్ణువును. అమరైః = దేవతులతోడ త్వంచ = నీవును సదా = ఎల్లపుడు. అర్చయధ్వే = పూజించుచుంటిరో. తస్మాత్ = ఆశివునికంటె. శ్రేష్ఠతమః = శ్రేష్ఠుడు. కః = ఎవ్వడు. అని చెప్పంబడియున్నది.

స్కాందమున. శివతత్వసుధానిధియందు. బ్రహ్మావిష్ణుమహేంద్రాశ్చలోకపాలాశ్చదేవతాః. విద్యాధరాగుహ్యకాశ్చ గంధర్వాశ్చాపికింనరాః. రాక్షసాదానవాదైత్యా వశిష్ఠాద్యామహర్షయః. లింగార్చనంప్రకుర్వంతి సదాకాలంద్విజోత్తమ. లింగార్చనరతా ఏతేమానుషేషుతుకాకథా.

బ్రహ్మవిష్ణుమహేంద్రాశ్చ = బ్రహ్మవిష్ణుమహేంద్రులును. లోకపాలాశ్చ = లోకపాలురును. దేవతాః = దేవతులును. విద్యాధరాః = విద్యాధరులును. గుహ్యకాః = గుహ్యకులును. గంధర్వాః = గంధర్వులును. కిన్నరాః = కిన్నరులును. రాక్షసాః = రాక్షసులును. దానవాః = దానవులును. దైత్యాః = దైత్యులును. వశిష్ఠాద్యాః = వశిష్ఠుడు మొదలగు. మహర్షయః = మహర్షులును, సదాకాలం = సమస్తకాలములయందును లింగార్చనం = లింగారాధనమును. ప్రకుర్వంతి = చేయుచున్నారు. ఏతే = వీరలు. లింగార్చనరతాః = లింగార్చనాతత్పరులు. మానుషేషు = మానవులయందు. కాకథా = ఏమివాతఙ. అని చెప్పంబడినది.

ఈవిధమున నే. శిష్టాస్సర్వే శివంప్రపన్నాః అనుయుపన్యాసమునందు. శిష్టులందరు శివారాధనపరులుగానుదాహరింపబడిరి. గావునన ందుజాడవలయు.

వైదికులచేయాచరించదగినది యనగాన వైదికులుయాచరించకున్నను. వైదికులకత్యావశ్యకమనియభిప్రాయము.

శ్లో॥ స్మృతి తంత్రపురాణేష్వబాధ్యత్వపరివర్జనాత్.
దేహావసానపర్యంతమాజ్ఞాచేశినతత్త్యజేత్॥ ౧౮.

అర్థము॥ స్మృతితంత్రపురాణేషు = స్మృతులయందును. తంత్రములయందును. పురాణములయందును. అబాధ్యత్వపరివర్జనాత్ = అబాధ్యత్వమువర్జించబడుటవలనను

దేహావసానపర్యంతం = దేహాంతమురదకు. ఆశౌచేపి = ఆశౌచమందునను. తత్ = ఆరాధనమును. నత్యజేత్ = విడువతగదు.

పరాశరస్మృతియందు శైవందేవార్చనం యస్యయస్యచాగ్నిపరిగ్రహః. బ్రహ్మచారియతీనాంచశరీరేనాస్తిసూతకం.

యస్య = ఎవనికి శైవం = శివసంబంధమగు దేవార్చనం = దేవారాధనముగలదో. యస్య = ఎవనికి అగ్నిపరిగ్రహః = శ్రౌతాగ్న్యుపాసనముగలదో వారికిని బ్రహ్మచారియతీనాంచ = బ్రహ్మచారులయొక్కయు యతులయొక్క శరీరే = శరీరమునందు సూతకం = సూతకమునాస్తి = లేదు. అని చెప్పంబడినది.

సిద్ధాంతాగమమునందు లింగార్చనరతానారీ సూతకేవారజస్వలా. రవిరగ్నిర్యథావాయుః కోటికోటిగుణశ్శుచిః.

లింగార్చనరతా = శివలింగారాధనపరురాలగు నారీ = స్త్రీ సూతకేవా = ప్రసవించినదిగానిరజస్వలా = రజోవతిగానిరవిః = సూర్యుడునుఅగ్నిః = అగ్నిహోత్రుడువాయుః = వాయుదేవుడు యథా = ఎట్లు శుచిః = పవిత్రమైనవారలో తథా = అట్లుకోటికోటిగుణః = కోటికోట్లగుణములుగా శుచిః = పవిత్రమైనది.

శివపురాణమునందుజాతకేమృతకేవాపినత్యాజ్యంశివపూజనం.

జాతకే = జాతాశౌచమందుననను మృతకే = మృతాశౌచమందునను శివపూజనం = శివరాధనము నత్యాజ్యం = విడువతగినదిగాదు అని చెప్పంబడినది.

ఇందుచే శివారాధనమువిషయమై జాతకాదులు బాధకములుగావని సిద్ధాంతీకరింపబడినది.

శ్లో॥ విహితత్వాచ్చ వేదేషు పురాణాదిషుసర్వశః.
కర్మసంసిద్ధికారత్వాన్మోక్షోపాదకత్వతః॥ ౧౯
శ్లో॥ విముక్తిఫలకత్వాచ్చ నిత్యత్వాచ్ఛిష్టసంమతేః.
శైవష్షడక్షరోనిత్యంజప్యస్స్యాచ్ఛ్రుతివర్త్మనా॥ ౨౦ .

అర్థము॥ వేదేషు = వేదములయందు విహితత్వాత్ = విధింపబడుటవలనను శైవః = శివసంబంధమగుషడక్షరః = షడక్షరమహామంత్రము శ్రుతివర్త్మనా = శ్రుతిమార్గనిష్ఠులకు జప్యః = జపించదగినది. స్యాత్ = అగును.

యజుర్వేదమునందు తన్నమఇత్యుపాసీత = తత్ = శివశబ్దితమగుపరం బ్రహ్మను నమఇతి = నమస్కారపూర్వకముగా ఉపాసీత = ఉపాసించతగినది. అని చెప్పంబడుటచేతను.

బృహజ్జాబాలమునందు ఓమితిహ్యగ్రేవ్యాహరేన్నమఇతిపశ్చాచ్ఛివాయేత్యుపరి

రత్రయం॥ ఓమితి=ఓంఅని అగ్రే=మొదలువ్యాహరేత్=చెప్పవలసినది. నమఇతి=నమః అని పశ్చాత్=వెనుక చెప్పవలసినది. తతః=అనంతరము శివాయేతి=శివాయఅనిఅక్షరత్రయం=మూడక్షరములను వ్యాహరేత్=చెప్పవలసినది, అని చెప్పంబడుటచేతను శైవషడక్షరమునకు విధిస్పష్టమైనది.

ఋగ్వేదమునను నమోభిర్గృణీమసి త్వేషం రుద్రస్యనామ, ఏతం=ఈ రుద్రస్య=రుద్రుని యొక్క నామ=నామమును నమోభిః=నమస్కారములచేత గృణీమసి=చెప్పుచుముగాక అని మొదలుగా విశేషముగా ప్రశంసింపబడినది.

పురాణాదిషు=పురాణాదులయందు సర్వశః=సర్వవిధముల విహితత్వాత్=విధింపబడుటవలనను శైవషడక్షరముజపించదగినది.

స్కాందమున బ్రహ్మోత్తరఖండమునందు అగస్త్యరామాదిభిరాదృతత్వాదముష్యమంత్రస్యచవైదికత్వాత్, పరస్యతత్త్వస్యచవాచకత్వాన్నమశ్శివాయేతి సదాజప్యం, అగస్త్యరామాదిభిః=అగస్త్యమహర్షియు శ్రీరామచంద్రుడు మొదలగువారలచేత ఆదృతత్వాత్=ఆదరించబడినది యగుటవలనను అముష్య=ఈ మంత్రస్య=మంత్రము వైదికత్వాత్=వేదములయందు చెప్పంబడినది యగుటవలనను పరస్య=తత్త్వస్య=పరతత్త్వమునకు వాచకత్వాత్=అభిధాయకమగుటవలనను నమశ్శివాయేతి=నమశ్శివాయఅని సదా=ఎల్లపుడు జప్యం=జపించుము అనివిధింపబడినది.

శివతత్త్వసుధానిధియందును నామ్నోస్తియావతీశక్తిః పాపనిర్హరణేద్విజ। తావత్పాపానికర్తుంవాశక్తః కోవాకలౌయుగే.

హేద్విజ=ఓవిప్రుడా నామ్నః=శివనామమునకు పాపనిర్హరణే=పాపములనణచుటయందు యావత్=ఎంతటి శక్తిగలదో. తావత్పాపాని=అన్నిపాపములను కర్తుం=చేయుటకు కోవా=ఎవ్వడు శక్తః=సమర్థుడు అని మొదలుగాని శేషముగాప్రశంసింపబడినది.

హరివంశమునందునను. భాస్వత్త్రిపుండ్రంభసితైస్సితస్సన్మౌనీజటీవల్కలవాన్ముకుందః। నిరంతరం చేతసిచంద్రచూడం విచింతయన్ పంచజజాపవర్ణాన్॥

భాస్వత్త్రిపుండ్రః=ప్రకాశించుచున్న భస్మత్రిపుండ్రముగలవాడును, భసితైః=భస్మములచేత, సితః=తెల్లనైనవాడును, మౌనవంతుడును, జటీ=జడలను ధరించినవాడును, వల్కలవాన్=నారచీరల ధరించినవాడునగు, ముకుందః=శ్రీకృష్ణమూర్తి, నిరంతరం=ఎడతెగకుండునటుల, చేతసి=చిత్తమునందు, చంద్రచూడం=శివుని, విచింతయన్=ధ్యానించువాడై, పంచ=ఐదగు, వర్ణాన్=వర్ణములను జజాప=జపించెనని, శైవపురాణము ప్రశంసింపబడినది.

కర్మసంసిద్ధికారిత్వాత్=కర్మసంసిద్ధికరమైనది యగుటవలనను, శైవపక్షరము జపించతగినది.

శ్రు॥ యదస్యకర్మణోత్యరీరిచం యద్వాన్యూన మిహాకరం. అగ్నిష్టత్స్విష్టకృద్విద్వాన్ సర్వంస్విష్టం సుహుతంకరోతుమే

అస్య=ఈ, కర్మణః=కర్మకు, అత్యరీరిచం=అధికముగా నాచరించితినో. ఇహ=ఈకర్మయందు, యత్=ఏది, న్యూనం=తక్కువగా, అకరం=చేసితినో. స్విష్టకృత్=స్విష్టకృత్తగు, అగ్నిః=రుద్రుడు, తత్=ఆ, సర్వం=సమస్తమును, స్విష్టం=స్విష్టమైనదానిగాను, సుహుతం=సుష్ఠుగా హోమము చేయబడినదిగాను, కరోతు=చేయుగాక అనుటచే, న్యూనాధిక కర్మలో ప్రాయశ్చిత్తముగా రుద్రనామస్మరణ మే చెప్పంబడినది.

స్విష్టకృత్తు రుద్రుం డెటులనంటివేని యజుస్సునందు దేవావైయజ్ఞాద్రుద్రమంతరాయన్ సయజ్ఞమవిధ్యత్తం దేవా అభిసమగచ్ఛంతకల్పతాంన ఇదమితితేబ్రువన్ స్విష్టంవైన ఇదంభవిష్యతియదిమంరాధయిష్యామ ఇతితత్స్విష్టకృతస్స్విష్టకృత్వం.

దేవావై=దేవతులుయజ్ఞాత్=యజ్ఞమునుండిరుద్రం=రుద్రుని అంతరాయన్=తప్పించిరిసః=ఆరుద్రుడుయజ్ఞం=యజ్ఞమునుఅవిధ్యత్=వేధించినవాడాయెతం=ఆరుద్రుని దేవాః=దేవతలు నః=మాకు ఇదం=ఈయజ్ఞము కల్పతాం=కల్పించబడుగాక ఇతి=అని అభిసమగచ్ఛంత=అభిగమనము జేసినవారైరి ఇమం=ఈరుద్రుని ఆరాధయిష్యామః=ఆరాధించితిమేని ఇదం=ఈయజ్ఞము నః=మనకు స్విష్టం=స్విష్టమైనది భవిష్యతి=కాగలదు ఇతి=ఇలాగని తే=ఆదేవతులు అబ్రువన్=పలికిరి అనిచెప్పంబడి యుండుటచే స్విష్టకృత్తురుద్రుడేయని యేర్పడినది.

స్విష్టకృద్ధోమమే కర్మన్యూనాధిక ప్రాయశ్చిత్తార్థముగా జెప్పబడినదిగావున స్విష్టకృద్ధోమము చెప్పబడని ప్రదేశమునందు స్విష్టకృత్తగు రుద్రునినామస్మరణమే యాచరణీయమని సిద్ధించినది.

మాంగళ్యాపాదకత్వతః = మాంగళ్యాపాదకమగుటవలనను శైవపక్షరము జపించదగినది.

మంత్రశాస్త్రమునందు శవర్ణమునకు శుభప్రదత్వంబును వకారమునకు సమృతబీజత్వంబును చెప్పంబడినది.

వాయుసంహితయందు అథవానంతకల్యాణ గుణైకనిధిరీశ్వరః. శివఇత్యుచ్యతేసద్భిశ్శివతత్త్వార్థకోవిదైః.

అథవా—లేకున్న అనంతకల్యాణగుణైకనిధిః=అనంతకల్యాణ గుణమణిగణాకరుండగు ఈశ్వరః=సర్వేశ్వరుడు శివతత్త్వార్థకోవిదైః=శివతత్త్వ

మునెరింగిన సద్భిః=సత్పురుషులచే ఉచ్యతే=చెప్పంబడునని ప్రశంసింపంబడినది.

ఇందు శ్రీశివనామమునకు మాంగళ్యాపాదకత్వము గనుపరచబడినది.

ముక్తిప్రదత్వాత్=ముక్తిప్రదముగావునను తారత్వాత్=తారకమగుటవలనను శైవమత్సరముజపించదగినది.

జాబాలవేదాంతమునందు అథ హైనం బ్రహ్మచారిణ ఊచుః=కింజప్యే నామృతత్వంనో బ్రూహీతి సహోవాచయాజ్ఞవల్క్యః శతరుద్రీయేణేతి అమృతస్య వానామధేయాని ఏతైర్హవా అమృతో భవతి.

అథ=అనంతరము బ్రహ్మచారిణః=బ్రహచర్యస్థులు ఏనం=ఈయాజ్ఞవల్క్యుని కింజప్యేన=ఏద్దానిజపముచే అమృతత్వం=ముక్తిగలుగునో దానిని నః=మాకు బ్రూహి=చెప్పుమాయని ఊచుః=పలికిరి సః=ఆయాజ్ఞవల్క్యుడు శతరుద్రీయేణేతి=శతరుద్రీయాధ్యాయముచేతననియును ఏతాని=ఇయ్యవి అమృతస్య=అమృతునియొక్క నామధేయాని=నామధేయములు ఏతైర్హవా=ఈనామధేయములచే అమృతః=ముక్తుడు భవతి=అగుచున్నాడు ఇతి=అని ఉవాచ=పలికెను అనిచెప్పంబడుటచే ముక్తిప్రదమున్న ప్రసిద్ధమైనది.

అథర్వశిఖయందు తత్తారం అనియు నమశ్శాధ్యాయమునందు నమస్తారాయ అనియు శివనామముగా చెప్పంబడుటచేతను బృహజ్జాబాలమునందు శైవమత్సరమునకు తారకసంజ్ఞ చెప్పంబడుటచేతను శివనామమే తారకమని వేద వేదాంత ఘంటాఘోషముగ సుప్రసిద్ధమైనది.

నిత్యత్వాత్=నిత్యమగుటవలనను శైవమత్సరముజపించదగినది.

అథర్వణసంహితయందు ఏకాదశకాండమున ప్రథమానువాకమునందు పంచసప్తసప్తములగుమూడు ఖండములయందు ముప్పదియొక్క మంత్రములుగల శ్రీరుద్రసంహితగలదు అందుపదునేడవమంత్రము.

సహస్రాక్షమతిపశ్యం పురస్తాత్ రుద్రమస్యంతం బహుధావిపశ్చితం నోపారమజిహ్వయేయమానం.

సహస్రాక్షం=అనంతములగునేత్రములుగలిగినట్టియు అతిపశ్యం=సర్వంబునతిమించిచూచునట్టియు అస్యంతం=సర్వమును గ్రసించునట్టియు విపశ్చితం=సర్వజ్ఞుడగు రుద్రం=రుద్రుని జిహ్వయా=నాలుకచేత ఈయమానం=ఉచ్చరించుచు నోపారం=ఉపరమించకుందుముగాక యనివ్యతిరేకముగా శివభజనవిరామమునకు నిషేధమునునిరూపించుచూ ప్రకృతమగు శివనామ జపమునకు నిత్యతను నిరూపించినారు.

శిష్టసమ్మతేః = శిష్టులయొక్క సమ్మతివలనను శైవపంచాక్షరము జపించదగినది.

స్కాందమున అగస్త్యరామాదిభిరాదృతత్వాత్ అని మొదలుగా అగస్త్యమహర్షి శ్రీరామచంద్రప్రభృతులచే పరిగ్రహించబడినట్లు చెప్పబడినది.

హరివంశమునందు ఘాస్వాస్త్రిప్రంత్రః అని మొదలుగా పంచజపాపవర్గ అను పర్యంతము శ్రీకృష్ణునిచే శైవపంచాక్షరముజపించబడినట్లు చెప్పబడినది.

భారతమునందు అనుశాసనికమునందు కృష్ణద్వైపాయనుడు కపిలుడు చారుశీర్షుడు వాల్మీకి జామదగ్న్యుడు విశ్వామిత్రుడు దేవలుడు గృత్సమదుడు మొదలగువారు శివనామజపనిష్ఠులుగా నిరూపింపబడిరి.

ఇందుచే శైవషడక్షర మంత్ర జపానుష్ఠానతత్పరుల సేకులు గనుపరచంబడిరి.

మొదటినుండి గనుపరచంబడిన హేతువులచే శ్రుతిమార్గానుగులకు శైవషడక్షర మవశ్యానుష్ఠేయమని సిద్ధాంతీకరింపబడినది.

శ్లో॥ ఆమ్నాతత్వాన్నిగమే నిత్యత్వాన్ముక్తికృత్త్వతః।
బిల్వపత్రైస్సమర్చ్యం స్యాచ్ఛివలింగమనారతం॥౨౧॥

అర్థము। నిగమే=వేదమునందు ఆమ్నాతత్వాత్=చెప్పంబడుటవలనను శివలింగం=శివలింగము బిల్వపత్రైః=బిల్వదళములచేత సమర్చ్యం=అర్పించదగినది

శ్రు॥ త్రిసుపర్ణమయాచితం బ్రాహ్మణాయదద్యాత్. యే బ్రాహ్మణాస్త్రిసుపర్ణం పఠంతి తే సోమం ప్రాప్నువంతి.

అయా=లక్ష్మీదేవిచేత చితం=వ్యాప్తమైన త్రిసుపర్ణం=కీటచ్ఛిద్రాద్యనాక్రాంతములగు మూడుదళములుగలబిల్వమును బ్రాహ్మణాయ=శివునికొరకు దద్యాత్=ఇవ్వవలసినది. అశబ్దము విష్ణువాచకముగావున ఆయనగా లక్ష్మీదేవియనియర్థము చెప్పబడినది లక్ష్మీదేవిచేవ్యాప్తమైనది యనగా తవవృక్షోఽథబిల్వః అని బిల్వములక్ష్మీగృహమని చెప్పంబడినది.

త్వం దేవేషు బ్రాహ్మణః అనియీ మొదలగు శ్రుతిప్రామాణ్యముచేత బ్రాహ్మణశబ్దము శివునిబోధించును యే=ఏ బ్రాహ్మణాః=బ్రాహ్మణులు త్రిసుపర్ణం=బిల్వమును పఠంతి=స్తుతిచేయుచున్నారో తే=వారు సోమం=ఉమాసహాయుడగుశివుని ప్రాప్నువంతి=పొందుచున్నారు అనుటచేనాక్షేపము లేదను.

వాజిశ్రుత్యుపాయతతో బిల్వ ఉదతిష్ఠత్ ఆదిత్యం వెద్దానినుండిజనించెనో అద్దానినుండే బిల్వముజనించెనని బిల్వము సూర్యునకును సజన్యముగా వ్యవహరింపబడినది.

నిత్యత్వాత్ = నిత్యమగుటవలనను బిల్వ పత్రములచే శివలింగము పూజింపదగినది.

శివతత్త్వసుధానిధియందు యోనకుర్యాద్బిల్వదళైరర్చనం-శంకరస్యతు శతాయుః పురుషోవాపి తస్యజన్మనిరర్థకం.

యః=ఎవ్వఁడు బిల్వదళైః=బిల్వదళములచేత శంకరస్య=శివుని యొక్క అర్చనం=పూజను నకుర్యాత్=చేయకుండునో శతాయుః పురుషోవాపి=నూరేండ్లు గలమనుజుడైనను తస్య=వానియొక్క జన్మ=జన్మము నిరర్థకమైనది బిల్వ పత్రవిహీనాయాపూజానిష్ఫలాభవేత్.

బిల్వపత్రవిహీనా బిల్వపత్రములులేని యా=ఏపూజగలదో సా=ఆపూజనిష్ఫలా=నిష్ఫలమైనది భవేత్=అగును అనియీప్రకారము బిల్వపత్రములచే పూజింపనివానినింద చెప్పఁబడుటచే నిత్యత్వముని రూపింపఁబడినది.

ముక్తికృత్త్వతః=ముక్తికారియగుటవలనను బిల్వపత్రములచే శివలింగమర్చింపవలయు.

బహుజన్మార్జితైః పుణ్యైర్బిల్వపత్రార్చనం లభేత్ బిల్వపత్రార్చనం కృత్వాపునర్జన్మభాఙ్నభవేత్ శుష్కైః పర్యుషితైర్వాపివనైర్వా బిల్వదళైరపి పూజయేద్గిరిజానాథంముచ్యతే సర్వపాతకైః సత్యంపునస్సత్యంసత్యంబిల్వపత్రార్చనంపరం బిల్వపత్రార్చనేనైవపునర్జన్మనవిద్యతే.

బహుజన్మార్జితైః=అనేకజన్మములయందు సంపాదించబడిన. పుణ్యైః=పుణ్యములచేత. బిల్వపత్రార్చనం=బిల్వపత్రార్చనమును. లభేత్=పొందును. బిల్వపత్రార్చనం=బిల్వపత్రార్చనమును. కృత్వా=చేసి. పునః=మరల. జన్మభాక్=జన్మముపొందువాడు. నభవేత్=కానేరడు. శుష్కైః=ఎండినవియయినను. పర్యుషితైర్వాపి=రోజులుగడచినవియయినను. బిల్వదళైః—బిల్వదళములచేత. గిరిజానాథం=శివుని. పూజయేత్—పూజించినచో. సర్వపాతకైః—సమస్తపాతకములచేత. ముచ్యతే—విముక్తుడగు. సత్యంసత్యంపునస్సత్యం—మున్మాటి నిజము. బిల్వపత్రార్చనం—బిల్వముచే పూజించుట. పరం—శ్రేష్ఠమైనది. బిల్వపత్రార్చనేనైవ—బిల్వపత్రములచే పూజించుటచేతనే. పునర్జన్మ—పునర్జన్మము. నవిద్యతే—లేదు.

అని యీప్రకారము ముక్తిసాధకత్వము కనుపరచఁబడినది.

ఈ చెప్పంబడిన హేతువులచే బిల్వపత్రార్చనమవశ్యని షేయమనినిరూపింపబడినది.

శ్లో॥ రుద్రపీతంపిబేదిత్యాదిశ్రుతేశ్శాసనాత్పరం।
అసమర్పితస్యగర్హ్యత్వాదభోజ్యత్వవిధానతః॥ ౨౨॥

శ్లో॥ అదీక్షితపరత్వేః తన్నిషేధగిరామపి।
నిర్మాల్యస్యనహేయత్వం కింత్వదీక్షావతాంభవేత్॥ ౨౩॥

శ్లో॥ చండాధికారవత్త్యేవలింగేతస్యాః షేధతః।
తదభావాచ్చబాణాదౌ నిర్మాల్యంసేవ్యమాస్తికైః॥ ౨౪॥

అర్థము॥ రుద్రపీతంపిబేదిత్యాదిశ్రుతేః=రుద్రపీతంపిబేత్ అనియీ మొదలగుశ్రుతియొక్క. శాసనాత్=శాసనమువలన. ఆస్తికైః=ప్రామాణికులచే. నిర్మాల్యం=నిర్మాల్యము. సేవ్యం=సేవించదగినది.

శ్రు॥ రుద్రభుక్తంభుంజీత. రుద్రపీతంపిబేత్. రుద్రాఘ్రాతంజిఘ్రేత్ । రుద్రభుక్తం=రుద్రునిచేభుజింపబడినప్రసాదమును భుజింపవలయు. రుద్రపీతం=రుద్రునిచేపానముచేయబడిన తీర్థమును. పిబేత్=పానముచేయవలయు. రుద్రాఘ్రాతం=రుద్రునిచేతనాఘ్రాణింపబడినపుష్పాదులను. జిఘ్రేత్=ఆఘ్రాణించవలెను అని యర్థము. ఇందుచే రుద్రోపభుక్తమేసేవించదగినదనియు వేదాంతములయందుగనుపరచబడినది.

అసమర్పితస్య=శివునకు సమర్పించనిపదార్థము. గర్హ్యత్వాత్ = నింద్యమగుటవలనను. అభోజ్యత్వవిధానతః=అభోజ్యత్వమువిధింపబడినదిగావునను. నిర్మాల్యమునుసేవించదగినది.

కామికమునందు పత్రంపుష్పంఫలంతోయమన్నపానాద్యమౌషధం। అనివేద్యభుంజీతభగవంతంసదాశివం॥ పత్రం=పత్రంబును. పుష్పం=పుష్పంబును. ఫలం= ఫలంబును. తోయం=ఉదకంబును. అన్నపానాద్యం=అన్నపానాదులును. ఔషధం=ఔషధంబును. భగవతం=భగవంతుడగు. సదాశివం=సదాశివునకు. అనివేద్య=నివేదించక. నభుంజీత=భుజించదగదు. అని నిషేధింపబడియున్నది.

శివపురాణమునందును, శంభోర్నిర్మాల్యకంశుద్ధంభుంజీయాత్సర్వతోద్విజః । అన్యదేవస్యనిర్మాల్యం భుక్త్వాచాంద్రాయణంచరేత్॥ శుద్ధం=నిర్మలమును. శంభోః =పరమేశ్వరునియొక్క. నిర్మాల్యకం=నిర్మాల్యమును. సర్వతః=అంతటను. ద్విజః = ద్విజుడు. భుంజీయాత్=భుజించవలయును. అన్యదేవస్య=దేవాంతరునియొక్క. నిర్మాల్యం నివేదితమును. భుక్త్వా=భుజించి. చాంద్రాయణం=చాంద్రాయణమును. చరేత్=చరించవలయును. అని [illegible] శివనివేదిత

ముగానిది అపరిశుద్ధమనియు, దేహాంతరనిర్మాల్యమైనను భుజించతగదని చెప్పంబడి యున్నది.

తన్నిషేధగిరామపి=శివనిర్మాల్యమును నిషేధించువాక్యములును అదీక్షితపక్షే న=దీక్షారహితవిషయమగుటచేతనూ. దీక్షితులకు నిర్మాల్యము సేవించదగినది.

కామికమునందు మల్లింగధారిణో లోకే దేశికా మత్పరాయణాః। మదేకశరణాస్తేషు భోజ్యం నైవాన్యజంతుషు॥ లోకే=లోకమునందు మల్లింగధారిణః=నాయొక్క లింగము ను ధరించినవారును. మత్పరాయణాః=నాయందుభక్తులునుగలరో. తేషు=వారలయందు. భోజ్యం=మదర్పితము భోజనార్హమైనది. అన్యజంతుషు = ఇతరులయందు. నైవ= భోజనార్హము కాదు.

శివపురాణమునందు నిర్మాల్యం నిర్మలం శుద్ధం నిర్మలత్వాదనిందితం । తస్మాదభోజ్యం నిర్మాల్యమశుద్ధై రశివాత్మకైః । జిహ్వాచాపల్యసంయుక్తః శివసంస్కారవర్జితః॥ శివనిర్మాల్యభోజీచేద్రౌరవం నరకం వ్రజేత్॥

నిర్మాల్యం=నిర్మాల్యము. నిర్మలం=నిర్మలమైనది. శుద్ధం = పవిత్రమైనది. నిర్మలత్వాత్=నిర్మలమగుటవలన. అనిందితం=అనవద్యమైనది. తస్మాత్=అందువలన. అశివాత్మకైః =అమంగళాత్ములగు. అశుద్ధైః=అపవిత్రులగువారలచే. నిర్మాల్యం= నిర్మాల్యము. అభోజ్యం=అభోజ్యమైనది. జిహ్వాచాపల్యసంయుక్తః=జిహ్వా చాపల్యముతోగూడిన, శివసంస్కారవర్జితః=శివసంస్కారరహితుడు. శివనిర్మాల్యభోజీచేత్=శివనిర్మాల్యమును భుజించెనేని. రౌరవం=రౌరవమును. నరకం=నరకమును. వ్రజేత్=పొందును. అని యీమొదలగు వచనములచే శివనిర్మాల్యనిషేధము దీక్షారహిత విషయమని యేర్పడినది.

చండాధికారవతి=చండీశాధికారముగల. లింగేఏవ=లింగమునందే. తస్య= ఆనిర్మాల్యముయొక్క. నిషేధతః=నిషేధమువలనను. బాణాదౌ = బాణాదిలింగములయందు. తదభావాత్=అచండాధికారము లేనుగావునను. ఆస్తికైః = ఆస్తికులచేత. నిర్మాల్యం=నిర్మాల్యము. సేవ్యం=సేవించదగినది.

సిద్ధాంతాగమమునందు. చండీశాధికృతిర్యత్ర న సేవేత తదర్పితం ; యత్ర=ఎచ్చట, చండీశాధికృతిః=చండీశునకధికారముగలదో. తదర్పితం=అందుసమర్పించబడిన. వస్తుజాతము. నసేవ్యం=సేవించదగదు. అని చెప్పబడియున్నది,

సిద్ధాంతాగమమునందే, బాణలింగే చ శైలే లోహే రత్నలింగే స్వయంభువి। ప్రతిమాసు చ సర్వాసు న చండో ధికృతో భవేత్॥ బాణలింగే=బాణలింగమునందును. చశైలే=శిలాలింగమునందును. లోహే=లోహకృతమగులింగమునందును. రత్నలింగే=రత్ననిర్మితమగు లింగమునందును. స్వయంభువి=స్వాయంభువమునందును. సర్వాసు = సమస్తములగు

ప్రతిమాపన=ప్రతిమలయందును. చండః=చండీశుడు. అధికృతః=అధికారముగలవాడు. నశాధాడు. అనుటచే చరలింగాదులయందు చండాధికారము లేదు గావున తత్ప్రయుక్తమగు నిషేధమునకు ప్రవృత్తియే లేదు.

ఇందుచే శివనివేదిత మే పగ్రాహ్యమని సిద్ధాంతీకరింపబడినది.

శ్లో॥ శివభావవతాంముక్తేస్సజ్జన్మన్యేవలాభతః।
శివఏవతుసంసేవ్యోముక్తికామైరనారతం॥ ౨౫॥

అర్థము॥ శివభావవతాం=శివభక్తిగలజనులకు. తజ్జన్మన్యేవ = అజన్మయందే. ముక్తేః=ముక్తియొక్క. లాభతః=లాభముగలదుగావున. ముక్తికామైః = ముక్తిగోరువారలచే. అనారతం=ఎల్లప్పుడును. శివఏవ=శివుడే. సంసేవ్యః=సేవింపదగినవాడు.

శివపురాణమునందు. అన్యభావస్తుయోమర్త్యస్సోపిజన్మత్రయాత్పరం. శివభావస్తుయోమర్త్యస్తస్మిన్ జన్మనిముచ్యతే. యః=ఏ. మర్త్యః=నరుడు. అన్యభావః = ఇతరదేవతాభక్తిగలవాడో. సోపి=ఆనరుడును. జన్మత్రయాత్ = మూడుజన్మములకంటె. పరం=పిదప, ముచ్యతే=ముక్తుడగు, యః=ఏనరుడు, శివభావః=శివభక్తి గలవాడో సః=ఆనరుడు, తస్మిన్ =ఆ, జన్మని, జన్మయందే, ముచ్యతే=ముక్తుడగునని చెప్పంబడి.

ఇందుచే శివభక్తిగలవానికినీజన్మమునందేముక్తిగలదని యేర్పడినది,

శ్లో॥ యదాచర్మవదిత్యాదిశ్రుత్యాన్యంసముపాసతాం।
ముక్తేరలాభతశ్చాపి శివస్సేవ్యోముముక్షుభిః॥ ౨౬॥

అర్థము। యదాచర్మవదిత్యాదిశ్రుత్యా=యదాచర్మవత్ అని యీ మొదలగు శ్రుతిచే, అన్యం=ఇతర దేవతను, సముపాసతాం=ఉపాసించువారలకు, ముక్తేః= ముక్తియొక్క, అలాభతశ్చాపి=లాభములేనుగావునను, ముముక్షుభిః = మోక్షముగోరువారలచే, శివః=శివుడు, సేవ్యః=సేవించదగినవాడు,

శ్రు। యదాచర్మవదాకాశం వేష్టయిష్యంతిమానవాః। తదాశివమవిజ్ఞాయ, దుఃఖస్యాంతోభవిష్యతి॥ యదా=ఎప్పుడు, మానవాః=మానవులు, ఆకాశం=ఆకాశమును, చర్మవత్=తోలునువలె, వేష్టయిష్యంతి=చుట్టగలరో - తదా=అప్పుడు, శివం=శివుని, అవిజ్ఞాయ=తెలుసుకొనక, దుఃఖస్య=దుఃఖముయొక్క, అంతః=అంతము, భవిష్యతి = కాగలదు అని యీ ఆకాశమును తోలునువలెచుట్టినప్పుడు శివునితోపని లేక ముక్తి గలుగనని రెండు యసంభవమను నభిప్రాయముచే శ్రుతి చెప్పినదాయె,

శ్లో॥ భవంభవ్యాయసేవంతే-భవ్యామైభవేతర।
[illegible] ॥ ౨౭॥

అర్థము॥ భవం=భవుని, భవ్యముకొరకు, సేవంతే=సేవించుచున్నారు. భవేత
రం=భవునికంటెనితరుని. అభవ్యాయ=అభవ్యముకొరకే. సేవంతే=సేవించుచున్నారు.
శివాయ=మంగళముకొరకు. శివం=శివుని, అర్చంతే=పూజించుచున్నారు. శివేతరం=
శివునికంటెనన్యుని. అశివాయైవ=అమంగళముకొరకు. అర్చంతే=పూజించుచున్నారు.
ఈయర్థము న్యాయసిద్ధమయినది.

శ్లో॥ యేషాంస్యాదీశ్వరో దేవస్సేశ్వరాస్తేప్రకీర్తితాః।
యేషాంతు నేశ్వరో దేవః కథితాస్తేనిరీశ్వరాః॥ ౯॥

అర్థము॥ యేషాం=ఎవరలకు, ఈశ్వరః=ఈశ్వరుడు. దేవః=దేవుడో. తే=
వారు. సేశ్వరాః=సేశ్వరులని. ప్రకీర్తితాః=చెప్పబడిరి, యేషాం=ఎవరలకు, ఈశ్వ
=ఈశ్వరుడు. దేవః=దేవుడు, న=కాడో, తే=వారు, నిరీశ్వరాః=నిరీశ్వరులుగా. కథి
తాః=చెప్పబడినదు, ఈయర్థంబునుక్తన్యాయసిద్ధంబెయగును.

శ్లో॥ బ్రాహ్మణామానవాదేవం బ్రాహ్మణంసముపాసతే।
కులహీనాస్తుసేవంతే కులహీనంనరాస్సురం॥ ౧౦॥

అర్థము. బ్రాహ్మణాః=బ్రాహ్మణులగు. మానవాః=మానవులు, బ్రాహ్మణం=బ్రా
హ్మణుడగు, దేవం=శివుని, సముపాసతే=ఉపాసించుచున్నారు, కులహీనాః=కులహీనుల
నరాః=నరులు-కులహీనం--కులహీనుడగు. సురం=దేవుని, సేవంతే=సేవించుచున్నారు.

శ్రు॥ త్వందేవేషుబ్రాహ్మణోఽస్యహంమనుష్యేషుబ్రాహ్మణోవై బ్రాహ్మణ ము
పధావతిఉపత్వాధావామి, త్వం=నీవు, దేవేషు=దేవతులయందు, బ్రాహ్మణః=బ్రాహ్మణు
డవు, అసి= అగుదువు.అహం=నేను. మనుష్యేషు=మానవులయందు, బ్రాహ్మణః=
బ్రాహ్మణుడను, బ్రాహ్మణోవై=బ్రాహ్మణుడైతే. బ్రాహ్మణం=బ్రాహ్మణుని, ఉపధా
వతి= సేవించుచున్నాడు,అందువలన, త్వాం=నిన్ను, ఉపధావామి=సేవించుచున్నాను.

శివపురాణమునందు బ్రాహ్మణోభగవాన్ రుద్రఃక్షత్రియఃపరమోహరిః। పితా
మహస్తువైశ్యస్స్యాద్వృషలస్తుపురందరః। భగవాన్=భగవంతుడగు. రుద్రః=రుద్రుడు
బ్రాహ్మణః=బ్రాహ్మణుడు. హరిః=విష్ణువు. క్షత్రియః=క్షత్రియుడు. పితామహస్తు
బ్రహ్మదేవుడైతే. వైశ్యః=వైశ్యుడు. పురందరః=ఇంద్రుడు. వృషలః=శూద్రుడు. స్యా
త్=అగును.

ఇందుచే రుద్రుడేబ్రాహ్మణుడనియు విష్ణ్వాదులు క్షత్రియులనియు చెప్పంబడె
పైన చెప్పంబడినశ్రుతియునుమానవులయందు బ్రాహ్మణులు దేవతులయందుబ్రాహ్మణుడౌ
రుద్రునినే సేవించవలయునని స్పష్టము గా చెప్పంబడినది. అట్లు సేవించకనతిక్రమించిన

యోవై స్వాందేవతామతియజతే ప్రస్వాయై దేవతాయైచ్యవతే నపరాం ప్రాప్నోతి పాపీయాన్ భవతి॥ యోవై=ఎవడు. స్వాం=స్వీయమగు. దేవతాం=దేవతను. అతియజతే=అతిక్రమించుచున్నాడో. స్వాయై=తనదియగు. దేవతాయై=దేవతవల్ల. చ్యవతే=భ్రష్టుడగుచున్నాడు. పరాం=రెండవదేవతను. నప్రాప్నోతి=పొందడు. పాపీయాన్=పాపవంతుడు. భవతి=అగుచున్నాడు. అనగా తనదేవతను తాను విడుచుటచేతన నాదేవతవిడుచు. రెండవదేవతయు.

కులక్రమాగతయైన స్వదేవతను వదలిన యీచంచలచిత్తుడు నాయందు స్నేహగుణములవాడగు నాయనునభిప్రాయముచేత నితనిని పరిగ్రహించనేరదు. ఇందుచేతను భయభ్రష్టుండై పాపిష్ఠుండగునని వేదములయొక్క యభిప్రాయము.

శ్లో॥ జన్మమృత్యుప్రహాణాయ జన్మమృత్యుహరశ్శివః ।
అజాతఇతితుశ్రుత్యాసేవ్యోభవతి నిత్యదా॥ ౩౧

అర్థము॥ జన్మమృత్యుప్రహాణాయ=జన్మమృత్యువులయొక్క నాశముకొరకు. జన్మమృత్యుహరః=జన్మమృత్యువుల నపహరించు శివః=శివుడు. అజాతఇతిశ్రుత్యా=అజాత ఇత్యేవం అనుశ్రుతిచే. నిత్యదా=ఎల్లపుడును. సేవ్యః=సేవించదగినవాడు. భవతి=అగుచున్నాడు.

నిగమములయందు భూతస్యజాతఃపతిరేకఆసీత్ అనుటచే. బ్రహ్మదేవునకు జన్మ చెప్పబడెనది. జాతోబృహన్నభిపాతితృతీయం అనుటచే విష్ణునకు జన్మచెప్పంబడినది. తమ జననమరణముల పోగొట్టుకొననేరని యీదేవతలు లోకులయొక్క జననమరణముల నెట్లనూ పోగొట్టజాలరుగావున జననమరణ రహితుడగు రుద్రుడే సేవ్యుడని శ్రుతి చెప్పుచున్నది.

శ్రు॥ అజాతఇత్యేవంకశ్చిద్భీరుః ప్రపద్యతే. రుద్రయత్తెదక్షిణంముఖం తేన మాంపాహినిత్యం॥ భీరుః=జననమరణములవలన భయమునొందిన. కశ్చిత్=ఒకానొకడు. అజాతఇతి=జన్మరహితుడవని. తే=నీయొక్క. దక్షిణం=దక్షిణమగు. ముఖం=అఘోరముఖమును ప్రపద్యతే=పొందుచున్నాడు. తేన=ఆముఖముచేత. మాం=నన్ను. నిత్యం=ఎల్లప్పుడును. పాహి=రక్షించుమా యని యర్థము. ఇందుచే జననమరణములనుండి భయముబొందినవారలు శివునినే యుపాసించవలయునని స్పష్టీకరించబడినది.

శ్లో॥ శివంతునసమం బ్రూయాద్దేవైరన్యైః కదాపివా ।
సమం బ్రువన్ సనిపాత్యశ్చాప్రస్రుచోదిత వర్త్మనా॥ ౩౨

అర్థము॥ శివం=శివుని. అన్యైః=ఇతరులగు. దేవైః=దేవతులతోటి. సమం=సమానునిగా. కదాపివా=ఎప్పటికిని. న బ్రూయాత్=చెప్పవగదు. సమం=సమునిగా. బ్రువన్=చెప్పునట్టి. సః=అనరుడు. శాస్త్రిచోదితవర్త్మనా=ధర్మశాస్త్రములయందు చెప్పంబడిన విధానముచే. నిష్కార్యః=ప్రాయశ్చిత్తము చేయదగినవాడు.

సూతసంహితయందు॥ కేచిదద్వైతమాశ్రిత్య బిడాలప్రతిమానరాః । రుద్రేణసామ్య మన్యేషాంప్రవదంతి విమోహితాః॥ బిడాలప్రతిమాః=గోడమీదిపిల్లి వాటమునసున్న. కేచిత్=కొందరు. నరాః=నరులు. అద్వైతం=అద్వైతమును. ఆశ్రిత్య=ఆశ్రయించి. విమోహితాః=మోహగ్రస్తులై. రుద్రేణ=రుద్రునితోటి. అన్యేషాం=ఇతరదేవతులకు. సామ్యం=సామ్యమును. ప్రవదంతి=చెప్పుచున్నారు. అనియును.

ఖద్యోతోయది చండభాను సదృశస్తుల్యో హరిశ్శంభునా॥ ఖద్యోతః=మెరుగుడుపురుగు. చండభాను సదృశోయది=మధ్యాహ్నసూర్యునితో సమానమగునేని. హరిః=విష్ణు. శంభునా=శివునితోటి. తుల్యః= సమానుడగునని యీమొదలుగా విశేషించి సామ్యవాదము నిరాకరించబడినది.

శివపురాణమునందు యేమాంబ్రహ్మాదిభిస్తుల్యం యేత్వాంలక్ష్మ్యాదిశక్తిభిః । గురుంయేప్రకృతేస్తుల్యం సంస్మరంత్యల్పబుద్ధయః । తేషాంపాపానినశ్యంతి శివరాత్రిప్రజాగరాత్॥ యే=ఎవరలు. మాం=నన్ను. బ్రహ్మాదిభిః=బ్రహ్మాదులతోడ. తుల్యం= సమునిగాను. యే=ఎవరలు. త్వాం=నిన్ను. లక్ష్మ్యాదిశక్తిభిః=లక్ష్మ్యాదిశక్తులతోడ. తుల్యాం=సమురాలినిగాను. యే=ఎవరలు. గురుం=గురువును సర్వజనమునకు. తుల్యం=సమునిగాను. సంస్మరంతి=స్మరించుచున్నారో. తేషాం=వారలయొక్క. పాపాని=పాతకములు. శివరాత్రిప్రజాగరాత్=శివరాత్రియందు జాగరణము జేయుటవలన. నశ్యంతి=నశించుచున్నవి. అని శివునకు నితరదేవతాసామ్యమును దలచినందుకు శివరాత్రి జాగరము ప్రాయశ్చిత్తముగా జెప్పంబడినది.

శ్లో॥ గాయత్రీప్రణవాద్యామే యజ్ఞైచాధికృతానరాః।
తద్బోధ్యం తేతుసేవంతేఽనధికారయుతానవై॥ ౩౨

అర్థము॥ యే=ఏ. నరాః=నరులు. గాయత్రీప్రణవాదౌ= గాయత్రియు. ప్రణవము అగ్నిహోత్రము వీనియందును యజ్ఞేచ=యజ్ఞమునందును అధికృతాః= అధికారము గలవారలో. తే=ఆనరులు. తద్బోధ్యం=ఆగాయత్రీ ప్రణవాదులకు.బోధ్యుడగుశివుని. సేవంతే=సేవించుచున్నారు. అనధికారయుతాః=ఆగాయత్ర్యాదులయందు. అధికారము లేనివారు. నసేవంతే=సేవించరు.

గాయత్రీమహామంత్రము భర్గపదాంకితమై భర్గదేవతాకమైనదిగావున గాయత్రియం దధికారముగలవారు భర్గుని యుపాసించుట న్యాయము.

పాతంజలయోగశాస్త్రమునందు క్లేశకర్మ విపాకాశయైరపరామృష్టః పురుషవిశేష ఈశ్వరః । క్లేశకర్మవిపాకాదులచే పరామర్శింపబడని యొకపురుషుండు. ఈశ్వరుఁడ నంబరగునని చెప్పి. తస్యవాచకః ప్రణవః తస్య=అశివునకు. వాచకః=అభిధాయకము. ప్రణవః=ప్రణవము. అని చెప్పంబడినది.

శివపురాణమునందును. ప్రణవోవాచకస్తస్య శివస్యపరమాత్మనః॥ తస్య=ఆ. పరమాత్మనః=పరమాత్మయగు. శివస్య=శివునకు. ప్రణవః=ప్రణవము. వాచకః=అభిధాయకము. అనిచెప్పంబడియున్నది గావున నీప్రణవమునం దధికారముగలవారు ప్రణవవాచ్యుఁడగుశివుని యుపాసించుట న్యాయము.

శ్రు॥ త్వమగ్నేరుద్రః హేఅగ్నే=ఓ అగ్నీ త్వం=నీవు. రుద్రః=రుద్రుడవు శ్రు.రుద్రోవా ఏషయదగ్నిః, ఏషః=ఈ. అగ్నిః=అగ్ని. రుద్రోవా=రుద్రుఁడు. అనియును చెప్పంబడుటచే అగ్న్యుపాసనయందధికారులును శివునియుపాసించుట న్యాయము.

శ్రు॥ ఆ వోరాజా నమధ్వరస్యరుద్రం॥ అధ్వరస్య=యజ్ఞమునకు. రాజానం=అధిపతియగు. రుద్రం=రుద్రునియనియు. శ్రు॥ అయంసోమః కపర్దినే॥ అయం=ఈ. సోమః=క్రతువు. కపర్దినే=రుద్రునికొఱకనియు. శ్రు॥ గాథపతిం మేధపతిం రుద్రం అనుచోట మేధపతియనగా పశుమేధాదులగు యజ్ఞములకు పతియగు రుద్రుఁడనియును, యజ్ఞాధిపతి రుద్రుఁడుగా జెప్పంబడియె.

ఇమంపశుంపశుపతేతే అద్యబధ్నామి. హేపశుపతే=ఓపశుపతీ. ఇమం=ఈ. పశుం=పశువును. తే=నీకొఱకు. అద్య=ఇపుడు. బధ్నామి=బంధించుచున్నాను- అనుటచేను శివుడు యజ్ఞమునం దారాధనీయుఁడుగా జెప్పంబడియుండుటచేత నట్టియజ్ఞమునం దధికారముగలవారు శివునిసేవింతురనుట ప్రసిద్ధము.

శ్లో॥ విద్యానాథస్యకరుణా యస్మిన్విద్యోతపూర్ణశః।
విద్యాశివమయీతస్మిన్నేతరస్మిన్కదాచన॥ ౩౩॥

అర్థము॥ విద్యానాథస్య=పరమేశ్వరునియొక్క. కరుణా=దయ. యస్మిన్=ఎవనియందు పూర్ణశః=సంపూర్ణముగా. విద్యోత=కలుగునో. శివమయీ=శివసంబంధమగు. విద్యా=జ్ఞానము. తస్మిన్=వానియందు. విద్యోత=ఉండును. ఇతరస్మిన్=శివానుగ్రహములేని వానియందు కదాచన=ఎప్పటికిని. నవిద్యోత=కలుగనేరదు.

స్వంగమతాతపఘ్నం । స్కాందపయద్దామద్వాదశాంకరేణ దక్షిణాధార్యం ద్విజహత్యాశుద్ధ్యై ॥ సప్తాననం భోగపతిప్రధానం తస్తేయాదిశుద్ధిం విదధాతి సద్యః । వైనాయకం హ్యష్టముఖం సువర్ణాం స్పష్టం గురుస్త్రీగమనాద్యఘఘ్నం ॥ నవాననం భైరవ ఏవ దేవో భుక్తిం చ ముక్తిం శివతుల్యశక్తిం । కరోతి వామేన కరేణ ధార్యం హత్యాయుతానామపి హన్తి కోటి ॥ హరిస్స్వయం యద్దశవక్త్రబీజం పిశాచభూతగ్రహరాక్షసాంశ్చ । వేతాళసర్పప్రతిరోధిసింహవ్యాఘ్రాదిశంకాం వినిహన్తి శీఘ్రం ॥ ఏకాదశాస్యం దశకైకరుద్రం ధార్యం శిఖాయాం విధినాననవద్యే । నరాశ్వమేధాయుత వాజపేయ సహస్ర గోదాన ఫలేన తుల్యం ॥ యద్వక్త్రైర్దశద్వయేన కథితం తద్భాస్కరీయం స్మృతం వర్ణస్థం రవితుష్టికృద్ధయమఖైర్గోమేధపుణ్యైస్సమం । సర్వం సిధ్యతి భోగభాగ్యమఖిలం భ్రూణార్య మాతాపితృభ్రాతృ స్త్రీవధదోషవిశుద్ధ్యతి దధన్నాస్మాత్పరం విద్యతే ॥ రుద్రాక్షమేకం శిరసావిధార్యం త్రింశన్మాలాం విదధీత మూర్ధ్ని । ద్వాత్రింశకైః కంఠతలేన ధార్యం శిఖాధార్దస్తుహితద

తము కాలాగ్ని రుద్ర దేవతాకమైనదియు, ఆత్మహత్యాభక్షణాది దోషముల శమింపజేయునదియు నగును. ఆరు ముఖములుగల రుద్రాక్షమునకు కుమారస్వామి అధిదేవతయగు దీనిని కుడిచేతియందు ధరించునెడ బ్రహ్మహత్యతొలంగును. ఏడుముఖములుగల రుద్రాక్షము సర్పరాజగు వసంతుండధి దేవతగాగలది. ఇది స్వర్ణస్తేయాది దోషముల నశింపజేయును. ఎనిమిదిముఖములుగల రుద్రాక్షమునకు వినాయకుండధి దేవతయగును. ఇయ్యది గురుతల్పగమనాది దోషముల తొలంగజేయును. తొమ్మిదిముఖములుగలది భైరవుండె అధిదేవతగా గలది. ఇది భుక్తిముక్తుల నొసంగును. దీనిని ఎడమచేతియందు ధరించునెడ వేలకొలది హత్యలనైన హరించును. పదిముఖములుగల రుద్రాక్షము సాక్షాత్తు విష్ణురూపమే యగు ఇయ్యది భూతప్రేత పిశాచములవల్లను, సర్పవ్యాఘ్ర సింహాది క్రూర జంతువులవల్లను గలుగు భయమును హరించును. పదునొకండుముఖములుగలదానికి ఏకాదశరుద్రులు అధిదేవతలగుదురు. దీనిని శిఖయందు ధరించునెడ సర్వయాగఫలంబును, సహస్ర గోదానఫలంబును నొసంగును. పండ్రెండు ముఖములుగల రుద్రాక్షమునకు సూర్యుండధి దేవతయగును. దీని ధరింప సకల భోగభాగ్యంబులును సర్వయాగఫలంబును గలుగుటయగాక భ్రూణహత్యాది సకలదోషంబులును దొలంగును.

ర్ణమాలా ॥ కంఠేధృతా యేన ధృతాక్షమాలా । జప్త్వాప్నుయాద్యజ్ఞ సహస్రపుణ్యం ॥ రుద్రాక్షాష్టశతేన యేనకలితా మాలాసదాధార్యతే । కంఠేతేనలభేత్ క్షణాత్ క్షణమహాపుణ్యం మహేజ్యాధికం । వింధ్యాద్రావామ్లకః ఖరోపి యదభూద్రుద్రాక్షభారావహః కైలాసే శతకల్పమీశసదృశో హాహాసపద్యోగణః । శ్వేతంరక్తమథాపిపీత మసితం విప్రాదికానాం స్మృతం రుద్రాక్షస్యలభేద్యథాతథమిదం ధార్యంశిఖాయాంశిరే । కంఠేకర్ణయుగోపవీతహృదయే ప్యాబధ్యరూప్యాదిభిః పంచార్ణప్రణవాత్మకాఖ్యమనుభిర్ముక్తోనవద్యోభవేత్ ॥ స్నానేవా జపహోమయోర్వ్రతవిధౌ దేవార్చనాదానయో దీక్షాశ్రాద్ధకయోః క్రతౌ సభసితో రుద్రాక్షమాలాధరః ॥ కుర్యాత్కర్మచవైదికంచ సకలం స్యాదక్షయంతత్ఫలం నోచేద్వ్యర్థమిదం భవత్యయమహోపాపేనవద్యే ధ్రువం ॥ కేచిజ్జాతకశావయోర్జలమలోత్సర్గేచ సంగేస్త్రియా శృద్ధాంవక్షసి మాలికాం నదధతే స్యాయుః క్షయస్స్యాదితి । పూజ్యంయోజ్యముఖాముఖేన సదృశో ముక్తాప్రవాళాసితైః సౌవర్ణై

---

ఒక్క రుద్రాక్షమును శిఖయందును, ముప్పదియారు రుద్రాక్షములను శిరమునందును, ముప్పదిరెండు రుద్రాక్షములను మెడయందును ధరించువానికి వేయియజ్ఞముల ఫలములభించును. ఎనిమిదినూర్ల రుద్రాక్షలుగల మాలికను మెడయందు ధరించువాని పుణ్యము వచింపనలవిగాదు. వింధ్యపర్వతంబుల రుద్రాక్షముల బరువు మోయు గార్దభంబును కైలాసంబున ప్రమథగణంబై యుండెను. తెలుపు, ఎఱుపు పసుపువన్నెగల రుద్రాక్షములను బ్రాహ్మణులు మొదలగు నాలుగుజాతులవారును క్రమముగా ధరింపవలయును శిఖయందును, కరమునందును, కంఠమునందును, కర్ణయుగమునందును. ఉపవీతస్థానమునందును, హృదయమునందును రుద్రాక్షములను వెండి, బంగారు రత్నములు మొదలగువానిలోఁ జేర్చి, పంచాక్షరి ప్రణవము మొదలగు మంత్రములతో ధరించువాఁడు ముక్తినొందును. మరియు, స్నానము, జపము, హోమము వ్రతము, దేవతార్చనము దానము, దీక్ష, శ్రాద్ధము యజ్ఞము మొదలగు కర్మములయందు భస్మరుద్రాక్షములను ధరింపవలయు. ఇట్లు ధరించువాని కక్షయఫలము చేకూరును. ధరింపకున్నయెడ వాని కర్మము వ్యర్థమగుటయు గాక వాఁడు పాపఫలంబు నొందును. కొందఱు జాతాశౌచములు మలమూత్రోత్సర్గములు, స్త్రీసంగమము, మొదలగు నపవిత్రసమయములయందు పవిత్రమగు

ర్మణి భిర్వా ధన్ముఖ ఫలం మన్త్రోన వద్యేత జేత్ । రుద్రాక్షం వపుషా ధరస్తది మృతశ్శ్వానోపి ముక్తో భవే చ్ఛ్వదిన్నం త్యమః పూర్తా కే శివ పురంగచ్ఛ్వస్సోపాయతే । కిం సూక్తైః బహుభి స్సమాత్రిక మిదం స్వాంగే సదా ధారక స్సంసారం నపునః క్రియాలిమనుజో వక్ష్యే నవద్యేతవ ॥ రుద్రాక్షద్రుమ పుష్పపల్లవ పుట స్సృష్టానిల స్పర్శనా ద్దూరస్థా స్తరవ స్తృణాన్యపిలతా యాంత్యక్షయం తత్ఫలం ॥ తత్పుణ్యద్రుమ జాతలక్షణమణిం బిభ్రత్వజస్రం నరో ముంచేత్సంస్మృతిబంధనాదితి పునశ్చిత్రం కిం చిత్రియే ॥ ఇత్యాదినా రుద్రాక్షధారణ మాహాత్మ్య మనంత ముక్తం ॥

బృహజ్జాబాలే యథాస్థానం భస్మనా త్రిపుండ్రం శ్వేతేనైవ ధృత్వా రుద్రాక్షాన్ శ్వేతాన్బిభృయాన్నత్ర సమ్మతిరితి తథా రుద్రాక్షజాబాలేపి ఓపక్రమా దుద్రాక్షాన్ ప్రశస్యాంతే బృహజ్జాబాల వదేవమంత్రాః పఠితాః ఏతేన బిభృయాదితి తద్ధరణస్య విధిర్బోధితః ॥ తథా రామరహస్యే రామమంత్ర పురశ్చరణ విధౌ చతుర్థాధ్యాయే ॥

---

రుద్రాక్షమాలికను ధరింపనొల్లక, రుద్రాక్షమాలికను గుచ్చునప్పుడు సుభములోఁజేర్చియు, అందు ముత్యములు, పవడములు, నీలములు, బంగరుపూసలు మొదలగు వానిం జేర్చియు ధరింపవలయును.

రోగమున నెవ్వండయిన ప్రాణవియోగ కాలమునందు శరీరమున రుద్రాక్షము ధరించి యొక్క శ్వాసమునైన విడిచి మృతినొందినను వాఁడు శివపురమునకుఁ జేరుఁగాని తిరుగ జన్మింప నేరఁడు. పలుమాటలేల? రుద్రాక్షమును సమంత్రకముగా శరీరమున నెప్పుడును ధరించువాఁడు మరల సంసారము నొందనేరఁడు.

రుద్రాక్ష వృక్షముయొక్క పుష్పపల్లవములమీదినుండి వచ్చు గాలి సోకినంతన దూరమునందుండు చెట్లు, తీవలు, తృణములును నక్షయఫలము నొందుచున్నవి. ఇక నా పుణ్యవృక్షమున జనించిన రుద్రాక్షము నెప్పుడు ధరించువాఁడు సంసారబంధమునుండి ముక్తినొందుననుట యేమిచిత్రము! అని యీ మొదలుగా రుద్రాక్షమహిమ అపరిమితముగాఁ జెప్పఁబడియెను.

బృహజ్జాబాలమునందు. విన్యుక్తస్థానములయందు తెల్లనిభస్మముతో త్రిపుండ్రములను ధరించి, తెల్లని రుద్రాక్షములను ధరింపవలయునని యున్నది. రుద్రాక్షజాబాలము

పద్మాక్ష తులసీకాష్ఠ రుద్రాక్ష కృతమాలయేతి రుద్రాక్షాణాంమాలా రామమంత్ర సాధనమిత్యపి గృహీతా॥ యద్యప్యత్రతులసీ కాష్ఠస్యస హనివేశః కృతః తథాపి తస్యాధార్యత్వాత్ రుద్రాక్ష సాహచర్యేణ పఠితస్యాపి రామమంత్ర సాధనత్వమనేన బోధ్యత ఇతిధ్యేయం॥ రుద్రాక్ష ధారణస్యాన్యత్ర విధానా దిహన కశ్చిద్విరోధః। అతఏవ సర్వజపార్థ త్వే గణనవినియోజ్యాక్ష మాలాపరిగణ నైదం పర్యప్రవృత్తాయా మక్ష మాలికాయా ముపనిషది॥ ప్రవాళమౌక్తిక స్ఫటిక రజతాష్టాపద చందన పుత్రజీవికాబ్జ రుద్రాక్షా ఇతి నతులసీ కాష్ఠస్య పరిగణనం। తథా బృహజ్జాబాలే, రుద్రాక్షానధికృత్య సప్తమ భస్మజ్యోతీ రుద్రాక్ష ఇతి ఏవం చతుర్భి రుపనిషద్భి రుపపాదితమితి శ్రౌతతా రుద్రాక్షధారణస్య సిద్ధా॥

నను విధీయతాం ప్రశస్యతాం చేదంనిగమేషు యదీదంస్యాన్నిత్యం తదీహాకస్యాదనివార్య మితిచేత్తదపి శ్రుతిషు నిరూపితం యథా। బృహజ్జాబాలోపనిషది॥ అష్టమ బ్రాహ్మణే తృతీయఖండే॥ అథ భు

---

నందును నిట్లే కలదు. ఇందు 'బిభృయాత్' అను లింజంతముచే రుద్రాక్షధారణము విధింపబడినది. మరియు రామరహస్యోపనిషత్తునందు. తామరపూసలు, తులసిపూసలు, రుద్రాక్షములు అను వానితో రచింపఁబడిన జపమాలతో రామమంత్రము జపింపవలయుననుటచే రుద్రాక్షమాలిక రామమంత్రమునకును సాధనమని తెలియుచున్నది. ఇందు తులసిపూసలు చేరియున్నను వానిని ధరింపఁగూడదు గాన రుద్రాక్షములతోఁ జేరియున్నప్పటికి యవి రామమంత్రజపమునకైనను సాధనములగునని యెఱుంగునది. రుద్రాక్షధారణమన్ననో పలుచోట్ల విధింపఁబడియున్నది గాన బాధకము లేదు.

ఈ కారణమువలనే సర్వమంత్రముల జపించుటకు నుపయోగించు నక్షమాలికలను జెప్పుటకై యేర్పడినదగు అక్షమాలికోపనిషత్తునందు, పవడములు, ముత్యములు, స్ఫటికములు, వెండి పూసలు, బంగరుపూసలు, మంచిగంధపుపూసలు, పుత్రజీవికాబీజములు, తామర పూసలు రుద్రాక్షములును జపమాలికకు నుపయోగించుట కలదు గాని యందు తులసిపూసలు చెప్పఁబడియుండలేదు. బృహజ్జాబాలమునందు. భస్మజ్యోతిసే రుద్రాక్షవని లదు. ఇటుల బృహజ్జాబాలము, రుద్రాక్షజాబాలము రామరహస్యము అక్షమాలికోపనిషత్తును నాలుగుపనిషత్తులయందు రుద్రాక్షపరీక్ష కలదు. గాన రుద్రాక్ష ధారణము శ్రౌ

సుడ్జాబాలో మహాదేవం సాంబం ప్రణమ్య పప్రచ్ఛ కిం నిత్యం బ్రాహ్మణానాం కర్మ కర్తవ్యం యదకరణే ప్రత్యవైతి బ్రాహ్మణ ఇత్యనేన నిత్యతయా బ్రాహ్మణానాం కిం కర్మ కర్తవ్యమితి ప్రశ్నము పస్యస్య యథాస్థానం భస్మనా త్రిపుండ్రం శ్వేతేనత్యక్త్వా తదుపరి రుద్రాక్షాశ్శ్వేతా వా ఽశ్వేతా వా నైవ తత్ర సమ్మార్గ ఇతి నిత్యతయా నుష్ఠే యధర్మేష్వేవాస్యాపి రుద్రాక్షధారణస్య పరిగణనా దస్యాకరణే ప్రత్యవాయజనకత్వరూప నిత్యవిధిత్వం సిద్ధమ్॥

నను రుద్రాక్షాః శ్వేతాశ్చ భృయాదితి శ్వేతానామేవ విహితతయా తాదృశానామి దానీ ముపలభ్యతయా విధిరయం నిష్ప్రయోజన ఇతిచే దుచ్యతే॥ విప్రే శుక్లాస్తు మృచ్ఛ్రేచే రక్తాః క్షత్రే విధీయతే । హరిద్రవర్ణా వైశ్యేతు శూద్రేకృష్ణాంవి నిర్దిశేదితి పరాశర మాధవీయగత వచన విహితాయా శ్వేతాయా శ్శౌచమృదస్తా దృగలాభే గుణలోపేచ ముఖ్యస్యేతి న్యాయేన యథాసంభవ మృత్తికాయాగ్రహణా॥ తేనైవ న్యాయేన తత్రాపి శ్వేతరుద్రాక్షాణామలాభేపి యథా

---

టిమని యేర్పడెనది

ప్ర. వేదమునందెన్నో విధులు కలవు. వానినన్నిటిం జేయ మనకలవియగునా? అవి నిత్యవిధులేని తప్పదు. రుద్రాక్షధారణము నిత్యవిధియని యెట్లు చెప్పబడినది?

ఉ. బృహజ్జాబాలమునందు బ్రాహ్మణుండే కర్మములను జేయమన్న ప్రత్యవాయమునొందునో ఆట్టి నిత్యకర్మము లెవ్వియని భుశుండి పరమేశ్వరు నడిగినట్లు ప్రశ్న చేసి, లేదనాతే భస్మమును విధ్యుక్తస్థానములయందు ధరించి తెల్లనివైనను కాకున్నను రుద్రాక్షములను తప్పక ధరింపవలయునని యుత్తరము చెప్పబడి యున్నది. ఇట్లు చేయకున్న ప్రత్యవాయము కలిగించు కర్మములయందే రుద్రాక్షధారణము చేర్పబడియెగాన నిత్యవిధియని నిశ్చయమగుచున్నది.

ప్ర. విధివాక్యమునందు తెల్లనిరుద్రాక్షములను ధరింపవలయునని యున్నది. అది యిప్పుడు దొరుక నేరవు? ఇక నల్లనివానిం ధరింప నేమి ఫలము?

ఉ. తెల్లని మృత్తికతో బ్రాహ్మణుండును, ఎఱ్ఱనిమృత్తికతో క్షత్రియుండును పచ్చని మృత్తికతో వైశ్యుండును, నల్లనిమృత్తికతో శూద్రుండును శౌచవిధిని నెరవేర్చవలయునని పరాశరమాధవీయమున నున్నను బ్రాహ్మణునకు తెల్లని మృత్తిక దొరకని

సంభవం రుద్రాక్షధారణస్యైవ న్యాయ్యత్వాత్ ॥ అతఏవ । విప్రాదీనాం క్రమాచ్ఛ్వేత రక్త పీతకృష్ణాసితం । తథాలాభేయథాలాభంధారణీయమ దూషితమితి శివపురాణవచన మపిసంగచ్ఛతే ॥ యత్తు త్వయోక్తం బ్రాహ్మణోబిభృయా దిత్యాదివచన విరుద్ధస్య తథాలాభేయథాలాభమిత్యాది వచనస్య ప్రమాణత్వమితి తదపి శ్రుత్యంతరాపరిజ్ఞానమూలం బృహజ్జాబాలోపనిషది ॥ అష్టమబ్రాహ్మణే తృతీయఖండే రుద్రాక్షాశ్శ్వేతావా అశ్వేతావా నైవతత్రతసమ్మర్శఇతి। భస్మజాబాలేపి ॥ రుద్రాక్షాన్ శ్వేతానేవ బిభృయాన్నతత్ర సమ్మర్శఇత్యనేనచ రుద్రాక్షేషు శ్వేతాశ్వేతవిమర్శనం వినా నిత్యతయాధార్యత్వస్య ప్రతిపాదనాత్ ॥ కించతంమాత్రిస్స్నిగ్ధా దృఢాస్స్థూలా ఇత్యాదినా తామ్రాదీనామపి విధానాత్ ॥ శ్వేతాదీనాం వృక్షపర్యాయత్వాచ్చ శ్వేతరుద్రాక్షాణామలభ్యత్వాత్తద్ధారణమను పపన్నమితి వాదో దుష్ట ఇతి స్పష్టం ॥

నచేదం శిష్టజనానుష్ఠితమితివాచ్యం సర్వజనానుష్ఠితత్వాత్తథాహి

చో॥ నల్లనిమృత్తికతోనైన శౌచవిధి తీర్చుకొనుట న్యాయమైయున్నది గాని తెల్లనిమృత్తికదొరకదన్యనని బ్రాహ్మణుడు శౌచవిధిని వదలుట యుక్తముగునా గుణములోపించినను ముఖ్యమును విడువగూడదను పూర్వమీమాంసా న్యాయమునుబట్టి తెల్లనిమృత్తిక దొరకని చో నల్లనిమృత్తికయు గ్రాహ్యమేయని యేర్పడును. ఈ న్యాయమునుబట్టియే తెల్లని రుద్రాక్షములు దొరకనప్పుడు నల్లని రుద్రాక్షములను ధరించుట యుక్తమని నిర్ణయమగును. కావుననే బ్రాహ్మణులు మొదలగువారు క్రమముగా తెలుపునన్నమొదలాగాగల రుద్రాక్షములను ధరింపవలయు. అట్టివి దొరకనిచో సదృశమైన ధరింపవలయునని శివపురాణమునగలదు.

ప. తెల్లని రుద్రాక్షములు దొరకున్నయెడ దొరకినవానిని ధరింపవలయునను శివపురాణవచనము తెల్లనివానినె ధరింపవలయునను శ్రుతికి విరుద్ధము గాదా?

ఉ. ఆ వచనము శ్రుతి విరుద్ధమైనది కాదు. రుద్రాక్షలు తెల్లని వైనను కాకున్నను దానియెడ విమర్శింపక లభించినవానిని ధరింపవలయునని బృహజ్జాబాలమునందు కలదు గాన రెండును సమానార్థకములే యగును. శ్రుతియందు రుద్రాక్షములెట్టివైనను వానిని నిత్యవిధిగా ధరింపవలయునని యున్నది. ఇదిగాక తెలుపు ఎరుపు మొదలగునవి చెట్ల

నచేదం శిష్టజనానుష్ఠితమితి వాచ్యం సర్వశిష్టజనానుష్ఠితత్వా
త్తథాహి రుద్రాక్షధారిణో మహర్షయ స్సనత్కుమార సనకనిదాఘ
కాత్యాయన దత్తాత్రేయ భరద్వాజ కపిలవశిష్ఠపైప్పలాదముఖాః రు
ద్రాక్షజాబాలాది షూపనిషత్సు ప్రశంసితాః తథాపాద్మేచ । అథరా
మగిరౌ రామః పుణ్యే గోదావరీతటే । భూతిభూషితసర్వాంగో రుద్రా
క్షాభరణైర్యుత ఇతి శ్రీరామచంద్రస్యాపి తద్ధారణం స్మృతం । సూ
తసంహితాయాం ॥ ఏతస్మిన్నంతరే శ్రీమాన్ మహాకారుణికోత్తమః ।
కృష్ణాజినోత్తరీయశ్చ ఆషాఢేనవిరాజితః ॥ భస్మోద్ధూళితసర్వాంగ శ్శుద్ధ
శిరస్త్రిపుండ్రధృక్ ॥ రుద్రాక్షమాలాభరణో జపన్ పంచాక్షరంము
దా । శిష్యైస్తాదృగ్విధైర్యుక్తో మహాత్మాస్వాయమాగత ఇతి ॥ సత్రావ
సానేసన్నద్ధా ఇతి ప్రస్తుత్య ఋషివర్ణనావసరే ॥ ఋషయోమృదవస్స్వ
స్థా స్సర్వద్వంద్వవివర్జితాః । రుద్రాక్షమాలాభరణా స్సితభస్మావకుం
ఠితాః । ఇతి విశిష్టధర్మగ్రహణార్థేన స్తావనీయాన్ ఋషీన్ ప్రస్తుత్య
భస్మోద్ధూళిత సర్వాంగా స్త్రిపుండ్రాంకిత మస్తకాః । రుద్రాక్ష మా

---

లోని భేదములు కాని రుద్రాక్షలలోని భేదము కానేరవు. కావుననే ఎర్రనివి గూడ ధరింపవలయునని విధింపబడుట గలదు.

ప్ర. రుద్రాక్షములను శిష్టులు ధరించినారా?

ఉ. సకల శిష్టులు ధరించిరి. సనత్కుమారుడును, సనకుడు నిదాఘుడును, కాత్యాయనుడు దత్తాత్రేయుడును, భరద్వాజుడు, కపిలుడు. వశిష్ఠుడు పైప్పలాదుడు మొదలగువారు రుద్రాక్షధారులని రుద్రాక్షజాబాలము మొదలగు నుపనిషత్తులలో గలదు. పద్మపురాణమునందు గోదావరియొడ్డుననున్న చిత్రకూటపర్వతమునందు శ్రీరామచంద్రుండు భూతిభూషిత సర్వాంగుండును, రుద్రాక్షమాలికాధరుండునై యుండెననుటచే శ్రీరామచంద్రుడు రుద్రాక్షముల ధరించెనని తెలియుచున్నది

సూతసంహితయందు । దయాశాలియు, కృష్ణాజినోత్తరీయుండును, పాలాశదండధారియు భస్మోద్ధూళితసర్వాంగుండును, శిరస్త్రిపుండ్రధారియు, రుద్రాక్షమాలాధరుండునునగు సూతుండు పంచాక్షరమంత్రము జపించుచు నిట్టిశిష్యగణముతో నింతలోన వచ్చెనని కలదు. దీనిబట్టి సూతుండును తచ్ఛిష్యులును భస్మరుద్రాక్షధారులని యేర్పడుచున్నది. మరియునందు. సత్రావసానమునకువచ్చిన మునీశ్వరులను వర్ణించి కొంతలో

లాభరణా జటావల్కల ధారిణ ఇతి॥ పురా శ్వేతాది రిష్యాం తామ
నయో మునిసత్తమాః। సంఖ్యాచ శతమే తేషాం సహస్రాద్వాదశ సంఖ్య
యా। తపతే భస్మ దిగ్ధాంగా స్త్రిపుండ్రాంకిత మస్తకాః। రుద్రాక్ష
మాలాభరణాః రుద్రారాధనతత్పరా। ఇత్యాదినా బహుషు పురాణే
షు బహవస్తద్ధారిణః ప్రశంసితా ఇతి మహతీయ మనుష్ఠాత్ప్రశంసా।
బృహజ్జాబాలోపనిషది॥ సమరనిదాఘః కాత్యాయన దత్తాత్రేయభర
ద్వాజ కపిలవసిష్ఠ పైప్పలాదైశ్చ కాలాగ్నిరుద్రం పరిసమేత్యోవాచ।
అథ కాలాగ్నిరుద్రః కిమర్థం భవతా మాగతమితి సహోవాచ రుద్రా
క్షధారణవిధిం సర్వే శ్రోతు మిచ్ఛామ ఇతి॥ అథ కాలాగ్ని రుద్రః ప్రో
వాచ॥ రుద్రస్యనయనాదుత్పన్నా రుద్రాక్షా ఇతి లోకేవ్యాఖ్యాయ
తే॥ అథవా సదాశివ స్సంహారకాలే సంహారంకృత్వా సంహారాక్షిం
ముకులీకరోతి। తన్నయనా జ్జాతా రుద్రాక్షఇతివ్యాఖ్యాయతే। తస్మా
ద్రుద్రాక్షత్వమితి॥ అథకాలాగ్నిరుద్రః ప్రోవాచత ద్రుద్రాక్షేవాగ్వ
మ్యాకృతే దశగోప్రదానే యత్ఫల మవాప్నోతి తత్ఫల మవాప్నోతి

రు ద్వంద్వదోషరహితులును, రుద్రాక్షమాలాధారులును భస్మాంగ గుంఠనపరులునని చె
ప్పఁబడియెను.

ఇదిగాక. ఉత్తమధర్మమును దెలిసికొనదలచిన మునుల నుద్దేశించి భస్మోద్ధూళి
తాంగులును, త్రిపుండ్రధారులును, రుద్రాక్షమాలాభరణులునని చెప్పఁబడియున్న
మరియు శ్వేతుడు మొదలుకొని పదివరకు నూటపండ్రెండుగురు ఋషులును భస్మరు
ద్రాక్షధారులును రుద్రారాధనతత్పరులునని యున్నది. ఇట్లనేక పురాణములయందు రు
ద్రాక్షధారులగు మహర్షులు పెక్కురు ప్రశంసింపఁబడియున్నారు.

బృహజ్జాబాలోపనిషత్తునందు. సమరుడు, నిదాఘుడు, కాత్యాయనుడు దత్తాత్రే
యుడు మొదలగు మహర్షులు కాలాగ్నిరుద్రునొద్దకరుదెంచి రుద్రాక్షధారణవిధి వి
న్నవించి యడుగ నగ్గేవుండిట్లనియెను. రుద్రుని నేత్రముల నుండి పుట్టినవి గాన రుద్రా
క్షములని చెప్పఁబడుచున్నవి. సదాశివుడు సంహారకాలంబున ఫాలనేత్రంబుచే జగము
ల సంహరించి యా ఫాలనేత్రంబు మూయగా నట్టి నేత్రంబునుండియు రుద్రాక్ష
ములు ప్రభవించెను. దానను రుద్రాక్షంబులని చెప్పఁబడుచున్నవి. రుద్రాక్షము
రుద్రాక్షముల మధ్యగింపగా పదిగోదానముల ఫలము కలుగును.

తత్ఫల మశ్నుతే ॥ సహమజ్యోతీ రుద్రాక్షీ ఉవాచ ॥ తద్రుద్రాక్షం కర్ణేస్పృష్టమిచ్ఛన్ శతగోప్రదాన ఫలంభవతి ॥ తద్రుద్రాక్షే కరయో ర్ధార్యమాణేసతి ద్విసహస్రగోప్రదానఫలం భవతి॥ రుద్రాక్షేకంఠేధార్యమాణేత్రిసహస్రగోప్రదానఫలం భవతి । రుద్రాక్షేకర్ణయోః ధార్యమాణేఏకాదశ సహస్రగోప్రదాన ఫలంభవతి॥ఏకాదశరుద్రత్వంగచ్ఛతి॥ శిరసి ధార్యమాణే కోటిగోప్రదానఫలంభవతి ॥ ఏతేషాంస్థానానాం కర్ణయోఃఫలంవక్తుం నశక్యమితి సహోవాచ ॥ అథసనత్కుమారః ప్రపచ్ఛ రుద్రాక్షస్య దానమస్త్యేవేతివా ఇతి ॥ అథకాలాగ్నిరుద్రః ప్రోవాచ అష్టశతరుద్రాక్షం దత్వా అష్టశతరుద్రాక్షం ధారయేత్ । భూతలయదానే యత్ఫలమవాప్నోతితత్ఫల మశ్నుతే ॥ సహమజ్యోతీ రుద్రాక్షీ ఉవాచ ॥ అథ కాలాగ్నిరుద్రం భగవంతం సనత్కుమారః పప్రచ్ఛ ॥ రుద్రాక్షసహస్రం క్రమేణ ధర్తుంవా శక్యంవా ఇతి ॥ అథకాలాగ్నిరుద్రః ప్రోవాచ ॥ రుద్రాక్షధారణా కర్తుమధివాసాది ప్రాణప్రతిష్ఠాం కృత్వా రుద్రాక్షం స్వర్షమేకంతు ధారయేత్ ॥ బ్రి

---

స్పృశింపగా నూరుగోదానములఫలము లభించును, రుద్రాక్షమును ధరింపగా సహస్రగోదానఫలము సంప్రాప్తమగును. రుద్రాక్షమును చేతులయందు ధరింపగా రెండువేల గోదానముల ఫలము దొరకును. రుద్రాక్షమును మెడయందు ధరింపగా మూడువేలగోదానముల ఫల మబ్బును. రుద్రాక్షములను చెవులయందు ధరింపగా పదునొకండువేల గోదానములకలనిఫలముసిద్ధించును. ఏకాదశరుద్రత్వంబునుపొందును. శిరంబునధరింపగాకోటిగోదానఫలము చేకూరును. ఈస్థానములలో చెవులయందు ధరింపకలుగు ఫలము వచింపనలవికాదు. ఎనిమిదినూర్లరుద్రాక్షములను దానముచేసి అన్నిరుద్రాక్షములను ధరించునెడ భూతలమునెల్ల దానము చేయగలుగు ఫలము లభించును. సహస్రరుద్రాక్షములను ధరించుటెట్లనిన రుద్రాక్షములకధివాసములు చేసి ప్రాణప్రతిష్ఠగావించి సహస్రరుద్రాక్షములను ఒక సంవత్సర కాలము ధరించునెడ బ్రహ్మత్వము వచ్చును. రెండు సంవత్సరములు ద్విసహస్రరుద్రాక్షలను ధరింపవిష్ణుత్వము గలుగును మూడు సంవత్సరములు మూడువేలరుద్రాక్షములను ధరింప సదాశివత్వము సిద్ధించును. వాడు పునరావృత్తిని పొందనేరడు. రుద్రాక్షమహిమంబు వచింప నలవికాదు. ఇది యొక్కటే జ్యోతిరూపమని వచించినట్లు కలదు.

ప్రాణత్యాగం గచ్ఛతి। ద్విసహస్రరుద్రాక్షం ద్వేవర్షే ధారయేత్ విష్ణుత్వంగచ్ఛతి॥ త్రిసహస్రరుద్రాక్షం త్రీణివర్షాణి ధారయేత్ సదాశివత్వంగచ్ఛతి॥ నసపునరావర్తతే। సహకోటిజ్యోతీ రుద్రాక్షేతి వాచ ఇతి॥

తథా స్కాందే। శంకరసంహితాయాం। రుద్రాక్షస్యాత్ర యా విప్రా రుద్రాక్షమితి కీర్తితః। రుద్రాక్షధారకశ్శంభుః పరిపూర్ణకటాక్షవాన్। రుద్రాక్షధారకాస్సర్వే రుద్రాకారాః ప్రకీర్తితాః। యస్యాన్త్యాజ్జన్మ చరమంతస్య రుద్రాక్షధారణే। త్రిపుండ్రధారణేచైవ పంచాక్షరజపే తథా॥ పరాశ్రద్ధాభవేత్పుంసామన్యేషాం దుర్లభా భవేత్। యస్యదేహేభవేదేకో రుద్రాక్షశ్శివభావకః। శివాలయంతు తద్దేహం సాక్షాచ్ఛంభుశ్శివస్స్వయం॥ నదేహేయస్య రుద్రాక్షాన త్రిపుండ్రస్యధారణం। శ్మశానమేవతద్దేహం తన్ముఖంగిరిగహ్వరం।

---

స్కాందమున శంకర సంహితయందు. రుద్రుని నేత్రములవలన జనించెను గాన రుద్రాక్షములని చెప్పఁబడుచున్నవి. రుద్రాక్షముల ధరించినవానికి రుద్ర పరమేశ్వరుఁడు పరిపూర్ణకటాక్షము కలిగియుండును. రుద్రాక్షములధరించినవారలందఱును రుద్రస్వరూపులగుదురు. ఎవ్వారల జన్మంబు చివరదైయుండునో వారలకు రుద్రాక్షధారణమునందును, భస్మత్రిపుండ్రధారణమునందును, పంచాక్షరజపమునందును నెక్కువశ్రద్ధకలిగియుండును, కాని యది తక్కినవారలకు లభింపనేరదు.

ఎవ్వని శరీరంబున నొక్క రుద్రాక్షము కలదో వాని శరీరము శివాలయంబును వాడు కేవలము రుద్రుండునగు. ఎవ్వని దేహంబున రుద్రాక్షలు భస్మ త్రిపుండ్రంబును లేవో వానిదేహము శ్మశానమువంటి యపవిత్రమైనదియు వాని నోరు కొండగుహవంటిదియు నగును. ఎవ్వఁడు రుద్రాక్షములను ధరించిన శైవులను శివరూపులనుజూచునో వాని కన్నులె సార్థకములైనవి గాన వాఁడె కన్నులుగలవాఁడని యెన్నఁబడును. మఱియు నెవ్వఁడు రుద్రాక్షధారులను మనుష్యమాత్రులనుగాఁ జూచునో అట్టివాఁడు చేయుపూజయు జపహోమాదులును వ్యర్థంబులగును. ఎవ్వఁడు రుద్రాక్షధారులను శివరూపులనుగా జూచునో వాఁడు సర్వవిధములగు తపంబులు చేసినవాఁడునగు. శివార్చకులు

రుద్రాక్షధారిణస్త్వేతాన్ పశ్యేద్యశ్శివభావతః। యస్యైతస్య సఫలే చక్షు ష్మత్తా తస్య చ। యస్తు రుద్రాక్షమాలాధారిణం మానుషత్వేన పశ్యతి। కృతం తేనార్చనం వ్యర్థం జపో హోమశ్చ నిష్ఫలః। యో వా రుద్రాక్షభూషాఢ్యం శివభావేన పశ్యతి। తేన తప్తం తపస్సర్వం కృతం తేన శివార్చనం। యస్తు రుద్రాక్షమణిభిః స్పృష్టతోయాభిషేచనః। గంగాస్నానం కృతం తేన తీర్థచర్యా కృతా పరా॥ రుద్రాక్షమేకం యో దద్యాచ్ఛివభక్తాయ భక్తితః। తస్య పుణ్యం వసుమతీం దత్త్వా వా శ్రోత్రియేషు సః॥ యో దత్తే మాలికాం భక్త్యాష్టోత్తరశతైర్యుతాం। కైలాసే స్వజనైస్సార్ధం మోదతే శివసన్నిధౌ। ఇత్యాదినా రుద్రాక్షమాహాత్మ్యమధికం ప్రతిపాదితం। తథాపి కేచిద్భస్మరుద్రాక్షధారణేన ప్రవర్తంతే। తత్కారణముక్తం భవిష్యత్పురాణే। పాపానామపి బాహుళ్యాద్దధీచస్య చ శాపతః। గౌతమస్య మునేశ్శాపాత్ శ్రౌతలింగం న రోచత ఇతి। ఆదిత్యపురాణే॥ దుర్వాససో మునేశ్శాపాత్ కుపితస్య మహాత్మనః। కణ్వశాపాద్భృగోశ్శాపాదుపమన్యోశ్చ శాపతః। దధీచస్య ము

---

శాసుగఁ జేసినవాఁడగుచున్నాఁడు. ఎవ్వఁడు రుద్రాక్షము స్పృశించిన జలమున స్నానము చేయునో వాఁడు గంగాస్నానము చేసినవాఁడును సకలతీర్థయాత్రలు నొనరించినవాఁడును నగు. శివభక్తునకొక్క రుద్రాక్షము నిచ్చువాఁడు శ్రోత్రియులకు సకల భూమండలము దానము చేయుటవలనఁ గలుగు ఫలము లభించును. నూటయెనిమిది రుద్రాక్షములుగల మాలికను శివభక్తునకొసంగువాఁడు కైలాసంబున శివసాన్నిధ్యంబున స్వజనులతోఁ గూడి సుఖమొందుచుండును. అని యీ విధమున రుద్రాక్షమాహాత్మ్య మధికముగా గలదు. అయినను గొందఱు భస్మరుద్రాక్షముల ధరింప విముఖులైయుండెదరు. దానికారణంబును భవిష్యత్పురాణంబునఁ గలదు. పాపాధిక్యమువలనను దధీచి గౌతమాదులశాపంబుల వల్లను వైదికచిహ్నములగు భస్మరుద్రాక్షములయొక్క ధారణము రుచింపనేరదని చెప్పబడెను.

ఆదిత్యపురాణమునందు కోపించిన దుర్వాసునియొక్క శాపమువల్లను, కణ్వునిశాపమువల్లను, భృగువిశాపమువల్లను, ఉపమన్యునిశాపమువల్లను, దధీచునిశాపమువల్లను, గౌతముని శాపమువల్లను దాక్షిణాత్యులలో పాపాత్ములగు విప్రులకు శివునియందును భస్మమునందును, రుద్రాక్షమునందును కొంచెమైనను శ్రద్ధ కలుగనేరదు. అనియున్నది.

మానవ పురాణమునందు. పూర్వము దుర్భిక్షకాలమున కలువురు విప్రులు గౌతము

నశ్యాపాత్ గౌతమస్య చశాపతః। విప్రాణాం దాక్షిణాత్యానాం శాపోపహ
త చేతసాం । శివేభస్మనిరుద్రాక్షే కించిచ్ఛ్రద్ధా న విద్యతఇతి॥ మానవేచ।
బ్రాహ్మణైశ్చపురా సర్వై గౌతమేన సురక్షితైః । విచార్య కార్యం సం
భూయ స్వదేశగమనోద్యతైః । గాం గ్రహ్మతా గౌతమేనేతి నిర్గుణైః పురుషా
ధమైః । కృత్రిమమిథ్యాభిశాపస్తు మహామోహవశేనతు ॥ తత్రస్ఫుత్వాన
మునిశ్శ్రీమాన్ గౌతమోమునిసత్తమః ॥ మహాక్రోధేన సంయుక్తశ్శ
శాప బ్రాహ్మణాధమాన్ ॥ యద్యత్తు రుద్ర సంబంధి తత్రతత్రాపి గు
ణినాః । భవతానున్ముఖాయూయం సర్వధా బ్రాహ్మణాధమాః॥ స్వా
ధ్యాయేచ జపేచైవ తథా ప్రవచనేపిచ। భవతానున్ముఖాయూయం సర్వ
ధా బ్రాహ్మణాధమాః ॥ శ్రుతిస్మృతిపురాణోక్తేష్వర్థేషు సకలేషుచ।
భవతానున్ముఖా యూయం సర్వధా బ్రాహ్మణాధమాః ॥ శంఖచక్రగ
దా పద్మ దండపాశాంకుశాదిభిః ॥ అంకితాశ్శ్రద్ధయా యూయం సర్వథా
బ్రాహ్మణాధమాః । వర్తులాశ్వత్థపత్రార్థ చంద్రశూలాదిలింగినః ।
భవత శ్రద్ధయాయుక్తా స్సర్వధా బ్రాహ్మణాధమాః ॥ అశ్వత్థపత్రలింగీన

---

నొద్దఁజేరి యమ్మహామునిచే సురక్షితులై యుండి పదంపడి కొంతకాలమునకు తమదేశ
ము సుభిక్షంబుగా నున్నదని విని స్వదేశ గమనోన్ముఖులై గౌతమమునిమీద నొక నెపముఁ
బోదలచి యందఱుచు జేరి దురాలోచనము గావించి కృత్రిమగోవును నిర్మించి యర్ధ్య
గౌతమునిమీది కనుప నమ్మునీంద్రుండా గోవును దర్భతోఁ గొట్టెను. అంత నాగోవు
లసైన్ద్రెల్ల గౌతముఁడు గోవును జంపెను గాన నిందుండరాదని యందఱును బైలువెడ
లు నమ్మునీంద్రుఁడు నిజతపః ప్రభావంబున నిజమారసి కృతఘ్నులగు వారినుద్దేశించి బ్ర
హ్మణాధములారా? మీకలు రుద్రసంబంధములగు భస్మరుద్రాక్షధారణము శివపూజా
దులగు దానియందు నాసక్తి లేని వారలగుదు.

మఱియును, శ్రుతిస్మృతులయందుఁ జెప్పఁజడు విషయములయందు శ్రద్ధాహీనులు
రయ్యెదరు శంఖము, చక్రముఁ గద, పద్మము, దండము, పాశము, అంకుశము మొ
దలగువాని ముద్రలను ధరించుదు, వర్తులాకారము, అశ్వత్థపత్రకారము, అర్ధచంద్రాకార
త్రిశూలాకారములగు పుండ్రములు ధరించుదు. ఇదిగాక, బౌద్ధధర్మము నవలంబించి పా
చరాత్రము, కాపాలము, కాలాముఖము, శాక్తమునను వానియందుఁగల దీక్షలనొం
ది చార్వాకము, పాషండము, జైనమను మొదలగు దీక్షలవహించు అవైదికములగు ధర్మ

బౌద్ధధర్మాశ్రితాః । పాంచరాత్రేచ కాపాలే తథా కాలాముఖేపిచ । శాక్తేచదీక్షితాయూయం భవత బ్రాహ్మణాధమాః । చార్వాకేచమతే యూయం తథా పాషండకేపిచ । వైష్ణవేదీక్షితాయూయం భవత బ్రాహ్మణాధమాః॥ దుర్మతేషుతథాన్యేషు మార్గేష్వశ్రౌతకేషుచ । శ్రద్ధయా దీక్షితా యూయం భవత బ్రాహ్మణాధమాః ॥ ఇత్యాది ॥ కౌర్మే ॥ సృష్టాని కామతో యూయం వేదబాహ్యవిరోధినః । నిర్మాయచపురాణాని భవత బ్రాహ్మణాధమాః ॥ దోర్మ్యాలే తప్తముద్రాది ధారిణః పాపచేతసః । వేదమార్గ పరిభ్రష్టా భవత బ్రాహ్మణాధమాః॥ విష్ణుమేవపురస్కృత్య శివమార్గ విదూషకాః । నరకాయాతనాయూయం భవత బ్రాహ్మణాధమాః ॥ సన్మార్గ నిందకాదుష్ట మార్గైకపరిమోహినః । పాపోపదేశ నిరతా భవత బ్రాహ్మణాధమాః ॥ మోక్షమార్గం పరిత్యజ్య వక్రిమార్గైకగామినః । వేదనిందాపరాయూయం భవత బ్రాహ్మణాధమాః ॥ అగ్నిష్టోమాదికర్మాణి విసృజ్యశ్రుతినిందకాః । వాయ్వాదిదేవతా భక్తా భవత బ్రాహ్మణాధమాః ॥ చక్రాంకితాశ్శైవమార్గ నిందకాస్స్వాత్మదూషకాః । ధర్మాధ్వప్రతికూలాశ్చ భవత బ్రాహ్మణాధమాః ॥ భారతాద్యాప్రకల్ప్యాపి వచనానిస్వబుద్ధితః । కపోలకల్పితార్థ

---

ములయందు నధికశ్రద్ధకలిగి యుండుడని మొదలుగా పెక్కువిధముల శపించినట్లు కలదు.

కూర్మపురాణమునందును. గౌతమశాపఘట్టమున, బ్రాహ్మణాధములారా మీరు ఇచ్ఛకొలది వేదవాక్యములను పురాణవాక్యములను కల్పించుకొనుడు. భుజములయందు తప్తముద్రలను ధరించి వేదమార్గమునుండి తొలంగినవారలు కండు. విష్ణువిపేరు చెప్పుచు శివమార్గమును దూషించుచు పాతకముల ననుభవించుడు. దుష్టమార్గమున మోహితులై సన్మార్గముల నిందించుచు పాపకృత్యముల నుపదేశించుచుండుడు. మోక్షమార్గమును విడిచి పుట్టి వంకరదారి నేగుచు వేదనిందచేయుచుండుడు. అగ్నిష్టోమము మొదలగు కర్మముల వదలి వేదముల దూషించుచు వాయువు మొదలగు దేవతల నారాధించుడు. చక్రాంకనము ధరించి శైవమార్గము నిందించుచు ధర్మమార్గమునకు ప్రతికూలురై యుండుడు.

జ్ఞా భవత్ప్రాబాహ్యా ద్విజాధమాః ॥ ఇత్యాదిశాపపరాహతత్వాదూర్ధ్వపుండ్ర విధౌ తిర్యక్పుండ్రనిషేధేచ తదుపకల్పిత వచనా న్యస్మరణీయానీతి సిద్ధం ॥ ఇతి ॥

రుద్రాక్షధారణవిధి
స్సమాప్తః.

---

మరియు మహాభారతము మొదగు వానియందు స్వకపోల కల్పితవచనము(లు) చేర్చబడుచుండును. ఈ మొదలగు శాపములచే పరాభూతులగు వారు ఊర్ధ్వపుండ్రము ధరింపవలయునని యును, భస్మరుద్రాక్షములు ధరింపఁగూడదనుటకును కల్పించిన వాక్యములు స్మరింపఁదగినవి కానేరవు.

రుద్రాక్ష ధారణవిధి
ముగిసెను.



శైవ ప్రచారిణీ బ్రాంచాఫీసు.
కనాని - దుగ్గిరాల పోస్టు,
గుంటూరుజిల్లా.

REGD No.

చందా సం॥ రు 2

శ్రీ

శివాయగురవేనమః.

# శైవరహస్యబోధిని

ఇది

వృద్ధపరంపరాగత శైవాచారములు శాస్త్రసమ్మతములు అని నిరూపించు ద్విమాసపత్రిక.

| సంపుటము | రుధిరోద్గారి సం॥ | సంచిక |
|---|---|---|
| 1 | ఆశ్వయుజశుద్ధవిజయదశిమి | 1 |

ముదిగొండ నాగలింగశాస్త్రి. పత్రికాసంపాదకుఁడు

శ్లో॥ అనుశ్రుతాచారపరత్వసాధినీ
విరుద్ధవాదాఘనితాన్తబాధినీ।
అశేషశంకామయపంకశోధినీ
జయత్వియం శైవరహస్యబోధినీ॥

---

శ్రీ విద్యాగణపతిముద్రాక్షరశాలయందు
ముద్రింపఁబడియె.
తెనాలి.

1923

# విషయసూచిక



| | | |
|---|---|---|
| శాశ్వతప్రధాన పోషకులకు | | చందా రు ౧౦౦-౦- |
| శాశ్వతపోషకులకు | | ౫౦-౦- |
| శాశ్వతచందాదారులకు | | ౨౫-౦- |
| ప్రధానపోషకులకు | సం॥ ౧ కి | ౧౦-౦- |
| పోషకులకు | సం॥ ౧ కి | ౫-౦- |

వీరిపేర్లుమాత్రమె ప్రతిపత్రికయందు ముద్రింపఁబడుచుండును.

శ్రీ

శివాయగురవేనమః

# శైవరహస్యబోధిని

శ్లో॥సదాశివసమారంభాం శ్రీకంఠారాధ్యమధ్యమాం।
అస్మదాచార్యపర్యంతాం వందేగురుపరంపరాం॥

శ్లో॥జయతు నతవిధేయ శ్శైలకన్యాసహాయః
జయతు గిరిశభక్తిః ప్రాంత భాస్వద్విముక్తిః।
జయతు విగతమోహా భక్తిభాజాంసమూహో
జయతు భృశ మకుంఠో భావ్యకృ న్నీలకంఠః॥

శ్లో॥జయతు దురితవల్లీజాతహేతి ర్విభూతిః
జయతు శుభదశీలా భద్రరుద్రాక్షమాలా।
జయతు భవవిభంగం భవ్యమీశానలింగం
జయతుచ సుఖభూమానారతం శంభునామ॥

శ్లో॥భావుకం దిశతువిఘ్ననాయకో
భావుకందిశతు శక్తిసాయకః।
భావుకందిశతు మేసదాశివా
భావుకందిశతు మే సదాశివః॥

శ్లో॥మహేశమాహేశమహాప్రసాదతో
విపశ్చిదక్షీణ కృపావలంబతః।
మతాభిమానాఖ్య కటాక్షదృష్టితః
ప్రవర్తతాం శైవరహస్యబోధినీ॥

శ్రీ

శివాయగురవేనమః

# శైవరహస్యబోధిని

## పత్రికావశ్యకత.

శైవాగ్రగణ్యులారా!

శ్లో॥ శైవంచ వైష్ణవం శాక్తం సౌరం వైనాయకం తథా। స్కాందం చ భక్తిమార్గస్య దర్శనాని షడేవహి॥

అనువచనమునుబట్టి షణ్మతములలో నగ్రాసనము నలంకరించిన శైవమతము విద్యాలోపము మొదలగుకారణములచే హీనస్థితికి వచ్చెనను ట స్పష్టము. అది యెట్లనిన, సంస్కృతవిద్యాలోపమునుబట్టి శైవధర్మజ్ఞానము లోపించెను. ధర్మజ్ఞానలోపమునుబట్టి తదభిమానము లోపించెను. అభిమానలోపమునుబట్టి తదనుష్ఠానము లోపించెను. ఈవిధమున నీమతము శ్లో॥ కలౌ శైవ మహోచకం, అనువచనమునకు పాత్రమై యుండుట విచారకరము.

ఇది యిట్లుండ నారిపో నున్నదీపమునకు జంఝామారుతముంబలె విషమస్థితియం దున్నయీమతమున కింకొకయుపద్రవ మాసన్నమయ్యెను. ఏమందురా?

శైవమతము పారమార్థికము కాదనియు, శైవులెల్లరకు శైవధర్మానుష్ఠానారంభమున వందనీయుం డగుబసవేశ్వరుండు నిందనీయుండనియు. శైవాగ్రగణ్యులకు గౌరవావహమైనషట్కాలశివపూజ మహాదోషావహమనియు, మున్నుగా మతధర్మములు పరిష్కరించుటయెగాక, కొందరీమతమునకు దహనసంస్కారంబును విధింపం గొందఱు సన్నద్ధులైయుం

ట యందలు నెఱింగి యున్నదేకదా?

దీనింబట్టి శక్తికొలది ప్రాచీనశిష్టాచారముల ప్రామాణ్యరహస్యము వెల్లడిచేయ నవసరమని తోచెడిని.

ఈసందర్భమున (గొందఱియభిప్రాయము వేరువిధముగఁ గన్పట్టుచున్నది. ఏమనిన, ఇప్పటివారియాక్షేపములవలన ననాదియగుమతమునకు లోప మేమిసంభవించును? దీనికై వగవనేల? ప్రతిక్రియాయత్నంబు నేల? యని వారినిశ్చయము. ఇది యథార్థమే. నిజ మెఱిఁగినవారి కవసరము లేదు. కాని యట్టిపండితులు,అవ్యాజభక్తిభరితులు నల్పసంఖ్యాకులును, సామాన్యజనులై యధికసంఖ్యాకులు నైయున్నారు. ఇటులుండ పూర్వాచారదూషణము పండితులకు బుద్ధిభేదమును గలిగింపకున్నను, సామాన్యులకు చిత్తచాంచల్యమును గలిగింపకుండునా? ఇట్టు లధికసంఖ్యాకులు మతధర్మములయందు విపరీతభావమును వహించుటకంటె మతమున కనిష్టంబు వేరొం డేమికలదు? కావున నిట్టియదనున నుపేక్షాభావ మనర్థకర మని స్పష్ట మయ్యెడిని.

కావున నిప్పుడు పండితులు తమపాండిత్యమును, ధనికులు తమ ధనమును మతధర్మప్రతిష్ఠాపనమునకై వినియోగింప నవసరమని వేర వక్కాణింపం బనిలేదు. మతాభిమానశాలురకు నిజమతగౌరవము నిలుపుకొనుటకంటె నెక్కుడుపని యుండదుగదా?

కాఁబట్టి యీసమయమున, మతధర్మముల ప్రాశస్త్యమును దెలుపుపత్రిక ప్రతిష్ఠింప నవసరమని యేర్పడియెను. ఇంకొకవిధమున ధర్మసంశయముల వారింప నశక్యముఁ గదా?

ఈపత్రికయందు శైవమహాజనుల పూర్వాచారములు నిర్దోష

ము లనియు, ప్రమాణసిద్ధము లనియు, ప్రశస్తము లనియు ప్రధానము గాఁ బ్రతిపాదింపఁబడును.

శైవులు వేకువ మొదలుకొని రాత్రి పండుకొనునందాఁక, జేయ నగు నాహ్నికకృత్యములను, సర్వసందేహనిరాకరణపూర్వముగను, స్వప్రమాణముగను నిర్ణయించిన యాహ్నికకాండ మను గ్రంథంబును,

అంత్యేష్టివిషయమున, శికింద్రాబాదువాస్తవ్యు లగు శ్రీపండిత స్వాములవారు సిద్ధాంతీకరించిన దహనసాపిండ్యరూపసూత్కాచారము ను ఖండించి, సకలసంశయనివారకము లగు ప్రమాణవచనములతో పూ ర్వాచారమును, సిద్ధాంతీకరించిన అంత్యేష్టికాండంబును, ఇంకను శైవా చారరహస్యములను దెలుపు శివాగమంబులును క్రమముగఁ బ్రకటిం పంబడును.

'అల్పారంభః క్షేమకరః' అను న్యాయమునుబట్టి యీపత్రిక యిప్పుడు ద్వైమాసపత్రికగా నారంభింపఁబడినను గ్రహించువారిసంఖ్య యొక్క యభివృద్ధినిబట్టి క్రమముగా మాసపత్రిక చేయఁబడుటయు గాక సంచికలపుటలును హెచ్చింపఁబడును. ఒరులముద్రాయంత్రము లయందు ముద్రింపించుచుండుటం జేసి దీనికి చందా యధికముగా నిర్ణ యించినందునకు మన్నింప వేడెద.

కావున, మతాభిమానవంతులు శీఘ్రముగ పోషకులుగను చం దాదారులుగను జేరుటచే తమకుగల మతాభిమానమును గనఁబఱచి యీకార్యమునకు తోడ్పడుదురని నమ్ముచున్నాఁడను.

ముదిగొండ నాగలింగశాస్త్రి,

ప॥ సం॥

శ్రీ

శివాయగురవేనమః

# శ్రీ బసవేశ్వర భూషణము

శ్లో॥ మునియాచనయా శివాజ్ఞయా
శివభక్త్యుద్ధరణార్థ మాగతం।
వృషరాడప గావతారతా
మహితం శ్రీబసవేశ్వరం భజే॥

భక్తిధుర్యులారా,

ప్ర॥ శైవమహాజను లెల్లరు శైవధర్మప్రారంభమునందు శ్రీబసవేశ్వరునిస్మరించుచుండుట సర్వదేశప్రసిద్ధమై యున్నసంగతి యందఱు నెఱింగినదే. ఇట్లు సర్వశైవమహాజనసమ్మత మగుసదాచారము శ్రీ॥వి॥ పాకయాజివాఙ్ముఖమునం బడి దూష్యముగను దురాచారముగను బరిణమించుటయు నెల్లరు నెఱింగినదేకదా? ఇప్పుడు మనము పురాతనమార్గ మవలంబించి బసవేశ్వరుని స్మరింప నగునా? లేక పాకయాజిసిద్ధాంతము నే నమ్మి బసవేశ్వరుని గర్హింప నగునా? ఇం దేమిచేయ నగునో? నిర్ణయించుఁడు.

ఉ॥ తొల్లిటిమహాసీయులు దురాచారము నెట్టు లాచరింతురు? అప్పటివారు జ్ఞాననిధులు. వారియాచారమునందు దోషలేశ ముండునా? ఉండదు. కాఁబట్టి యిప్పు డెవ్వండేని తనయజ్ఞానదోషంబునం జేసి పూర్వాచారమును దూషించినంతమాత్రన నది విడుచుటయే బుద్ధిచాపలము.



ప్ర॥ పూర్వాచారంబులందుమాత్రము దోషంబు లేల యుండ

వు? శ్రీశంకరాచార్యాదు లగుమహర్షియు లవతరించి తొల్లింటిదోషంబుల సంస్కరించియుంట విన లేదా? అట్లు యీయారాజియు శైవమతంబు సంస్కరింప నవతరించెనని యేల విశ్వసింపరాదు? కాబట్టి అర్థాపత్తిప్రమాణములతోఁ బనిలేదు. విమర్శించినపిమ్మట బసవేశ్వరునందు గుణము దొరకిన గ్రహింపవలయు. లేనిచో ద్యజింపవలయు. బసవేశ్వరునందేగుణము కనిపట్టి పురాతనులు స్మరియించుచుండిరి?

ఉ॥ ఇంతకు పూర్వచరిత్రలకన్న సాధనాంతరములు లేవు. చరిత్రలంబట్టి యాపురుషుఁడు మహాభక్తియుతుఁడని తెలియవచ్చెడిని. కాననే యాపురుషునందు పరమభక్తిరూపమహాగుణమును గ్రహించి యున్మహాత్మ్యఁ దలంచుచున్నారు. దీనందప్పేమి?

ప్ర॥ ఏదేని నొకగుణ మున్నంతమాత్రన గ్రహించుట యుక్తముగునా? దోషంబుం గలదేమో యని విచారింపంబనిలేదా?

ఉ॥ అట్లేని దోష మున్నంతమాత్రన విడుచుట యుక్తమగునా? గుణంబుంగలదేమో యని విచారింపంబనిలేదా? ఇచ్చట పరిష్కారము దుర్ఘటము. ఏలన, ప్రాచీనులు బసవేశ్వరునిగుణమును గ్రహించిరిగాని దోషమును గ్రహించిరా? లేదు. వారికి గుణముతోనె యవసరముగాని దోషముతోఁ బనియేమి? యీరాజియైనను దోషమునే గ్రహించెఁగాని గుణమును గ్రహించెనా? లేదు. ఈయనకు దోషముతోన పనిగాని గుణముతోఁ బనియేమి? ఈయిరువురకు చీకటివెలుతురులకుంబలె నన్యోన్యవైరము గన్పట్టెడిని. బసవేశ్వరునందు దోషమున్నది, లేనిది, పదంపడి విమర్శింపంబడు. ఇప్పుడు దోష మున్నదనునెదిరివాదము నంగీకరించి, యేదేనిదోష మున్నను బసవేశ్వరుని స్మరింపనగు ననుట ప్రకృతము. ఈయర్థంబునం దొకయితిహాసంబు గలదు. అవధానముతో వినుఁడు.

వేదవ్యాసుం డొకనాడు హస్తినాపురమున కరుదేర దుర్యోధ నుం డమ్మహర్షిని యథావిధి నర్చించి, మునీంద్రా, నామనంబున నొక సంశయంబు గలదు. వారింపవేయని ప్రార్థింప నావుడు నడుగుమనిన నతండిట్లనియె. మునివర్యా, చారులవలన లోకాభిప్రాయంబులు విను నప్పుడు జను లెల్లరు ధర్మరాజును గుణవంతునిగను, నన్ను దోషినిగను నెన్నుచున్నటుల వినియుంటిని. అందు కగుకారణంబు వివరింపవే య నివేడ నమ్మునీంద్రుండు ధర్మజుని రప్పించి యుధిష్ఠిరా, నీ వొకయే డ్లు దేశాటనంబుచేసి యొ క్కైన వెదకి యొకదోషిం గొనితెమ్ము. అని యాతని నంపి సుయోధనా, నీవు నొకయేడు పుడమిం బరిభ్రమించి వెదకి యెట్టైన నొకగుణవంతుని గొనిరమ్మని యానతిచ్చి యథేచ్ఛ న రిగినవాడై వత్సరావసానంబున కరినగరమునకు మరల నేతేరునంతకు ధ ర్మజదుర్యోధనులును నలబ్ధమనోరథులై యచటి కరుదెంచిరి. అప్పుడు వేదవ్యాసుండు దుర్యోధనుం గాంచి గుణవంతునిం గొనివచ్చితివా? అనియ డుగ నాతం డిట్లనియె. మునిచంద్రా, దేవర యానతిచ్చినది మొదలు దేశ మెల్లం బరిభ్రమించినను నెందును గుణవంతుడు దొరకండయ్యె. కొందఱొక్కయూర శమదమాదినిరతు, దానదయాశీలు, వర్ణాశ్రమధర్మాలం పటు, సూనృతవ్రతు నొక్కభూసురుం గాంచి యీతఁడు గుణవంతుండని విశ్వసించియు నెగడునెడ నీతనియందేదేని దోషము దొరకునో విచా రింపక గుణియనరాదని యెంచి కొంతకాలము నిరీక్షించుచుంటిని. ఇ ట్లుండ నావిప్రుం డొకనాఁడు భుజించి హస్తముఖప్రక్షాళనంబునకై వాకిటి కరుదెంచి తొలుత నోరుగడిగికొనియె. అదిచూడగనే నేనిట్లు తలంచితిని. భుజించినపదార్థపుష్టి ముఖహస్తంబులం గడిగికొనకముందు శూద్రుని గాంచునెడ తొలుత హస్తంబుం గడిగికొని తరువాత ముఖం బుంగడిగికొనవలయునని ధర్మశాస్త్రకర్తలు విధించియున్నారు. అట్టులుం

డ నతండు తోలుత ముఖంబు గడిగికొనియె. ఇట్లు శాస్త్రవిరుద్ధ మగు నాచారము నొనరించెఁగావున, నీతని గుణవంతునిగా నెట్లు గ్రహింప నగు?-ఈతండును దోషియే. ఇఁక గుణవంతుఁ డెందు దొరకును? ఎందును దొరకఁడు. అని నిరాశుండనై వచ్చితి నని వచించెను. అంత వేదవ్యాసుండు ధర్మజుంగాంచి దోషిం గొనివచ్చితివా? అని యడుగ నత్యం డిట్లనియె. మహాత్మా, దేశ మెల్ల గాలించి వెదకినను నెందును దోషి దొరకం డయ్యెను. ఊరూర వెదకుచు నేయేపురుషుని గాంచి దోషి యని గ్రహింపఁబోయినను నాయాపురుషునం దెల్ల నేదే నొక్కొకమహాగుణంబు గానవచ్చుచుండె. వత్సరాంతమువరకు దేశ మెల్ల వెదకి దోషి నెందుంగానక తొన కొక్కయూరఁ గృషీవలుం డగునొక్కబ్రాహ్మణకులజుం గాంచి యీతనియందు స్నానసంధ్యాదిగుణంబులేవియు లేవు. విప్రుండయ్యు గులోచితకృత్యంబులు విడిచియున్న వాఁడు కావున నీతనిం దోషియని గ్రహింతమని యొంచియు వెదకునెడ గుణంబు దొరకునో విచారింపక దోషియనరాదని కొంతకాలము నిరీక్షించుచుంటిని. అంత నతం డొకనాఁడు పొలమున నరక దున్నుచుండ నాతనిజనిత యచటి కన్నముంగొని వచ్చెను. దానింగాంచి యతండు, ఓసీ మాయమ్మ భుజించెనా? అని యడుగ నాపుడు లేదనియె. అంతవాఁ డుగ్రుండై తొలుత నాతల్లి కన్న మిడక నాకేల కొనివచ్చితని యామెను మర్దించి యాహారముంగొనకయ యింటి కేగెను. అది గాంచి, ఆహా యీతం డెంతపుణ్యవంతుండు? ఈతనికిం గలమాతృభక్తి నిరుపమానము. ఇట్టిగుణవంతుని దోషియని యేను భ్రమించితి నే నాదోషమెట్లు తలంగునని పరితపించి నిరాశుండనై వచ్చితి. నావిని వేదవ్యాసుండు ధర్మజదుర్యోధనుల నుపలక్షించి మీయందు గలగుణదోషంబులంబట్టి యెదిరివారు నటు గానిపించెదరు. ఇంతియగాని గుణదోషంబు

లన వేరుగా లేవని నచించి యంతర్హితుం డయ్యెను. అంత దుర్యోధ మునిసంశయంబు నివర్తించెను. కావున సుజనులు గుణముల గ్రహింతురుగాని వారికి దోషములతోఁబనిలేదు. మఱియు, బసవేశ్వరునందు దోషమే లేదు. అట్లుగాక యమ్మహనీయునందు నేదేనిదోష మున్నట్లితరులకుఁ దోచినను నిరుపమానశివభక్తిరూపమహాగుణముంబట్టి యాదోషము గ్రహింపంబడదు. కాన బసవేశ్వరుని స్మరింప నగును.

ప్ర॥ మీరు దోషము లేదనిన నెట్లు నమ్మనగు? శి॥ వి॥ పాకలూజివద్ద పెద్దభూతద్ద మున్నది. అది మొతపూర్వ కాలమునాటివారియందగు నల్పదోషము నైనను దగ్గరకుదెచ్చి పర్వతతుల్యముగాఁ గనఁబరచును. ఇట్టులుండ దోషము లేదనికాని, యది యల్పదోష మనికాని మీరు మూసిపెట్టిన నీమాట నిప్పటివా రెట్లువిశ్వసింతురు? బసవేశ్వరునందగుమహాదోషములు శ్రుతిధర్మసంజీవని, 3 వ సంపుటము ౬ సంచిక మొదలగు ననేకములగుసంచికలయందకాక శైవధర్మములదూషింపనాపత్రిక చాలదని కేవల మిందుకై వెలయింపంబడిన శైవధర్మప్రకాశిక ౧ వ సంపుటము 3 వ సంచికయందు ౧ వ పుటమొదలుకొని చివరపుటవరకు గనపరచంబడి యుండెఁగదా? గ్రంథ మంతయు విసఁజాలకున్న శివశివయని పర్యవసితార్థము నైన నాలింపుడు.

శైవధర్మప్రకాశిక. ౧ సంపుటము. 3 వ సంచిక ౨3 వపుట, ఇట్లు నిశ్చయించుకొని యుపనయనము మాని మేనమామకూతును గంగమాంబను వివాహమై కక్కయాది చండాలురతో గలసియాహారవిహారాదులు సలిపినట్లు బసవపురాణము చెప్పియున్నది.

పుత్త్రులు లేక యనేకవ్రతములుచేసి కన్నబసవని తలిదండ్రులగు మాదిరాజుమాదాంబికలు కులమువారగు బ్రాహ్మణులు బసవని బహిష్కరించిరి. అతఁడు వారిని విడిచి చండాలురతోఁ జేరియున్నవాఁడు

ఇట్లు కులభ్రష్టుఁడైనకతమున నే క్రింది శైవపంచకవచనప్రకారము బసవఁడు స్మరణీయుఁడు కాడయ్యెను.

బసవఁడుపనయనము మానినాఁడు. కావున స్వవర్ణాశ్రమధర్మదూరుఁ డయ్యెను. అందుచే శివద్రోహియై యున్నవాఁడు. ఇదిగాక వేదవిహితోపనయనాచారమును నిందించి విడిచినవాఁడు. కావుననే తలిదండ్రులు బంధువులు మున్నగువారిచే బహిష్కరింపఁబడినవాఁడు కాన బసవఁడు స్మరణీయుఁడుకాఁడు. అతనిచరిత్ర పఠనీయము కాదు, అని యున్నది.

ఇచట బసవఁడుబసవఁడు. అని మొదలుగాఁ గలదు. అతఁడెవ్వఁడోయని యెన్నకుఁడు. బసవేశ్వరుఁడను నెడ దోషము వచ్చునను నిశ్చయముతో నట్లు పలుకఁబడుచుండెఁగాని యాపదముచే బసవేశ్వరుఁడే వాచ్యుఁడని యాజియాశయము.

వింటిరా? బసవపురాణసారము. యాజి బసవపురాణమునెల్ల శోధింప బసవేశ్వరుఁడు మహాదోషి యనియు, అతఁడు స్మరణీయుఁడు కాఁడనియు, అతనిచరిత్ర పఠనీయము కాదనియు నేర్పడెను. ఇందున కేమి చెప్పెదరు?

ఉ॥ఇది తప్పుకాదు. సముద్రమునఁ గొందరు రత్నముల గ్రహింతురు. మఱికొందరు శంఖముల గ్రహింతురు. ఇంకగొందరు నత్తగుల్లలు గ్రహింతురు. యిట్లే బసవపురాణమునందును, కొందరు బసవేశ్వరునిభక్తిని గ్రహించుచున్నారు. కొందర మ్మనీయమాహాత్మ్యమును గ్రహించుచున్నారు. ఐనను,కొందరాపురుషునియం దఃసుదోషములనే గ్రహించుచున్నారుకాఁబోలు? పురాకృతమునుబట్టి వారివారిదృష్టి కయ్యది గనఁబడుచుండుంగదా?

ఇట్లు, దోషమునే గ్రహించినవారు బసవేశ్వరుని స్మరింపరాదని

నిర్ణయించినను నమ్మహాపురుషుభక్తిని, మాహాత్మ్యమును గ్రహించిన వారమ్మహాత్మునెట్లు తలంపకుందురు? సముద్రమున నత్తగుల్లలు గ్రహించినవాఁడు ఇందు నత్తగుల్లలగాక వేరేమియు లేవని రాఁగుద్దినను నందగుసారము తెలిసినవారు సముద్రము జోలి విడుతురా? కాన యాజి నిర్ణయముతోఁబని లేదు.

ప్ర॥ బసవేశ్వరుఁడు కక్కయాదిచండాలురతో కలసి తిని వారిలోఁ గలసెగదా! అట్టిబసవేశ్వరు నెట్లు స్మరింపనగు?

ఉ॥ కక్కయాదులు మహాభక్తులని వారిప్రసాదమునుబసవేశ్వరుఁడు గ్రహించెఁగాని, చండాలు రెక్కడను దొరకక కక్కయాదులప్రసాదమును గ్రహించెనా? లేదు. అట్లు, బసవేశ్వరుండును మహాభక్తుండని పెద్ద లాయననామమును స్మరించుచున్నారుగాని, చండాలురలోఁగలసి తినినవాఁ డెక్కడను దొరకనందున బసవేశ్వరుని గ్రహించుచుండిరా? లేదు. భక్తిపరులు భక్తిరసమున గ్రహింతురుగాని, తక్కులోపముల లెక్కింపరు. కక్కయాదులుగాని, బసవేశ్వరుఁడుగాని, భక్తిరహితులే యైయుందురేని? వారిస్మరణము కూడనిదే యైయుండును? వారు మహాభక్తినిష్ఠులై యున్నప్పుడు వారిస్మరణము దోషావహ మెట్లగును? అది భక్తిరస మెఱుంగనివారలకు లోపముగాఁ గనఁబడినను భక్తిరసకోవిదులకు మహాగుణముగఁ దోఁపక మానదు.

ప్ర॥ బసవేశ్వరుఁడు ఉపనయనము మానుకొనెను. ఉపనయనము మానుకొనినవాఁడు వ్రాత్యుఁడగునని మను వీక్రిందివిధమునఁ జెప్పియున్నాఁడు. దశమాధ్యాయమునఁ జూడుఁడు.

శ్లో॥ ద్విజాతయ స్సవర్ణాసు జనయం త్యవ్రతాంస్తు యాన్।
తాన్ సావిత్రీపరిభ్రష్టాన్ వ్రాత్యానితి వినిర్దిశేత్॥

ఇందులకు కుల్లూకభట్టాచార్యుఁ డిట్లు వ్యాఖ్యానము గావించి

యున్నాఁడు. ద్విజాతయ స్సవర్ణాసు స్త్రీషు యాన్ పుత్రా నుత్పా దయాంతే తేచే దుపనయనాఖ్యవ్రతహీనా భవంతితదా తాం సకృష్ణోపన యనాన్ వ్రాత్యా ఇత్యనగిరా సంజ్ఞయా వ్యపదిశేత్. ప్రతిలోమజపు త్రవదస్యాపిఉపకారాక్షమపుత్రత్వప్రదర్శనార్థం అస్మిన్ సంకీర్ణప్రకరణే అనూదితం॥ ఇందుల కర్థమేమన, ద్విజులు సజాతిస్త్రీలయందు నేపుత్రు లను గనుచున్నారో వా రుపనయనవ్రతమును మానినయెడ వారిని వ్రా త్యులని నిర్దేశింపవలెను. ప్రతిలోమజ (చండాలాది) పుత్రులవలెనే వెనుక దెలుపఁబడినవ్రాత్యులకు నుపకారముచేయఁదగనిపుత్రత్వము కలు గునని తెలుపుటకు గాను మనువు సంకీర్ణజాతులను గూర్చి చెప్పెడిచో ట చెప్పియున్నాఁడు. బసవఁడు (ప్రతిలోమ) చండాలురతోఁజేరినాఁడ ని స్పష్ట మగుచున్నది. చండాలురను ధర్మకార్యము జేయునపుడు స్మ రింపఁగూడదని మను వీక్రిందివిధమునఁ దెలిపియున్నాఁడు. శ్లో॥ నతై స్సమయ మన్విచ్ఛే త్పురుషో ధర్మ మాచరన్॥ ఇందులకుఁ గుల్లూక భట్టాచార్యుఁ డిట్లు వ్యాఖ్యానము గావించియున్నాఁడు. ధర్మానుష్ఠాన సమయే చండాలశ్వపాకై స్సహ దర్శనాదివ్యవహారం నకుర్యాత్॥ ధర్మ కార్యములు చేయువా రాసమయమందు చండాలశ్వపాకులతో దర్శనాది వ్యవహారమును జేయరాదని చెప్పియున్నాఁడు. దర్శనాదివ్యవహారము మాను మనుటచే చండాలస్మరణకూడదని స్పష్ట మగుచున్నది. వాని ముఖావలోకనము జేయగూడదని చెప్పినవెనుక వానిని స్మరించువాఁడు ప్రపంచముననుండునా? కావుననే యిప్పటికిని ద్విజులు మడిగట్టుకొని యున్నపుడు చండాలురను గూర్చి యేదేనిఁ జెప్పవలసివచ్చినయెడ జెప్ప రానివాడని వ్యవహరించుచున్నారు. కాని వానిపే రుచ్చరించుట లేదు. కాన నుపనయనము మానుకొని చండాలుఁడై కక్కయాదిచం డాలురతోఁ జేరినబసవని స్మరించవలయునని శాస్త్రిగారు వ్రాయుట

శాస్త్రదూష్యమని సుజనులు చెప్పకొనక తప్పదు. అని వ్రాసియు న్నదాని కేమి సమాధానము?

ప్ర॥ మనువు ఉపనయనము మానుకొనినవారిని వ్రాత్యులని వ చించుట మొదలగునవి కొన్ని యథార్థములే యగు. కాని (ప్రతి లోమజ) చండాలాది యని ప్రతిలోమజపదమునకు చండాలురనియూజి చేసినయర్థము తనవిపరీతపాండిత్యమువలన ప్రాప్తమైనయనర్థమే యగు. ఏలన, ప్రతిలోమజు లనగా, అధమజాతిపురుషునకు నుత్తమజాతిస్త్రీకిని బుట్టినవా రనుట సుప్రసిద్ధము. ఇట్టులుండ, ధర్మశాస్త్రవచనముల కర్థము నిర్ణయింపవచ్చినప్పుడు చండాలరూపపదార్థ ముపస్థిత మగుటం జేసి యీతనిపురాకృతము శోచనీయము.

సంస్కృతమున విభక్తులు తెలియనివాఁడు ధర్మశాస్త్రముల కర్థ ము వ్రాయవలసివచ్చినప్పుడు ఇట్టియనర్థము లేతెంచుచుండుట కర మా శ్చర్యకరము కాదు. అట్టి భ్రాంతినిబట్టి ,నత్రైస్సమయమన్విచ్ఛేత్, అను ప్రమాణముచేత చండాలస్మరణము కూడదని వ్రాసినవ్రాతను విమ ర్శింప నవసరముండునా? ఉండదు. కావున దీనిం బోవిడుతము.

మన్వాదులు ఉపనయనముమానినవారిని వ్రాత్యులలో చేర్చినను కుల్లూకభట్టు అట్టివారిని సంకీర్ణప్రకరణమునఁ జేర్చినను భక్తిరహితుల నుద్దేశించియే యీవచనములు ప్రవర్తించినవికాని భక్తినిష్ఠుల నుద్దేశిం చి ప్రవర్తించినవి కావని యొప్పితీరవలయు. కావుననే, శ్రీశంకరా చార్యులవారు శ్లో॥ నిస్త్రైగుణ్యే పథి విచరతాం కోవిధిః కోనిషేధః॥ త్రి గుణాతీత మగు మార్గమునఁ జరించువారలకు విధినిషేధములతో నేమి పని యని వచించియున్నారు. అట్లు శ్రీవిద్యారణ్యులవారును,

శ్లో॥ వర్ణాశ్రమ వయోవస్థా భిమానో యస్య విద్యతే,
తస్యైవచ నిషేధాశ్చ విధయ స్సకలాఅపి॥

వర్ణాద్యమాభిమానము గలవారలకేగాక భక్తిజ్ఞానాతిశయము వలన నట్టియభిమానములేని మహానీయులకు విధినిషేధములతోఁ బని లేదని చెప్పియున్నారు.

వారు వచించినది జ్ఞాననిష్ఠుల నుద్దేశించికాని భక్తినిష్ఠుల నుద్దేశించి కాదని శంకింతురేమో? ఈశ్వరభక్తి జ్ఞానముకంటె నెంతమాత్రము తగ్గిపోవునది కాదు. జ్ఞానస్వరూప మెఱిగినవారలకు జ్ఞాన మెట్లు సర్వోత్తమమో? భక్తిరహస్య మెఱింగినవారలకు భక్తియు సర్వాతీత మైనదే. జ్ఞానవిదులు ధర్మమును జ్ఞానసాధనముగా నంగీకరించిన ట్లు భక్తివిదులు ధర్మమును భక్తిసాధనముగా నంగీకరించుచున్నారు.

భక్తి జ్ఞానమునకు సాధనముగాన భక్తికంటె జ్ఞాన మెక్కుడని శంకింతురేమో? భక్తి జ్ఞానసాధన మనునది కొందఱిమతమేగాని సర్వసమ్మతము కానేరదు. ఏలన, భక్తిసూత్రములయందు జ్ఞానమే భక్తిసాధనమని నిర్ణయింపఁబడియున్నది కదా? కావుననే, జ్ఞానమునుబట్టి ధర్మమునెడ మతభేద మేర్పడినట్లు భక్తినిబట్టియు ధర్మమునెడ మతభేద మేర్పడియున్నది. అది యెట్లనిన,

జ్ఞానములభించియున్నను శ్లో॥ సుప్తహ స్తస్థపుష్పవత్ ॥ నిద్రించు వానిచేతిలో నున్నపూవు దానియంతన పడిపోవునట్లు జ్ఞాననిష్ఠాపారవశ్యముచేత కర్మము దానియంతన విడిపోఁదగునుగాని బుద్ధిపూర్వముగా విడువఁదగదని కొందఱియాశయము.

జ్ఞానేచ్ఛ కలిగినమీఁద ధర్మమునే యవలంబించియుండునెడ జ్ఞానమును సాధింపవలనుపడనుగాన ధర్మముతోఁ బనిలేదని కొందఱిమతమై యున్నది. ఇందు రెండవమతమునే శ్రీశంకరాచార్యులవా రంగీకరించియున్నారు. కావునసె, శ్రు॥ సన్న్యస్య శ్రవణం కుర్యాత్ ॥ అను శ్రుతిని మూలీకరించుకొని జ్ఞానేచ్ఛ కలుగగనె వివిదిషాసన్న్యాసము

నవలంబించి వేదాన్తవాక్యశ్రవణము చేయవలయునని సిద్ధాంతీకరించి యుంషిరి.

ఇట్లే భక్తి సిద్ధించి యున్నను విదేహముక్తివరకు కర్మంబు నపే క్షితమేయని కర్మజ్ఞానసముచ్చయవాది యగు శ్రీనీలకంఠభగవత్పాదుని మతమై యున్నది. బసవేశ్వరుని మతమైననో భక్తి లభించినమీాద వర్ణాశ్రమధర్మమునే యవలంబించి యుండునెడ భక్తినిష్ఠ కుదరనేరదు గాన నట్టిధర్మముతోం బనిలేదనునది.

ధర్మము భక్తిజ్ఞానములకు సాధనమని యెల్లరు నంగీకరించియున్న ను, ధర్మము జ్ఞానేచ్ఛకు సాధనముగాని జ్ఞానసాధనము గాదనియు, శ మదమాదులే జ్ఞానమున కంతరంగసాధనములుగాని ధర్మమైననో జ్ఞాన మునకుబహిరంగసాధనమే యనియు శ్రీశంకరాచార్యులవారు సిద్ధాం తముచేసియున్నారు. దీనింబట్టి భక్తిజ్ఞానములదృష్టిచే ధర్మముయొక్క స్థితి యెంత దుర్బలముగ నున్నదో తెలిసెనుగదా?

ఇట్టివర్ణాశ్రమధర్మరాహిత్యము పరిపూర్ణభక్తిభరితుం డగుబస వేశ్వరున కొక్కలోపమని ప్రాజ్ఞులు తలంతురా?

ఇట్లు భక్తిని ప్రధానముచేసికొని భక్తినిష్ఠకు బాధకమను నా హేతుతో వర్ణాశ్రమధర్మమును పాటింపకున్నను, భక్తికి ముక్తిప్రదత్వము సర్వసమ్మతము కావునను, బసవేశ్వరుఁడు మహాభక్తుఁ డనుట నిర్వివాద ము కావునను, భక్తిప్రధాన మగువీరశైవము నుద్ధరించెనుగాన యాజి శంకించినలోపములు గుణములుగనె యేర్పడినవి.

ప్ర॥ బసవేశ్వరుఁ డుద్ధరించినశైవమతము వర్ణసంకరశైవమతము గాని వీరశైవమతము గాదు. వీరశైవుఁడు స్వజాత్యాశ్రమధర్మములను విడువరాదు. విడిచినయెడ వాఁడు పతితుఁడగునని శైవశాస్త్ర మిట్లు చెప్పియున్నది.

శ్లో॥ స్వజాత్యాశ్రమధర్మం యస్త్యక్త్వా వేదోదితం నరః।
అన్యజాత్యాశ్రమాచారం చరేత్స పతితో భవేత్॥

ఇంతియకాదు. మఱియొకచోటి యిట్లు చెప్పియున్నది.

శ్లో॥ శివోక్తాం జాతిమర్యాదా మోతీత్య భువివర్తతే।
సపాషండఇతి జ్ఞేయ స్సర్వకర్మబహిష్కృతః॥

స్వజాతికిని స్వాశ్రమమునకును వేదోక్తమగు ధర్మమేదికలదో దానిని నరుఁడు వదలి యన్యజాతికిని, నన్యాశ్రమమునకును విహితమైన ధర్మము నాచరించినయెడ వాఁడు పతితుఁ డగుచున్నాఁడు. అని యూరంభించి సంకరజాతులలోఁ జేర్చి బసవఁడు వృద్ధిచేసిన శైవమతము మేము చెప్పినట్లు సంకరశైవ మగునుగాని వీరవశైవమెట్లగును? దీనింబట్టి బసవేశ్వరుఁడు శైవమతము నుద్ధరించెనని యెట్లు నమ్మనగును?

ఉ॥ బసవేశ్వరుఁ డుద్ధరించినది వర్ణసంకరశైవ మనుట పాపమూలము. ఏలన, వర్ణాశ్రమధర్మముల నవలంబించిన దొకటియు, వాని నవలంబింపని దొకటియు నిట్లు వీరశైవము రెండువిధములగుచున్నది. దీనికి శివాగమంబులును వాయుసంహితయందు,

శ్లో॥ శివాగమోపి ద్వివిధః శ్రౌతోశ్రౌతశ్చ స స్మృతః।
శ్రుతిసారమయ శ్శ్రౌత స్స్వతంత్ర ఇతరో మతః॥

అనుటచే వర్ణాశ్రమధర్మములను పాలించు వైదికశివాగమములు కొన్నియు, వర్ణాశ్రమధర్మములను పాలింపని స్వతంత్రాగమములు కొన్నియు కలవని చెప్పఁబడియున్నది. వానింబట్టి వర్ణాశ్రమధర్మముల నవలంబించినవీరశైవ మొక్కటియు, వాని నవలంబింపనివీరశైవ మొకటియు లోకమున ననాదిసిద్ధములై ప్రసిద్ధివహించియున్నవి.

సశేషము.

ఇట్టులుండగా వర్ణాశ్రమధర్మములఁ బాటింపని వీరశైవము వర్ణసంకరశైవ మనుటంజేసి తనబూతుపాండిత్యము వ్యక్త మగునే కాని యాషతమున కెట్టిలోపంబును కలుగనేరదు.

పైఁగడ నుదాహరింపఁబడిన శంకరసంహితావచనములు వర్ణాశ్రమాద్యభిమానము కలవానికి వర్ణాశ్రమధర్మానుష్ఠాన మవసర మని బోధించుచున్నవి. జాత్యాద్యభిమానము లేనివానికి స్వజాతి, అన్యజాతియను భేద మెక్కడిది? స్వజాతిధర్మమును విడిచిపెట్టి అన్యజాతిధర్మమును చేయువాని నుద్దేశించి ప్రవర్తించినవచనములు జాత్యభిమానము లేనివానివిషయము లెట్లగును?

కాఁబట్టి జాత్యభిమాననుండి స్వజాతిధర్మమువలంబింపక యన్యజాతిధర్మ మవలంబించినవాఁడు పతితుఁడనియు, బహిష్కృతుఁడనియు నావచనములు బోధించుచున్నవి.

కాన బసవేశ్వరాది మహనీయుల నుద్దేశించి యావచనముల వినియోగపరచుట వివేకమూలము కాదు.

ప్ర॥ ధర్మశాస్త్రవచనములకు బసవేశ్వరాదులేల బద్ధులుగారు?

ఉ॥ రాజధనము నపహరించుట దోషమే. అని భగవద్భక్తుఁ డగు రామదాసు రాజధనము నపహరించె నను నేరమునకు బద్ధుఁడగునా? కాఁదు. పితృవాక్యము నతిక్రమించినవాఁడు దోషియని సకలశాస్త్రములు నిర్ణయించుచున్నవి. వానింబట్టి పరమభాగవతుఁ డగుప్రహ్లాదుఁడు దోషి యగునా? కాదు. మఱియు, శిశుహత్య మహాదోషమని సమస్తమగు విద్యాస్థానములు నిరూపించుచున్నవి. అట్లని మహాభక్తుఁ డగుచిరుతొండనైనారు దూష్యుఁడగునా? కాఁదు గదా?

ఇట్లే, సావిత్రీరహితుఁడగువిప్రుఁడు వ్రాత్యుఁడని మనుస్మృతి

యందున్నను, వర్ణాశ్రమధర్మరహితుఁడు పతితుఁడని సకలధర్మశాస్త్ర ములయందున్నను వానింబట్టి నిరుపమానభక్తిరసపరాయత్తచిత్తులగు బసవేశ్వరాదులు దూష్యులనుశంకకే యాస్పదములు కారు.

ఇట్టులుండ కర్మబద్ధవిషయములగు ధర్మశాస్త్రవచనములఁ బట్టి జీవన్ముక్తులగు మహాభక్తులయందు దోషముఁ స్థాపించి వారి నిందింప సాహసించుట యెట్టి వివేకసంపత్తియో? ఎట్టి పాండిత్యప్రక ర్షమో? వచింపఁజాలను.

ప్ర॥ జాత్యంతరులలోఁ జేరినబసవేశ్వరుని స్మరింప గౌరవ మెట్లు డును?

బ॥ బసవేశ్వరుఁ డెవ్వారలలోఁ జేరెనో వారికి జాత్యభిమానము లేనుగాన వారు భక్తులగుదురుగాని జాత్యంతరు లెంతమాత్రము కారు. కాఁబట్టి బసవేశ్వరుఁడు భక్తులలోఁ జేరెనుగాని జాత్యంతరులలోఁ జే లేదని ధ్రువపడినది. కాన బసవేశ్వరుని స్మరణ మగౌరవకరము కాదు. మఱియు, అమ్మహనీయుఁడు మహాభక్తుఁడు కాన నాపురుషుని నామస్మరణము భక్తిసాధనముగా గ్రహించియున్నారు. దానఁజే యాయనపేరు స్మరించువారలకు గౌరవముకలదనునెడ సంశయమేమి?

ఆపురుషుని నామస్మరణము గౌరవావహ మనియె అదియెప్పుడు సంభవించుటకై యనేకులు శంకరాదినామములతో సమముగ బసవే రునిపేరును పెట్టుకొనుచున్నారు. ఆపేరు స్మరింపఁగూడనిదే యగు నేని, యీపేరెవరైనఁ బెట్టికొందురా? ఆపేరుపెట్టుకొనినవారికిగాని, ప లుచువారికిగాని యెట్టనైన నగౌరవము వచ్చినట్లు వినియుంటిమా? హిం దూదేశమున నిరుపమాన మగుకీర్తి నార్జించినవారును, శ్రీఉత్తరాంధ్రస్థా నపరిపాలకులై స్వర్గ మలంకరించినశ్రీకందుకూరు బసవరాజులంగా కన్న గౌరవము నొందినవారుఁగలరా? ఇంక నెందఱో యీపేరుగలవా

రిప్పటికి నున్నారని యాజి యెఱుఁగఁడా? ఈయాజి బసవయ్యకే తన కూఁతు నిచ్చియుండ లేదా?

కాఁబట్టి బసవని పేరు స్మరింపఁగూడదను యాజిసిద్ధాంతము శైవమహాజనసత్సంప్రదాయవిరుద్ధ ముగాన న్యాయదృష్టిగలశైవుల కెంత మాత్రము విన(దగినది కాదు.

ప్ర॥ శ్లో॥ నేక్షేత పూజావేళాయాం నరం వత్స బహిష్కృతం।
శివద్రోహిణ మాచారనిందకం నహృదిస్మరేత్॥

అనుశంకరసంహితావచనమునుబట్టి బసవఁడు స్మరణీయుఁడు కాఁడని చెప్పియున్నాఁడు. దీని కేమిసమాధానము చెప్పెదరు?

ఉ॥ పూజాకాలమున బహిష్కృతుఁడగు మనుజుని చూడఁగూడదనియు, తలంపఁగూడదనియు వచించి అట్టిబహిష్కృతు లెవరనుశంక కలుగఁగా,

శ్లో॥ దధీచినా గౌతమేన శప్తా యే బ్రాహ్మణాధమాః।
కలా వవతరిష్యన్తి నిన్దకా స్తే బహిష్కృతాః॥

తొల్లి దధీచిచేతను, గౌతమునిచేతను శపింపఁబడినబ్రాహ్మణబ్రువులు కలియుగమున నవతరించి శివుని శివధర్మములను నిందించుచుందురు. వారే బహిష్కృతులని శంకరసంహితయందే నిర్ణయింపఁబడియుండ బసవేశ్వరాదులు బహిష్కృతు లనుట మహాసాహసము. శ్రీమదప్పయదీక్షితులవారును శివతత్త్వవివేకమునందు, నేక్షేతపూజావేళాయాంనరంవత్సబహిష్కృతం-అనుశంకరసంహితావచనము దధీచిగౌతమశాపదగ్ధులైననిందకులపరమే యని నిర్ధారణచేసియున్నారు. కాని యాజి కనిపెట్టినసరహస్యార్థము వారిబుద్ధికిని గోచరించినట్లు తోఁచదు.

కావున యథేచ్ఛముగా మహాభక్తులు బహిష్కృతులనియు వారిని స్మరింపఁగూడదనియు మతములకు విపరీతయాజి సిద్ధాంతము పండిత

మండలి కందునది కాదు.

మఱియు, శ్లోకార్థము యోజికగోచరము గాన నతఁడాశ్లోకము నుదాహరించెను. ఏలందురా? ఆశ్లోకమున, ఆచారనిందకం సహృది స్మరేత్, శైవాచారముల నిందించువాఁడు బహిష్కృతుఁడనియు నట్టివా ని స్మరింపఁగూడదనియు నున్నది. తాను సుప్రసిద్ధముగ శైవాచారనిందకుఁడై యుండితన్ను విషయీకరించునాశ్లోకార్థము తనకు తెలిసియుం డునెడ నుదాహరించునా ? ఇదియు ప్రమాదమే.

( సశేషము. )



ప్ర॥ బసవేశ్వరుఁడు వర్ణాశ్రమముల పాలించెనా? లేదు. అది యాయన కెట్లుదోషము కాదు? అగునేని నాయన నెట్లుస్మరింపనగు?

ఉ॥ బసవేశ్వరుఁడు వర్ణాశ్రమధర్మములఁ బాలింపలేదనుట నిజమే. అయినను అది యాయనకు దోషముకాదు. ఏలందురా? పరిపూర్ణ మగుభక్తిగాని, జ్ఞానముగాని కలిగియున్న మహనీయులకు కులాభిమానాదులతోఁ బనిలేదని నిర్ణయింపఁబడిమెగదా?

మఱియు, మాదిరాజు మాదాంబికలు పుత్రులులేక యనేక వ్రతములు సల్పగా బసవేశ్వరుఁడు జన్మించెనని యాజియే వ్రాసియున్నాఁడు. దానింబట్టి దోషి యెట్లు జన్మించును?

అదిఁగాక ఎనిమిదవయేట నుపనయనమునకు తలిదండ్రులు యత్నింపగనే బసవేశ్వరుఁడు నిషేధించినట్లు బసవపురాణమునఁ గలదని యాజి వచించుచున్నాఁడుగదా? లోకమున నెటనైన సంతతిబాల్యమున నుపనయనము నిషేధించువాఁడుండునా? ఉండడు. దానింబట్టి యాతఁ డట్టిమతము నుద్ధరించుటకై యవతరించినట్లు తెలిసెడిని. ఆమహనీయుఁడెంతో శివానుగ్రహపాత్రుఁడు కానిదే బిజ్జలుని సామ్రాజ్యమునకు మంత్రిత్వపదవి నెట్లు వహించును? లక్షపైతొంబదివేల గణముల నెట్లారాధించును? పరమేశ్వరభక్తిని లోకమున నెట్లు ప్రతిష్ఠించును? కావున బసవేశ్వరుఁడు మహనీయుఁడని స్పష్టమగుచున్నది.

మఱియు, బసవేశ్వరుని మహత్త్వము యాజిమొందర నుపయోగింపకున్నను మహాకవిపాల్కుఱికి సోమనాథుఁడు మున్నగు మహనీయుల చిత్తమున కమేయానందము నొసంగదయ్యెనా? కావుననే సోమనాథుఁడు బసవపురాణమును తెనిగించుటయెగాక తారచించిన పండితారాధ్య చరిత్రకును బసవేశ్వరుని కృతిస్వామినిగాఁ జేసియుండెను.

ఇకనీయాజి వర్ణాశ్రమోద్ధరణబద్ధశ్రద్ధుఁడుగాన బసవేశ్వరుని మెచ్చుకొనఁడందురా? అట్లేని మహనీయులగు శ్రీమల్లికార్జున పండితారాధ్యులవారు మున్నగువారు వర్ణాశ్రమధర్మముల నుద్ధరించినవారుగదా? వారీయాజిమాత్రము నుద్ధరింపకుండిరా? వారు బసవనాథుని ద్వేషించినట్లెందైనగలదా? భూషించినట్లె పెక్కుచోట్ల కనఁబడుచున్నది. ఎట్లనిన, పండితారాధ్య చారిత్రయందు శ్రీమల్లికార్జున పండితారాధ్యులవారు బసవేశ్వరునుద్దేశించి "అతనిసామర్థ్యంబు నట్టి మహత్వ మతనిచరిత్రంబు లల్పులకగునె" అని పెక్కువిధముల ప్రశంసించినట్లున్నది.

కావున పరిపూర్ణభక్తిభరితులకు కులాభిమానాదులతో పనిలేదుగాన బసవేశ్వరుఁ డుద్ధరించిన వర్ణాశ్రమధర్మరహిత వీరశైవము విరుద్ధమైనది కాదు. అట్లయినను కేవల కర్మాసక్తులు కొందఱు ఆమార్గమును విరుద్ధముగ నెంచినను ఆమార్గమునకు దగునధికారులే యందున కర్తృలగుదురు. ఇంతియుకాని ఇంతమాత్రమున తత్తన్మార్గ ప్రవర్తకులయందు దోషమును శంకించి వారిని దూషింపఁగూడదు. ఏలన,

బృహస్పతి చార్వాకమతమునకు ప్రవర్తకుడు, అయినను నవగ్రహారాధనయందు ఆయనను పూజించుచునేయున్నారు. మహావిష్ణ్వవతారమగు బుద్ధుఁడు బౌద్ధమతమును కల్పించెను. ఇంతియెగాక శివకేశవులే వేదవిరుద్ధములగు నాగమముల వచించినట్లు పెక్కుచోట్ల గలదుగదా?

ఇపుడీయాజి తాను శ్రౌతగ శ్రుతిధర్మముల సంజీవింపజేయుచున్నాఁడననిచెప్పి వీరినందఱను దూషింప నారంభించునుగాబోలు? వారిగ్రహాచార మెటున్నదో చూచుచుందము. ఈ

విమర్శముంబట్టి బసవేశ్వరుఁడు దూషణార్హుఁడు కాఁడని యేర్పడుచున్నది.

మఱియు బసవేశ్వరుఁడు మహాత్ముడని బసవపురాణాదులయందు చెప్పఁబడియున్నది. దీనింబట్టియు నమ్మహనీయుందు లోపములుగలవని యెన్నకూడదు.

ప్ర॥ బసవేశ్వరుఁడు మహాత్ముఁడెయగుగాక యాజిమహాత్ములకు సరిచువాఁడుగాడు. మఱియు, తనమాహాత్మ్యమునకు హానివచ్చునను నూహతో మహాత్ములనెల్ల దూషించు వ్రతము నవలంబించెను. సకలజనులు తన్నె మహాత్ముఁడనక గాంధినేల మహాత్ముఁడనిరి అనియెంచి యాశాంతమూర్తిపైకి దండయాత్ర కేగినది ప్రసిద్ధమేకదా? వానిమునకు మహాత్మునిలోపములమాత్ర మేల యెంచఁగూడదు?

ఉ॥ లోపముల నెంచుటకు మొదలిడునెడ లోకమున మహాత్ముఁడే దొరకఁడు. ఏలన, వేదముల విభజించి పురాణముల సంగ్రహించి మహాభారతము రచించి బ్రహ్మమీమాంస నుపదేశించి హిందూమతమునకెల్ల పరమాచార్యత్వము వహించియున్న శ్రీవేదవ్యాస మహర్షి అవివాహితయగు దాశకన్యకు దివాసంగమమువలన జన్మించినట్లు తెలియుచున్నది. దీని కేమిచేయుదము? కావుననే మహాత్ములలోపముల నెంచగూడదు. అని పెద్దలు శాసించియున్నారు.

ఈకాలమున మహాత్ముల దూషించు మహానీయు లవతరింపఁ గలరని త్రికాలజ్ఞానియగు నాసాత్యవతేయుఁడు ముందుగనే గ్రహించి నట్లు తోఁచెడిని. కావుననే మహాభారతము ప్రజాగరపర్వమున

శ్లో॥ మునీనాంచ నదీనాంచ కులానాంచ మహాత్మనాం।
ప్రభవో నాధిగన్తవ్యః స్త్రీణాం దుశ్చరితస్యచ॥

మునులు, నదులు, కులములు, మహాత్ములు; స్త్రీలదుశ్చరిత్రము వీనివానిమూలము విచారింపఁగూడదని వచించెను. ఏలనిన, మహర్షుల జననము, తపము ... ... నాల్గోఛింప నే

కులహీనకాంతకో పుట్టినట్లు తేలును. దానంజేసి వారియందు గౌరవము నిలువనేరదు. ఇట్లే నదులయొక్క ప్రవాహముచూడ నద్భుతముగా నుండును. వానిమూలస్థానమును వెదుకఁబోయిన నచట చిన్నకాల్వగా నుండి శౌచాదిక్రియానిర్వర్తనమునకే చాలకుండును. అదిగాంచు నెడ నానదియందు భక్తి కుదురునా? ఇట్లే పెక్కుకులములవారును బహుమానపాత్రులై యున్నారు. ఆకులముల మూలము విచారింప నెట్లుండునో? అట్లే కపీరుదాసువున్నగు మహాత్ములును నపరిమితభక్తి జ్ఞానసిద్ధులై ప్రసిద్ధి వహించిరి. వారిపుట్టుకతో నేమిపని? కావునను ధీమంతులు గుణమును లెక్కసేతురుగాని కులమును లెక్కసేయరు.

ప్ర॥ వారు భక్తులుగాని, జ్ఞానులుగాని, యగుదురుగాక, వారియందు లోపము లున్నప్పు డేల యెంచగూడదు?

ఉ॥ మహాత్ముల నడతయందు లోపము లెట్లుండును? వారినడత సర్వజనసాధారణము గాదు. పరాశరుఁ డంతటిమహర్షి దాశకన్యను జూచి మోహించెను. ఇది లోప మననగునా? అనఁగూడదు. ఏలందురా? వా రట్టినడత నేలనడిచిరో దానికిఁదగుకారణము మన బుద్ధికిఁ గోచరించునదిగాదు. కాన నదిలోపముకాదు.

ప్ర॥ పాకయాజిబుద్ధి మనయందలబుద్ధివంటిదేయని యెంచుదురా? అట్లుగారు. కావున మహాత్ములనడతకుఁ దగుకారణము మనబుద్ధికి గోచరింపకున్నను యాజిమహాబుద్ధికి గోచరింపకుండునా? అందునకు, దగుకారణము గోచరింపమినే దూషించుచున్నాడు కానలయు. దీనందప్పేమి?

ఉ॥ పాకయాజిబుద్ధి యెట్టిదో మాకు తెలియదు.

శ్లో॥ అలోకసామాన్య మచిన్త్యహేతుకం ద్విషన్తి మందా శ్చరితం మహాత్మనాం॥ మహాత్ములచరిత్రము లోకసాధారణమైనది కాదు.

లంచుటకు దగుకారణము అందఱకు తెలియునది కాదు. అట్టిచరిత్ర మును బుద్ధిహీనులు దూషించుచుందురని మహాకవి కాళిదాసు వచించియుండెను. దీనింబట్టి కాళిదాసుబుద్ధికి గోచరింపనట్లు తెలియు చున్నది. ఈత డంతకన్న నెక్కుడందురా? కానిండు.

ప్ర॥ బసవేశ్వరుఁడు మహాత్ముఁడై త్రిగుణాతీతమార్గమున నున్న వాఁడే యగునేని నాయన వివాహమేల చేసికొనియెనని పాకయాజి యాక్షేపించుచున్నాఁడు. దీనికేమి సమాధానము?

ఉ॥ వివాహము సంగమార్థమే యనియు వివాహము చేసి కొననివారు త్రిగుణాతీతులనియు యాజిసిద్ధాంతము కావలయు. కానిచో నతఁ డిట్లేలయడుగును? వివాహము గృహస్థులకయినను సంతానార్థముకాని సంగమార్థముకాదు. అది భక్తులకయిననో భక్త జనపరిచర్యార్థమే. ఇంతమాత్రము తెలియనివాని ప్రసంగము విమర్శ నార్హ మెట్లగు? యాజి తనసిద్ధాంతమునుబట్టి వివాహమాడె నని పర మేశ్వరునిగూడ నాక్షేపింపనగుగదా? ఇఁక నాతనికి తక్కువారు లెక్కయా? కాన యాజిప్రసంగ మధికమైనదే.

ప్ర॥ బసవేశ్వరుఁడు వర్ణాశ్రమధర్మములఁ బాలించెనా? లేదు. వర్ణాశ్రమధర్మములఁ బాలించిన పూర్వాచార్యు లెందఱో కలిగి యుండ బసవేశ్వరనామము స్మరింపవలయునను నిర్బంధమేమి?

ఉ॥ బసవేశ్వరుఁడు వర్ణాశ్రమధర్మములఁ బాలింపకుండెనే? పరి పూర్ణభక్తి భరితునకది లోపము కానేరదని తెలిపియుంటిమి పూర్వా చార్యులు మహేశ్వరపారమ్యమును బోధించి మహేశ్వరభక్తిని లోక మునఁ బ్రతిష్ఠించిరికాని వారు మాహేశ్వరభక్తిని నిలిపియుండలేదు. శ్రీ బసవేశ్వరుఁడైననో మాహేశ్వరభక్తినిలుపనే యవతరించినవాఁడు

మాహేశ్వరభక్తి యైననో మహేశ్వరభక్తికంటె కష్టసాధ్యమైనదియు మహాఫలశాలియు నైయున్నది. నాకంటె నధికులు నాభక్తవరులని పరమేశ్వరుఁడె భక్తులమహిమమును బ్రకటించియున్నాఁడు.

కనఁబడనిమి పరమేశ్వరునందు భక్తి నెట్లో నిలుపనగుగాని ప్రత్యక్షపరమేశ్వరుఁడగు భక్తునందు లేశమయిన భక్తి నిలుపుట కడుకష్టము. ఏలన, కనబడనిపరమేశ్వరుఁడు ఎట్లు వర్తించినను మనల బాధింపఁడు. భక్తుఁడైననో ఎట్లు వర్తించినను మనలోపముల నెంచి బాధించును. పరమేశ్వరుఁ డేయంశమునను మనకడ్డమువచ్చువాఁడు కాఁడుగాన నాయనయం దసూయాద్వేషాదులు కలుగనేరవు. భక్తుడైననో సర్వాంశములయందు మన కడ్డమువచ్చువాఁడుగాన నీయనయం దసూయాద్వేషాదులు కలిగితీరును.

కనఁబడమిని, పరమేశ్వరభావమునను పరమేశ్వరునందు గౌరవ ముండనగును. గాని కనఁబడుచుండుటను, మనుష్యభావమునను భక్తునియందు గౌర ముండనేరదు.

లోకమున నొకభక్తు నారాధించి యాయనమెప్పు గొనుటయె యెంతవానికిని శక్యము గాదు. అట్టియెడ ఒక్కడా? ఇర్వురా? లక్షపై తొంబది వేవుర భక్తగణముల ననుదినము సేవించుచు తన తనుమనోధనముల వారల కర్పించి వా రొనరించిన సకలపరీక్షలకు జలింపక నిలిచి సర్వలోకాతిశాయి మహామహిమభరితుఁడని సర్వపూర్వాచార్యులచే పొగడ్తగన్న శ్రీ బసవనాథుని మహానుభావము మధ్యాహ్న భాస్కర తేజంబు గుడ్లగూబలకుంబలె మూఢాత్ముల కెట్లు తెలియును? అట్టి మహానుభావుని స్మరింపకున్న భక్తి యెట్లుపొడముకును? భక్తి జనింపకున్న జననమరణ ప్రవాహరూప మగు సంసారబంధమునుండి విముక్తి యెట్లులభించును?

కావున బసవేశ్వరుని స్మరించుట దోషావహమో? బసవేశ్వరుని స్మరింపగూడ దనువాని స్మరించుట దోషావహమో? బుద్ధిమంతులె నిశ్చయించికొందురుగాక.

ప్రః॥ భక్తులనిచెప్పి కులహీనుల స్మరించు నాచార మేమతమందైనఁ గలదా?

ఉః॥ భక్తులను కులహీను లనుట ప్రత్యవాయ కరముగాన నట్లనగూడదు. శైవమతమునకు ప్రతిద్వంద్వి యైనది వైష్ణవమతము. అందు పన్నిద్ద రాళ్వారులు కలరు. వారిలో బ్రాహ్మణేతరులేగాక పెక్కురు కడజాతియందు బుట్టినవారు నున్నారు. శ్రీవైష్ణవులు వారిని స్మరించుటమాత్రమే గాదు. వారిప్రతిమలు లేకున్న దివ్యక్షేత్రము కానేరదని నిర్ణయించి శ్రీ మహావిష్ణు సన్నిధానమందును తీర్థప్రసాదములు గ్రహింపనేరరు.

దీనింబట్టి యామతమునందు భక్తుల కెంతయున్నత స్థానమొసఁగబడియెనో యూహించుకొనుడు. దీనింబట్టి బసవేశ్వరస్మరణము దూష్యమెట్లగు? భూష్యమే కదా?

ప్రః॥ ఇట్టి యాచారమును స్మార్తు లంగీకరింతురా?

ఉః॥ స్మార్తు లంగీకరింపకుండుట దోషావహము కానేరదు. ఒకమతమువారికి మతాంతరుల యంగీకారముతో నేమిపని? అయినను స్మార్తమతమునకు బరమాచార్యు లగు శ్రీశంకరాచార్యులవారు మనీషాపంచకమునందు శ్లో॥ చండాలోస్తు సతు ద్విజోస్తు గురురిత్యేషా మనీషామమ॥ జ్ఞానము కలవాఁడు చండాలుఁడైనను సరే లేక ద్విజుఁడైనను సరే వాఁడె గురుఁడని నాయభిప్రాయమని వచించియున్నారు. వారు జ్ఞానినిగూర్చి చెప్పిరిగాని భక్తునిగూర్చి చెప్పిరాయని శంకింత

బనిలేదు. జ్ఞానముకంటె భక్తి తక్కువైనదికాదని లోగడ దెలుపం బడియె. కావున పరిపూర్ణభక్తిరసభరితుండగు బసవనాథువిస్మరణము సర్వవిమతజనాసమ్మతంబును గాదు.

ప్ర॥ భక్తులుగాని జ్ఞానులుగాని యగుదురుగాక. అట్టి కుల హీనులను స్మరింప వేదము సమ్మతించునా?

ఉ॥ శ్రు॥ కులాలేభ్యః కర్మారేభ్యశ్చ వోనమోనమః అని శ్రుతి కుమ్మరులకొఱకు, కమ్మరులకొఱకును నమస్కారములను విధించుచున్నది. అటం జెప్పంబడినవారు భక్తులో జ్ఞానులోయని యంగీకరింపక తప్పదు. లేకున్న మూఢులకొఱకని యంగీకరింప రాదు గదా? ఇట వేదభాష్యకర్త లీయర్థము నంగీకరించిరా అని శంకింపం బనిలేదు. భట్టభాస్కరులవారు శ్రీరుద్రభాష్యమునందు సర్వేపి చైతే వివిధారాధన సంప్రీణిత పరమేశ్వరప్రసాదభాజో జాతివిశేషాఏవ నమస్క్రియన్తే॥ ఈకుమ్మరులు మొదలగువారెవ్వ రనిన, పలువిధము లగు పూజలచే పరమేశ్వరు ననుగ్రహము వడసిన వారగు నాయాజాతి మానవులే నమస్కరింపంబడుచున్నారని చెప్పి యున్నారు. పూజలచే పరమేశ్వరు ననుగ్రహము నార్జించినవారు భక్తులు గాకున్న మఱి యెవ్వరు?

దీనింబట్టి కులహీనులైనను భక్తులగువారి స్మరణము శైవ పూర్వాచార్యులకును సర్వవిమత పూర్వాచార్యులకును సమ్మత మగుటయేగాక వేదములకును వేదభాష్యకర్తలకును పరమసమ్మత మని సిద్ధాంతమైనది. కావుననే బసవేశ్వరుండు భక్తులను కులహీను లనియెంచక సేవించెను. బసవేశ్వరుండైననో బ్రాహ్మణకులజుండేగాని హీనకులుండును గాండు. ఇట్లు బసవేశ్వరుండు స్మరణీయుండే యని యందఱు సమ్మతి కనంబరుపంబడియె. ఇది యాజకసమ్మతమందురా? కానిండు. తుంగభద్రాస్నానమున బెల్లంబులగు నాజ్ఞలో యేమి?

ప్ర॥ భక్తు లెందఱో యుండ బసవేశ్వరునే స్మరింపనేల?

ఉ॥ భక్తు లసంఖ్యాకులున్నమాట నిజమే. అయినను బసవేశ్వరుడు కేవల భక్తుడే గాక "శివభక్త్యుద్ధరణార్థ మాగతం" అను నభియుక్తోక్తినిబట్టి భక్తి నుద్ధరింప నవతరించినట్లు తెలియుచున్నది. భక్తుడు తానుమాత్రము తరించును. ఇటక భక్తినుద్ధరించిన మహానుభావుడైననో లోకమునంతను తరింపజేయును. ఈకారణమున బసవేశ్వరునందు విశేషము స్పష్టమగుచున్నది.

ఇదిగాక, పరమేశ్వరుడు భక్తులను తనకంటె నధికులనుగా మన్నించును, ఈ యర్థమును శ్రీమదప్పయదీక్షితాదివిద్వత్సార్వభౌము లనేకు లంగీకరించియున్నారు. బసవేశ్వరుడైననో భక్తి నుద్ధరింప నవతరించినమహానుభావుడు. పరమేశ్వరుడు కేవలభక్తులనె తనకంటె నధికులనుగా మన్నించునప్పుడు భక్తి నుద్ధరింప నవతరించిన భక్తిసామ్రాజ్యమూర్ధాభిషిక్తుడగుబసవనాథు నెట్లు మన్నించునో అది వచింప మనవాక్కులకే కాదు. బ్రహ్మాదులకును శక్యముకాదనుట నిక్కము.

ఇట్టి బసవేశ్వరుని స్మరణము ఎంతయో పూర్వపుణ్యము లేకున్న లభించునా? లభింపనే లభింపదు.

అల్లేని శి. వి. పాకయాజి బసవేశ్వరుని స్మరింపగూడదనుటకు కారణ మేమందురా? ఎంతవెదకినను వానిపురాకృతముకంటె వేరు కారణము కన్పట్టుటలేదు. బసవేశ్వర దూషణవలన నష్టమే మనిన కాశీఖండము పంచసప్తతితమసర్గమున శ్లో॥ శివనిందారతా యేచ శివభక్తజనేష్వపి। తేయాంతి నరకేఘోరే యావచ్చంద్రదివాకరౌ॥ శివనిందాపరులును శివభక్తనిందకులును సూర్యచంద్రులుండువరకు ఘోరమగు నరకంబున నుందురని చెప్పబడియున్నది.

శ్రీ బసవేశ్వరుగుణములు లిఖింపను ముద్రింపను నశక్యములుగాన నిప్పటికింతటితో ముగించుచు ఖండనార్థసంప్రాప్త భక్తజనదూషక వాఙ్మిశ్రిణసంభావిత సకలదోషపరిహారమునకై బసవేశ్వరుపలుమారు స్మరించుచు చిత్తము నమ్మహనీయునందుఁ బ్రవేశపెట్టుదము.

చ. అసమగుణాఢ్యునందు శరణాగతవత్సలునందు జంగమ
శ్వసనమహిష్ఠునందు భవవారణకారణునందుభక్తమా
నసపరిపూర్ణునందు గణనాథుఁడు మాబసవయ్యయందు మా
బసవనియందు మాబసవపాత్రునియందు వసింపు చిత్తమా.

గీ. సుకవు లొగి నీకు బసవేశ సుకృతు లనెడు
శ్రవణగళమూర్ధ ధార్యభూషణము లిడిరి
పొసగ ధరియింపు మిది పాదభూషణంబు
దూషకవ్రాత ముఖదంతపేషణంబు.

గీ. ఉద్భటారాధ్య వంశసముద్భవుండ
నాగలింగాహ్వయుఁడఁ జల్పినాడ భక్త
ముఖ్యబసవేశ సత్పాదభూషణంబు
దోషిజనశోషణము భక్తిపోషణంబు.

ఇది

బసవేశ్వరభూషణము.

శివము.



శ్రీ

శివాయగురవేనమః

# శైవసాతిభాష్య

# నిర్ణయము.

ఇది

తెనాలి సంస్కృతకలాశాలా

సాహిత్యోపాధ్యాయులగు

బ్రహ్మశ్రీ మదిగొండ. నాగలింగశాస్త్రుల

వారిచే వ్రాయంబడియె.

---

తెనాలి రైతు ముద్రాక్షరశాలయందు

ముద్రింపఁబడియె.

1922.

C. M. V. Mahajani

శివాయగురవేనమః.

# ఉపోద్ఘాతము.



పండితవర్యులారా!

శ్రీకరభాష్యము, నీలకంఠభాష్యము ననిరెండు బ్రహ్మసూత్ర శైవభాష్యములు కలవనుట యెల్లరకు విశదమే. నీలకంఠభాష్యము నకే శ్రీకంఠభాష్యమనియు నామాంతరము కలదు.

వీనిలో శైవులకు ముఖ్యమైనదెద్ది యని యోజించి ప్రాచీనత్వము, సర్వదేశప్రఖ్యాతత్వము, నిర్దుష్టత్వము, శైవసమయసిద్ధ సర్వవిషయ భూషితత్వము మున్నగు గుణములు గలిగియుండు కతన నీలకంఠభాష్యము ముఖ్యమని నామదిలో నిశ్చయించుకొని యుండి నరసాపురమునఁ జరిగిన శైవమహాజన సభలో నీలకంఠభాష్య మహోత్కర్షమును గూర్చి వ్రాసిన వ్యాసమును చదివియుంటిని.

ఆమహాసభకు శ్రీమదుర్లాం సంస్థానాధీశ్వర సమాస్థాన విద్వాంసులగు బ్రహ్మశ్రీ, చాగంటి శీతయ్యశాస్త్రులవారు దయచేసి యుండి శైవులకు నీలకంఠభాష్య మెంతమాత్రము గ్రాహ్యముకాదు. శ్రీకరభాష్యమే గ్రాహ్యమని వ్రాసికొనివచ్చిన వ్యాసమును చదివిరి. దైవవశమున నిట్లు పరస్పరవిరుద్ధములగు నభిప్రాయము లేకకాలమున వ్యక్తమైనవియేగాని నిజముగా వారియభిప్రాయము నేనుగాని నాయభిప్రాయము వారుగాని యెంతమాత్రమైన నెఱిఁగియుండి యిట్లు వ్రాయుటచే నేర్పడినవి కానేరవు.

ఎట్లైననేమి? మాయిర్వురలో నభిప్రాయభేదము స్పష్టపడినది. కాన నద్దానిం దీర్మానింపవలసిన బాధ్యత మహాసభవారిపైనుండెను.

కాని యందునకప్పుడు వారామోదింప రైరి. మాలో మేమే సడలు కొనిన మేలని వారభిప్రాయపడి యుండవచ్చు. కాని యదియెట్లు సమకూరును? ఏనభిప్రాయపడినదే న్యాయ్యమను నిశ్చయము నాకు కలిగియుండునంతదనుక నెదిరివాదమెట్లు సమ్మతమగు? ఈ భావమే శ్రీ శీతయ్యశాస్త్రిలవారికినిం గలిగియుండునని నానమ్మకము. ఇట్లుగాక అనాలోచితముగా నేదియోపచించి పౌరుషముతో వ్రాసినే నిల్పుట కుద్యమించుచున్నారమనినీరెంచుదురా? ఎంచుడు. ఇందునకు మేమెంతమాత్ర మంగీకరింపము. మావాదములను పూర్తిగాం బరిశీలించిన మీద మీరెట్టులెంచినను సమ్మతమే. పై సంగతి వినుడు.

తిరుగ నీచర్చ మాదలగ్రామమున జరిగిన శైవమహాసభలోం దలచూపెను. ఏలనంగా. నాచే వ్రాయంబడిన మతగ్రంథముల ముద్రించు ప్రస్తావమందు రాంగానే వీరికి మాకును మతభాష్యవిష యమై తగాయిదా కలదుగాన నది పరిష్కారమగువఱకు వీరిగ్రంథ ములు ప్రకటింప వీలులేదని శ్రీ శీతయ్యశాస్త్రిలవారు సెలవిచ్చినం దున సభ్యుల కోరికనుబట్టి యీచర్చ ఆరంభింపంబడియు నప్పటి సభలో శ్రీ శీతయ్యశాస్త్రిలవారు సభాధ్యక్షులుగా నున్నందున వారి తోచర్చకూడదను నుద్దేశముతో కార్యదర్శులచే నడుమన యాపి వేయంబడియె.

అయినను వెలకుర్రుగ్రామమున జరిగిన మహాసభలో నీచర్చ కొంతసేపు జరిగినమీద నాపుదలసేయంబడి యుభయ వాదములు వ్రాసియనుపునెడ కార్యనిర్వాహక సభలో తీర్మానముచేయం గలమని మహాసభవారు సెలవిచ్చి యున్నందున నాయభిప్రాయము వ్రాయ వలసివచ్చెను. వ్రాయనిచో నీపక్షము దుర్బలమని యెన్నంబను గదా? ఇదియు నల్పముగ వ్రాసినం జాలునా? చాలదు. అణుమా

త్రమున నభిప్రాయమంతయు స్పష్టపడుటెట్లు? దానంజేసి / పూర్తి
గనే వ్రాయవలయు. ఇట్లువ్రాసి కార్యనిర్వాహక సభవారి కర్పిం
పఁగా నాసభయం దల్పసంఖ్యాకులేగదా కాంచుదురు. అంతమా
త్రన నీపరిశ్రమము సఫలమగునా? కాఁజాలదు.

ఎట్లును నీవాద ప్రతివాదములు చాలకాలమునుండి చర్చలో
నుండి యున్నందున లోకులెల్లరు వీని స్వరూపమును ఫలితమును
దెలిసికొను కుతూహలము కలిగియున్నవారు. కావున ముద్రింపిం
చుటే యుచితము. అని తోచుటంజేసి ముద్రింపింపవలసియు
వచ్చెను.

నీలకంఠ భాష్యగత మహాగుణములఁ బ్రకటించుటయందే భావ
ముగలవాఁడఁగాని నిజముగా శ్రీకర భాష్యగతదోషముల నుద్ఘాటన
జేయుటయందుఁ గుతూహలముగలవాడంగాను. ఏమిచేయుదు?
దైవంబీజనునిచే నిప్పనియుఁ జేయింప సమకట్టినది. దైవప్రేరణంబు
నంజేసి యకార్యంబును నవశ్యకరణీయంబె యగుంగదా? అట్లుగాక
యేమిచేయనగు?

ఇది యకార్యంబని యుపేక్షింతునా? ఇదిగాదు అదియని
చర్చవచ్చినప్పు డుపేక్షించుటెట్లు?

శ్రీకరభాష్యమే ముఖ్యమని యొప్పరాదా? అట్లొప్పిన నీపుట్టి
యేమి మునుఁగునని యడుగుదురా?

వినుఁడు. శైవసంఘమునకు భాష్యములు రెంటిలో నేదియు
న్నను సరే. రెండు నున్ననుసరే. రెండులేకున్ననుసరే. వీనిలో
తప్పులతడికె నిలిచిననుసరే. అట్టిదానింజూచి లోకులు పరిహసించి
నను సరేయని యొరులవలెనేను నిట్టిభావమే గలిగియుందునేని నట్లే
యూరకుందును. అట్లుగాక యొక్కటె సూత్రభాష్యము ముఖ్య
ముగా సిద్ధాంతితమై యుండవలయుననియు, అది నిర్దుష్టముగానె యుం
డవలయుననియు లేనిచో నీసంఘమునకవమానకరమనియు నేనెం

కరభాష్యము సదోషంబనియు దృఢభావము గలిగియుండి యెట్లయిన సరేయని యూరకుండుటెట్లు ?

ఈకారణంబున నిప్పని తప్పదయ్యె. కావున మన్నింపవేడుచున్నాఁడను. నాకు గలిగియున్న యీభావము ప్రమాదమూలమో! లేక భ్రమమూలమో ? స్పష్టపడుసమయము వచ్చినప్పుడు వెనుదీయుటేల ? రెండువాదముల గనఁబరుచుటే నాపనిగాని వీనిలో నిది ముఖ్యమని నిర్ధారణచేయు భారమైననో మహాజనుల పైననేయున్నది. దైవవశమున శ్రీకరభాష్యమె నిర్దుష్టమనియు,ముఖ్యమనియు మీహృదయంబులకు నచ్చెనా ? అదియెనాకు పరమసమ్మతము. ఈరెంటిలో నొకటి యస్మత్ప్రత్నార్జితము. తక్కినది కాదు అనుమాట లేదుగదా ! ఉభయవాదముల సంగ్రహించినంతవఱకు క్రిందు పొందుపరచితి.

ప్రమాదవశమునగాని, అసూయాదోషమునఁగాని స్వపక్షమునందగు దోషములను విపక్షమునందగు గుణములను వ్రాయక విడిచితి వేమో దీనింబట్టి యెట్లునిర్ధారణ చేయనగునని మీరు నన్ను ప్రశ్నింపవచ్చును. దీనికి నేను నిరుత్తరుఁడనే.

అయినను నాయందు దయయుంచి యట్టిలోపముల వెంటనే ప్రకటింపఁగలందులకు శ్రీ శాస్త్రులవారిని నుభయవాదములఁ బరిశీలించి న్యాయమును వెల్లడింపఁగలందులకు మిమ్మును ప్రార్థింపుచు కథాప్రక్రమంబు పక్రమింప ననుజ్ఞగొనుచున్నాఁడను.

ఇట్లు

విధేయుడు,

ముదిగొండ నాగలింగశాస్త్రి.

శ్రీ

శివాయగురవేనమః

# శైవభాష్య నిర్ణయము



శ్రీకరభాష్యము శైవులకు ముఖ్యమనుటకు సాధకములు.

1. కలౌపండితదేశికః అను ప్రమాణమునుబట్టి కలియుగమున శైవాచార్యులైన శ్రీపతి పండితులవారిచే రచింపఁబడి యుండుట మొదటిది.

2. శైవులకు లింగధారణము ముఖ్యముగాన నదియిందుస్పష్ట వచనములచే సిద్ధాంతీకరింపఁ బడియుండుట రెండవది.

3. శైవులు లింగైక్యమును ముక్తిగా నంగీకరించుచున్నారు. శ్రీకరభాష్యమున భేదాభేదము సిద్ధాంతీకరించు నప్పుడు జీవునకు బ్రహ్మమునకు బద్ధదశయందు భేదము, ముక్తదశయందభేదము కలదని నిర్ణయింపఁబడి యుండుటచే నీభాష్యము నొప్పినగాని లింగైక్యము సిద్ధింపకుండుట మూఁడవది.

ఈ కారణములచే శ్రీకరభాష్యము గ్రాహ్యమగును.

శ్రీకర భాష్యము ముఖ్యముకా దనుటకుఁగల కారణములు.

1. సుమారు ఇరువది సంవత్సరముల క్రిందటి వఱకు శికింద్రాబాదులో నివసించుచుండిన శ్రీపండిత స్వాములవారిచే నీభాష్యము తాత్కాలిక పండిత సాహాయ్యముతో నిర్మింపఁబడి యాదిశ్రీపతిపండిత కృతముగాఁ బ్రకటింపఁబడినది. కావుననే యీస్వాములవారికిఁ బూర్వమెవ్వరిచేతను పేర్కొనఁబడి యుండలేదు. దానంజేసి కేవల మిది నవీనగ్రంథమేగాని ప్రాచీనమైనది కానేరదు. శ్రీస్వాములవారు తమచే రచింపఁబడినదాని పురాతనముగాఁ బ్రకటింపఁ బూనినప్పుడు [illegible] శ్రీపతిపండిత [illegible]మైనందున తమ కూట

స్థునిచే నిర్మింపఁబడినట్లు వెల్లడించుటన్యాయ్యమే. దీనింబట్టియు శ్రీస్వాములవారే దీనికిఁగర్తలనితోచెడిని. అట్లుగాక యాది శ్రీపతి పండితులవారే నిక్కముగ దీనిని రచించియుండిరేని నాగ్రంథము నీరివఱకు నెవ్వరికిఁ గానంబడక తద్వంశ్యులగు వీరికేయెట్లులభించెనో దుర్నిరూపము గదా? ఈవిధముననిద్ది నవీనమని స్పష్టపడుచున్నది గాని దీనికంటె ప్రాచీనమైన నీలకంఠ భాష్యము సిద్ధమై యున్నప్పుడు దానికంటె నిదియె ముఖ్యమనుట యెట్లు? కావున నిది ముఖ్యముకాదు.

ప్ర:—లింగధారణ చంద్రిక 12 వ పేజిలో, శ్రీమచ్ఛ్రీపతి పండితయతీంద్రకృత శ్రీకరాఖ్య బ్రహ్మమీమాంసాభాష్యే అని యీభాష్యము పేర్కొనఁబడియున్నది గాననిది ప్రాచీన మెట్లుగాదు?

ఉ:—లింగధారణ చంద్రికను ముద్రించుకాలమున శ్రీకర భాష్యమువాడుకలోనికి వచ్చినది. కావున ప్రాచీనమని లోకులకు విశ్వాసము గలిగించుటకు ముద్రాపకులచే పేరుమాత్రమిందుఁజేర్పఁబడినదే గాని గ్రంథకర్తచే నుదాహరింపఁబడినది కాదు.

ప్ర:—గ్రంథకర్త శ్రీకరభాష్యమును పేర్కొనియుండ లేద నుటకు కారణమేమి?

ఉ:—లింగధారణచంద్రిక (53 పేజిలో) విశిష్టాద్వైతపక్ష ఏవాంగీకరణీయః. అనియున్నది. గ్రంథకర్త శ్రీకర భాష్యమును పేర్కొని యున్నయెడ భేదాభేదము శ్రీకరభాష్య సిద్ధాంతము గాన ముందు దాని సిద్ధాంతముచేసి పిమ్మట విశిష్టాద్వైత మునుసిద్ధాంతముచేయఁగా స్వవచన వ్యాఘాతముతప్పనేరదు. ఈదోషమునుద్ధరించుటకై రెంటిలో నొకటి ప్రక్షిప్త మనక తీరదు.

ప్ర:— ఈ రెంటిలో నేదికల్పితము?

ఉ:— శ్రీకరభాష్యమను పేరుమాత్రము మొదటను విశిష్టాద్వైతసిద్ధాన్తస్వరూపము పిమ్మటను నిరూపింపఁబడియున్నది. కావునసిద్ధాంతస్వరూపమంతయుఁ బ్రక్షిప్త మనుటకంటె శ్రీకరభాష్యమును పేరుమాత్రము ప్రక్షిప్తమనుటలాఘవము. ఇదిగాక శ్రీమ

చ్ఛ్రీపతి పండితకృత శ్రీకరాఖ్యబ్రహ్మమీమాంసాభాష్యే జిజ్ఞాసాద్యధికరణేషు స్పష్టీకృతత్వేనచ అనువాక్యమును తీసివైచినపూర్వోత్తరవాక్యములు సరిపడియున్నవి. కాని విశిష్టాద్వైతపక్షఏవాంగీకరణీయః అనువాక్యమునుగాని తత్స్వరూపమును నిరూపించిన పూర్వోత్తర భాగమును గాని తీసివైచినయెడ పూర్వోత్తరగ్రంథము సరిపడుటలేదు. కాబట్టి శ్రీకరభాష్యమను మాటప్రక్షిప్తమని యొప్పక తప్పదు.

ప్ర:—విశిష్టాద్వైతపక్ష ఏవాంగీకరణీయః అనుమాట బ్రహ్మవిద్యాధ్వర్యులవారు చెప్పినట్లు చంద్రికలోనున్నది. కాన ప్రసంగ వశమున విశిష్టాద్వైతము మతాంతరమే యనువాదింపఁబడినది. దీనింబట్టి స్వమతము భేదాభేదమేయనియేల నిర్ణయింపరాదు?

ఉ:— లింగధారణచంద్రికలో నెచ్చటనేని భేదాభేదసును పేరైనఁగలదా? ఇందునిరూపించిన విశిష్టాద్వైతము పరమతమనియు పేరైన నీఁదులేని భేదాభేదము గ్రంథకారునిమతమనియు నెంచుటకిం దభిమానముకంటె కారణాన్తరము కనఁబడదు. ఇది గాక లింగధారణచంద్రిక 52 పేజీలో జీవబ్రహ్మణోరభేదాంగీకారే ద్వాసుపర్ణాసయుజావిత్యాది భేదప్రతిపాదకవాక్యవిరోధేన భేదాంగీకారే నేహనానాస్తికించన ఇత్యాద్యభేద విధాయకవాక్య విరోధేనచ ఉభయోరప్యప్రామాణ్య ప్రసక్త్యా విశిష్టాద్వైతపక్ష ఏవాంగీకరణీయః అనివ్రాయఁబడియున్నది. భేదప్రతిపాదక శ్రుతులకు నభేదప్రతిపాదకశ్రుతులకు విరోధములేకుండ విశిష్టాద్వైతపక్షమున సమన్వయించిన బ్రహ్మవిద్యాధ్వర్యులవారి శివదర్పణమనుగ్రంథమును ప్రమాణముగా గ్రహించియున్నారు. శివదర్పణమనఁగా నీలకంఠభాష్యమునకు వ్యాఖ్యానమైన శివార్కమణిదీపికకు వ్యాఖ్యానము. దీనింబట్టి నీలకంఠభాష్యగతవిశిష్టాద్వైతమునే స్వమతముగ చంద్రికాకారుఁడు గ్రహించినట్లు స్పష్టమగుచున్నది. శివదర్పణగ్రంథకర్త్రలయందెంతో పూజ్యభావము లేనిది బ్రహ్మవిద్యాధ్వర్యుచరణైః

అని చరణశబ్దము ప్రయోగించియుండరు: కావున విశిష్టాద్వైతము చంద్రికా కారునికి పరమతమనుట న్యాయ్యముకాదు.

ఇంతియకాక చంద్రికాకారుని కాలమునాటికి శ్రీకరభాష్య మనునదియొకటి యుండి యందగు భేదాభేదమే స్వమతమను: నళి మానము చంద్రికాకారుని కున్నపక్షమున భేదప్రతిపాదక శ్రుతులకు నభేదప్రతిపాదక శ్రుతులకు భేదాభేదపరముగా సమన్వయము చేసిన శ్రీకరభాష్యసిద్ధాంతమునే యుదాహరించి యుందురు. భేద ప్రతిపాదక శ్రుతులకు నభేదప్రతిపాదక శ్రుతులకు విశిష్టాద్వైతపక్షమున సమన్వయము చేయుటకంటె భేదాభేదపక్షమున సమన్వయము లాఘవము. అట్లయినను భేదాభేదము నుదాహరింపరైరి: ఇట్లు స్వమతమై లాఘవమై యున్న భేదాభేదమును గూఢముగా మనసుననే నిడుకొని మతాంతరమునందలి సమన్వయమును గనఁబరచవలసిన గ్రహచారము చంద్రికాకారుని కేల కలిగెను? మతాంతరము నుదాహరించిన నీకేమిలాభమని పండితు లాక్షేపింతురను శంకవారికి లేదుకాఁబోలు? కావున చంద్రికాకారుని కాలమునాటికి శ్రీకరభాష్యము లేనేలేదు.

ప్ర:—లింగధారణ చంద్రికయందు 30 పేజీ "యోమాయో పాధికోదేవో లింగరూపీ సదాశివః। సోవిద్యోపాధికోభూత్వాభవత్యంగస్వరూపవాన్। తత్ప దేనోచ్యతే లింగత్వం పదేనాగమీరితం। అన యోరైక్యభావోఽయం సంబంధోఽసిప దేనచ" ఇత్యాదిస్థలముల యందైక్యభావమంగీకరింపఁబడినది. ఈయైక్యభావము భేదాభేదము నందుఁగలదు. అదియిందీకరింపఁ బడియున్నదిగాన చంద్రికాకారుని మతము భేదాభేదమే యని యేల నిర్ణయించుకొనరాదు?

ఉ:—భేదాభేదము నందైక్యభావము కలదనుట జీవేశ్వరులకు బద్ధదశయందు భేదము ముక్తదశయందభేదమునని యొప్పిననేగాని సంభవింపదు. అటొప్పునెడ శ్రుతిసూత్రవిరోధము తప్పదుగాన నపసిద్ధాంతమగునని ముందు నిరూపణము కాఁగలదు. దీనింబట్టిచం

ద్రికాకారుఁ డుదాహరించిన నైక్యభావము భేదాభేదములోనిది కానే రదు. ఇం కేమన ననుభవాద్వైతములోనిదే యని గ్రహింపవలయు.

ప్ర:—చంద్రికాకారుఁ డుదాహరించిన నైక్యభావము శ్రీకర భాష్యమునందలి భేదాభేదమున కెట్లు సంబంధింపదు?

ఉ:—చంద్రికాకారుఁ డుదాహరించిన నైక్యభావము అను భవాద్వైతమునుబట్టియే వచ్చినట్లొప్పికొరవలయు. అట్లుగానిచో ఆపేజీయందే (౩౦) జీవబ్రహ్మైక్యాపరనామక నీరనీరసంయోగోక్తి పదవాచ్యః తత్త్వంపదలక్ష్యార్థయోర భేదమితివిజ్ఞానాత్మ తదనంతరం అహంబ్రహ్మాస్మీత్యఖండ మహావాక్యార్థమను భవః జీవన్ముక్తో భవిష్య తీతి. ఈవిధమున జీవబ్రహ్మైక్యము నీరును నీరును గలసినట్లని చంద్రి కయందే కలదు. ఈవిధమగు నైక్యము అనుభవాద్వైతముననే గాని శ్రీకరభాష్యగత భేదాభేదమున లేదు. నీరునునీరును గలిసిన ట్లని చెప్పఁబడిన నైక్యము శ్రీకరభాష్యమున నధికముగ ఖండింపఁబ డియెయుండినది. నిజమిట్లులుండ శ్రీకరభాష్యగత భేదాభేదమునం దలి నైక్యమును చంద్రికాకారుఁడు గ్రహించెననుట కేవలము విరు ద్ధము. ఇట్లే యీమతమున ముక్తిగానాడఁబడు లింగైక్యపదం బును, అనుభవాద్వైతమును బట్టి వచ్చినదేగాన శ్రీకరభాష్యసిద్ధాం తమునుబట్టి వచ్చినదెంతమాత్రము కానేరదు.

కాబట్టి లింగధారణ చంద్రికాకారుఁడు శ్రీకరభాష్యసి ద్ధాంతమునుగాని, కొనకు శ్రీకరభాష్యమను పేరునుగాని యుదాహ రించెననుట కల్ల. తదితరులయిన నెచటనయిన నీభాష్యము నుదా హరించినట్లు లెక్కఁగినంతవఱకు సంస్కృతాంధ్రద్రావిడకర్ణాటవాఙ్మ యములందు గోచరించుట లేదు.

ప్ర:—కలాపండిత దేశికః అను ప్రమాణమునుబట్టి శ్రీపతి పండితులు భాష్యకర్తలని యేల నిశ్చితముకాదు?

ఉ:—ఈప్రమాణము నెవ్వరేగ్రంథమున వాడియున్నారు? దీనింబట్టి మల్లికార్జున పండితులు భాష్యకర్తలనిగ్రహింపవలయునా?

లేక శ్రీపతిపండితులు భాష్యకర్తలని గ్రహింపవలయునా? పండిత దేశికపదము ఇద్దఱను బోధించుచున్నది. గాన వీరిలో శ్రీపతిపండితుఁడే తత్పదవాచ్యుఁడని యెట్లునిర్ధారణము చేయనగును? పోనిండు ఈవచనము ప్రమాణసిద్ధమే అయియుండనీ? దీనింబట్టి లోకులు వీరిద్దరలో తమకిష్టమువచ్చిన పండితునే గ్రహింపనీ! విమర్శింపగా వీరిద్దరును భాష్యకర్తలు గారనుట స్పష్టము. ఏలందురా వినుడు.

సోమనాథుఁడు పండితారాధ్యచారిత్రమును వ్రాసియున్నాఁడు. అందు మల్లికార్జునపండితుఁడు వ్రాసిన గ్రంథములను పేర్కొనియున్నాఁడు. కాని అందు శ్రీకరభాష్యమును రచించినట్లు వచించియుండలేదు. మల్లికార్జునపండితుఁడు తాను వ్రాసినశివతత్త్వసారమునందును స్వకృతములగు గ్రంథములను పేర్కొనియుండెను. కాని యందైన శ్రీకరభాష్యమను పేరులేదు. తానిద్దాని రచించియుండిన యెడ చిల్లరగ్రంథముల నన్నిటిం బేర్కొనియుండి ముఖ్యమగుసూత్రభాష్యమును ప్రస్తావించియైన నుండకుండునా? కాబట్టిమల్లికార్జున పండితుఁడు దీనినివ్రాయలేదనుట స్పష్టము

ఆచారిత్రమునందె శ్రీపతిపండితుని చరిత్రంబును వ్రాయంబడియున్నది. అందు శ్రీపతిపండితుని మాహాత్మ్యంబు బాగుగ నభివర్ణింపఁబడియున్నది. కాని యాయన శ్రీకరభాష్యమును నిర్మించినట్లు చెప్పఁబడియుండలేదు. ఇదిముఖ్యమైనవిషయము కానందున విడిచెనేమోయని యెంచుటకును వీలులేదు. అట్లెంచుటకును సూత్రభాష్యము రచించెననుటకన్న ముఖ్యమైన విషయమెద్ది? శ్రీనీలకంఠ శంకర రామానుజ ప్రభృతు లందఱును బ్రహ్మసూత్రభాష్యనిర్మాణమున నెగడా కీర్తికాయులై యున్నవారు. ఇట్టిసందర్భమున మహానుభావుడగు సోమనాథుఁడు బ్రహ్మసూత్రభాష్య నిర్మాణము పండితుని చరిత్రములో నవముఖ్యాంశముగా తలంచునా? తలంపఁడు కాబట్టి శ్రీపతిపండితుఁడు శ్రీకరభాష్యమును రచించినసంగతి సోమనాథుఁడెఱుంగఁడని విశ్వసింపవలయు. ఆలోచింపనిదియు యుక్తముగాఁదోఁపదు.

ఏలనగా సూత్రభాష్యము రచించినవే యాచార్యుండును దేశములన్నియుఁదిరిగి . దిగ్విజయముచేసి తనభాష్యసిద్ధాంతమును స్థాపించుకొనునుగాని తానువ్రాసినది దాచిపెట్టుకొని యేరికిం జెప్ప కయేదివమున కేగఁడు. నీలకంఠ శంకరప్రభృతు లందఱు దిగ్విజయము చేయుటనేగదా వారి భాష్యములు జగత్ప్రఖ్యాతిఁ గాంచఁ గలిగినవి. లేనిచో నాఁడె ఇవన్నియు నంతరించియుండును.

కాఁబట్టి శ్రీపతిపండితుఁడు సూత్రభాష్యమును రచించియుండె నా? దిగ్విజయము చేసియేయుండును. దిగ్విజయముచేసి తనసూత్రభాష్యమునులోకమున స్థాపించియుండెనా? ఆవార్త సోమనాథుఁడెచట నైన వినియేయుండును.వినియున్న తెడగ్రంథమున- వ్రాయకుండునా? ఉండనేరఁడు.

ఒకవేళ శ్రీపతిపండితుఁడు పూర్వాశ్రమవంశమునుబట్టి శ్రీస్వాములవారికి దగ్గరవాఁడైనను, కాలమునుబట్టి శ్రీసోమనాథునకె ఎక్కువ దగ్గరవాఁడగును. శ్రీపతిపండితునిచరిత్రము పూర్తిగాఁ దెలియుటకు కాల సామీప్యమే ఎక్కువసాధకముగాని వంశసామీప్యముకాదు. కావున సోమనాథుఁడెఱుఁగని శ్రీపతి పండితుని భాష్యకర్తృత్వము శ్రీస్వాములవారికిఁ దెలిసెననుట ఎట్లువిశ్వసనీయమో తోఁపదు. శ్రీపతి పండితుఁడు రచింపకుండనీ మఱియే యితరులయిన పూర్వమే రచించి రని నమ్ముటకును తగిన నిదర్శన మెద్దియు గోచరించుటలేదు. కావున నవీనమనియే తోఁచెడిని. ఈశ్రీకరభాష్యముకంటెనెగాక తక్కుశాంకరభాష్యాదుల కంటెను ప్రాచీనమని సకలవిద్వాంసులచే పొగడ్తగన్న నీలకంఠభాష్యము సిద్ధమైయున్నప్పుడు దానికంటె నిదియె ముఖ్యమని యెట్లుగ్రహింపవలయునో ఎన్నివిధముల నాలోచించినను పొడగట్టుటలేదు.

ప్ర:—ఇది ప్రాచీనము కాకుండనీ నవీనమేకానీ? బాలాదపిసుభాషితంఅనున్యాయమున శైవులకావశ్యకమగు లింగధారణమిందు స్పష్టముగా నిరూపింపఁబడియున్నది గాన నిదిముఖ్యమని యేలనొప్పఁగూడదు?

ఉ:—శైవులకు లింగధారణ మావశ్యకము కాదనిగాని యది యిందులేదనికాని యెవరును జెప్పసాహసింపరు. నవీనమైనంతమాత్రమున నెన్నటికి గ్రంథము గ్రాహ్యముకాదు. ఎక్కడేని గుణమునుబట్టి గ్రంథము గ్రాహ్యమగునుగాని ప్రాచీనతనుబట్టియే కాదు. అయినను, సూత్రభాష్యము విషయమై ప్రాచీనతయునపేక్షణీయమే. ఏలందురా! మతభాష్యమెంత ప్రాచీనమైనదో మతమునంత ప్రాచీనమైనదని పొగడ్తనొందఁగలుగుగాని మతభాష్యము నవీనమనుటలో మతమునకట్టి ప్రశస్తికలుగనేరదు. ఆయామతభాష్యముల కాలమును బట్టియేకదా ధీమంతులాయామత మప్పటినుండియున్నదని యూహింపఁగలిగియుండుట. అట్టిసందర్భమున అన్నిమతభాష్యములకంటె ప్రాచీనమని విమతులచేతను నంగీకరింపఁబడి యన్నిమతముల కన్న శైవమతము ప్రాచీనమని లోకులు గ్రహించుటకును పరమసాధనమైయున్న నీలకంఠభాష్యము ముఖ్యముకాదనియు, నన్నిమతభాష్యములకంటె నవీనమైయున్న శ్రీకరభాష్యమే ముఖ్యమనియు సిద్ధాంతము చేయగా దానని మతమున కెట్టిగౌరవము చేకూరునో అదియు మదీయాల్పబుద్ధికి కేవల మగోచరమైయున్నది. శైవులకు లింగధారణము ముఖ్యముగదా! అదియిందుఁగలదుగాన నీశ్రీకరభాష్యము ముఖ్యమయ్యెనందురా?

వినుడు. ముఖ్యమగు లింగధారణము నీలకంఠభాష్యముననుగలదుగదా! ఇఁక నీలకంఠభాష్యకర్త చేసినతప్పేమి? అట్లుగాదు. శ్రీకరభాష్యమున లింగధారణము స్పష్టవచనములతో నీలకంఠభాష్యమున నున్నదానికంటె నధికముగాఁగలదు. కావున ముఖ్యమయ్యెనందురా! అందున దోషపదముగాని యొక్కమనవి నాలింపుడు. ఇందు దోషములున్నను నాక్షేపములేదా? అదెక్కడివందురా? ఇది నిర్దోషమని సాధింపగలవారు వెల్వడినప్పుడు కనఁబరుచునెడ లాభము. ఇది నిర్దోషమని సాధింపఁగలవారెవరు?

ఈభాష్యము దోషభూయిష్ఠమైయుండుటె యిదియగ్రాహ్యమనుటకు

దోషములు రెండువిధములు. 1 గ్రంథరచనాగతములు. 2 సిద్ధాంతగతములునగు. రచనాగతదోషము లిందుపెక్కుగలవనియు వానిని తాముసవరింతుమనియు శ్రీ శీతయ్యశాస్త్రులవారంగీకరించి యెయున్నందున నిచటవాని నుదాహరించుట యనావశ్యకము. రెండవకోటికిం జేరినవి సిద్ధాంతదోషములు. అవియునిందుగలవు.

ద్వైతమును,అద్వైతమును, ద్వైతాద్వైతమును సిద్ధాంతము చేసిన పూర్వాచార్యులందఱు జీవేశ్వరులకు బద్ధదశయందుగాని ముక్తదశయందుగాని ద్వైతమో అద్వైతమో ఒకటియె యుండునని నిర్ణయించిరి. అట్లువచింపకున్న శ్రుతిసూత్ర విరోధము దుష్పరిహరమగు. శ్రు॥ యఏషసంప్రసాదోఽస్మాచ్ఛరీరాత్సముత్థాయ పరంజ్యోతి రుపసంపద్య స్వేనరూపేణాభినిష్పద్యతే॥సూ॥ సంపద్యావిర్భావస్స్వేనశబ్దాత్ అను శ్రుతిసూత్రములు ముక్తియందు జీవునకు తన రూపమేవచ్చునుగాని, యితరరూపము రానేరదని చెప్పుచున్నవి. దీనింబట్టియే బద్ధదశయందుగాని ముక్తదశయందుగాని తాము సిద్ధాంతముచేయం బూనిన భేదమో,అభేదమో ఒకటియేయుండునని పూర్వాచార్యులు సిద్ధాంతము చేయవలసినవారైరి. శ్రీశంకరాచార్యులవారు జీవునకు బద్ధదశయందు భేదము నంగీకరించినను బద్ధదశమిథ్యామాత్రమే యని చెప్పి పరమార్థదృష్టిచే జీవునకు త్రికాలములయందును బ్రహ్మాభేదము గలదని నిర్ణయించి యున్నారు.

శ్రీకరభాష్యకారులైననో, జీవుండుసత్యమే, బ్రహ్మయు సత్యమే జీవేశ్వరులకు బద్ధదశయందు భేదము సత్యమే. ముక్తియందభేదము సత్యమే. బద్ధదశయందు బ్రహ్మముకంటె భిన్నుండైన జీవుండు ముత్యపు చిప్పయందుంబడిన జలబిందువు ముత్యమగునట్లును. పరశువేది సోకునెడ నినుము బంగరువగునట్లును బ్రహ్మము యొక్క యోగముచే జీవుండు బ్రహ్మమే యగునని సిద్ధాంతము చేసియున్నారు.

శ్రీకరభాష్యము జిజ్ఞాసాధికరణమున, ప్రయోజనం భ్రమరకీటలోహరసాదిషు స్వాభావికభేదని వృత్తిదర్శనాదితి. సంపద్యావిర్భావాధికరణమున ఆవిర్భావఃఅభివ్యక్తి స్వరూపప్రాప్తిః. యథా

తామ్రాదికం రసవేధయా హిరణ్యాం భవతీతి తామ్రాదికము రసవేధచే బంగారమగు నట్లీజీవుఁడు బ్రహ్మోపాసనచే స్వాభావికమగు భేదమును విడిచి బ్రహ్మమేయగునని పలుచోట్ల నిరూపింపఁబడియున్నది.

ఈవిధమున జీవుఁడు పూర్వము తనకు లేని బ్రహ్మత్వమును, ఇంతకుమున్ను తనకు లేనిదగు బ్రహ్మాభేదమును ముక్తియందు పొందుననఁగా- జీవుఁడు పూర్వము తనకున్న రూపముచే పొందునుగాని క్రొత్త రూపమును పొందఁడని, చెప్పు శ్రుతిసూత్రములెట్లు విరోధింపవు? జీవునకు జీవత్వంబును, బ్రహ్మతో భేదంబును నదివఱకు సత్యముగ స్వాభావికములేయయియుండి ముక్తియందు పరశువేది సోకునెడ నినుము బంగరువగునట్లు బ్రహ్మత్వంబును, బ్రహ్మముతో నభేదంబును ఆగంతుకములుగా వచ్చునని చెప్పునెడ జీవునకీరూపము పూర్వమున్నదే యగుఁగాని క్రొత్తరూపము కాదని యెట్లు సాధింపనగు? కావుననే శ్రీకరభాష్యమున సంపద్యావిర్భావాధికరణమున నీయాక్షేపముచేసికొనియు సమాధానము కుదరక యీయంశమును విడిచిపెట్టి యున్నారు. ఈవిధమున నపసిద్ధాంతము నపభ్రంశబహుళము నగుటంజేసి యిది యగ్రాహ్యమనవలసివచ్చెను.

ప్ర॥ ఈగ్రంథమును పండితులేల నిర్దోషముగా సవరింపఁగూడదు?

ఉ॥ తగు సామర్థ్యముండిన సవరింపవచ్చును. సామర్థ్యమనఁగా సర్వశాస్త్ర పరిజ్ఞానము- సర్వమత సిద్ధాంత పారదృశ్వతయని గ్రహింపవలయును. ఇట్టి శక్తిగల సర్వజ్ఞకల్పులున్నచో దీనినిర్దోషముగా సవరింపవచ్చును. అట్లుగాక కొంచెము వ్యాకరణపరిజ్ఞానము గలవారు దీని సవరింపఁబూనినచో శబ్దదోషముల మాత్రము కొన్నిటి సవరింపఁ జాలుదురు, అంతమాత్రమున న్యాయమీమాంసాశాస్త్రజ్ఞుల దృష్టికి నిర్దోషముగాఁ దోచుటెట్లు?

ప్ర॥ భిన్నభిన్న శాస్త్రజ్ఞానముగలవారు పలువురు చేరి దీనినెల్ల సమర్థింపఁ గూడదా?

ఉ॥ వ్యాకరణ జ్ఞానము గలవారొకరు, తర్కజ్ఞానము గలవారు మఱియొకరు. ఈవిధమున పలువురుజేరి రచించుటనే ఈభాష్యమున కిన్నిపాట్లు తటస్థించినవి. తర్కవ్యాకరణాది శాస్త్రములలోనను పరస్పర మతభేదములుగలవు. తార్కికులకు తర్కమతమే తెలియుఁగాని ఎదిరి మతము తెలియదు. వైయాకరణులకు వ్యాకరణమతమే తెలియు. ఇట్టిచో కేవలతార్కికులు తర్కయుక్తులను కేవలవైయాకరణులు వ్యాకరణయుక్తులను జేర్చినచో వారి వారి మత భేదములనుబట్టి పరస్పర విరోధము గ్రంథమునఁ జేరకమానదు. కావున సర్వశాస్త్ర పరిజ్ఞానముగల యొకవ్యక్తియే ఆమూలాగ్రముగా గ్రంథమును వ్రాసినఁగాని దానియందుఁ బూర్వాపర విరోధము పొడసూపక గ్రంథము నిర్దోషమను ఖ్యాతిని వహింపనేరదు. సర్వశాస్త్రపరిజ్ఞానమైనను కొంచెము కొంచెముండినఁ జాలదు. పరిపూర్ణతనే వహించియుండవలయు. అట్టిమహనీయులు దొరుకుటయరిది. కావున దీనింబాగుచేయుట దుర్ఘటము.

ప్ర॥ అట్టి మహనీయులనే సంపాదించి దీని నిర్దోషముగాఁ జేసినచో గ్రాహ్యమేలకాదు ?

ఉ॥ ఎట్లును నిది యసంభవము. ఐనను ఎట్లో వ్యాకరణాది విరోధ దోషములు లేకుండఁ జేయఁగలమని విశ్వసించినను సిద్ధాంత దోషము నెట్లు సవరింపవలెయు ? వాక్యములతోసహా సిద్ధాంతమును గూడ మార్చునెడ నప్పుడది క్రొత్త భాష్యమగు గాని యిప్పుడున్న శ్రీకరభాష్యమెంత మాత్రము కాదు గదా ! దీనింబట్టి చూచినను ఈశ్రీకర భాష్యము గ్రాహ్యము కాదని స్పష్టమగుచున్నది.

ప్ర॥ భాష్యమున దోషములుండుగాక, అయినను ఇందు శైవులకు ముఖ్యమగు లింగధారణము స్పష్టముగాగలదు. గాన దీనింగ్రహించిన బాధకమేమి ?

ఉ॥ ఏదేని గుణమును బట్టి సదోషమైనను గ్రంథాన్తరమును గ్రహింపనగుఁ గాని మతభాష్యము నట్లు గ్రహింపఁగూడదు. మత



భాష్యము దోషయుక్తమగునెడ తత్కర్తయగు మతాచార్యుఁడు శా

ప్రజ్ఞాన రహితుఁడని లోకులచే నెన్నంబడు. దానింబట్టి యట్టి మతాచార్యునిచే స్థాపితమగు మతమును శాస్త్రవిరుద్ధమనియే నిశ్చితమై పోవును.

ఇట్లు దోషభూయిష్ఠమగు భాష్యమునే నిర్బంధముగా స్థాపించి మతమునకుఁ దదాచార్యునకును శాశ్వతమగు నపయశంబు చేకూర్చుటకంటె నట్టి భాష్యము గ్రాహ్యము కాదని యెంచుటె యుక్తమనుట యెల్లరకు తెల్లమనియే తలంచెద.

నీలకంఠభాష్యము గ్రాహ్యము కాదనుటకు కారణములు.

1. నీలకంఠుఁడు శైవులపూర్వాచార్యులలోఁ జేర్పంబడి యుండలేదు.

2. నీలకంఠుని సిద్ధాంతమున సాయుజ్యముక్తి లేదు. దానింబట్టి భ్రమరకీటన్యాయేన శాశ్వతశివసాయుజ్యసిద్ధిరస్తు అనుసంకల్పమును మార్చికొనవలయు.

3. ఈమతమున లింగైక్యము ముక్తిగా పాడంబడుచున్నది. నీలకంఠభాష్యమున నైక్యము ముక్తిగా నంగీకరింపఁబడలేదు గాన లింగైక్యముకుదరనేకుదరదు.

4. నీలకంఠుఁడువిశిష్టాద్వైతమును సిద్ధాంతముచేసెను. దాని నొప్పునెడమనలము విశిష్టాద్వైతులమనియే చెప్పికొనవలసి వచ్చును. విశిష్టాద్వైతులన వైష్ణవులనియే లోకమున రూఢమైయున్నది. మనమును విశిష్టాద్వైతుల మనిచెప్పికొనఁగనే వారితో కలహముతప్పదు.

5. నీలకంఠభాష్యము శైవులలో పూర్వులచే నామోదింపఁబడి యుండలేదు.

6. ఈభాష్యమున శైవులకు ముఖ్యమగు లింగధారణంబును లేదు.

ఈకారణములచే నిర్దోషమైనను ప్రఖ్యాతమైనను నీలకంఠభాష్యము శైవులకు గ్రాహ్యము కానేరదు.



నీలకంఠభాష్యము శైవులకు ముఖ్యమనుటకుఁ గలకారణములు.

1. నీలకంఠాచార్యుడు పురాతన శైవాచార్యులలో చేరి యుండుటవలన నామహనీయుని భాష్యము శైవులకు ముఖ్యమగు. అదియెట్లనిన వీరశైవాచార్యవిజయమున ద్వాదశాచార్యులను నిరూపించునపుడు వారిలో భాష్యకర్తయగు నీలకంఠాచార్యుండును పరిగణింపఁబడియుండె. కావున పూర్వాచార్యులలో చేరలేదను మాట యసత్యము.

2. నీలకంఠుని మతమున సాయుజ్యముక్తిలేదు గాన భ్రమ రకీటన్యాయేన శాశ్వతశివసాయుజ్య సిద్ధిరస్తు అను సంకల్పమును మార్చి కొనవలసివచ్చుననుటయు సత్యముగాదు. సాయుజ్యమన నైక్యమె యనుకొని యదినీలకంఠుని మతమున లేదని వచించు చున్నారు. సాయుజ్యశబ్దమున కైక్యమను నర్థములేనెలేదు. సహ యుంక్తఇతిసయుక్ యుజిర్ యోగేఇతిధాతో స్సత్సూద్విషేత్యాది నాక్విప్. తయోర్భావస్సాయుజ్యం అనువ్యుత్పత్తినిబట్టి సయుజ్ = కూడనున్నవారు. వారిభావముసాయుజ్యము అనగా సహయోగ మనియే యేర్పడుచున్నది. దీనింబట్టి సాయుజ్యము జీవేశ్వరులకు భేదమునందే సరిపడునుగాని యభేదమునందు సరిపడదనియేస్పష్టమ గుచున్నది. కావుననే శ్రు॥ ద్వాసువర్ణా సయుజాసఖాయా సమా నంవృక్షం పరిషస్వజాతె అను శ్రుతియు జీవేశ్వరులు సహయోగము కలవారను నర్థమునే సయుజా అను పదముచే బోధించుచున్నది. సయుక్ అను పదముకంటె భావార్థకప్రత్యయము వచ్చుటచే సాయు జ్యమను పదము ఏర్పడినది గాని యింకొకవిధమున గాదు. దీనికి భిన్నముగా నేకీభావ మర్థమని సాధించునెడ శ్రుతి విరోధము తప్పదు.

మొదట సాయుజ్యమను పదమున కేకీభావమను నర్థమేలేదు. అట్టి యర్థమును శ్రమపడి సాధించినను శ్రుతి విరుద్ధమగు శ్రుతివిరో ధము నలక్ష్యముచేసి సాధించినను నిరుపయోగమగుటయే గాక

వారుదాహరించిన భ్రమరకీటన్యాయేన అను సంకల్పము వారికే కుద రక విడిచి పెట్టఁబడ వలసివచ్చును.

ఏలందురా? వినుడు. జీవేశ్వరులుపమేయము. భ్రమరకీటములుపమానము. సాయుజ్యసిద్ధి సాధర్మ్యంబునగు. ఇచట సాయుజ్యమన నేకీభావమని యర్థము సాధించియది యుపమేయమగు జీవేశ్వరులకుఁగలుగునని చెప్పఁబూనినచో నీసాధర్మ్యము ఉపమానమగు భ్రమరకీటములయం దుండవలసినపని లేదా? అదివానియం దెట్లుండును? భ్రమరకీటములలో కీటము భ్రమరరూపమునొందినను నా రెండువెవ్వేరుగనే యుండుఁగాని యెప్పుడేని నొకటియగునా? కానేరవు. ఇట్లేకీభావముసమానధర్మమగుచో నదియుపమానము నగలదని నిరూపించుట యసంభవము. కాబట్టి సాయుజ్యసిద్ధిరస్తుఅను నంకల్పము ఎవ్వారలనుబాధించునో తెలిసెనా? నీలకంఠభాష్యమొప్పనివారినే బాధించునని స్పష్టమైనది.

3 ప్ర:— లింగైక్యమే ముక్తియని శైవులలో వాడుక కలదు. ఇట్టిముక్తివిశిష్టాద్వైతమునఁగలదా? లేదు. కావున విశిష్టాద్వైతమును ప్రతిపాదనసేయు నీలకంఠభాష్యము శైవుల కెట్లు గ్రాహ్యమగు?

ఉ:— లింగైక్యము ముక్తియనుట అనుభవాద్వైతమును బట్టివచ్చినదని చెప్పియుంటిని. దీనికిని నీలకంఠభాష్యమునకును విరోధములేదు. నీలకంఠభాష్యము సగుణతత్త్వమును ప్రతిపాదన చేయును. లింగైక్యమను ముక్తియైననో నిర్గుణతత్త్వమునకు సంబంధపడినది. కావున నదియిందులేదు. నిర్గుణతత్త్వ మవాఙ్మనసగోచరము ననుభవైకవేద్యముగాన నదియనుభవాద్వైతమునకే సంబంధపడియున్నది. ఇందుననే యదిభాష్యమున నిరూపింపఁబడి యుండలేదు. కావున ననుభవాద్వైతమునకునీలకంఠభాష్యమునకును విరోధమే లేదు.

ఈకారణముననే శంకరభాష్యమునే మతభాష్యముగా గ్రహించినశుద్ధాద్వైతమతస్థులును సగుణోపాసనను గూర్చి నీలకంఠభాష్యమునే ప్రమాణముగా గ్రహించుచున్నారు. ఇట్టులుండ నీలకంఠభాష్యము శైవులకు గ్రాహ్యముకాదనుటకంటె ప్రమాద మింకొకటి యుండునా? ఉండదు.

4 ప్ర:— నీలకంఠుఁడు విశిష్టాద్వైతమును సిద్ధాంతము చేసియుండెగదా? దానినొప్పిన మనమును విశిష్టాద్వైతులమనియే చెప్పికొనవలసివచ్చును. విశిష్టాద్వైతులన వైష్ణవులనియే లోకమున రూఢమైయున్నది. విశిష్టాద్వైతులమని చెప్పికొనఁగనే మనతో వైష్ణవులు కలహింపరా? ఇట్లుండ నీలకంఠభాష్యము గ్రాహ్యమనుట యెట్లు?

ఉ:— నీలకంఠభాష్యమున విశిష్టాద్వైతము సిద్ధాంతితమైయున్నను శివాద్వైతభాష్యమనియె నీలకంఠభాష్యము దక్షిణదేశమునవ్యవహరింపఁబడుచున్నది. ఆరంభణాధికరణమునందు 'విశ్వం భూతం భువనంచిత్రంబహుధాజాతం జాయమానంచయత్ । సర్వోహ్యేషరుద్రః' ఈమున్నగు శ్రుతులనుదాహరించి 'పరమకారణాత్ పరబ్రహ్మణః శివాదభిన్నమేవ జగత్కార్యమితి' పరమకారణమైన పరమేశ్వరునికంటె జగమభిన్నముగనే యున్నదని శివాద్వైతమునే సిద్ధాంతము చేసియున్నారు. ఈనీలకంఠభాష్యము ప్రఖ్యాతమైన యనంతరము చాలకాలమునకు రామానుజయతి యీభాష్యసిద్ధాంతమునే సంగ్రహించి శివశబ్దస్థానమున నారాయణశబ్దము నిడుచు శ్రీభాష్యమును రచించి నారాయణాద్వైతమనిగాని, విష్ణ్వద్వైతమనిగాని పేరిడుట కట్టిపేరు అప్రసిద్ధమనియెంచి యాసిద్ధాంతమునకు విశిష్టాద్వైతమని నామకరణముచేసెను. ఆకారణమును బట్టి నీలకంఠభాష్యమును విడువనగునా?

అట్లుగాక నీలకంఠభాష్య సిద్ధాంతమునకు విశిష్టాద్వైతమ నియే నామమని యంగీకరింతము. అయినను దీనిని వైష్ణవులు గ్రహించిరని మనము విడిచిపెట్టుట యుక్తముకాదు. ఇందుకొక దృష్టాంతము చూడుడు. అద్వైతమను సంజ్ఞ పూర్వము బౌద్ధమత మునకు సార్థమైయున్నది. కావుననే 'సర్వజ్ఞస్సుగతో బుద్ధోఽద్వ యవాదీ వినాయకః॥ అని యమరసింహుఁడు బుద్ధదేవు నద్వైతవాది నిగాఁ జెప్పియున్నాఁడు. అట్లైనను శ్రీశంకరాచార్యులవారు తమ సిద్ధాంతమున కద్వైతమనియే నామకరణము నంగీకరించిరి. దాన లోపమేదైన వచ్చునని వారిబుద్ధికిఁ దోచలేదు. అందులోపముండినం గదా వారికిఁ దోచును? అందును తమ సిద్ధాంతము కన్న పూర్వమె బౌద్ధమతమున కద్వైతసంజ్ఞ కలిగియున్నది. బౌద్ధమతమన్నో కేవలము నాస్తికము. ఇట్లు తమకంటె పూర్వమె నాస్తికమత సిద్ధాం తముగా వాడుకలోనున్న యద్వైత పదము తమసిద్ధాంతమునకు సంజ్ఞగా నంగీకరించినను దోషమురాలేదని స్పష్టమైనది. న్యాయ్య మిట్లుండ నీలకంఠ భాష్యమునకు నివ్వల చాలకాలమునకు వైష్ణ వులు శైవులకుంగల విశిష్టాద్వైత సంజ్ఞను తాము ధరించిరని యావే రునందు, నాసిద్ధాంతమునందు, నింతెగాక తత్సిద్ధాంత ప్రతిపాదకభా ష్యమునందును నసూయనూని విడువఁ బూనుట యెంతదూరదర్శి తయో ముఖ్యముగాఁ గమనింపఁ దగియున్నది.

ఇదిగాక లోకమున నెవ్వరేని తమమతము గ్రహించిన వార్త వినఁగనె యానందమునొంది వారియెడ స్నేహభావము నూనుదురు గాని మామతము నీవేల గ్రహించితివనికలహింతురనుటయు ననుభవ విరుద్ధము. కావుననే యూరపుదేశమునఁ జాలమంది దొరలద్వైత మతమునుసహేతుకమని యంగీకరించిరని యపరిమితానందము నొం దుచున్న పెక్కురద్వైత పండితులఁగాంచు చున్నాము.

కాఁబట్టి నీలకంఠభాష్యమును స్వీకరింపఁగనే విశిష్టాద్వైతమున పహరించితిమని వైష్ణవులు కలహింతురనుట సమంజసము కాదు.

5. ప్ర॥ నీలకంఠభాష్యము పూర్వులచే నామోదింపఁబడి యుండలేదు గాన నిది శైవులకెట్లు గ్రాహ్యమగు ?

ఉ॥ ఈభాష్యమును పూర్వులనుమోదింప లేదనుట నిజము కాదు. పూర్వులనుమోదించుటనే యిది గ్రాహ్యమగుచున్నది. ఎట్లనిన వినుడు.

నిగమాగమసార సంగ్రహమని నామాంతరముగల క్రియాసారమను నిబంధన గ్రంథమును రచించిన నీలకంఠాచార్యుఁడు «నీలకంఠ శివాచార్యనామ్నా భాష్యమచీకరత్॥ పరమేశ్వరుఁడు నీలకంఠశివాచార్యునిచే భాష్యమును చేయించెనని వక్కాణించి దీనినే ప్రమాణముగా గ్రహించి యీభాష్యమునకు కారికారూపమగు వ్యాఖ్యానము గూడ రచించియుండెను. క్రియాసారకర్తయగు నీలకంఠుఁడు లింగధారి బ్రాహ్మణుఁడని తత్కృతమగు క్రియాసారముచేతనే స్పష్టమగుచున్నది. ఈ క్రియాసారమును నిర్ణయసింధుకారుఁడును. వైద్యనాథ దీక్షితుఁడును గూడ తమ నిబంధన గ్రంథములయందు ప్రమాణముగా గ్రహించియున్నారు. దానంజేసి యితడు వారలకంటెను ప్రాచీనుండని స్పష్టమగుచున్నది.

ఇట్లుప్రాచీనుండును విమతప్రధాన ధర్మనిబంధన గ్రంథకర్తలచే ప్రామాణికుఁడుగా నంగీకరింపఁబడిన వాఁడును. బహుగ్రంథకర్తయు లింగధారి బ్రాహ్మణుఁడునైన నీలకంఠుఁడు లింగధారి బ్రాహ్మణులకిదియె భాష్యమని నిర్ణయించినను విచ్ఛిన్నముగాని సంశయ మవిచ్ఛిన్నమనియె యెంచనగును.

ఇదిగాక లింగధారణ చంద్రికాకారులును నీలకంఠభాష్యసిద్ధాంతమునే ప్రమాణీకరించినట్లు పూర్వమే నిరూపితమయ్యెఁగదా! అట్లె లింధారణ దీపికాకారులును నీలకంఠభాష్యమునే ప్రమాణీక

రించియున్నారు. ఏలూరుగ్రామ వాస్తవ్యులైన శ్రీమల్లమపల్లి మల్లికార్జున శాస్త్రులవారి జనకులగు శ్రీబుచ్చిలింగకవిగారు స్వకృతమగు హాలాస్యమాహాత్మ్యమునందు భాష్యకర్త నీలకంఠాచార్యులేయని యాచార్యస్తుతి నొనర్చియున్నారు. కావున నీలకంఠభాష్యమును ముఖ్యముగా గ్రహించుటకు పూర్వుల నిరోధమొతమాత్రము లేదనియే నిశ్చితమగుచున్నది.

6. ప్ర॥ ఈభాష్యమున శైవులకు ముఖ్యమగు లింగధారణము లేనప్పుడిది యెట్లుగ్రాహ్యమగు?

ఉ॥ లింగధారణము శైవులకు ముఖ్యమైనను భాష్యమునకంత ముఖ్యమైనది కాదు. ఏలన, జగము, జీవుఁడు ఈశ్వరుఁడు అనువాని స్వరూపమును, పరస్పరసంబంధమును నిరూపించుట కేతత్త్వవిచారశాస్త్రము ప్రవర్తించినది. కావున లింగధారణము లేమిచే భాష్యము గ్రాహ్యము కాదనుమాటయే గ్రాహ్యము కాదు.

ఇదిగాక లింగధారణము నీలకంఠభాష్యమునఁ గలిగియున్నట్లు క్రియాసారకర్తయగు నీలకంఠుఁడనేకాధికరణములయందుదాహరించియున్నాఁడు. ప్రామాణికుఁడగు క్రియాసారకర్త భాష్యమున లేనిదాని నున్నదని యసత్యమును ప్రకటించుటకుఁ దగుకారణము దుర్నిరూపము. కాఁబట్టి క్రియాసారకారుని కాలమునాటికి నీలకంఠభాష్యమున చాలచోట్ల లింగధారణము స్పష్టముగా నున్నదని యొప్పక తప్పదు.

ప్ర॥ అట్లేని నది యిప్పుడేమైనది?

ఉ॥ శుద్ధాద్వైత మతస్థులు సగుణోపాసనను సాధించుటకై నీలకంఠ భాష్యమును వ్యాఖ్యానాదులచే సంస్కరించియున్నారు వారికి లింగధారణ మనపేక్షితము. కాన నట్టి సంస్కరణములవలన దాక్షిణాత్య కోశములలో లింగధారణ ప్రతిపాద నపరభాగములు ప్రక్షిప్తమై యుండవచ్చును. అంతమాత్రమున భాష్యమే యగ్రాహ్య

మగునా ? ఇప్పటికి నీ దేశమున దొరుకుచున్న వ్రాత ప్రతులలో చాలచోట్ల లింగధారణము ప్రతిపాదింపఁబడియే యున్నది.

ప్ర॥ ఈదేశమున దొరకు వ్రాతప్రతులలోనున్నను లింగ ధారణము ముద్రితములగు దాక్షిణాత్య కోశములయందు లేదు గాన నిందు లింగధారణముకలదని లోకులెట్లు విశ్వసింతురు ?

ఉ॥ పరిశీలించునెడ ముద్రితమగు నీలకంఠ భాష్యమునను ధారణము కనఁబడుచునేయున్నది. సహకార్యంతర విధ్యధికరణమునందు పాశుపతవ్రత ధారిణాం ముక్తిరేవఫలం పాశుపతవ్రతము నవలంబించినవారలకు ముక్తియే ఫలమని సిద్ధాంతము చేయఁబడియున్నది. పాశుపత వ్రతస్వరూపము నిరూపించునపుడు లింగధారణ ప్రతిపాదకములగు మంత్రములుదాహరింపఁబడి యున్నవి. కాన నిదియిష్టలింగధారణ పరమని స్పష్టమగుచున్నది.

ప్ర॥ పాశుపతవ్రతమన లింగధారణమని యెట్లు నిర్ణయింపనగు?

ఉ॥ లింగధారణ చంద్రిక 44 వపేజీ- నిర్మితం హిమయా పూర్వంవ్రతం పాశుపతం శుభం। గుహ్యాద్గుహ్యతరం సూక్ష్మం వేదసారం విముక్తయే ఏవపాశుపతోయోగస్సేవనీ యోమ ముముక్షుభిరితి విభూతి రుద్రాక్షలింగధారణ రూపపాశుపత వ్రతప్రతిపాదకాగమస్య అనువాక్యమును బట్టి భస్మరుద్రాక్ష శివలింగధారణాత్మకమైన దీక్షయే పాశుపతవ్రతమని నిర్ణయింపఁబడి యున్నది. కాఁబట్టి నీలకంఠ భాష్యమున లింగధారణములేదనుట కల్ల. ఇఁక లింగధారణచంద్రిక ప్రమాణము కాదనుటకంటె ప్రతివాదుల కుపాయాంతరములేదు. ఏలన, నీలకంఠభాష్యము గ్రాహ్యము కాదనిసాధించుటకై యందు లింగధారణము లేదనవలసివచ్చెను. లిఖిత గ్రంథములయందు గలదని నిరూపింప ముద్రితగ్రంథమునందు లేదనవలసివచ్చెను. ముద్రిత గ్రంథమునందును లింగధారణము పాశుపత వ్రతమనువైదికసంజ్ఞచే

విధింపఁబడినదని ప్రతిపాదింప పాశుపత వ్రతమన లింగధారణము కాదని సాధింపవలసివచ్చెను. పాశుపతవ్రతమన లింగధారణమే యని లింగధారణచంద్రికా కారుఁడు నిర్ణయించినట్లు కనఁబరచఁ బడియె. ఇఁక చంద్రికాకారుని గ్రంథము గతియేమి కానున్నదో చూతము గాక.

ప్ర॥ నీలకంఠభాష్యమున 'అత్యాశ్రమ సంజ్ఞితో యమాశ్రమభేదః' అనుటచే నీపాశుపతవ్రతమున కత్యాశ్రమమనియు పేరు గలదని తెలియుచున్నది. 'అత్యాశ్రమీ ప్రాణలింగ సంబంధీ భస్మఘుంటికా, కంథాంకమండలుం భిక్షాపాత్రం దండంచ ధారయేత్' అను ప్రమాణమునుబట్టి అత్యాశ్రమ మన సన్యాసమని తెలియుచున్నది. ఇట్లుండ గృహస్థులు మొదలగా నవలంబించిన లింగధారణ మత్యాశ్రమెట్లగు? ఇది అత్యాశ్రమము కానిచో నీలకంఠ భాష్యమున చెప్పంబడిన పాశుపతవ్రత మత్యాశ్రమ సంజ్ఞితమని చెప్పంబడియుండఁగా నది గృహస్థులాచరించు లింగధారణ పరమనుట యెట్లు?

ఉ:—అత్యాశ్రమమను పదము లింగధారణదీక్షనే బోధించును. సర్వాశ్రమధర్మములలో నుత్తమైనది కాన దీనికత్యాశ్రమమని పేరుగలిగెను. ఈయర్థమును బోధించుటకే యిదియత్యాశ్రమసంజ్ఞితమని చెప్పియున్నారు. కాని యిది అత్యాశ్రమమని చెప్పియుండలేదు. అత్యాశ్రమపదము సర్వాశ్రమసాధారణ లింగధారిపరమైనను శ్రీపండితస్వాములవారు లింగధారిగృహస్థాదులకు దహనసాపిండ్యములు గలవని సాధించుటకై సన్యాసిపరమేయని యంగీకరించిరి. ఏలన, అత్యాశ్రమి అనుపదముతో లింగధారి ననూదించి సమాధ్యాదుల విధించియున్నపుడు ఈవిధులు సన్యాసిపరములనియు, గృహస్థాదులకైననో దహనసాపిండ్యములు విధేయములనియు సాధించుటకై వారికత్యాశ్రమపదముసన్యాసిపరము కావలసివచ్చెను. అత్యా

శ్రమ మన లింగధారణము కాదని తెలుపెడ లింగధారణము లేదను కారణమున భాష్యమును వ్రాసినైచుటకై మామిత్రులకును పండిత స్వామి నిర్ణీతమగు సన్న్యాసియను నర్థమె గ్రహింపవలసివచ్చెను. కాని అత్యాశ్రమమన లింగధారణ దీక్ష యొయని శైవశాస్త్రమున స్పష్టమై యున్నది.

ప్ర:—అట్లైన శైవశాస్త్రమునసే అత్యాశ్రమపదము సన్న్యాసి పరముగా ప్రయోగింపఁబడి యున్నది యెట్లు సమంజసమగును.

ఉ:—అత్యాశ్రమపదము సర్వాశ్రమ సాధారణుఁడగు లింగ ధారియందును, కొన్నిచోట్ల విశేషాశ్రమస్థుఁడగు సన్న్యాసియందును కూడ శాస్త్రమునఁ బ్రయోగింపఁబడుచున్నది. దీనింబట్టి యీపద ము లింగధారియను నర్థమును బోధించుసామాన్యవాచియే యగుగాని యాశ్రమవిశేషవాచకము కాదని యేర్పడుచున్నది. ఏలన, సామా న్యవాచకమగునేని నిర్విశేషం నసామాన్యం అను న్యాయమునుబట్టి కొన్నిచోట్ల ప్రకరణాదులచే విశేషార్థపరముగను గ్రహింపననువ గును. ఈచెట్టుపండు మిగుల మాధుర్యముగలది. దీనిటెంకియు నత్యల్పము; అనుచోట చెట్టు అనుపదము ప్రకరణమును బట్టి మామి డిచెట్టును తెలుపుచున్నది. అట్లే అత్యాశ్రమపదంబును సామాన్య ముగ లింగధారిపరమైనను కమండలువును, భిక్షాపాత్రమును ధరింప వలయునని చెప్పుప్రకరణమును బట్టి సన్న్యాసిపరమగుటకు బాధకమే మియు లేదు. ఈపదము విశేషవాచకమే యగునేని సామాన్యవా చకముగా ప్రయోగింపఁ బడుచోట్ల అర్థము కుదరకపోవును.

ప్ర॥ అత్యాశ్రమిపదము సామాన్యముగ లింగధారిని బోధిం చుననుట కేమిప్రమాణము?

ఉ:—వాతూలోత్తరమున శ్లో॥ అత్యాశ్రమం పాశుపతం శాంభవం వైశిరోవ్రతం। ఇతీదంనామభిః ప్రోక్తా వర్ణిగమాం తేషుకీర్త్య తే॥ అత్యాశ్రమము, పాశుపతము, శాంభవము, శిరోవ్రతము ఈము

న్నగు నామములచే లింగధారణదీక్ష యుపనిషత్తులయందుఁ గీర్తింపఁబడుచున్నదని చెప్పంబడియున్నది. కావుననే లింగధారణ చంద్రిక (54 పేజీ)యందు శ్లో॥ లింగంశివో భవేత్ క్షేత్రమంగంసంయోగఆశ్రయః। తస్మాల్లింగాంగసం యుక్తోయోపి సోత్యాశ్రమీభవేత్। అను వచనము నుదాహరించి లింగమును ధరించినవాఁడెల్ల నత్యాశ్రమియని నిర్ణయింపఁబడియున్నది.

ఇదిగాక, మామిత్రులకు పరమముఖ్యమగు శ్రీకరభాష్యము నందును, జిజ్ఞాసాధికరణమున 'లింగాగసంగినాంచైవ పునర్జన్మన విద్యతే, ఏషపాశుపతో యోగస్సేవ్యః పాశనివృత్తయే సర్వవేదాన్తసారోయ మత్యాశ్రమ ఇతి శ్రుతిః। లింగంశివో భవేత్ క్షేత్ర మంగం సంయోగఆశ్రయః। తస్మాల్లింగాగసంయుక్తో యోపిసోత్యాశ్రమీభవేత్। బ్రహ్మచారీగృహస్థోవా వానప్రస్థోయతిస్తువా। యస్తు లింగాగసంయుక్త స్సఏవాత్యాశ్రమీ భవేదితి లైంగస్కాందకూర్మ పురాణేషు పాశుపతాత్యాశ్రమి శబ్దయోర్లింగధారి పర్యాయత్వేన నిర్దేశా త్తత్పరత్వమేవేతిసిద్ధమితి. పాశుపతపదము అత్యాశ్రమిపదంబును లింగధారిపదంబునకు పర్యాయపరములుగాన, నాలుగాశ్రమములయందున్న లింగధారినిబోధించుననియు సిద్ధాంతము చేయఁబడి యున్నది.

దీనింబట్టి నీలకంఠభాష్యకారులుగాని, లింగధారణచంద్రికాకారులుగాని శ్రీకరభాష్యకారులుగాని లింగధారణము సిద్ధాంతముచేయ నెంచినవారందఱు పాశుపతాత్యాశ్రమిశబ్దములు లింగధారిపరములనియే యొప్పక తప్పదయ్యెను.

మామిత్రులు ఎట్లైన నీలకంఠ భాష్యము గ్రాహ్యము కాదని నిరయింపనెంచి గనుందులింగధారణము లేదని సాధించుటకై పాశు

పతాత్యాశ్రమిపదములు లింగధారణవరములుగావనినిశ్చయింపఁబూనునెడ కొనకు శైవభాష్యనిర్ణయమెట్లైనను తొలుత శైవులకుముఖ్యమని తాముసమ్మతించిన లింగధారణమునకే (అనగా మొదటికే) హానివచ్చునేమోయని తోఁచెడిగి. కావున పాశుపతమనినను, అత్యాశ్రమమనినను లింగధారణమగునా! కాదాయని సంశయింపఁ బనిలేదు. నిక్కముగ లింగధారణమే, ఇట్లు, పాశుపతము అత్యాశ్రమముననను వైదికసంజ్ఞలను గ్రహించి లింగధారణము ముద్రితమగు దాక్షిణాత్యపాఠమునందును నీలకంఠభాష్యమున స్పష్టముగనె కనఁబడునున్నది.

కాఁబట్టి యీభాష్యము లింగధారణ ప్రతిపాదకము కాదని సంశయింపక, పూర్వులచేనను మోదింపఁబడలేదని యలక్ష్యము నేయక, విశిష్టాద్వైతప్రతిపాదకమని యసూయగొనక, దోషభూషితమని యేవగింపక, యప్రసిద్ధమని యసంతుష్టి నెందక, ముఖ్యమనిమెంచి, యిద్దానిం బరిశీలించి, సారముంగ్రహించి తన్మార్గం బవలంబించి, యథావిధిననుష్ఠించి, పరమేశ్వరు కృపగాంచి, యనవధియగు నిహపరసుఖాంబుధి నోలలాడు దురుగాకయని మిమ్ముల నర్థించుచు పరమేశ్వరుఁ బ్రార్థించుచున్నాఁడ.

ఇట్లు

విద్వజ్జన విధేయుఁడు

మదిగొండ నాగలింగశాస్త్రి

సాహిత్యోపాధ్యాయుఁడు

సంస్కృతకళాశాల

తెనాలి

గుంటూరు జి॥.

# శ్రీకరభాష్య సంస్కరణము.

అనుశీర్షిక శైవధర్మప్రకాశిక 1 సంపుటము 4 సంచికయందు ప్రకటింపఁబడియున్నది. ఇందలి సారాంశ మేమనిన,

బ్ర॥ వేమూరు రామగోవిందశాస్త్రిగారు శైవభాష్యసంస్కరణరథారూఢులై రనియు. బ్ర॥ రెంటాల శరభయ్యశాస్త్రిగారును, బ్ర॥ చాగంటి సీతయ్యశాస్త్రిగారును తచ్ఛ్రీకరరక్షకత్వమునం బ్రవేశించియున్నవా రనియు, శ్రీ దేవిడీసంస్థానాధీశు లగు ఇజ్జితాసాక్ శ్రీ రాజా కందుకూరు బాలసూర్యప్రసాదరావు బహద్దరు జమీందారు వారు ముప్పది వేలరూప్యములను, వారిరాణీగారు పదివేలరూప్యములను భాష్యసంస్కరణమునకు వినియోగింతు మని భాష్యసంస్కరణ కార్యాలయము స్థాపించి కార్యక్రమము నడుపుచున్నవారనియు;

ఇంతియె కాక, శ్రీకరభాష్యసంస్కరణవిషయమై యాలోచింపవలసియున్నది. కాన రావలయు, నని శ్రీవారు తనకాహ్వాన మొసంగి రనియు, తాను వెంటనే వెళ్ళి దర్శింపగా శ్రీవారు భాష్యసంస్కరణప్రయత్నమును, సంస్కరణకార్యాలయస్థాపనమును, అప్పటికి గావించియున్న కార్యస్థితిని గన్పరచి ఇందుకు సంస్కరణాంశములను యోజించి తెలుపవలసినదిగ తమ కాజ్ఞ నొసంగిరనియు, దానింబట్టి సంస్కరణాంశములను శైవసిద్ధాంత మను శీర్షికక్రింద విశదీకరించుచున్నవార మనియు శి. వి. పాకయాజి యారంభించియున్న సంగతి తెలిసియేయున్నది కదా?

ఈశీర్షికలో బ్ర॥ రామగోవిందశాస్త్రిగారు శైవభాష్యసంస్కరణరథారూఢులై [illegible] కలి

గెను. వివుతపండితులు స్వమతమున జేరుటసంతోషకరముగదా! కాని, శ్రీవారు ముప్పదివేలరూప్యములను వినియోగింతు రనుమాట మాత్రమే గాక నే యర్థసంబంధమునుబట్టి వారిందు బ్రవేశించి రని యేర్పడుటంజేసి యాయానంద మప్పుడ యంతరించెను. అది యటుండనిండు.

శ్రీవా రిప్పుడు శ్రీకరభాష్యసంస్కరణము నుపక్రమించిన నిజమా ? ఇది నిజమేయగునేని న్యాయ్య మగునా ? యలన,

శ్రీకరనీలకంఠభాష్యములలో నెయ్యది శైవులకు ముఖ్యము? అనుచర్చ శైవమహాసభలో నిర్ణేయాంశముగా నేర్పడియుండుటంజేసి శైవమహాసభాధ్యక్షులగు శ్రీదేవిడి సంస్థానాధీశుల సమక్షమున నెలకుర్రు, తెనాలి గ్రామములలో జరిగినమహాసభలలో కొంతవరకు జరుపబడి నడుమన యాపివేయబడుచుండినసంగతి శ్రీవారికివిదితమే కదా ?

ఈరెండుభాష్యములలో శైవులకు నీలకంఠభాష్యము కావలెనని నిర్ణీతమైనదా ? అది నిర్ణీతముకానప్పుడు శ్రీవారు శ్రీకరభాష్యముపై నభిమానము వహించి దానిని సంస్కరింపబూనుట న్యాయ్యమెట్లగునో తోపకున్నది.

శ్రీవారికి శ్రీకరభాష్యముపై మొదటినుండి యభిమానము కలదందురా ? అట్లైన

ఈచర్చతో పనిలేదు. మేము శ్రీకరభాష్యమునే సంస్కరింపబూనితిమి. అని యీచర్చను మొదటన యాపివేయవలదా? శ్రీవారికి శ్రీకరభాష్యముపై నభిమానముండుటకు వారికి శ్రీకరభాష్యమొసగినమేలును నీలకంఠభాష్య మొసంగ దయ్యెనా! లేదు కదా!

కావున నీయుద్యమము శ్రీ సీతయ్యశాస్త్రిగారియం దగునభిమానమునుబట్టియె [illegible] తీరవలయును.

ఎట్లయిన నేమి? ఇది మంచిపనిగదా యెందురేని?

ఇది యెట్లు యుక్తకార్యమగు? ఏలన,

కేవలము శాస్త్రిగారియం దగు నభిమానమునుబట్టి నిర్దోషము గా నున్నదని సీతయ్యశాస్త్రిగారిచేతను యోగ్యతాపత్రము నందియున్న నీలకంఠభాష్యము విసువవలసివచ్చెను. శల్యప్రాయము లగుదోషములు విస్పష్టముగానున్నవని సీతయ్యశాస్త్రిగారిచే నంగీకరింపబడిన శ్రీకరభాష్యము గ్రహింపవలసివచ్చెను.

ఇదిసవరింప సీతయ్యశాస్త్రిగారికి శక్య మయ్యెనా? లేదు. కావుననే బ్ర॥ రామగోవిందశాస్త్రిగారిని రథారూఢులను జేయవలసి వచ్చెను గదా?

అతిమాత్రిము సంస్కరణము పూర్తి అయ్యెనా? లేదు. విమతస్థులకు శైవసిద్ధాన్త మెట్లు తెలియును? దానంజేసి వారిరథము కదలనె లేదు.

కావునన పోస్టున ఉత్తరమువైచినను నాలస్యమగునని తంత్రీముఖముననె శి. వి. పాకయాజికి వార్త యనుపవలసివచ్చెను. సీతయ్యశాస్త్రిగారు ఎంతకాలమునుండి యీవాదమున శ్రమ మొందియున్నను పాకయాజిసాహాయ్యము లేకున్న భాష్యరథము కదలుమార్గము కనఁబడలే దట.

దాననేకదా? యాజి సంస్కరణీయము లగు శైవసిద్ధాంతములను ప్రకటింప నారంభించెను. పాప మీయాజి మొదటినుండి శైవసిద్ధాంతమును సంస్కరింపనె శ్రమ మొందుచున్నాఁడుగదా? ఏట్లో. సీతయ్యశాస్త్రిగారి పుణ్యమున బ్ర॥ రామగోవిందశాస్త్రిగారి భాష్యరథంబును, పాకయాజిమనోరథంబును నిరాటంకముగా సాగుట కవకాశమేర్పడెను. [illegible] చేయునగు?

శైవసూత్రభాష్యమును మతాంతరులు సంస్కరింపవలసివచ్చుట కంటెను, మొదటినుండి శైవమతమునకు కంటకుడుగాప్రసిద్ధివహించిన పాకయాజి శైవభాష్యసిద్ధాంతమును నిర్ణయింపవలసివచ్చుటకంటెను శైవమతమునకు వేరేమి దుస్థితికలదు? ఇది యుండనిండు.

బ్రll రామగోవింద శాస్త్రిగారు తయారుచేయు భాష్యము శైవుల కుపాదేయ మగునా? అని యోజితము.

సీతయ్యశాస్త్రిగారు నీలకంఠభాష్యము కూడదనుటకు నీలకంఠుడు లింగధారి కాడని హేతువు చెప్పియున్న సంగతి యందఱకుఁదెలి యునుకదా? అట్టిశాస్త్రిగా రిప్పుడు భాష్యసంస్కరణము తమ కసాధ్యముగా తోచుటం జేసిస్వవచనవిరుద్ధముగ మతాంతరులను శైవభాష్యరథారూఢులను జేసినను శాస్త్రిగారి తీర్మానమునుబట్టి మతాంతరులచే సంస్కరింపఁబడిన భాష్యము శైవుల కందఱకెట్లుపాదేయమగును? పోనిండు. ఉపాదేయమేయనియెంచుటకు,

మతాంతరులు చేయుసంస్కరణము శైవుల కుపకారకమగునా? అని యాలోచింతము.

ఇం దొకనిదర్శనముకలదు.

శ్రీ ఉర్లాం సంస్థానాధీశులై కీర్తిశేషులైన కందుకూరు బసవరాజులంగారు కాశీపట్టణమున బ్రాహ్మణసంతర్పణమునకైయత్నించి బహుసహస్రబ్రాహ్మణభోజనమునకై పాకము సిద్ధముచేయింప వారియాస్థానముననే మొదటినుండి జీవించుచున్నవిమతపండితులు శైవులకు మాకును నేకపంక్తి లేదని సత్యేతరము నచ్చటివారికిఁ దెలిపియున్న కారణమున వారి సంతర్పణప్రయత్నము విఫల మగుటయేగాక తన్మూలమున శైవసంఘమున కెల్ల తిరమగు నగౌరవము ప్రాప్తించియుండుట పలువురకు తెలిసినయంశమే.

శ్రీ బసవరాజులంగారి కంటెను పండితులం బోషించినవారు కల రా? లేరు. అట్టివారు విశ్వసించినవిమతపండితులే యింతమహోపకారము చేసియుండిరి. దీనింబట్టి శైవభాష్యసంస్కరణభారము విమతులపై నుంచునెడ నిది రెండవ మహోపకార మగుటకు సందియ మేమి? ఏలన,

శ్రీకరభాష్యములోని లింగధారణసిద్ధాంత మేమి? జగద్వ్యాపకత్వఖండన మేమి? ప్రతిబింబజీవేశ్వరవాదఖండన మేమి? అవచ్ఛిన్నజీవేశ్వరవాదఖండన మేమి? అధ్యాసఖండన మేమి? అనిర్వచనీయతావాదఖండన మేమి? ఈమొదలగు సిద్ధాంతము లన్నియు బ్రః రామగోవిందశాస్త్రిగారి మతమునకు విరుద్ధములే. ఈఘట్టములలో వారు మనస్ఫూర్తిగా పనిచేయుదురా? ఇందు సంశయమేలన, శాస్త్రిగారు తమజీవికకై స్వమతహాని నెట్లుగావించి కొందురు? కాన నిది సూక్ష్మబుద్ధులకు విశ్వసనీయము కాదు. అగుగాక.

ఈసంస్కరణముచే శ్రీకరభాష్యము బాగుపడునా? అదెట్లు బాగుపడును? సంస్కరణీయము లగుశైవసిద్ధాంతములను తెలుపుమని యాజిని కోరియున్నారుగదా? దానింబట్టి యాజి తన సిద్ధాంతమునకె శైవసిద్ధాంతమని పేరుబెట్టి ప్రకటించుచున్నాఁడు. దీనింబట్టిగదా? భాష్యసిద్ధాంతము మార్పు చేయంబడును. ఇంతియెగాకున్న శ్రీరొట్టాల శరభయ్య శాస్త్రిగారి సిద్ధాంతములును కొన్నియిందుం జేరుచనుకొందము. దీనింబట్టి శ్రీకరభాష్యసిద్ధాంతము బాగుపడునా? ఇట్లు వాక్యములతోఁగూడ భాష్యములోని సిద్ధాంత మంతయు మారిపోవునెడ శ్రీకరభాష్యము నామమాత్రావశిష్టమే యగుగదా? ఈ సమయమున శ్రీపండితస్వాములవారు జీవించియుండిరేని యేమని ఘోషిల్లియుందురో?

శ్రీకరభాష్యమునకు సంప్రాప్తమైనయీచరమదశ కంతకు సీత య్యశాస్త్రిగారి యనుగ్రహమే కదామూలము. కానిండు. వారియను గ్రహము పడయఁజాలనినీలకంఠభాష్యమె భాగ్యవంతమని యిప్పుడు తోఁచెడిని.

అయినను, శ్రీకరభాష్యమె జయించె ననుటకు వీరుక్రొత్తభా ష్యమునకును శ్రీకరభాష్యమనునామకరణమె గావించినను లోగడ నగముద్రింపఁబడియున్న భాష్యమే శ్రీకరభాష్యమనియు, ఇ ప్పుడు వీరుసంస్కరించినది రామగోవిందభాష్యమేయనియు తప్పక లోకులు నిశ్చయించుకొనకుందురా ?

ఇట్లు శ్రీసీతయ్యశాస్త్రిగారు రామగోవిందభాష్యమును శిరసావ హింపవలసి వచ్చుట నీలకంఠభాష్యము కూడదని వారవలంబించినవాద ముయొక్క ఫలితమే కదా ? అగుగాక,

ఈయుద్యమము శైవసంఘమునకు కీర్తిదాయకమా ? ఇప్పుడు విమతపండితులసాహాయ్యకమువలన శైవసూత్రభాష్యము సంస్కరింపఁ బడుచున్న దనుటకంటె శైవసంఘమున కపఖ్యాతికరము వేరేమికలదు? ఏలందురా ? ఈయుద్యమమువలన శైవులకు సూత్రభాష్యము లేదని యో ? ఉన్నది మహాదోషయుక్త మనియో ఏర్పడును. దీనింబట్టి యీకాలముననె కాక పూర్వకాలమునను ఈమతమున పండితులు లేరని యొకదా స్పష్టపడును. మొదటినుండి పండితులులేనిమతము అశాస్త్రీ యమగు మూర్ఖమతమగుటకు సంశయ మేమి?

కావున ఇప్పుడు రామగోవిందశాస్త్రిగారు సంస్కరించుసూత్ర భాష్యమునే శైవసంఘ మంగీకరించు నెడ సర్వమతస్థులు నేకగ్రీవము గ శైవమత మపండితమతమని తప్పక వాకొన చేతురుగదా ?

ఈ వాస్తవ ... సూత్రమైన ... కలవానికి సహింప

శక్యమగునా ?

ఈయనర్థమున కర్తకు ననాలోచితముగ నీలకంఠ భాష్యము కూడదని సీతయ్యశాస్త్రిగా రవలంబించినవాద మేకదామూలము. ఆవాదమునకు ఫలితమిట్లేర్పడెనుగదా! ఇఁకనీసంస్కరణముయొక్క ఫలిత మెట్లు పరిణమించునో అదియిప్పు డెట్లు చెప్ప నగు ?

ఈకారణములనుబట్టి యప్రతిమప్రతిభాసమేతులును దూరదృష్టియుతులును నగు శ్రీదేవిడీ సంస్థానాధీశులు శ్రీకరభాష్యసంస్కరణమున కుపక్రమించి రనుట యెంతమాత్రము నమ్మదగి యుండలేదు.

ఒక వేళ, శ్రీసీతయ్యశాస్త్రిగారును, శి, వి, పాకయాజియు నీకార్యమునకై శ్రీవారిని ప్రోత్సాహించుచున్నను వారు ధర్మప్రభువులుగాన భాష్యచర్చాపర్యవసానమును తెలిసికొనునందాక త్వరపడరనియె నమ్ముచున్నారము.

ప॥ సం॥

## శ్రుతిధర్మ సంజీవనీప్రత్యుక్తి

శి, వి, పాకయాజి శ్రుతిధర్మసంజీవని భాద్రపదమాససంచికల యందు ఈసం॥ ఆశ్వయుజమాసమున వెల్వడిన శైవరహస్యబోధినింగూర్చి అసహనరూప మగువిమర్శముం గావించియున్నాఁడు. అది యెట్లు ? ఆపురుషునికి త్రికాలజ్ఞానము కలదాయనియడుగుదు రేని ఎఱుంగము. కాని ఆభాద్రపదమాసిక పత్రికాప్రకటన మతిపన్నప్రయుక్తమగుటచే నట్లు సంభవింపవచ్చునని తోఁచెడిని. అందగుసారాంశ మేమనిన, తనకు శాస్త్రలోకజ్ఞానములు సంపూర్ణమనియు నవి యెదిరికి లేవనియు ప్రధానమై యున్నది. ఇది వారివారిగ్రంథములనుబట్టి లోకులు గ్రహింపఁదగినదియెగాని తమకు దాము చెప్పికొనినంతన సిద్ధించునదిగా నేరదుగాన బహులు చెప్పఁదగినది కాదు. ఈయుపాలంభనుబట్టియే యవి

మెంతమాత్రము లేవని లోకులు గ్రహింతురేమో యనియుత్తోచెను.
మఱియు, శైవరహస్యబోధిని యనునామము మాపత్రికకు సా ర్థకము కాదనియు వచించియున్నాఁడు. బి, యస్, సరస్వతిరంకుచరి త్రమును, చండాలపుకట్ట్యలను, కలహశతములను, అశ్లీలసహస్రములను మాత్రము వెల్లడించు కలిధర్మసంజీవనిపత్రికకు శ్రుతిధర్మసంజీవనియని యు, అనుశ్రుతశైవధర్మవినాశికయగు పత్రికకు శైవధర్మప్రకాశిక యనియు వ్యవహరించువానిదృష్టికి ఈపత్రికనామము సార్థకమని యెట్లు తోచును?

ఇదిగాక, పైరెండుపత్రికలచే సర్వార్థసమార్జనముచేయువాఁడు స్వానుభవమునుబట్టి దీనికి శైవధనైకమార్గనియని పేరుపెట్టుట వింత యగునా?

తాను రెండుపత్రికల ప్రకటించుచు పత్రికాప్రటనము ధనసాధన మనుటం జేసి మూర్ఖశతకమున (జేరెనుగాన దీనింబట్టి తనకుగల శాస్త్ర లోకజ్ఞానములు వ్యక్తమగుచున్నవి.

మఱియు, అనుశ్రుతసదాచారముల ననక, అనుశ్రుతాచారము ల సాధింతు ననుటలో అనాచారములనుగూడ సాధింతునను నర్థము వ చ్చునని వ్రాసియున్నాఁడు. శ్లో. ఆచారహీనం నపునన్తి వేదాః,ఆచా రహీనః పురుషో లోకే భవతినిన్దితః, ఆచారపూతో భయవంశదీపః॥ ఈమొదలగు చోట్ల ఈయాజి ఆచారపదమునకు అనాచారమని యర్థ ము చెప్పునని యేర్పడుచున్నది. ఈతనియొక్క శ్రుతిధర్మముల సంజీవిం ప జేయునట్టి పాండిత్యప్రకర్షముం గంటిరిగదా? ఆతని శాస్త్రలోకజ్ఞా తిశయ మంతయు నిప్పుడె తెల్లమయ్యెను. ఇట్టులాతనిజ్ఞానాతిశయము ప్రతివాక్యమునందును గన్పడును. కాని ముద్రింపఁజాలనందున విరమింపవలసి వచ్చుచున్నది.
శేషముం.

# శ్రీకరభాష్యసంస్కరణము.

శ్రీవేమూరు రామగోవిందశాస్త్రిగారిచే శ్రీదేవిడీసంస్థానాధీశులు శ్రీకరభాష్య సంస్కరణము చేయించుచున్న సంగతి యెంతమాత్రము నమ్మదగియుండ లేదని లోగడసంచికయందు తెలుపంబడియె. నేటికిని మాయభిప్రాయమంతియే.

కాని శ్రీవారు ఇది నిజమనికాని నిజముకాదనికాని ప్రకటింపకుండుటంబట్టి వారు క్రియయే ప్రధానమని యెంచి కార్యదీక్షయం దుండిరేమో యని కొందఱు సంశయించుచున్నారు.

వీరి కిట్టిసంశయము కలుగుటకు కారణమేదియుం గన్పట్టుట లేదు ఏలనిన ఈకార్యము శైవసంఘమునకెల్ల నపఖ్యాతికరమని నిరూపింపంబడియెగదా? ఇట్టిపనిని వారెట్లు తలపెట్టుదురు?

శ్రీకరభాష్యమునందగు దోషములను విమతపండితులు పరిష్కరింతురా? ఈ మాట గోప్యస్థానమున నున్నవ్రణములను భావగారు కుదుర్చుచున్నారనునట్లు హాస్యాస్పదముగా నుండ లేదా?

గోవుయొక్క వ్యాధి కుదుర్చుమని దానిం బెబ్బులి కప్పగించినట్లు శ్రీకరభాష్యమును బాగుచేయుడని యద్దాని నెవ్వారలైన పరమతపండితుల వశముచేయుదురా? దానంజేసి యది బాగుపడునా? నిర్మూలమే యగుగదా?

మఱియు మేకలు గాయుపులికి జీతము బత్తెము నేర్పాటుచేయునట్లు లెవ్వారైన నీకార్యమునకై శాస్త్రిగారికి ధనసాహాయ్యకం బొనరింతురా?

కాబట్టి యిప్పని యెంతయు నమ్మదగినది కాదు.

ఈసంస్కరణము నిజమేల కాదు. 1924 సం॥ ఫిబ్రవరి 12, 15 తేదీలు వెల్వడిన ఆంధ్రపత్రికలలో దేవిడిసంస్థానపు శైవగ్రంథకార్యాలయము ఆంధ్రశైవ మహాజనులకు విజ్ఞప్తి అను వ్యాసములయందు శ్రీకరభాష్యమును చక్కగ సంస్కరించుచున్నారు అనియున్నదే అని యడుగుదురేని ఈప్రకటనలు శ్రీవారు చేసినవి కానందునను, శ్రీకరభాష్యసంస్కరణము కేవలము న్యాయవిరుద్ధము కావునను అందునమ్మకము కలుగుట లేదు. అదియెట్లనిన, ఈసంస్కరణము శైవమహాజనసభానిబంధనమునకు విరుద్ధము.

ఏలందురా? భాష్యచర్చ పరిష్కరణీయముగా శైవమహాజనసభయందు ప్రశంసించియున్న సంగతి యెల్లరకు జెలిసినయంశమేగదా? అది పరిష్కారము కానిచో యొక్కభాష్యము నభిమానించుట సభానిబంధనమునకు విరుద్ధమెట్లు కాకుండును?

వేరుగా పండితసభ గావించి యందీభాష్యచర్చను పరిష్కరించుకొనుటకు శ్రీవారు తామెతీర్మానించియుండి యట్టిపండితసభగాని యందట్టిపరిష్కారముగాని జరుగనిదే వారె శ్రీకరభాష్య సంస్కరణమున కెట్టులారంభింతురు?

మఱియు, ఈసంస్కరణము రుధిరోద్గారి సం॥ అశ్వయుజ శుద్ధ ౧౦లు వెల్వడిన శైవప్రచారిణియందు శ్రీఅరికరేవుల వీరభద్రరావుగారు వ్రాసినదేవిడీసంస్థానపక్ష శైవగ్రంథకార్యాలయము అను శీర్షికకును విరుద్ధము.

ఏలందురా? అదిట్లున్నది. కొలదికాలముక్రిందట మాదేవిడిసంస్థానాధిపతులు శైవసభాగ్రాసనాధిపత్యము వహించి ఎలకుర్తిసభయందు బదివేలరూప్యంబులు తామొసంగుదు మనియు ఆమూల్యమును నప్పుడు సభలో చర్చయందున్న భాష్యనిర్ణయము తీర్మానమైనపిదప ఆగ్రంథముంగూర్చి వ్రయపర్తుమనియు వచించియుండుట శైవమహాజను లెల్లసను నెఱింగియే యున్నారు. అని కలదు.

దీనింబట్టి సభలో చర్చయందున్న భాష్యనిర్ణయము తీర్మానమైనపిదప గెల్చిన భాష్యమునగూర్చి గదా ఆద్రవ్యమును వారు వినియోగపరుతురు. అని తెలియుచున్నది.

భాష్యచర్చ తీర్మానమైనదా? కాలేదు. ఇంక శ్రీవారు నలుబదివేలరూప్యములను శ్రీకరభాష్యసంస్కరణమున కెట్లువినియోగింతురు? అట్లుకాకున్న గెల్చినభాష్యమునకు పదివేలుకాక ఓడిపోయినభాష్యమునకైననో నలుబది వేలు వినియోగింతురా!

ఇంక భాష్యచర్చ తీర్మానమయ్యెనేమో యని శంకించెదరేని, అదితీర్మానమైనదని శి వి. పాకయాజింబోలువాండు చెప్పవలసినదెగాని సభ్యులెవ్వరు నట్లువచింప సాహసింపరు.

తక్కువారిమాటతో నేమిపని? భాష్యచర్చ పరిష్కారము కాలేదనుటకు బలవత్తరసాక్ష్యము కలదు

శైవప్రచారిణి ౧ సంపుటము ౧ సంచికయందు శైవమహాజనసభాధ్యక్షులగు శ్రీదేవిడీసంస్థానాధీశులు వ్రాసినశైవమహాజనసభ దానియావశ్యకత అనువ్యాసము ౧౬. పేజీయందు

శ్రీ

శివాయగురవేనమః

# శైవసూత్రభాష్యానుబంధము

శైవమహాజనులారా,

శైవసూత్రభాష్యనిర్ణయమునెడ నభిప్రాయభేదము కలిగియుండుటయు, ఈచర్చ శైవమహాసభయందు పరిష్కరణీయాంశముగా నేర్పడియుండుటయు శ్రీసభవారియనుమతినిబట్టి తెనాలివాస్తవ్యులగు శ్రీ ముదిగొండ నాగలింగశాస్త్రిగా రొకటియు, శ్రీమదుర్గాంసంస్థానవిద్వాంసు లగుశ్రీచాగంటి సీతయ్యశాస్త్రిగారొకటియు శైవసూత్రభాష్యనిర్ణయము లనుగ్రంథములను ప్రకటించియుండుటయు, పులినిజూచి నక్క వాతపెట్టుకొనినట్లు, శి, వి, పాకయాజి స్వేచ్ఛగా శైవసూత్రభాష్యనిర్ణయ మనునొకగ్రంథమును శైవధర్మప్రకాశికయనుతనమాసపత్రిక రెండవసంచికలో ప్రకటించియుండుటయు, శి, వి, పాకయాజిగ్రంథమున నాగలింగశాస్త్రిగారిని గూర్చి దూషణ మెక్కువయున్నను నీగ్రంథమునను, శ్రీసీతయ్యశాస్త్రిగారి గ్రంథమునను శ్రీకరభాష్యమె ముఖ్యమను పరమసిద్ధాంత మొక్కటియె అయియుండుటయు నందఱకుఁ దెలియును గదా?

అనంతరము దుందుభిసం॥ ఫాల్గునశుద్ధ ౮ లు తెనాలిగ్రామమున జరిగిన శైవమహాసభలో నీచర్చ కొంచెము జరిగినమీఁద సభవారిచే నాపివేయఁబడెను. అద్దానిసంగ్రహ మేమనిన,

భాష్యవాదసంగ్రహము.



తెనాలిగ్రామమున జరిగిన శైవమహాసభలో రెండవదినము మ

ధ్యాహ్నముమీద భాష్యచర్చ ఆరంభించుటకు సభవా రనుజ్ఞ నొసం గిరి. ఈచర్చ నీసభలోనైనఁ బర్యవసానము తేలునందాక విచారించు ట కవకాశ మొసంగిననేకాని చర్చించుట కంగీకరింపఁజాలనని శ్రీనాగ లింగశాస్త్రిగారు పలికిరి. అందునకు సభవా రంగీకరించిరి.

అప్పుడు శ్రీచాగంటిసీతయ్యశాస్త్రిలుగారును, శ్రీముదిగొండ నాగలింగశాస్త్రిలుగారును నెదిరివాదములమీద ప్రశ్నింపఁదగినకొన్ని ప్రశ్నలను వ్రాసి సభాధ్యక్షుల కొసఁగిరి. సభ్యులలో కొందఱొక ప్రశ్నము కోరిరి. సభ్యులు కోరినప్రశ్నముతో చర్చ ఆరంభింపఁబడి యెను. ఆప్రశ్న మేమనిన,

శ్రీకరభాష్యనీలకంఠభాష్యములలో నెయ్యది ప్రాచీనము? అ నునది. అయ్యెడ శ్రీసీతయ్యశాస్త్రులుగారు నీలకంఠభాష్యముకంటె శ్రీకరభాష్యము ప్రాచీనమని సాధింపఁబూనుకొనలేదు. నాగలింగ శాస్త్రిగారు శ్రీకరభాష్యముకంటె నీలకంఠభాష్యము ప్రాచీన మనుట కు శ్రీకరభాష్యములోననె ప్రమాణము కనఁబరిచిరి.
అందుమీదట సీతయ్యశాస్త్రిగారు శ్రీకంఠభాష్యము వేరు, నీలకంఠ భాష్యము వేరు అని యొకవాద మారంభించిరి. కాని, అది వారివా దమున కేమియు నుపయోగకారి కాదయ్యెను. అంతట శ్రీకరభా ష్యముకంటె నీలకంఠభాష్యము ప్రాచీనమని సభ్యులచే ననుమోదింపఁ బడెను.

తరువాత సీతయ్యశాస్త్రిగారిప్రశ్న మారంభింపబడియె. అది యేదనిన, లింగధారణచంద్రికాకారులు శ్రీకరభాష్యసిద్ధాంత మగు ద్వైతాద్వైత మవలంబించినారా? లేక శ్రీకంఠభాష్యమునే ప్రధాన ముగాఁ జేసికొని విశిష్టాద్వైత మవలంబించినారా? అనునది.

అంతట చంద్రికయందు పలుమారు శ్రీకంఠభాష్యములోని సి

ద్ధాంతము గ్రహింపఁబడియెగాన శ్రీకంఠభాష్యసిద్ధాంతమె చంద్రికా కారునిమతమని నాగలింగశాస్త్రిగారును, చంద్రికయందే శ్రీకరభాష్యము గ్రహింపఁబడియున్నదిగాన శ్రీకరభాష్యములోని ద్వైతాద్వైతసిద్ధాంతమేచంద్రికాకారునిమతమని సీతయ్యశాస్త్రిగారు నుపపాదించినపఁగంపఁడి లింగధారణచంద్రికలో శ్రీకరభాష్యమను పేరు గ్రంథకర్త గ్రహించినది కాదనియు పరిష్కర్తచేతనె గ్రహింపఁబడినదనియు నాగలింగశాస్త్రి గారు ధ్రువపరిచిరి. అప్పుడు సీతయ్యశాస్త్రిగారు మధ్యస్థులందఱు పక్షపాతము వహించియున్నారని మాత్రమె సెలవియ్యవలసివచ్చెను, తరువాత సీతయ్యశాస్త్రిగారు లింగధారణచంద్రికాకారుఁడు గ్రహించిన ముక్తిస్వరూపము భేదాభేదసిద్ధాంతమున కనుకూలముగా నున్నదికాన భేదాభేదమె చంద్రికాకారునిమత మని పలికిరి.

అనంతరము నాగలింగశాస్త్రిగారు చంద్రికాకారుఁ డుదాహరించినముక్తిస్వరూప మనుభవాద్వైతమునుబట్టి వచింపఁబడియెనెగాని భేదాభేదమునుబట్టి నిరూపించినది కాదనియు, శ్రీకరభాష్యకారుని మతమునందు ముక్తి స్వాభావికభేదనివృత్తిరూప మనియు అది శ్రుతిసూత్రవిరుద్ధ మనియు ప్రతిపాదించిరి.

అప్పుడు సీతయ్యశాస్త్రిగారు శ్రీకరభాష్యసిద్ధాంతమున దోషము లేదని సాధింపఁజూచియు పదంపడి యేదోషమునెప్పుకొని సవరించుకొందునని పలికిరి. అంతట సభ ముగింపుచేయఁబడియెను.

ఆరాత్రియే నాగలింగశాస్త్రిగారు లేనప్పుడు తమకు జయము కలిగెనని సీతయ్యశాస్త్రిగారు వచించియున్నట్లు భోజనకాలమునఁ గొందఱు సభ్యు లుభయులయెదుట ప్రస్తావించిరి. అప్పుడు కొంద ఱిది నిజమా యని సీతయ్యశాస్త్రిగారి నడిగిరి. అందుపై వారు తమకు

జయము కలుగలేదనియు, తా మట్లు వచింపను లేదనియు బహులు చెప్పిరి.

అందు మీదఁగొందఱు మీ రిప్పు డొప్పుకొనకున్నను నట్లు పలికినది యథార్థమే యనియు, ఇంకొకచోటనైన నట్లు చెప్పికొందురనియు, కావున రేపు తిరిగి యీచర్చ జరుపవలయునని నిర్బంధించిరి.

అప్పుడు సీతయ్యశాస్త్రిగారు విమతపండితులు లేకున్న నేను వాదింపనని పలికిరి. అంతట వారు కోరినట్లు విమతపండితులను రప్పించి తప్పక సభజరుపవలయునని యందఱుచే నిర్ణయింపఁబడియె.

మరునా ఁడుదయమున సభామంటపమునకు సభాధ్యక్షులరుదెంచి యిప్పుడె సభ పూర్తిచేసి రైలుకు వెళ్లుదుమని సెలవిచ్చిరి.

అంతట నాగలింగశాస్త్రిగారు, ప్రతిసభలోనను ఈచర్చను బహిష్కరింతుమని ప్రకటించుచుండుటయు, ఆరంభము చేయించి నడుమనె యాపివేయుచుండుటయు సంభవించుచున్నది. కావున నింకమీఁద సభవా రట్లు ప్రకటించినను ఈపనిమీఁద మేము రాఁజాలము. ఈసభలోన నీచర్చ పూర్తి గావింపవలయునని కోరిరి.

అంత, సభాధ్యక్షులు ఇప్పు డున్నపండితులు పక్షపాతము వహించియున్నారని సీతయ్యశాస్త్రిగారు సెలవిచ్చియుండిరిగదా? వీరిని మధ్యస్థులనుగాఁ బెట్టుకొని యెట్లు విచారింపవలయు? మహాసభలో నీచర్చ కవకాశము చాలదు. కావున, దీనికై ప్రత్యేకముగా పండితసభ యేర్పరచి దానిలో నీచర్చ పూర్తి చేసికొనవలయు నని వచించుచు సభ్యులనుఁగాంచి మీ రుభయులకు చర్చపెంచినకొలఁది వీరికి నావేశములు పెరుగునుగాన మనము వారి కట్టియవకాశ మొసఁగఁగూడ దనియు సెలవిచ్చిరి.



తరువాత, నాగలింగశాస్త్రిగారు, ఇట్టిభావము మొదటనయందు

నేడ బాధకము లేకుండెను. కాని యారంభము చేయించి కొంతవర కు జరిపినమీద నిల్లించనగునా? సీతయ్యశాస్త్రిగారు కోరినప్రకారము విమతపండితులను రప్పించియైన నీచర్చ పూర్తిగ విచారించి పరిష్కరింపుడని కోరిరి.

అనంతరము సభాధ్యక్షులు, ఈచర్చ మేమా ఆరంభము చేయించినది?అని యాగ్రహమును గనపరచి సభ్యులకు వందనములు చేసి సభ పూర్తిచేసి రైలుకు దయచేసిరి. భాష్యచర్చ ఇట్లు సభలో సంపూర్తినొందెను.

తరువాత, శి, వి, పాకయాజి తనశ్రుతిధర్మసంజీవని 3 వ సంపుటము 15—16 సంచికలలో తెనాలిలో జరిగినశైవమహాసభను గూర్చి ప్రకటించుచు, సీతయ్యశాస్త్రిగారికి,నాగలింగశాస్త్రిగారికిని జరిగినవాద ప్రతివాదములను గాగొన్నటివ్రాసి, వానికి శృంగభంగ మనియు, పరాభవమనియు నామకరణములు గావించి యథేచ్ఛముగా నసత్యవార్తల ను ప్రకటించియుండెను.

ఆవార్తలు కేవల మసత్యములని సభ్యు లందఱు గ్రహించియే యున్నారు. తక్కుంగలతనపత్రికాపాఠకులును పత్రికారంభముమొదలుకొని నాగలింగశాస్త్రిగారి కీతఁడు చేయుచున్నదూషణ మెఱింగినవారె కాన వారిని గూర్చి యీతఁడు ప్రకటించువార్తల నట్లును విశ్వసింపరనియెఱింగి చెడిని. ఈప్రకటనవలన తనకేమైన జయము కలిగినట్లు తేర్పడుచున్నదా? లేదు.

ఈపత్రికను చూడగనె పాకయాజి ధారణాశక్తికి కొంద అచెరు వొందసాగిరి. మఱికొంద ఱీపూర్వోత్తరపరూపావళి యీతఁడు జ్ఞాపకశక్తితో వ్రాసినది కాదు. ఆతనిశక్తి నెఱుంగమా? ఇది సీతయ్యశా

స్త్రిగారె చాటుగా వ్రాసి యిచ్చి యుందురని యూహించిరి.

నిజ మెట్టులున్నను ఈపత్రికలోనిదూషణాంశములకు పండితులు బదులుచెప్ప నవసరము లేదుగాని యందగుపూర్వోత్తరపక్షావళియైన నో విమర్శనాసహముగనె యున్నది. అట్లైననేమి చేయవలయు? ఇయ్యది పండితలిఖితముగాఁ బ్రకటింపఁబడియుండునెడ విమర్శించినలాభము కలదుగాని, అట్లుగాక, ఇది యాజిలిఖితమేయైనచో విమర్శించిన నేమిలాభమని యింతదనుక నుపేక్షింపవలసివచ్చెను.

పాపము దాగలేదు. నిజము నిలుకడమీద తెలియుననులోకోక్తి రిత్తయగునా? ఈనడుమ, శి, వి, పాకయాజి తెనాలిగ్రామమునకు వచ్చినప్పుడు ఇచ్చటిశైవసమాజసభ్యులు కొందఱు నీవిట్టియసత్యవార్తల నెట్లు ప్రకటించితి వని మందలింపఁగా దాని కాతఁడు సీతయ్యశాస్త్రిగారు వ్రాసియిచ్చినందున ప్రకటించితినని బదులు చెప్పెను కాని యీవచనము సమాజమువారికి నమ్మకము కలిగింపకపోగా, పెద్దపండితులగు సీతయ్యశాస్త్రిగారు నాగలింగశాస్త్రిగారిని సాధించుటకై వారికిని, సంఘమునకును విరుద్ధుఁడుగా ప్రసిద్ధివహించియున్నయీ నెట్లు చాటుగా నాశ్రయింతురని సంశయమే బాధించుచుండెను. ఈ సంశయము తీర్చికొనుటకై ఇచ్చటిసమాజమువారు శ్రీసీతయ్యశాస్త్రిగారి కొకరిజిస్టర్డులేఖ నంపిరి. దానిసారాంశ మేమనిన,

శ్రీశాస్త్రిగారి సముఖమునకు, అయ్యా, తెనాలియందుఁ జరిగిన శైవమహాసభనుగూర్చి ప్రకటితమగు శి, వి, పాకయాజిపత్రికను మేము కంపుకొనియున్నాము. పాకయాజి నాగలింగశాస్త్రిగారిపై ద్వేషముచేత నిట్టియసత్యవార్తలను ప్రకటించియున్నాఁడు. ఆయన ప్రకటించిన దానికి త[illegible]లోని అంశములవల్లనే యని

యసత్యములుగా ప్రకటింపఁబడినట్లు కనఁబడుచుండుటచే నుపేక్షించి యీవిషయమున స్వయముగా వారితోసంప్రతించగా సభలో జరిగిన సంగతులు మీరువారికి వ్రాతమూలముగా ఇచ్చినట్లు వారు చెప్పినందున సర్వజ్ఞులైన తమరు లోగడ నాకుజయము కలుగలేదని మాహేశ్వరబృందసమక్షములో సెలవిచ్చినప్పుడు నేనున్న వినియున్న కారణముననుు, భాష్యచర్చను పరిష్కరించుటకు వ్యవధిలేనందున ప్రత్యేకపండితసభ నొకదాని నేర్పాటుచేసికొని తీర్మానించుకొననలసినదనియు, ప్రస్తుత మీసభలో తీర్మానించుటకు వ్యవధిలేదనియు నగ్రాసనాధిపతిగారు తీర్మానించినసంగతి తెలిసియున్నకారణముననుు, మీ రట్లువ్రాసియిత్తురని విశ్వసింపక నిజము తెలిసికొనుటకై యీపత్రికను తమకు సమర్పించుచున్నాము. యాజిపత్రికను తామింతవరకు చూచియుండరనియు, చూచియుండినచో నావ్యాసములోనిసంగతు లబద్ధములని తాము ప్రకటించియుందురని మాకు నమ్మకము. కావున నిజము తెలుప ప్రార్థించుచున్నాము.

దీనికి శ్రీసీతయ్యశాస్త్రిగారు ప్రతిలేఖను రిజిస్టర్డుమూలకముగనె తెలిపిరి. దానిసారాంశ మేమనిన,

అయ్యా, తమ లేఖ యందినది. తెనాలియందు శ్రీశైవమహాసభజరిగిన కొలదిదినములకే సంజీవనిపత్రిక జూచి యుంటిని. అందు శ్రీనాగలింగశాస్త్రిగారికిని, నాకును ప్రశ్నప్రతివచనాత్మకముగ జరిగినవాదగ్రంథమును లిఖితరూపమున మాకిమ్మనియు, సంజీవనియందు ప్రకటింౘెద ననియు బ్ర శ్రీ, వి, పాకయాజిగారు కోరుటచే నేనా గ్రంథమును మాత్రము జ్ఞాపక మున్నంతవరకు వారికి వ్రాసి యిచ్చియుంటిని. అది జరిగినట్లే ప్రకటింపఁబడియున్నది. కాని యందు స

త్యేతరము గానరాదు. ఆవాదగ్రంథమునకు శృంగభంగ మనుశీర్షికయు, తత్పూర్వాపరభాగంబుల నుండువ్యాసంబులును నేను వ్రాసినవికావు, నాకు సమ్మతములును కావు. అట్లుండ నందలిగుణదోషములను పాఠకులగు తమబోంట్లు గ్రహింపవలసినదేకాని నేను వేరుగ జెప్పవలసిన దేమియు నుండ నేరదు. అందుచేతనే ఇదివరలో నాపత్రికచూచినవాడనైనను నేమియు వ్రాయనైతిని. శ్రీపాకయాజిగారిదియేకాక శైవసభలో మావివాదవిచారణకుముందే శైవసూత్రభాష్యనిర్ణయ మనుపేరుతోడనే తమయభిప్రాయమును వెలిబుచ్చి విమర్శనముం గావించి యాసంచికను ముందుగ శైవసభలో బంచియుండిరి. అదిగాక యాజిగారి సంజీవనిపత్రికపయి స్వవిషయములో నాయభిప్రాయ మెట్లు తెలుపును. నాటిసభాంతమున నగ్రాసనాధిపతులు మావివాదమును విచారించుటకు వ్యవధిలేనందున ప్రత్యేకపండితసభ నేర్పాటుచేసుకొని దానిలో తీర్మానించుకొనవలసినదనిన్ని ప్రస్తుత మీసభలో తీర్మానిచుటకు వీలులేదనిన్ని తీర్మానించినట్లు తాము వ్రాసియున్నారు. ఆ తీర్మానము నేను విన లేదు.

చిత్తగించునది.

విధేయుడు

చాగంటి సీతయ్యశాస్త్రి

దీనింబట్టి సీతయ్యశాస్త్రిగారు వాదప్రతివాదములను వ్రాసియిచ్చినట్లు వారిలేఖ వలననె స్పష్టపడినదికదా? వ్రాసియిచ్చినప్పుడు తాము వ్రాసియిచ్చినట్టు లాపత్రికలో ప్రకటింప వీరేల కోరలేదో? వీరు వ్రాసియిచ్చినట్టు లాపత్రికాధిపతియైన నేల ప్రచురింపలేదో ఇందుకు గారణము కనిపట్టుడు.

ఆలోచింప నొక్కటి తోఁచెడిని. ఏమనిన, సీతయ్యశాస్త్రిగారు వాదిప్రతివాదులలో నొకరై యున్నారుగాన, వీరిపేరుతోఁ బ్రచురించునెడ నీవ్రాఁతయందు లోకులకు నమ్మకము కలుగనేరదు. ప్రేక్షకుని వ్రాఁతగా నుండునెడ నెఱుఁగనివారైనఁ గొంతవరకు నమ్ముదురని యుభయులు నాలోచించినట్లు స్పష్టపడుచున్నది.

వీరిట్లు నాగలింగశాస్త్రిగారి కపజయము కలిగెనని లోకులకు నమ్మకము కలిగించుటకై యథార్థమును కప్పిపుచ్చవలసినవారైరి కదా? వీరి కిట్టిదృఢనిశ్చయ మున్నప్పుడు సభలో జరిగినవాదప్రతివాదములనే వ్రాసి యియ్యవలసినయావశ్యకత సీతయ్యశాస్త్రిగారి కేల యుండునో? యథార్థమునే ప్రకటింపవలసినయావశ్యకత యాజి కేల యుండునో మీర యూహించుకొనుడు.

వీరి కిట్టిదృఢభావము కలిగియున్నప్పుడు యాజి వ్రాసియిమ్మని శాస్త్రిగారి నడిగినను అడుగవచ్చును. అడుగకున్నను శాస్త్రిగారు యాజికి వ్రాసియు నీవచ్చును. దీనింబట్టి సీతయ్యశాస్త్రిగారు కేవలము విజయకాంక్షతో నీవాదమునఁ బ్రవేశించినట్లు తోఁచెడిని. కాని శైవసంఘమునకు భాష్య మెద్దియో నిర్ణయించునిశ్చయముతోఁ బ్రవర్తించినట్లు తోఁపదు. అట్టియాశయమే వీరికున్నయెడ, చర్చ పూర్తి కానిదె, నాగలింగశాస్త్రిగారు కోరినయొక్కప్రశ్నమునైన విచారింపనిదే అప్పుడేయాజి నాశ్రయించి తమవిజయమును ప్రకటన సేయించి కొందురా?

నాగలింగశాస్త్రిగారి కట్టియాశయ మెప్పుడును లేదు. మహాసభవారీచర్చ నేసభలోను పూర్తిచేయకుండిరే? అదియెట్లు తేలునా? అను నూహతో సభాధ్యక్షు లనుమతింపకున్నను పరిష్కరింపుడని

శక్తికొలఁది పోరాడి తొనకు వారికి కోపమువచ్చినందున చేయునదిలేక నిరాశులైరి.

మహాసభవారు భాష్యచర్చ నిట్లు పూర్తిచేసిరి గాన తిరుగ నీచర్చ సభలో సంభవింపఁగనియు, ఆకారణముననిప్పుడే తమవిజయము ను ప్రకటించుకొనిన బాగుండుననియు నెంచి సీతయ్యశాస్త్రిగారు తమ మనోరథమును యాజిసాహ్యమున పూర్తిచేసికొనిరి.

అంతియెకాని సభలో విచారింపఁబడినచర్చలోనైన సీతయ్యశా స్త్రిగారికి జయము కలుగనే లేదు. వారి కప్పుడు జయమే కలిగి యుండు నెడ నారాత్రి యందఱియెదుట తమకు జయముకలుగలేదని వారు చెప్పవలసినయవసర మేల యుండును? వా రట్లు చెప్పియుండని చో శాస్త్రిగారు శైవసమాజమువారికి వ్రాసినరిజిస్టర్డు లేఖలో మీయె దుట నాకుజయము కలుగ లేదని నేనుచెప్పియున్నట్లు వ్రాసియున్నారు. కాని యది సత్యముకాదని యేల వ్రాసి యుండరు? కావున వారికి జయము కలుగ లేదని వారిలేఖవలననే స్పష్ట మగుచున్నది.

మఱియు, సీతయ్యశాస్త్రిగారు తమ లేఖలో అగ్రాసనాధిపతి గారి తీర్మానమును తాము విన లేదనియు వ్రాసియున్నారు. దీనింబట్టి యాతీర్మానము నంగీకరించు నెడ సందువలన సభ యాగెనుగాని తమవి జయమువలన సభ యాగ లేదని లోకు లెంతు రేమోయని యూహించి నట్లును కనఁబడుచున్నది. దీనింబట్టి వారికి ఏవిధముననైన జయించితి మనిపించుకొనవలయు ననుకుతూహల మధికముగా నున్నట్లు తెలి సెడిని.

శ్రీసీతయ్యశాస్త్రిగారికి జయము కలుగుట యుండెవ్వరికి నస మ్మతము కాదు. నాగలింగశాస్త్రిగారికిని పరమసంతోషకరమే.

అయిన నిజయాపజయములు శ్రీకరనీలకంఠభాష్యములవి కాని శాస్త్రిగార్లయిరువురవి కానేరవు. సీతయ్యశాస్త్రిగారు జయిం చిరనగనె శ్రీకరభాష్యము జయించెననియు, నాగలింగశాస్త్రిగా రప జయ మొందిరనగనె నీలకంఠభాష్య మోడిపోయెననియు, తప్పక లోకు లు నిశ్చయింతురుగదా? న్యాయ్య మగుమార్గమున నీలకంఠభాష్య మోడిపోవునెడ నాగలింగశాస్త్రిగారి కించుకైనవిచారము కలుగనేరదు. అట్లుగాక కృత్రిమమార్గమున నీలకంఠభాష్య మపజయమునొందె నని ప్రకటితమగుట శైవసంఘమున కెల్ల నష్టకర మగుటంజేసి యెల్లరకు సంతాపకరమేకదా? కావున యీజితీర్మానించినజయాపజయము లెం తవరకు నిజమో యని విమర్శింప నవసరమయ్యెను.

ఈసభలోని జయాపజయములసంగతి యుండనిండు. సావకా శముగా తాము వ్రాసియిచ్చినసిద్ధాంతములనుబట్టియైన సీతయ్యశాస్త్రి గారికి జయము కలిగెనా? అని విమర్శించుట ప్రకృతము.

మొదటిదగు సభ్యులు కోరినప్రశ్నములో వారికి జయము కలి గెనేమోవిమర్శింతము. శ్రీకరభాష్యనీలకంఠభాష్యములలో నేది ప్రాచీనము? అనునది సభ్యులప్రశ్నము.

శ్రీకరభాష్యము నీలకంఠభాష్యముకంటె ప్రాచీనమని సాధిం చినప్పుడుకదా వారికీసారాంశమున జయము కలుగును? అట్లు సాధిం పయత్నమైనఁ జేసినట్లు శ్రు॥ జీవనిలోని ప్రకటనవలన తెలియుచున్నదా? లేదు. ఇఁక వారి కెట్లు జయము కలిగెను? అట్లు గాకున్న, శ్రీకర భాష్యముకన్న నీలకంఠభాష్యము ప్రాచీనము కాదనియైన సాధించినట్లు కనఁబడుచున్నదా? అదియు లేదు. శ్రుతి...... వని 3వ సంపుటము ౧౧-౧౬ సంచికల 12 పేజి సభ్యులు ... పండి

తునికంటె పూర్వుఁడని మీరంగీకరింతురా? లేదా యని యడిగిరి, నీల కంఠుని పండితునికంటె పూర్వుఁడని యంగీకరించుటలో మాకు విరుద్ధాభిప్రాయము లేదని సీతయ్యశాస్త్రిగారు వప్పుకొనిరి. అనియున్నది. నీలకంఠుని పండితునికంటె పూర్వుఁడని యంగీకరించునెడ పండితకృతమగు శ్రీకరభాష్యముకంటె నీలకంఠకృతభాష్యము ప్రాచీనమని వప్పుకొనినట్లు కాదా? దీనింబట్టి తమవాదమును నిలుపుకొనకపోగా ఎదిరి వాదము నంగీకరించినట్లే స్పష్టపడుటలేదా? ఇటులుండ నీసాంశమున వారి కెట్లు జయము కలిగెనో మీర నిశ్చయించుకొనుడు.

ఇచ్చట వీరవలంబించినవిచిత్రవాద మొక్కటి కలదు. ఏదన, నీలకంఠభాష్యము వేరు, శ్రీకంఠభాష్యము వేరు. శ్రీకరభాష్యమున నీలకంఠునిపే రున్నమాత్రమున శ్రీకంఠభాష్యమున కెట్లు ప్రాచీనత్వము వచ్చుననునది. దీనికి నాగలింగశాస్త్రిగారప్పుడె సమాధానము చెప్పియుండిరి. కాని యీయంశమును వీరేకారణముననో ప్రకటింపకైరి. ఆసమాధాన మేమనిన,

మాపక్షమున శ్రీకంఠభాష్యము నీలకంఠభాష్యము నొక్కటియె కాన శ్రీకరభాష్యమున నీలకంఠునిపేరు గ్రహింపఁబడినందున శ్రీకరభాష్యముకంటె శ్రీకంఠభాష్యమునకు ప్రాచీనత్వము సిద్ధించుచున్నది. శ్రీకంఠభాష్యము వేరు, నీలకంఠభాష్యము వేరుఅనుమీవాదమును బట్టి చూచినను శ్రీకరభాష్యమునందే శ్రీకంఠనామంబును గ్రహింపఁబడియున్నకారణమున శ్రీకంఠభాష్యమునకును ప్రాచీనత్వము తప్పక ప్రాప్తించుచునే యున్నది. కావున నది వేరు ఇదివేరు అనునీవాదము నవలంబించినందున మీ కేమి లాభము?

ఇదిగాక, శ్రీకంఠభాష్యముకంటె నీలకంఠభాష్యము వేరుగా

నుండునెడ దానిని తీసికొనివచ్చి యిది మనభాష్యముగాన శ్రీకంఠభాష్యము మనకు కూడదని వచించిన నదియుక్తముగా నుండుగాని లేని భాష్యము వేరుగానున్నదని భ్రమము కలిగించి యున్నది కూడదని నిరసింపఁబూనుట న్యాయ్యమాయని నిరూపించి యుండిరి. అప్పుడు శ్రీకింద్రాబాదువాస్తవ్యులగు శ్రీముదిగొండ నాగలింగశాస్త్రిగారు మొదలగుమధ్యస్థులు కొన్నిగ్రంథములమీద నీలకంఠభాష్య మనుపేరుచూచి శ్రీకంఠభాష్యముకంటె నితరభాష్యమని యెంచి లోపలజూచువరకు నది శ్రీకంఠభాష్యమె యగుచుండెననియు నీయొక్కభాష్యమునకే రెండునామములుగాని భాష్యములు రెండుగా లేవనియు నప్పుడే చెప్పియుండిరి.

మఱియు, శ్రీకంఠభాష్యముకంటె నీలకంఠభాష్యము వేరుగా నున్నది గాన నదిప్రమాణ మనువాదము ప్రచారములోనున్నభాష్యము ను నిరసింప వీరిచే గనిపెట్టఁబడినది కావునను, అద్దానిని వారు సాధించి చూపువరకు, గగనారవిందము సురభి యనువాదముంబలె నాశ్రయాసిద్ధము గావునను దానింగూర్చి విమర్శింపననవసరము.

సభ్యులు కోరినప్రశ్నముయొక్క విచార మటుండుగాక.

తాముగోరినప్రశ్నముయొక్క విచారమునందైన సీతయ్యశాస్త్రి గారికి జయముకలుగికుండునాయని యడుగుదు రేని? అదియెట్లోనిర్ధారణ సేయుదు.

ప్రకృతమగు శ్రుతి......వని పత్రికయందు 13 పేజీ

సీతయ్యశాస్త్రిగారిప్రశ్న.

లింగధారణచంద్రికాకారులు శ్రీకరభాష్యసిద్ధాంతమగుద్వైతాద్వైతమువలంబించినారా? లేక శ్రీకంఠభాష్యమును ప్రధానముగాఁ

జేసికొని విశిష్టాద్వైత మవలంబించినారా? అనునది.

ఇందుమీద నాగలింగశాస్త్రిగారు చంద్రికాకారునిచే శ్రీకంఠ భాష్యసిద్ధాంతము పలుమారు గ్రహింపఁబడియెననియు, భేదాభేదను అనుపేరైనను చంద్రికలో లేదనియు నిరూపించినతరువాత, శ్రు...ని 14 పేజీ,

సీతయ్యశాస్త్రి

చంద్రికాకారుఁడుతనగ్రంథమందు నెన్నిమారుఁలు విశిష్టాద్వైత మునెత్తికొన్నను అయ్యది దృష్టాంతార్థము చూపఁబడియెనేగాని అది త మమతమని చూపియుండలేదని ఇదివరకే ధ్రువపరచియుంటిని. భేగా భేదసిద్ధాంతము చంద్రికయం దెచ్చటనైనను లేదనియంటిరే? చంద్రిక 12 వ పుటయందు శ్రీమచ్ఛ్రీపతిపండితయతీంద్రకృత శ్రీకరాఖ్యబ్రహ్మ మీమాంసాభాష్యే అని భేదాభేదసిద్ధాంతప్రతిపాదకభాష్యము స్వసి ద్ధాంతప్రమాణభూతముగ గ్రహింపఁబడియుండ లేదని యెట్లనగలిగితిరి? అనియున్నది.

చూచితిరా? ఇచట, ఎట్లనగలిగితిరి అనుమాట పొడచి గెలిచిన చందమును నెట్లు తెలిపెదనో? ఇఁక లోపలివాక్యసందర్భముయొక్క స హేతుకత్వ మెట్లున్నదో పరిశీలించుడు.

చంద్రికయందు ఎన్నిమారులు విశిష్టాద్వైతము నెత్తికొన్నను అ య్యది దృష్టాంతార్థ మని ధ్రు వ ప రి చి యు న్నా ర ట. అదియు చూడుడు, 13 వ పేజీ

సీతయ్యశాస్త్రి.

అయ్యా, గ్రంథకారులు తమతమగ్రంథములయందు పైగ్రంథక ర్తల నుదహరించి వారియందు పూజ్యభావమును సూచించినంతమాత్ర

న గ్రంథకారులందఱు తత్తన్మతావలంబులేయని మీరుసిద్ధాంతీకరించిన చో స్వస్వభాష్యముల న్యాయసామ్యమునకై భట్టభాస్కరాదుల పూజ్యభావముతో నుదహరించు శంకరాదిభాష్యకర్తలందఱు పూర్వమీమాంసామతస్థులే కావలసివచ్చునుసుడీ, అనునదియే ధ్రువపరుచువాక్యముగాఁ దోఁచెడిని. దీనింబట్టి విశిష్టాద్వైతము చంద్రికాకారునకు స్వమతముకా దనియు, శ్రీకరభాష్యే అనువచనము గ్రహింపఁబడియెగాన శ్రీకరభాష్యములోని భేదాభేదము చంద్రికాకారునకు స్వసిద్ధాంత మనియు సిద్ధాంతముచేయుచున్నారు గదా?

ఇచట శాస్త్రిగారి నొక్కమాట యడుగుదు? ఏమనిన,

చంద్రికాకారుఁడు శ్రీకరభాష్యములోని భేదాభేదము తనమత మనియు, నీలకంఠభాష్యములోని విశిష్టాద్వైతము తనమతముకా దనియు. దానిని దృష్టాంతమునకే చూపితి ననియు నెటనైన తెలిపియున్నాడా? అని మొదట ప్రశ్నించుదు. అట్లు లేదని రేని?

మీరు ధ్రువపరిచినవిధమును బట్టి శ్రీకరభాష్యమును గ్రహించుటె దృష్టాంతార్థ మనియు, నీలకంఠభాష్యములోని విశిష్టాద్వైతము న గ్రహించుటే స్వసిద్ధాంతమును తెలుపుట కనియు నేల నిశ్చయించుకొనఁగూడదు. అని యడుగుదు. రెండును దృష్టాంతార్థమే యనిరేని,

చంద్రికలో శ్రీకరభాష్య మనుమాట యొక్కచోటనె కనఁబడుచున్నది. ఇంతియెగాని యందులోని సిద్ధాంత మేదియు గ్రహింపఁబడి యుండ లేదు. నీలకంఠభాష్యమైననో అధికరణార్థములతో, సిద్ధాంతములతో గూడ చంద్రికయందు పలుమారు గ్రహింపంబడియె. దీనింబట్టి చంద్రికాకారునకు నీలకంఠభాష్యముమీద నెక్కువయభిమానసము కనఁబడుట లేదా? దానింబట్టి నీలకంఠభాష్యసిద్ధాంతమే చంద్రికాకా

రునిమత మన్నిర్ణయించుట యుక్తమా? అట్లుగాక రెండును దృష్టాంతార్థము లేయన్నియు,చంద్రికాకారుని మత మగోచరమనియు,నిశ్చయించుటయు క్తమా? అనియడుగుదుము,

ఇదిగాక, చంద్రికాకారుఁడు గ్రహింపకున్నంతమాత్రమున నీలకంఠభాష్యప్రామాణ్యమునకు హాని లేదు. ఏలందురా? క్రియాసారకారాద్యనేకు లగుపూర్వాచార్యులు నీలకంఠభాష్యమును శిరసావహించి యుండుటయేగాక సీతయ్యశాస్త్రిగారు ఏశ్రీకరభాష్యమును ముఖ్యముగను సాధించి నీలకంఠభాష్యము నముఖ్యముగ సాధింపబూనిరో ఆ శ్రీకరభాష్యమునందే నీలకంఠభాష్యము ముఖ్యప్రమాణముగ గ్రహింపఁబడియున్నది. ఇఁక శ్రీకరభాష్యమైననో అట్లుగాక, చంద్రికాకారుని యనుగ్రహమును కోరునదే. ఏలందురా? శ్రీకరభాష్యమను పేరు చంద్రికయందకాక సంస్కృతాంధ్రద్రావిడ కర్ణాటకాది వాఙ్మయములం దెచ్చటను కన్పట్టుట లేదుగదా?

విచారింప చంద్రికలోనైన శ్రీకరభాష్యే యనుమాట గ్రంథకారుఁడు గ్రహింపనట్లే స్పష్టపడుచున్నది. ఏలందురా? శ్రీకరభాష్యమును తయారుచేయించిన శ్రీపండితస్వాములవారి సోదరకుమారుఁడగు మల్లికార్జునశాస్త్రిగారు తెలుగునముద్రిత మగులింగధారణచంద్రికను పరిష్కరించి యిచ్చినట్లున్నది.

సశేషము



దీనింబట్టి పరిష్కర్త శ్రీకరభాష్యనామమును జేర్చుట సంభావితము.

ప్ర॥ పండితస్వాములవారి సోదరకుమారుఁడగు మల్లికార్జునశాస్త్రిగారు లింగధారణచంద్రికను పరిష్కరించి యిచ్చినంతమాత్రమున ఆచంద్రికయందు శ్రీ కరభాష్యనామమును వారు చేర్చిరని యెట్లు నమ్మనగు?

ఉ॥ చంద్రికాపరిష్కర్త శ్రీకరభాష్యమునకు సంబంధింపనివాఁడై యగునేని సంశయమునకై యవకాశము లేకుండును. లింగధారణచంద్రిక టైటల్ పేజీయందు, శ్రీపతిపండితవంశసంభూతపండితాహ్వయశైవవిద్వత్సార్వభౌమస్య పుత్రేణ మల్లికార్జునారాధ్యేన సహోదరస్థాలిత్యాః పరిష్కృత్య, అనియున్నది. ఈమల్లికార్జునశాస్త్రిగారు శ్రీకరభాష్యనిర్మాణకాలమున స్వాములవారికి సహాయులైయుండి యాగ్రంథమును తమ కూటస్థుడగు శ్రీపతిపండితునిచే రచింపంబడినట్లు సృజించియున్నారు. కావున నీ శ్రీకరభాష్యము ప్రాచీనమని స్థిరపరుపవలసినబాధ్యత సీతయ్యశాస్త్రిగారికంటె వారికెక్కువయున్నది. అప్పుడు తాము తయారుచేసిన శ్రీకరభాష్యనామము అప్పటికిఁగల గ్రంథములలోఁ నుండదని వారికి గట్టినమ్మకమే. ఇఁక తాము పరిష్కరించు ప్రాచీనగ్రంథములలోఁ జేర్చుటకంటె గత్యంతరము లేదు. ఇట్టితరుణమున దైవానుకూల్యమున చంద్రికను పరిష్కరింపవలసివచ్చెను. అట్టియదనున తమమనోరథమును, తీర్చికొనకుందురా? కాఁబట్టి పరిష్కర్తయే లింగధారణచంద్రికయందు శ్రీకరభాష్యనామమును చేర్చెనని స్పష్టమగుచున్నది.

ప్ర॥ మల్లికార్జునశాస్త్రిగారు శ్రీకరభాష్యనిర్మాణమునను సంబంధపడినవాఁడేయగుఁగాక. దానింబట్టి ఆయన పరిష్కరించినచంద్రి

కలో శ్రీకరభాష్యనామమును చేర్చినేమోయని సంశయము కలుగ వచ్చునుగాని, అంతమాత్రమున, ఆయనయే చేర్చెనని యెట్లు నిశ్చ యింపనగు?

ఉ॥ చంద్రికలో శ్రీకరభాష్యే అనుపేరుమాత్రమున్నదిగానిదా నిలోనివాక్యముగానిసిద్ధాంతముగానియేదియు గ్రహింపఁబడియుండలేదు. గ్రంథకర్తయేగ్రహించునెడ వాక్యమునో సిద్ధాంతమునో గ్రహించుగాని పేరుమాత్రము గ్రహింపఁడు. దానివలన నేమియు ప్రయోజనములేదు గదా?

ఇదిగాక, మల్లికార్జునశాస్త్రిగారు పరిష్కరించినచంద్రికలో నన్నె, శ్రీకరభాష్యే అనుమాట కలదుగాని కాశీపట్టణమున శివకు మారపండితకృత వ్యాఖ్యానముతోగూడ నాగరలిపియందు ముద్రింపఁ బడిన చంద్రికలో శ్రీకరభాష్యే అనుమాట లేనేలేదు. దీనింబట్టి పరిష్కర్తయె చేర్చినట్లు ధ్రువపడుటలేదా? మల్లికార్జునశాస్త్రిగా రు శ్రీకరభాష్యకర్తలలో నొకరైయుండి వారు పరిష్కరించినచంద్రి కలోననే శ్రీకరభాష్యే అనుమాట కనఁబడుచు కాశీముద్రితప్రతి లోలేనప్పుడు పరిష్కర్తచేర్చెననుటకు సంశయ మెట్లుండునో ఇంకను ప్రమాణాంతర మేమికావలయునో తోఁపదు.

ప్ర॥ శివకుమారపండితవ్యాఖ్యాకలిత యగులింగధారణచంద్రిక బ్రాహ్మణేతరవిషయయని సర్వజను లంగీకరించుచుండ దానియందు బ్రాహ్మణశైవసిద్ధాంతప్రతిపాదక మగు శ్రీకరభాష్యప్రశంస యుండ కపోయినంతమాత్రమున మావాదమునకు లోటుండునా? అని సీతయ్య శాస్త్రిగారు వచించియున్నారు. దీని కేమి సమాధానము?

ఉ॥ కాశీయందు ముద్రితమగు చంద్రికా గ్రంథము జంగములు చే ప్రకటింపఁబడినదే. అయిన నంతమాత్రమున నాగ్రంథము బ్రా

హ్మణశైవుల కుపయోగింప దనుట సమంజసము కాదు. ఉపయోగింపదని సర్వు లంగీకరించినారనుచోట సర్వశబ్దమునకు యాజియు వీరు నుమాత్రమే వాచ్యులు కావలయు. దానిని వీ రంగీకరింపకుండుటకు ను శ్రీకరభాష్యనామ మందు లేకుండుటే కారణమని స్పష్ట మగు చున్నది. ఏలన, కాశీముద్రితచంద్రికాగ్రంథమున శ్రీకరభాష్యనామ ము లేకుండుటకు వీ రేమికారణము చెపిరో చూడుడు.

బ్రాహ్మణశైవసిద్ధాంతప్రతిపాదక మగుటంజేసి శ్రీకరభాష్యనా నామము జంగములు ముద్రించినప్రతిలో లేదనివచించుచున్నారు. వారు తీసివైచిరనిశాస్త్రిగారియాశయము. ఇది యెట్లు సంగతమగు ?

బ్రాహ్మణశైవుల కుపయోగించునని శ్రీకరభాష్యనామము ను వారు తీసివైచునెడ నందు నీలకంఠభాష్యసిద్ధాంతము నెట్లుంతుర ని శాస్త్రిగారి నడుగుదుము.

ప్ర॥ నీలకంఠభాష్యసిద్ధాంతము బ్రాహ్మణశైవుల కుపయోగింపదని సీతయ్యశాస్త్రిగారియాశయము. కావున దాని నందుండనిచ్చిరని యేలగ్రహింపరాదు?

ఉ॥ బాగుగగ్రహింపనగు. కాని ఇందొకసందియము కలిగెడిని. నీలకంఠభాష్యసిద్ధాంతము కాశీముద్రితప్రతిలో నెన్నిమారు లెవ్విధమున నున్నదో అన్నిమారులవ్విధముననే తెనుగున ముద్రితమైనచంద్రికలో నున్నది. నీలకంఠభాష్యసిద్ధాంతము బ్రాహ్మణశైవుల కుపయోగింపదే ని ఆసిద్ధాంతమును పలుమారు తనగ్రంథమున చంద్రికాకారుడెట్లు గ్రహించెనో దానికిఁ దగుకారణము నిరూపించవలసినబాధ్యత సీత య్యశాస్త్రిగారియందు కలదు. అది వారు నిరూపించుదనుక కాశీ ముద్రితచంద్రిక బ్రాహ్మణేతరవిషయయనుట యుక్తియుక్తముకాదు. ఇక, చంద్రికయే బ్రాహ్మణేతరవిషయయనియో ?! చంద్రికలోని నీల

కంఠభాష్యప్రశంస ప్రక్షిప్తమనియో క్రొత్తగవాదించుటకన్న శాస్త్రి గారి కుపాయాన్తరము లేదు. సకలదేశగతములగుచంద్రికాగ్రంథముల లోనున్న నీలకంఠభాష్యప్రశంస ప్రక్షిప్తమెన్నటికి గాదుకదా? దీనింబట్టిచంద్రికయందు శ్రీకరభాష్యనామము పరిష్కర్తయేచేర్చెనని యు నీలకంఠభాష్యసిద్ధాంతము అన్నిచోట్లముద్రితములగు చంద్రికా గ్రంథములయందు శంకానాస్పదముగ నున్నదనియు స్పష్టమయ్యెను. దానింబట్టి చంద్రికాకారుఁడు నీలకంఠభాష్యసిద్ధాంతమునే గ్రహిం చెనుగాని శ్రీకరభాష్యసిద్ధాంతమును స్పృశింపనె లేదని ధ్రువ పడినది. ఇఁక చంద్రికాకారుఁడు నీలకంఠభాష్యసిద్ధాంతమును గ్రహిం చెనా? లేక శ్రీకరభాష్యసిద్ధాంతమును గ్రహించెనా? అనుసీతయ్య శాస్త్రిగారి ప్రశ్నమున వారికిగాని, వారిభాష్యమునకుగాని యెట్లు జయముగలిగెనో యాజియుదాహరించిన రేగుచెట్టుక్రిందిగ్రుడ్డివానిసామెత యెవ్వరి కన్వయించునో యూహించుకొనుఁడు.

ప్ర॥ సభలో సీతయ్యశాస్త్రిగారికే యీప్రశ్నమున జయమేల కలిగియుండఁగూడదు?

ఉ॥ సభయందు ఈప్రశ్నవిమర్శానంతమున, చంద్రికలో శ్రీకర భాష్యనామముచేర్చి ముద్రించుటను శ్రీపండితస్వాములవారు ముద్రాప కులకేబదిరూప్యములనిచ్చియుండినదినేను బాగా నెఱుంగుదునని శికింద రాబాదావాస్తవ్యులగు శ్రీనాగలింగశాస్త్రిగారు చెప్పియుండిరి. అప్పు డు సభ్యులందఱు పక్షపాతమువహించియున్నారనుటకంటె సీతయ్యశా స్త్రిగారికి సమాధానాంతరము కన్పట్టలేదు. ఈయర్థము ముద్రిత మగుసీతయ్యశాస్త్రిగారి జయవాదమునందునుగలదు. ఎట్లనిన, చంద్రి కలో శ్రీకరభాష్యపుమాటను పరిష్కర్తచేర్చెననుటకు మీమాటయే నా? ప్రమాణాంతరము చూపగలరా? శికింద్రాబాదావాస్తవ్యులగు

బ్ర॥ నాగలింగశాస్త్రిగారిచే మీరు సాక్ష్యమిప్పించితిరి. కాని బహిరంగసభవారిచే మాధ్యస్థ్యమునకై యెన్నుకొనఁబడియుండినను మీపక్షమే యవలంబించియున్న నాగలింగశాస్త్రిగారిమాట మాకెట్టినమ్మకము కల్పించును? అని మొదలుగానున్నది. ఈన్యాయముచూడుఁడు. బహిరంగసభవారిచేమాధ్యస్థ్యమునకై యెన్నుకొనఁబడినవారియందు శాస్త్రిగారికి నమ్మకము లేదట. ఇందు గారణమేమి? వారు నిజము చెప్పిరనియే. ఇఁక వారు తమ కనుకూలముగాఁ జెప్పియుందురేని అప్పుడు నమ్ముదురు కాఁబోలు ? దీనింబట్టి సభలో శాస్త్రిగారి కీప్రశ్నవిచారమున నెట్లు జయముకలిగినది యూహించుకొనుఁడు. సభయం దిట్లు జయము కలుగుటనేకదా విజయప్రకటనమునకు యోజి సాహ్యమవసరమయ్యెను. ప్రకృతమనుసరింతము.

ప్ర॥ ఇప్పటికిచాలగ్రంథవిస్తరమయ్యెను. కాన పర్యవసానమునకున్న పూర్వోత్తరపక్షములనుమాత్రము విమర్శింతము. ప్రకృతశ్రుతి ధర్మసంజీవని 16–17 పేజీలు.

నాగలింగశాస్త్రి.

శ్రీకరభాష్యసిద్ధాంతము భేదాభేదము. దీనియం దంగీకరించినము క్తిస్వరూపము 'జలే జలమివ నహశ్నాపహ్నీరివ' యని వ్యాఖ్యానము చేయఁబడెనచో భేదాభేదము కుదరనేకుదరదు. భేదాభేదమనఁగా జీవబ్రహ్మలకు బద్ధదశయందు భేదము. ముక్తదశయం దభేదమునుగదా? 'జగత్సత్యం శివస్సత్యం జీవ స్సత్యం స్వభావతః. అనివ్రాసిన॥ శ్రీపతిపండితుఁడంగీకరించిన భేదాభేద మిట్టిదే గదా ? అనఁగా బద్ధదశయందు శివునికన్న భిన్నముగ నుండుజీవుఁడు ముక్తదశయందు శివతత్వమున కలసి శివాభేదము నొందుచున్నాఁడని తాత్పర్య మగుచున్నది. ఇట్లయిన యెడ శ్రు॥ యఏష స్సంప్రసాదోస్మాచ్ఛరీరా త్సముత్థాయ పరంజ్యోతి

రుపసంపద్య స్వేనరూపేణాభినిష్పద్యతే, సంప ద్యావిర్భావ స్స్వేనశబ్దాత్, అను శ్రుతిసూత్రములు విరోధించుచున్నవి. ఎట్లన, ఈజీవుఁడు శరీరమును విడిచి పరమేశ్వరుని బొంది ముక్తదశయందు స్వకీయరూపమునే బొందుచున్నాఁడని శ్రుతిసూత్రములకర్థము. ఈసిద్ధాంతమున శివుఁడును జీవుఁడును భిన్నులుగదా? భిన్నుఁడైన జీవునకు ముక్తదశయందు వచ్చెడు శివరూపము స్వీయ మెట్లగును? కాఁబట్టి శివజీవులకు బద్ధదశయందు భేదమును ముక్తదశయం దభేదమును చెప్పెడు భేదాభేదసిద్ధాంతప్రతిపాదకమే యీముక్తి యైనయెడ శ్రుతిసూత్రవిరోధము తటస్థించును. అదిగాక, అద్వైతమందును ద్వైతమందుంగూడ శివజీవులకు బద్ధదశయందుగాని ముక్తదశయందుగాని యభేదమో భేదమో యేదియో యొక్కటియే యుండును. భేదాభేదమందుఁగూడ నట్లె బద్ధదశయందును ముక్తదశయందునుగూడ శివజీవులకు భేదాభేదమే యుండవలయు. అటులగాక బద్ధదశయందు భేదము; ముక్తదశయందభేదమునని చెప్పఁబడి యున్నది. అటుల చెప్పిన పూర్వోక్తశ్రుతిసూత్రవిరోధము దుఃగుద్ధరము.

సీతయశాస్త్రి.

అసూయ్య, మీరు చెప్పిన శ్రుతిసూత్రవిరోధము మామతమున గలుగదు. ఏమన, యథాగ్నే ర్విస్ఫులింగా, ఇత్యాదిశ్రుతిప్రమాణమున నీభేదాభేదమందు జీవుఁడు శివుని యవయవమని యంగీకరింపబడియుండె. అనఁగా, అగ్నివలన విస్ఫులింగము లుదయించునట్లు శివునివలన జీవులుదయించును. అగ్నివలని విస్ఫులింగ మగ్నికి అవయవ మెట్లగుచున్నదో శివునివలన నుదయించు జీవుఁడు శివునియవయవ మగుచున్నాఁడు. అణుత్వమహత్వభేద మగ్నివిస్ఫులింగములకున్నను అగ్నిత్వవ్యాపారగమేకమై యున్నటు పాశబద్ధత్వాల్పజ్ఞత్వాపాశబద్ధత్వసర్వజ్ఞత్వభేద

ము శివజీవులకున్నను శివత్వము మాత్ర ముభయమునం దేకమై యున్నం దున బద్ధదశయందు శివజీవులకు భేదాభేదము సంగతమై యుండును. ఇక ముక్తదశయందు విస్ఫులింగ మగ్నియం దైక్యమొందినట్లు జీవుడు పాశబద్ధుఁడైనందున శివునికంటె భిన్నుఁడై యున్నట్లు కాన్పించినను యథార్థమున శివాంశస్వరూపుఁడగనుక ముక్తదశయందువచ్చు శివ స్వరూపము స్వీయమైయే యున్నది. కావున మీరు కన్పరిచిన శ్రుతి సూత్రవిరోధము కలుగదు. ఒకవేళ ముక్తదశయందు మీరుచెప్పిన ట్లు జీవుఁడు శివైక్యమొందిన నభేదమే ప్రాప్తించునుగాని ముక్తదశ యందుగూడ భేదాభేద మెట్లువచ్చునని శంకించెదరేమో. అవయవా వయవిసంబంధము సమవాయముగనుక ముక్తదశయందు శివైక్య మవి భాజ్యమైనను భేదముగ గాన్పించును. గాన ముక్తదశయందుగూడ భే దాభేదము ముఖ్యముగా సిద్ధించును, ఇక „తామ్రం రసవేధయా హిరణ్యం భవతీ" త్యాదిదృష్టాంతములు భాష్యమందు గాన్పించినను యథాగ్నేరిత్యాదిపూర్వోక్తశ్రుత్యర్థాన్యథానుపపత్తిచే నాదృష్టాంత ములు కేవలభేదమాత్రప్రతిపాదకములే యని భాష్యతాత్పర్య మవగత మగుచుండెను. కావున సిద్ధాంతదోషమిసుమంతయైనను లేదు. కనుక శ్రీకరభాష్యమున వ్రాసినముక్తి లింగధారణచంద్రికాకారుఁ డంగీకరించి యే యుండెను. అతని మతమును భేదాభేదమె. అందుచే శ్రీకర భాష్యము పురాతనశైవాంగీకృత మని మీరును సభ్యులును గ్రహింప వలెను. అనియున్నది.

ఈయుత్తరపక్షమునుబట్టియైన సీతయ్యశాస్త్రిగారికిజయము కలు గలేదా?

ఉ॥ శ్రీకరభాష్యసిద్ధాంతమున శివజీవులకు బద్ధదశయందు భేద ము, ముక్తదశయం దభేదము నంగీకరింపబడియె. ఇట్లుచెప్పానేక

శ్రుతిసూత్రములువిరోధించునుగాన బద్ధదశయందును ముక్తదశయందును గూడ భేదమో? అభేదమో? భేదాభేదమో ఒక్కటియే యుండవల యునని పూర్వపక్షసారాంశము.

దీనికివారు వ్రాసినయుత్తరపక్షములో బద్ధదశయందు శివ జీవులకు భేదాభేదము సంగతమనియు, ముక్తదశయందునుగూడ భేదా భేదము ముఖ్యముగ సిద్ధించుననియు కలను. ఇదియెట్లున్నదో చూడు డు. బద్ధదశయందు శివజీవులకు భేదము. ముక్తదశయందునభేద మునని చెప్పఁగూడదు. రెండుదశలయందును భేదాభేదము నొప్పితీర వలయునను పూర్వపక్షమునకు, అట్లెరెండుదశలయందును భేదాభేద మునొప్పితిమని సమాధానము కనఁబడుచున్నది. లోకముననెయ్యెడ నైనను పూర్వపక్షమును ఖండించి జయమందినవారిం గంటిమిగాని పూ ర్వపక్షము నంగీకరించితిమని విజయమునొందినవారిం గనలేదు.

మఱియు నింకొకవిశేషముం గనుఁడు. నాగలింగశాస్త్రిగారు శ్రీకరభాష్యసిద్ధాంతమున గనపరిచిన శ్రుతిసూత్రవిరోధమును సీతయ్య గారెట్లుపరిహరించిరో చూడుడు. ఇఁక యత్తాగ్రమ్ం రసవేధయా హిర ణ్యం భవతీత్యాదిదృష్టాంతములు భాష్యమందు గాన్పించినను యథా గ్నే రిత్యాదిపూర్వోక్తశ్రుత్యర్థాన్యథానుపపత్తిచే నాదృష్టాంతములు కే వల భేదమాత్రపాదకములే యని భాష్యతాత్పర్య మవగత మగుచుండె ను. కావున సిద్ధాంతదోష మిసుమంతయైనను లేదు. అనికలదు. ఈవాక్యము యపుడంతయు మానెను. కానియిఁకజల్లెడడంతమాత్రము న్నదనునట్లున్నది. దృష్టాంతము లున్నను అనుమాటచే నవివిరుద్ధము ములుగానె యున్నవని వారిమనసునకు ద్యోతకమైనట్లు స్పష్టపడుచున్న ది. మఱియు, శ్రుత్యర్థాన్యథాపపత్తిచే అనుటచే నవి శ్రుతివిరుద్ధ ములని తేలుచున్నది. ఇఁక, శాస్త్రిగారు శ్రుతివిరుద్ధములగు నాదృ

ష్టాంతముల కేమి గతి గల్పించిరో కంటిరా? కేవలభేదమాత్రప్రతిపాదకములే యని యవగత మగుచుండ్డనని ప్రౌఢివాద మవలంచిరి. కేవలభేదమాత్రప్రతిపాదకములకు శ్రీకరభాష్యమున నవసర మెట్లు కలుగును ? శ్రీకరభాష్యసిద్ధాంతము కేవలభేదమాత్రప్రతిపాదకము కాదుగదా? అదృష్టాంతములు కేవలభేదమాత్రప్రతిపాదకము లనువాక్యమె విరుద్ధముగా నున్నది. ఏలందురా? తామ్రము రసవేధచే నెట్లు బంగార మగునో అనుదృష్టాంతము బద్ధదశయందు భిన్నుఁడుగా నున్నజీవుఁడు ముక్తిదశయందు అభిన్నుఁడుగా బ్రహ్మమగుననుటకు గ్రహింపఁబడినది. కేవలభేదమునందు జీవునకు బ్రహ్మత్వ మెప్పుడురాదుగాన నాదృష్టాంతముతో నేమియు పనిలేదు. ఇట్టియసంబద్ధ వాక్యముతో సిద్ధాంతదోషమును పరిహరించి నట్లభినయించి సిద్ధాంతదోష మిసుమంతయైనను లేదని యొడ్డనపడిరి. ప్రతివాదిసమక్షమున నింతసులభముగ జయమునొంద నెట్లగు? కానవె అప్పుడు సభలో శ్రీకరభాష్యమునందు సిద్ధాంతదోషముల సవరణ చేయించుకొందునని యొప్పుకొనక తప్పదయ్యెను. కావుననె యాజిసాహ్యమున కృత్రిమజయమాశింపవలసి వచ్చెను. ఇది యుండనిండు. బద్ధదశయందు భేదము, ముక్తదశయందభేదము నని యంగీకరింప శ్రుతిసూత్రవిరోధము తటస్థించుననుగాన రెండుదశలయందు భేదమో? అభేదమో! భేదాభేదమో? ఒప్పవలయునని నాగలింగశాస్త్రిగారునిరూపించినదానింబట్టి శ్రీకరభాష్యసిద్ధాంతముకాకున్నను రెండుదశలయందు భేదాభేదము కలదను వాదముసాధింప మొదలిడిరి. ఇప్పుడింకొక బాధకము వచ్చెను. ఏమనిన,

బద్ధదశయందు భేదము, ముక్తదశయందభేదము నెప్పునెడ ముక్తియందు లింగైక్యముకుదురునను నాశచే శ్రీపండితస్వాములవారిట్టి

భేదాభేదము సిద్ధాంతము చేసిరి. ప్రస్తుతము శాస్త్రిగారు ముక్తియం దును భేదాభేద మంగీకరించిరిగాన వీరిసిద్ధాంతమునలింగైక్యము కుదు రదు. ఏలందురా? ముక్తదశయం దభేదమునంగీకరించిన నైక్యము కుదురునుగాని భేదాభేదము నంగీకరించునెడ ఐక్యానైక్యముసిద్ధించును గాని కేవలైక్యమును సాధింప బ్రహ్మకు నశక్యమే యగు. ఇట్టియర్థ ము స్వవచనవ్యాఘాతమునకు వెరపులేని పండితు లంగీకరించినను నం దగువిరోధమును బుద్ధిమంతులు గ్రహింపకుండరు. సీతయ్యశాస్త్రిగారు కోరినసారాంశములయొక్క విచారమిట్లు తేలియున్నది. సీతయ్యశా స్త్రిగారు స్వహస్తముచే వ్రాసినదియు, యాజిచే స్వయముగా ముద్రిం పఁబడినదియునగు పూర్వోత్తరపత్రావళినిబట్టియే నీలకంఠభాష్యముయొ క్క ప్రాశస్త్యము స్పష్టమగుచున్నదిగదా?

ఈవాదగ్రంథమునకు పరాభవ మనియు, పరాజయ మనియు నామకరణముగావించిన యాజియొక్క బుద్ధికుశలత,విపరీతమైనదనుటకు సందియము లేదు. సత్యము, ధర్మము, శాస్త్రము మున్నగు సకలవిష యములయందును నాతనిబుద్ధి విపరీతముగాప్రవర్తించుననుటకు నిదియు నొకనిదర్శనముగా నెంచుడు.

ఈయాజి యీవాదగ్రంథమునకు శృంగభంగమనియు నామకర ణము గావించియున్నాఁడు. ఇదియు నాతనికిగలశృంగిత్వమునే ధ్రువ పరిచెడిని. పోనిండు.

ప్ర॥ సభలోనిచర్చనుబట్టియేకాని, సీతయ్యశాస్త్రిగారువ్రాసి యిచ్చిన గ్రంథమునుబట్టియేగాని నిర్ణయము తేలవలయునను నిర్బంధ మేమి? వారు సావకాశముగా నాలోచించి యీసారాంశములలో జయ మేల పొందఁగూడదు?

ఉ॥ బాగుగ జయమొందవచ్చును. శ్రీకరనీలకంఠభాష్యముల లో నెయ్యది ప్రాచీనమని సభ్యులు కోరినసారాంశమునగాని చంద్రికా కారుఁడీరెండుభాష్యములలో నెద్దానిని గ్రహించెనని సీతయ్యశాస్త్రి గారు కోరినసారాంశమునగాని తమకు సాధకమగు ప్రమాణములను యుక్తులను ప్రకటించియనుపునెడ వారివాదము నంగీకరించుటకు సిద్ధ ముగానున్నాము. వారు వ్రాసియనుపునెడ నీపత్రికయందు ప్రకటించు టకును నభ్యంతరము లేదు. ఇంతియగాని యసందర్భముగా యాజి చేయుప్రకటనలవలనంగలుగు జయాపజయము లకించిత్కరములుగాన నవి లెక్క సేయంబడవు.

ప్ర॥ యాజి సేయుప్రకటన లేల లెక్కసేయఁబడవు?

ఉ॥ ప్రమాణవచనముల కపార్థము చెప్పుటకుగాని, తనకు నిజ ము తెలిసియున్నను దానిని దాచి యసత్యమును ప్రకటించుటకుగాని యాజికి ఇహపరములవలన లేశమైన వెరపు లేదని, దుహితృదౌహిత్రవిష యక శ్రాద్ధాధికారపరిష్కారమునందును, అరాధనవిధివిమర్శముఖమర్దన మునందును నిరూపింపఁబడియున్నది. అట్టివానివ్రాత నింకను విమర్శింప నేమిలాభము?

ప్ర॥ మీరుకోరినప్రశ్నములలో సీతయ్యశాస్త్రిగారి కేల జయ ము కలుగఁగూడదు?

ఉ॥ బాగుగ కలుగవచ్చును. కాని సభలో మాప్రశ్నముల విమర్శమునకు సభాధ్యక్షు లంగీకరింపరైరి. ఏమిచేయనగు? శాస్త్రి గారికట్టియపేక్ష యుండునెడ కాదననేల? ఒకటిరెండిటినుదాహరింతము. ఎట్లన,

శ్రీసీతయ్యశాస్త్రిగారు శ్రీకరభాష్యము యొక్క ప్రామాణ్యము సాధిం

చుటకై తామురచించిన శైవసూత్రభాష్యనిర్ణయమునందు॥ పండితం భాష్యకర్తారం, అని గౌతమసూత్రమున కలదని వచించియున్నారు.

గౌతముఁడు న్యాయసూత్రములు రచించియున్నాఁడు. అందీ వచనము లేదు.

పండితం భాష్యకర్తారం, అనువచనము గలయేసూత్రగ్రంథమును గౌతముఁడు చేసియుండెనో అది ముద్రితగ్రంథమో, లేక లిఖితగ్రంథమో దానిని రుజువుచేయవలసినబాధ్యత సీతయ్యశాస్త్రిగారియందు గలదు.

అట్టిగ్రంథమును వారు రుజువుచేయుదురా? వారివాదమును శిరసావహింతుము. లేదేని యిట్లనక తప్పదు.

ప్ర॥ ఎట్లు?

ఉ॥ నిరాధారమగు తమవాదమును నిలువఁబెట్టుకొనుటకై పండితంభాష్యకర్తారం అనువచనము సీతయ్యశాస్త్రిగారిచే తమసూత్రగ్రంథములోనిదే యుదాహరింపఁబడియె. ఇట్లు స్వకపోలకల్పితవచనముల నుబట్టి జీవింపవలసిన శాస్త్రిగారివాదము ఎట్లు సజీవమగును? ప్రమాణవచనముల కల్పితత్వము తెలగనే నిర్జీవమగుగదా?

ప్ర॥ ఇంకను ప్రశ్నమేదేని కలదా?

ఉ॥ ప్రశ్నములు చాల కలవు. కాని వానినన్నిటి వ్రాయునెడ గ్రంథవిస్తరమగు. కావున నింకొక్కటి వ్రాసి ముగింతము. సీతయ్యశాస్త్రిగారి వాదమున ముఖ్యవిషయములు రెండు. ఎవ్వియనఁ శ్రీకరభాష్యము గ్రాహ్యమనుట యొక్కటి, నీలకంఠభాష్యము గ్రాహ్యమనుట వేరొక్కటి. ఇందు శ్రీకరభాష్యము గ్రాహ్యమనుటను, పండితం భాష్యకర్తారం అనుప్రమాణవచనము నుదాహరించి నీలకంఠభాష్యము గ్రాహ్యమనుటకు నొక్క హేతువును చెప్పియున్నారు.

తరువాతఁ బదునాల్గవసభ గుంటూరుమండలమందలి తెనాలిపురమున ముదిగొండ బ్రహ్మయ్య ముదిగొండ కొండయ్య అయ్యవార్లగార్ల యాహ్వానమున జరుపఁబడెను. నేనును నాయకస్థానము (అగ్రాసనము) నకు నియమింపబడితిని. భాష్యవిచారణ సభకు ముఖ్యాంశముగ నుండ గొన్నియితరతీర్మానములును జరిగెను. గాని యింతవరకు కార్యనిర్వాహకసభ జరుపఁబడమి వాట్ల నిట వివరింపక భాష్యవిచారణ పూర్తికాలేదని మాత్రము శైవమహాజనులకు విశదపరచుచు నీయంశమును ముగించుచున్నాడను. అని కలదు.

ఇట్లు శ్రీదేవిడీసంస్థానాధీశుల వ్యాసమునుబట్టియు భాష్యవిచారణ పూర్తిగా లేదని ధ్రువపడినదికదా?

ఇఁక శ్రీవారు స్వవచనవిరుద్ధముగ నీకార్యమున నెట్లుప్రవర్తింతురు? ఎట్లును ప్రవేశింపరు.

అయినను శ్రీవారిట్టిపని నుపక్రమించిరని కొందఱుప్రకటించి శైవమహాజనమనంబుల శంకాశల్యంబు నెలకొల్పిరిగాన వెంటనె నిజముం బ్రకటించి శైవమహాజనంబుల సంశయంబు దీర్తురుగాకయని శ్రీదేవిడీ సంస్థానాధీశులను ప్రార్థించుచున్నాము.

ఇట్లు,

ష॥ సం॥

ప్ర॥ అదిరయేది?

ఉ॥ శ్రీమల్లికార్జున పండితారాధ్యులవారు శివతత్త్వసారమున అద్వైతమ్మతో బాటు విశిష్టాద్వైతమునుగూడ ఖండించియున్నారు. అని తమ శైవసూత్రభాష్యనిర్ణయమున సీతయ్యశాస్త్రిగారు వ్రాసియున్నారు. విశిష్టాద్వైతసిద్ధాంతము పూర్వాచార్యులచే ఖండింపఁబడియెగాన తత్ప్రతిపాదకమగు నీలకంఠభాష్యము శైవులకు గ్రాహ్యముకాదని లోకులు గ్రహించుటకై యీ వాక్యము వ్రాయఁబడియెను. శివతత్త్వసారమున లేనిదే సీతయ్యశాస్త్రిగారు వ్రాయుదురా అనియెంచితిమిగాని యాగ్రంథము వెదకిచూడ విశిష్టాద్వైతమును ఖండించువచనమే అందు కనఁబడదయ్యెను. శివతత్త్వసారము ఆంధ్రసాహిత్యపరిషత్తువారిచే ముద్రితమయ్యేయున్నది. దానియందు విశిష్టాద్వైతఖండన మణుమాత్రమైన లేదు. ఇఁక సీతయ్యశాస్త్రిగారివద్ద వ్రాతగ్రంథమేదైననుండి యందువిశిష్టాద్వైతఖండన మున్నదికాబోలు? అదియందుండు సెడముద్రితమైనదానిలోనేమైపోయెను? కాశీయందు ముద్రితమైన లింగధారణచంద్రికలో శ్రీకరభాష్యే అనుమాటను తీసివైచినట్లు శివతత్త్వసారమున విశిష్టాద్వైతఖండనమునుగూడ ముద్రాపకులు తీసివైచిరని శాస్త్రిగారు వాదింతురు గాబోలు? పాపము ముద్రాపకులు తామద్వైతులైయుండియు శివతత్త్వసారమున తమ కసమ్మతమైనను అద్వైతఖండనము నంత నుండనిచ్చియు తమకుపరమసమ్మతమైన విశిష్టాద్వైతఖండన మణువైన లేకుండ నెట్లు తీసివైతురు? ఇట్లే పండితంభాష్యకర్తారం అనువచనమునుగూడ గౌతమసూత్రమున లేకుండ ముద్రాపకులు తీసివైచియుండిరికాబోలు? దీనింబట్టి కాశీ, కలకత్తా, మద్రాసు మొదలగుతావుల నున్నముద్రాపకు లందఱు సీతయ్యశాస్త్రిగారికి పెద్దయపకారము చేసినవారని నమ్మవలయునుగదా? ఏలన, వీరికుపయోగించుననియే యాయావచనముల ముద్రాపకులు తీసివైచిరికావలయు? వీరికుపయోగించునని వారి కెట్లు తెలిసెను? వారికి త్రికాలజ్ఞానము కలిగియుండనగు? కావున అబద్ధం పతిత్వా కుచోద్యం అనునట్లు అపసిద్ధాంతము నవలంబింపనేల? దానిని సాధించుటకు క్రొత్తవచనముల కల్పింపనేల? వానిప్రామాణ్యము నిలుపుకొనుటకై ముద్రాపకులపై దోషారోపణము చేయనేల? అని శాస్త్రిగారిని హెచ్చరింపవలసివచ్చినందునకు చింతిలుచున్నాము.

ప్ర॥ అట్లైనని నీలకంఠభాష్యమే ముఖ్యమని మీరువ్రాసిన శైవసూత్రభాష్య నిర్ణయమ్మమీద నాక్షేపములు లేవా?

ఉ॥ లేవనేల? అట్లుండునెడ వానినడుగవద్దని చెప్పితిమా? శ్రీసీతయ్యశాస్త్రి గారుగాని వారిపక్షమున తక్కుపండితులుగాని ప్రశ్నములవ్రాసి యనుపుచున్నవానిని సమగ్రముగా నీపత్రికయందు ప్రకటించి తోచునెడ సమాధానముచెప్పుటకును లేకున్న వారివాదము శిరసావహించుటకును సిద్ధముగానున్నాము.

ప్ర॥ మీశైవసూత్రభాష్యనిర్ణయము మీద శి. వి. పాకయాజి తనభాష్య నిర్ణయమునందు ఖండనను వ్రాసియుండెనే దానికి సమాధాన మేమిచెప్పితిరి.

ఉ॥ శి. వి. పాకయాజి యాక్షేపములకు న్యాయదీపికా పత్రికాధిపతి ప్రభృతులు తగుసమాధానము చెప్పగలుగుదురుగాని యప్పని మముబోంట్ల కెట్లుశక్యమగు?

ప్ర॥ ఏల శక్యముగాదు?

ఉ॥ దీనికి స్థాలీపులాకన్యాయమున నొక్క దృష్టాంతము చూపఁబడును. పాకయాజి భాష్యనిర్ణయమున ౬ పేజీ, ఇట్లనిన మావాదము పూర్వపక్షమెట్లు కాఁగలదు? ఈనడుమ నాగరలిపియందు ముద్రింపఁబడిన శ్రీకంఠభాష్యమున దాని నచ్చొత్తించిన పండితులు వ్రాసిన పీఠికయందు మాధవీయే శంకరవిజయే పంచదశసర్గే నీలకంఠనామా బ్రహ్మసూత్రభాష్యకర్తా శ్రీమచ్ఛంకరాచార్యేణ వివదమానః పరాజితః స్వభాష్యం పరిత్యజ్య శరణంగత ఇతి విజ్ఞాయతే సోయం నీలకంఠః ఏతద్భాష్యకర్తా శ్రీకంఠశైవ ఏవేతి కేచిత్, అనిలేదా యని పూర్వపక్షిమనలఁ బ్రశ్నించవలెను.

ఇందుతో నీలకంఠభాష్యమునకే శ్రీకంఠభాష్యమను నామాంతరము కలదని పూర్వపక్షవాది చెప్పినమాట పూర్వపక్షము కాలేదా? అనియున్నది.

ఈఘట్టము శ్రీకంఠభాష్యము వేరు, నీలకంఠభాష్యము వేరు, అని సాధింప నేర్పడినది.

ఇచట యెదిరివాదమునకు సాధకమగు మాధవీయే అని మొదలుకొని కేచిత్' అనువరకుగల పీఠికావాక్యము పూర్వపక్షముగా గ్రహింపఁబడియెను. కేచిత్ అని లేదాఅనిపూర్వపక్షి మనల ప్రశ్నించవలెను. అనువ్రాతను బట్టియు ఇది పూర్వపక్ష వాక్యముగా స్పష్టపడుచున్నదికదా?

దీనికి తరువాత సమాధానమేమికలదో చూడుడు. ఇందుతో నీలకంఠ భాష్యమునకే శ్రీకంఠభాష్యాంతర నామముకలదని పూర్వపక్షవాది చెప్పినమాట పూర్వపక్షము కాలేదా అనియున్నది. ఇందుతోఅనిన ఈపీఠికావాక్యముతో అనికదా యర్థము. పీఠికావాక్యమున కర్థమేమి? శ్రీకంఠుఁడు నీలకంఠుఁడు నన నొక్కడేయని కానిజర్థము? కావున నే ఇది పూర్వపక్షవాదికి సాధకముగా నుదాహరింపఁబడియెను.

దీనిచేత పూర్వపక్షవాదిచెప్పినమాట పూర్వపక్షమయ్యెనా? సిద్ధాంతమే యయ్యెను. పూర్వపక్షమైనదేది? నీలకంఠుఁడు వేరు. శ్రీకంఠుఁడు వేరు. అను యాజివాదమే. అట్లుకాకున్న ఈపీఠికావాక్యమును ఖండించువాక్యమిందేదైనఁగలదా? లేదు. ఇట్లు ఎదిరికి సాధకమైన పూర్వపక్షముచెప్పి దానిచేతానే గెల్చితినని చంకలు గొట్టుకొనువానికి సమాధానము చెప్పనవసరమేమియుండును?

ఈవిధముగ ముందువెనుకనున్నమాటలకు సంబంధములేకుండఁగాగితములనెవ్వరో యూరకయిచ్చిరిగదాయని వానిని జెఱుచు యాజివాక్ర్తలకు పండితులెట్లు సమాధానముచెప్పగలుగుదురు?

మఱియు, ఇంకను పూర్వపక్షిమొదలుగా స్వయోగ్యతాప్రకటన వాక్యములు కొన్నిగలవు. కావుననే యాజిప్రసంగమునకు తగునట్లు బదులుచెప్ప న్యాయదీపికా పత్రికాధిపతి పరిభృతులే సమర్థులని వచింపఁబడియెను.

ప్ర॥ శ్రీసీతయ్యశాస్త్రిగారిపక్షమున శి. వి. పాకయాజి వాదించుచున్నాఁడుగాన శాస్త్రులవారు సమాధానము చెప్ప నవసరమేమి?

ఉ॥ శాస్త్రిగారు యాజినినమ్మి విజయమునందగోరుటంజేసి వారు దేనినో నమ్మి యేట దిగినవారింబోలుటకు సంశయముండదు. ఈ యర్థము గతప్రశ్న సమాధానమున విశదీకరింపఁబడియె. కావునవారు జయము నభిలషించినను లేక శైవసంఘముయొక్క సంశయము తొలగింపనూనినను స్వయముగ తమవాదమునందలి గుణములను ఎదిరివాదమునందగు లోపములను వెంటనే ప్రకటించి తీరవలయు. అట్లుగాక ఉపేక్షించిరేని వారు తమవాదము వదలుకొనిరని శైవసంఘము నిశ్చయించుకొన నభ్యంతరముండదు.

ప్ర॥ శ్రీదేవిడీ సంస్థానాధీశులు రామగోవిందశాస్త్రిగారిచే శ్రీకరభాష్యమును సంస్కరింపించుచున్నారుగదా? దీనింబట్టి సీతయ్యశాస్త్రిగారి వాదము విజయమునొందుచుండ ఇంకను భాష్యచర్చనుజరుప వారికవసరమేమి?

ఉ॥ ఈప్రశ్నము చాలముఖ్యమైనది. శ్రీవారు శ్రీకరభాష్యమును సంస్కరించుటయే నిజముకాదు. ఒకవేళ అది నిజమేయగునేని దానింబట్టియే శ్రీకరభాష్యము ఓడిపోయెనని తప్పక ధ్రువపడునుగదా?

ప్ర॥ అదియెట్లు?

ఉ॥ శ్రీకరభాష్యము గెల్చునను నమ్మకమే వారికుండునేని భాష్యచర్చ పరిష్కారము కానిదే వివాదమధ్యమున అభిమానపురస్సరముగ నద్దాని సంస్కరణమేల యూరంభింతురు?

చర్చాపరిష్కారానంతరమున నే జయించినభాష్యమే గ్రహింపఁబడునుగదా? దానిఁబట్టి యది గెల్చినను నమ్మకము వారికె లేనట్లు ధ్రువపడుట లేదా?

మఱియు శ్రీకరభాష్యము దోషయుక్తమా? నిర్దోషమా? అను చర్చామధ్యమున రామగోవిందశాస్త్రిచే శ్రీకరభాష్య సంస్కరణ మారంభింపఁబడుటంబట్టియే అది మహాదోషయుక్తమని నిశ్చిత మగుచున్నది.

ఎటువంటి వరుఁడు ఆరోగుఁడా? సరోగుఁడా అని సంశయముగలిగి పరీక్షింపఁబోయినప్పుడు వాఁడు చికిత్సకై వైద్యశాల కనుపఁబడియుండు నెడ వాని సరోగునిగా నెంచి కన్యాదానము సేయ నంగీకరింతురా?

అట్లు సంస్కరణప్రయత్నముంబట్టియె అదిమహాదోషయుక్తమని ధ్రువపడినది. నిర్దుష్టమగునీలకంఠభాష్యము సిద్ధముగానుండ సదోషమగుశ్రీకరభాష్యము నే గ్రహింపవలసినగ్రహచారము లోకులకేమి?

ప్ర॥ శ్రీరామగోవిందశాస్త్రిగారుచేయు సంస్కరణముచే నదినిర్దోషమగుగదా?

ఉ॥ ఆపని సీతయ్యశాస్త్రిగారే ఏల చేయఁగూడదు? రామగోవిందశాస్త్రిగారిని భాష్యరథారూఢులను జేయుటంబట్టి యాపని సీతయ్యశాస్త్రిగారికి సాధ్యము కాదని ధ్రువపడినదికదా? దానిని సవరింప తమకు సాధ్యముకానప్పుడు అదియె కావలయునను పట్టుదల వారికెందుకు?

ప్ర॥ అది నిర్దోషమగుటగదా ముఖ్యము. అప్పని యెవ్వరిచేనైన నేమి?

ఉ॥ రామగోవిందశాస్త్రిగారు శ్రీకరభాష్యమును నిర్దోషముగా సవరింతురనుట భ్రాంతిమాత్రము వీరిసంస్కరణమువలన విభక్తిలోపములు కొన్ని తొలగింపఁబడినను సిద్ధాంతదోషము లింకను వేనవేలు చేరుననుటయే యథార్థము.

ప్ర॥ 1924 సం॥ ఫిబ్రవరి 12-15 తేదీలు వెల్వడిన ఆంధ్రపత్రికలలో దేవిడి. సంస్థానపు శైవగ్రంథకార్యాలయము ఆంధ్రశైవమహాజనులకు విజ్ఞప్తి అను వ్యాసముల యందు శ్రీకరభాష్యమును చక్కఁగ సంస్కరించుచున్నారు. బ్రహ్మశ్రీ చాగంటి సీతయ్యశాస్త్రిగారు ప్రధానపండితులుగా నుండిరి. అనికలదు. కాని యందు శ్రీరామగోవిందశాస్త్రిగారి పేరు లేదు. సీతయ్యశాస్త్రిగారె ప్రధానపండితులుగానుండి సంస్కరించుచున్నట్లు తెలియుచున్నదిగాన వీరు సంస్కరించిన శ్రీకరభాష్యము నేల యంగీకరింపఁగూడదు?

ఉ॥ ఏల యంగీకరింపఁగూడదో? అవధానముతో వినుడు. శి. వి. పాకయాజి ప్రకటించిన శ్రీకరభాష్యసంస్కరణము అనువ్యాసమునందు రామగోవిందశాస్త్రిగారు శైవభాష్యరథారూఢులైరనియు రెంటాల శరభయ్యశాస్త్రిగారును చాగంటి సీతయ్యశాస్త్రిగారును తచ్ఛ్రీకరరక్షకత్వమునం దున్నారనియు కలదు. దానింబట్టి సీతయ్యశాస్త్రిగారు శ్రీకరభాష్యసంస్కరణము తమకు సాధ్యముకానందున రామగోవిందశాస్త్రిగారిని భాష్యరథారూఢులను జేసి తమవ్యూనిక నెగ్గుటయే ముఖ్యముగాన

తా మెచ్చటనున్న నేమి యనునోర్పుతో వారిరథపుగాండ్ర కావలిపనియందున్నట్లు స్పష్టపడెను. తరువాత మేమీపత్రికయందు మతాంతరులు చేయుసంస్కరణము శైవులను నుపాదేయముకాదని తెలిపియుండుటంబట్టి యిప్పుడు రామగోవిందశాస్త్రి గారిపేరు దాచి సీతయ్యశాస్త్రిగారినె ప్రధానపండితులనుగా ప్రకటించుచున్నట్లు తెలిసెడిని. అట్లుగానిచో వీరు ప్రధానపండితులుగానుండిరి అనువాక్యము సార్థకము గాదు, అయినను రామగోవిందశాస్త్రిగారు కార్యాలయమున నున్నట్లే ద్యోతకమగు చున్నది. ఏలనిన ఆకార్యాలయమున బహుపండితులు నిరంతరము పనిచేయుచున్నా రనియు నున్నది.

సీతయ్యశాస్త్రిగారు గాక అచ్చటి శైవపండితులు బహుసంఖ్యాకు లెవరు. కెంట్లాల శరభయ్యశాస్త్రిగారున్నను వారితోనే బహుపండితులనుమాట సార్థకమ గునా? కావున రామగోవిందశాస్త్రిగారు చేరియేయున్నారు. అయినను వారు ద్రవ్యలాభమునే ప్రధానముగా నెంచికొనిరిగాన నచ్చటిపండితులలో సీతయ్యశాస్త్రి గారికి ప్రాధాన్యమిచ్చుట కంగీకరించినట్లు స్పష్టమగుచున్నది.

అచ్చటి పండితులలో సీతయ్యశాస్త్రిగారు ప్రధానులైనను భాష్యసంస్కరణము వీరికి సాధ్యముగాదని రామగోవిందశాస్త్రిగారిని రథామాత్యులనుజేయుటంబట్టి యాసంస్కరణమున వారికి ప్రాధాన్యమొసగక తప్పదు. వారో ద్రవ్యమునకే ప్రాధాన్యము నంగీకరించిరి. కానిచో స్వమతవిరుద్ధమగు విమతభాష్యసంస్కరణమునం బ్రవర్తించుటయెగాక, అందోళికారోహ స్తద్భంగశ్చ, అనునట్లు తొలుత భాష్యరథ మధిష్ఠించి పదంపడి దిగువనుండి పనిచేయుటను నంగీకరింతురా? ఇట్లు వారి చిత్తమునకు ద్రవ్యమే ప్రధానము గానభాష్యసంస్కరణము ప్రధానముగాదనుటయు దానంజేసి యదియపసంస్కరణమే యగుననుటయు ముమ్మాటికి నిజము.

కాబట్టి విమతపండితసాహాయ్యకము లేక భాష్యసంస్కరణమే జరుగదు. అది జరిగినను అపసంస్కరణము గాకమానదు. ఆసంస్కరణమెట్టిదైనను దానివలన శైవులకు సూత్రభాష్యము లేదనియో ఉన్నది మహాదోషయుక్తముగా నున్నదనియో? ధ్వనిపడక తప్పదు. అట్లుగాక క్రొత్తగ భాష్యసంస్కరణ మనవసరముగదా? దీనింబట్టి యీమతము మొదటినుండి యపండితమతమను నపఖ్యాతికి భాజనమెట్లు గాకుండును!

కావున మొదట రామగోవిందశాస్త్రిగారిని శైవభాష్య రథామాత్యుల గావించినట్లు ప్రకటించినను పదంపడి స్వమతమహాజనాసమ్మతి నూహించి వారిపేరు దాచి శ్రీ సీతయ్యశాస్త్రిగారినే ప్రధానపండితులనుగా వెల్లడించినట్లు క్రొత్తసంస్కరణమువలనను నిజసంఘమునకు గలుగనున్న కళంకమును గ్రహించి యిప్పటినుండియు శ్రీవారుతప్పక విరమింతురని నమ్మచున్నారము.

ము. రా. శా.

శ్రీ

శివాయగురవేనమః.

# కారణోత్తరతంత్రే—క్రియాపాదః.

ప్రారభ్యతే.

దేవ్యువాచ॥

మూ॥ దేవదేవ జగన్నాథ సర్వజ్ఞ కరుణానిధే।

ప్రసన్నాస్త్వత్తభవతో ధర్మా నానావిధా శ్శ్రుతాః॥౧

విహితాః పూర్వశైవానాం సమ్మతా శ్రుతిసంతతేః।

భవతాహి పురాప్రోక్తం కరుణాయత్త్రితాత్మనా॥౨

అనాదిశైవధర్మాస్తు సర్వధర్మోత్తమా ఇతి।

తానద్య శ్రోతుకామాస్మి ప్రసీద బ్రూహ్యశేషతః॥౩

తా॥ పార్వతీదేవి పరమేశ్వరు నవలోకించి స్వామీ నీవలన పూర్వశైవులకు విహితములగు ననేకధర్మముల వినియుంటిని. తొల్లి మీరు అనాది శైవధర్మములు సర్వోత్తమములనివచించితిరి. కాన నాధర్మములు వినగోరెద. వానినశేషంబుగఁ దెలిపి యనుగ్రహింపుము.

ఈశ్వర ఉవాచ॥

సాధుపృష్టం త్వయా దేవి లోకానుగ్రహచేతసా।

హన్తతే కథయిష్యామి ధర్మాన్ శాంభవసమ్మతాన్॥౪

సద్యోముక్తిప్రదా నద్య మదీయజ్ఞానసాధనాన్।

తా॥ దేవీ, నీవు లోకానుగ్రహముగోరి బాగుగ నడిగితివి. కావున జ్ఞానసాధనములై సద్యోముక్తిప్రదములగు శాంభవధర్మములను చెప్పుచున్నాను.

మూ॥ యదేతచ్ఛాంభవంనామ వ్రతం శ్రుత్యంతసమ్మితం॥౫

పునర్భవపరిహాణాయ ముముక్షు స్తత్సమాచరేత్।

మూ॥ బ్రహ్మచారీ గృహస్థోవా వనస్థో౽థయతిస్తువా॥౬

మోహిద్వా పరిగృహ్ణీయా త్సద్యో ముక్తిం యదీచ్ఛతి।

తా॥ [illegible] తత్సమాచరేత్? అనియు, వ్రతమే తత్సాను

పత్రం అనియు ఉపనిషత్తులయందుఁ జెప్పబడుచున్న శైవదీక్షను బ్రహ్మచారిగాని, గృహస్థుడుగాని, వనస్థుఁడుగాని యతిగాని స్త్రీగాని ముక్తిగోరు వారందఱు పునర్జన్మ రాహిత్యమునకై ఆచరింపవలయు.

మూ॥ విద్యతే నాస్యసదృశం వేదేష్వన్యేషు వా క్వచిత్ ॥౭
కాంక్షేత ముక్తిం యస్సద్యస్సఏతద్వ్రత మాచరేత్।
తితీర్షు ర్జన్మవారాశిం గురుపోతం సమాశ్రయేత్ ॥౮॥
సమ్యక్పరీక్ష్యవై శిష్యం పరిగృహ్ణీత దేశికః।
నివేదయిష్య న్మజ్జ్ఞానం దద్యాదాదౌ శిరోవ్రతం॥౯

తా॥ ఈ శైవదీక్షనుబోలు కర్మము వేదములయందు గాని తక్కువిద్యల యందుగాని లేనుగాన జన్మసాగరమును దాటనెంచినవాఁడు సద్గురువనునోడ నాశ్రయింపవలయు. గురువైనను శిష్యుని బాగుగ పరీక్షించియె గ్రహింపవలయు, అట్లుగ్రహించి నాజ్ఞానమును (శివజ్ఞానమును) బోధించుటకై మొదటవానికి శిరోవ్రతము నొసంగునది.

మూ॥ అన్యథా గురుశిష్యౌతౌ పతతో నరకాంబుధౌ॥

తా॥ శైవదీక్ష నొసంగకయె నాజ్ఞానము నుపదేశించునెడ గురుశిష్యులిర్వురు నరకసాగరమునం బడుదురు.

మూ॥ అత్యాశ్రమం పాశుపతం శాంభవం తచ్ఛిరోవ్రతం॥౧౦
ఇతీదం నామభిః పుణ్యై ర్నిగమాన్తేషుగీయతే॥

తా॥ శ్రు॥ అత్యాశ్రమిభ్యః పరమంపవిత్రం॥ శ్రు॥ అత్యాశ్రమీ సర్వదా సకృద్వా జపేత్॥ శ్రు॥ వ్రతమేత త్పాశుపతం, వ్రతమేత చ్ఛాంభవం, శ్రు॥ తేషామేవైతాం బ్రహ్మవిద్యాం వదేత శిరోవ్రతం విధివద్యైస్తు చీర్ణం, ఈ మొదలగు నుపనిషత్తులయందు అత్యాశ్రమమనియు, పాశుపతమనియు, శాంభవమనియు శిరోవ్రతమనియు, ఈ శైవవ్రతమే కొనియాడంబడుచున్నది.

మూ॥ తనుత్రయగతానాదిమలత్రయ మసౌ గురుః॥౧౧
దీక్షాత్రయేణ నిర్దగ్ధ్వా లింగత్రయ ముపాదిశేత్॥

తా॥ ఈ గురుఁడు శిష్యునియొక్క స్థూలసూక్ష్మ కారణములను మూడు శరీరములయందున్న ఆణవమాయిక కార్మికములను మూడుదోషములను వేధామను

క్రియలను మూడుదీక్షలచే భస్మముగావించి యిష్టప్రాణభావములను మూడులింగముల నుపదేశింపవలయును.

మూ॥ స్వాగ్రేస్థితస్య శిష్యస్య దేశికః కరుణానిధిః॥ ౧౨
కుర్యాద్దీక్షాం మహాశైవీ మవిద్యాపాశకృన్తనీం॥

తా॥ కరుణాశాలియగుగురుఁడు తనయెదుటనున్న శిష్యునకు అవిద్యాపాశము గొల్చునట్టి మహాశైవదీక్ష నొసంగవలయును.

మూ॥ దీయతే లింగసంబంధః క్షీయతేచ మలత్రయం॥౧౩
దీయతే క్షీయతే తస్మాత్సాదీక్షేతి నిగద్యతే।

తా॥ ఈ్వనతమునందు ఆణవమాయికకార్మికములను మూడుదోషములను క్షయింపఁజేసి ఇష్టప్రాణభావములను మూడులింగములయొక్క సంబంధ మొసఁగబడుచున్న దిగాన దీనికి దీక్షయనుపేరు సార్థక మగును.

మూ॥ సాదీక్షా పరమాశైవీ త్రిధాభవతి నిర్మలా॥౧౪
ఏకావేధాత్మికా సాన్యా దన్యా మన్త్రాత్మికామతా॥
క్రియాత్మికా పరా కాచి దేవమేవ త్రిధాభవేత్॥౧౫

తా॥ ఈమహాశైవదీక్షయందు మూడుదీక్షలు చేరియున్నవి. అవి యెవ్వియన మొదటిది వేధాదీక్షయు, రెండవది మంత్రదీక్షయు, మూడవది క్రియాదీక్షయునగును. ఈమూఁటిను చేరి మహాశైవదీక్ష యగును.

మూ॥ హస్తమస్తకసంయోగా ద్దృష్ట్వా వేధేతి కీర్త్యతే।
గురుణోదీరితా కర్ణేసాహి మన్త్రాత్మికా భవేత్॥౧౬
శిష్యపాణితలే దత్తాయాదీక్షా సాక్రియాభవేత్।
అత్రైకైకాపి విఖ్యాతా దీక్షాసప్తకశోభితా॥౧౭

తా॥ గురుఁడు శిష్యునిశిరమున హస్తమునుంచిశిష్యుననుగ్రహదృష్టితో చూచు నది వేధాదీక్షయనిచెప్పఁబడును. గురుఁడు శిష్యునిచెవియందు మంత్రము నుపదేశించు నది మనుదీక్ష యగును. శిష్యునిహస్తమున లింగమునిడునదిక్రియాదీక్షయగు. ఇందొక్కొక్కటి యేడేసి యవాంతరదీక్షలతో గూడినదిగాన ఇట్లు మహాశైవదీక్ష ఏకవింశతి [ఇరువదియొక] యవాంతరదీక్షలుగలిగి యొప్పుచున్నది.

మూ॥ తత్ప్రకారం ప్రవక్ష్యామి శృణు ష్వైకాగ్రమానసా।

తా॥ ఆదీక్షయొక్క విధానము చెప్పెదను. ఏకాగ్రచిత్తురాలవై వినుము.

మూ॥ దీక్షయిష్య న్మహాచార్య శ్శిష్యం పూర్వోక్తలక్షణం॥౧౮

యుక్తకాలే తదంగాని ద్రవ్యాణ్యాహృత్య యత్నతః।

మండపం కారయే త్తస్య గ్వక్ష్యే తల్లక్షణంయథా॥౧౯

తా॥ ఆచార్యుఁడు శిష్యునకు మహాశైవదీక్ష నొసంగఁదలచి విధ్యుక్తకాలమున వస్తుసామాగ్రి సిద్ధముచేయించి మండపము నిర్మింపవలయు. దానిలక్షణం బెట్లనిన,

మూ॥ దశభి ర్ద్వాదశైర్వాపి మనుభిర్వా ప్రహస్తకైః।

దీక్షార్థం మండపం కుర్యాత్ షోడశ స్తంభసంయుతం॥౨౦

ఏతేషాం మండపానాంచ పంచహస్తోన్నతం విదుః

చతురశ్రం చతుర్ద్వారం చతుస్తోరణభూషితం॥౨౧

తా॥ పది, పండ్రెండు, పదునాలుగు, పదునాలుహస్తములపరిమితిలో నేదొక పరిమితిచొప్పున దీక్షామండపము నిర్మింపనలయు.

ఈమండపము పదునాఱు స్తంభములుగలదియు, ఐదుహస్తములయెత్తుగలదియు, పలుచదరమైనదియు, నాలుగువాకిళ్ళుగలదియు, నాలుగుతోరణములుగలదియునై యుండవలయు

మూ॥ న్యగ్రోధ స్తస్య పూర్వస్యాం దక్షిణస్యా ముదుంబరః।

అశ్వత్థ ముత్తరస్యాంచ ప్లక్షః పశ్చిమతో భవేత్॥౨౨

తా॥ ఆమండపమునకు తూర్పుదిక్కున మఱ్ఱిచెట్టును, దక్షిణపుదిక్కున అత్తిచెట్టును, పశ్చిమదిక్కున జువ్విచెట్టును ఉత్తరపుదిక్కున రావిచెట్టును నుంచవలయు.

మూ॥ నవభాగైకభాగేతు మధ్యే వేదింప్రకల్పయేత్।

హస్తమాత్రసముత్సేధాం దర్పణోదరసన్నిభాం॥౨౩

తా॥ ఆమంటపమునడుమ తొమ్మిదవభాగమున నొకతిన్నె వేయవలయు. అది హస్తమాత్రము ఎత్తుగలిగి చదరముగా నుండవలయును.

మూ॥ కుండాని కల్పయే త్తత్ర నవపంచైకమేవవా।

పూర్వస్మిం శ్చతురశ్రంస్యా ద్వహ్నౌ పిప్పలపత్రవత్॥౨౪

అర్ధచంద్రంతు యామ్యేస్యా న్నైఋత్యాంతు త్రికోణకం।

వృత్తంస్యా ద్వారుణేభాగే షడశ్రం వాయుగోచరే॥ ౨౫

పద్మంస్యా దుత్తరేభాగే హ్యైశాన్యా మష్టకోణకం।
స్యాదీశానేంద్రయో ర్మధ్యే వృత్తంవా చతురశ్రకం॥ ౨౬

తా॥ ఆమండపమున కుండములను తొమ్మిదింటినిగాని, ఐదిటినిగాని, ఒకటిగాని వేయవలయు. నవకుండములు వేయునెడల తూర్పుదిక్కున చతురశ్రకుండంబును, ఆగ్నేయమున పిప్పలపత్రము (రావియాకుంబోలినది) దక్షిణమున అర్ధచంద్రంబును, నైఋతిదిశను త్రికోణంబును, పడమరదిశను వృత్తకుండంబును? ఈశానదిశయందు అష్టకోణంబును, ఈశానదిశకు తూర్పుదిశకునడుమ వృత్తకుండముగాని, చతురశ్రకుండముగాని యొకటియు ఇట్లు తొమ్మిదికుండములను నిర్మింపవలయు

మూ॥ ఇంద్రాదిసోమకాష్ఠాన్త మైశాన్యాంచ ప్రకల్పయేత్।
చతురశ్రార్ధచంద్రేచ వృత్తం పద్మంచ వర్తులం॥ ౨౭

తా॥ అయిదుకుండములను నిర్మింపనెంచునెడ తూర్పున చతురశ్రంబును, దక్షిణమున నర్ధచంద్రంబును, పడమర వృత్తకుండంబును, ఉత్తరమున పద్మకుండంబును, ఈశానమున వృత్తకుండంబును నేర్పరచవలయును

మూ॥ ఏకాగ్ని వేదికా పూర్వేచోత్తరే పశ్చిమేపివా।
ఈశాన్యాం చతురశ్రంవా వృత్తంవాపి ప్రకల్పయేత్॥ ౨౮

తా॥ ఒక్కకుండమును వేయనెంచునెడ తూర్పునగాని, ఉత్తరమునగాని, పశ్చిమమునగాని, ఈశానదిశనుగాని చతురశ్రకుండమునో లేక వృత్తకుండమునో ఒక దానిని నిర్మింపవలయును.

మూ॥ స్థండిలంవాథ కుర్వీత హస్తమాత్రప్రమాణకం।
సికతాభి ర్మృదావాపి గుణాంగుళమితోన్నతి॥ ౨౯

తా॥ కుండమును వేయకున్న ఇసుకచేతగాని మృత్తికచేతగాని మూడంగుళముల యెత్తును హస్తమాత్రప్రమాణంబునుగలస్థండిలమునైనను ప్రాగాదిదిశలలో నొకదిక్కున నిర్మింపవలయును.

మూ॥ మండపం రచయిత్వైవం ధ్వజాద్యైస్తంవిభూషయేత్।
ముక్తాజాలవితానైశ్చ ఫలపల్లవపంకజైః॥ ౩౦
రంభాభి ర్దర్భమాలాభి ర్దర్పణై ర్ధూపవర్తిభిః॥

తా॥ ఈవిధమున మండపము నిర్మించి ధ్వజపతాకలచేతను ముత్యములుకూర్చిన

చాందినీలచేతను, పండ్లచేతను, చివురుటాకులచేతను, కమలములచేతను, అరుట్లచేతను దర్భమాలలచేతను అద్దములచేతను, ధూపవర్తులచేతను నలంకరింపవలయును.

మూ॥ తత్ర గౌరీలతాలింగమండపం విలిఖేత్సుధీః।
పంచవర్ణయుతైశ్చూర్ణై రథవాశుభ్రవర్ణకైః॥

తా॥ ఆమండపమునడుమ వేదియందు పంచవర్ణచూర్ణములచేతగాని, శ్వేతచూర్ణముచేతగాని గౌరీలతాలింగమండలమును లిఖింపవలయును.

మూ॥ స్నాతస్సభస్మరుద్రాక్షస్సకలీకృతవిగ్రహః॥
గురుర్మాహేశ్వరైస్సార్థం ప్రాప్య మండప మస్యతు।
ద్వారా ణ్యస్త్రేణ సంప్రోక్ష్య తాసిచ త్వారిచార్చయేత్

తా॥ గురుఁడు స్నానముచేసి భస్మరుద్రాక్షలు ధరించి, తనశరీరమున కళాన్యాసము చేసికొని మాహేశ్వరులతోఁగూడ మండపమునొద్దకరుగించి యామండపముయొక్క నాలుగుద్వారములను పూజింపవలయు,

మూ॥ ఓంహాంశాంతికళాభిఖ్యద్వారాయ నమఇత్యపి।
ఓంహాంవిద్యాకళాభిఖ్యద్వారాయ నమఇత్యపి॥ ౩౮
హాంనివృత్తికళాభిఖ్యద్వారాయ నమఇత్యపి॥
హాంప్రతిష్ఠాకళాభిఖ్యద్వారాయ నమఇత్యపి॥ ౩౯
పూర్వాదీని సమభ్యర్చ్యతత్తచ్ఛాఖయో ర్న్యసేత్.
నందినంచ మహాకాళం భృగినంచ వినాయకం॥ ౩౬
వృషం స్కందం తథాదేవం చండం ద్వాద్వాచతుర్ష్వపి।

తా॥ ఓంహాంశాంతి కళాద్వారాయనమః అని తూర్పుద్వారమును ఓంహాం విద్యాకళాద్వారాయనమః అనిదక్షిణద్వారమును ఓంహాంనివృత్తికళాద్వారాయనమః అనిపశ్చిమద్వారమును, ఓంహాం ప్రతిష్ఠాకళాద్వారాయనమః అనియుత్తరద్వారమును, బూజించి వానిశాఖలయందు క్రమముగాతూర్పున నందిమహాకాళులను, దక్షిణమున భృంగివినాయకులను, పశ్చిమమునవృషభస్కందులను, ఉత్తరమున దేవీచండీశ్వరులను పూజింపవలయును.

మూ॥ తాళత్రితయ మస్త్రేణ కృత్వావామాంఘ్రిపార్ష్ణితః॥ ౩౭
ఘాతత్రయం తథాకృత్వా విఘ్నా నుత్సార్య యత్నతః॥

ద్వారాణ్యస్త్రేణ తూద్ఘాట్య ప్రతీచీద్వారతో బుధః॥ ౩౮
అంతః ప్రవిశ్య యాగోపకరణా న్యవలోక్య చ॥
అస్త్రప్రాకారావృతశ్చ కవచేనావకుంఠితః॥ ౩౯
సుఖాసనే తూపవిశేత్ కుశాదిపరికల్పితే॥

తా॥ అస్త్రమంత్రము చదువుచు మూఁడుమార్లు రెండుచేతులతో తాళము కొట్టియు, ఎడమకాలిమడమతో నేలమీద మూఁడుమార్లు తన్నియు విఘ్నముల బారఁ దోలి అస్త్రమంత్రముచేత ద్వారముల తెరచి పశ్చిమద్వారమునుండి లోనఁబ్రవేశించి యాగోపకరణములఁ జూచి అస్త్రప్రాకారముచే నావరింపఁబడినవాఁడును, కవచ మంత్రముచే నవకుంఠనము చేసికొనినవాఁడునునై దర్భాదినిర్మితమగు సుఖాసనమునఁ గూర్చుండవలయును.

మూ॥ తత స్సశిష్య స్తాంబూలదక్షిణాభస్మసంయుతం॥ ౪౦
పాత్రం గృహీత్వా ప్రబ్రూయాద్దేవంసద్గురుసన్నిధౌ॥
సంసారాంబుధినిర్మగ్నం జన్మగ్రహభయాకులం॥ ౪౧
మృత్యుపాశవశందీనం కృపయానుగృహాణ మాం॥
ఇతివిజ్ఞాప్య తత్పాత్రం సంస్థాప్యాగ్రే భివాదయేత్॥ ౪౨

తా॥ అంత నాశిష్యుఁడు తాంబూలము దక్షిణ భస్మఘుటిక నుంచినపాత్రము నుగ్రహించి స్వామీ, సంసారసముద్రమునమునిఁగి జన్మగ్రహముచే భయమొందుచు మృత్యుపాశబద్ధుఁడనై దీనుఁడనైన నన్నుగ్రహింపుమని విన్నవించి యాపాత్రమును గురుసన్నిధినునిచి వందనము చేయవలయును.

మూ॥ గురుస్తత్పాత్రమానీయ నిక్షిప్య గణమధ్యకే॥
పరిగృహ్యా గణానుజ్ఞా ముపవిశ్యాసనేపునః॥ ౪౩
దీక్షయిష్య న్మిహాచార్యో దేశకాలౌ నిగద్య చ॥
గణేశ మభ్యర్చ్య కుర్యాత్స్వస్తిపుణ్యాహవాచనం॥

తా॥ తరువాత గురుఁడాపాత్రమును గణమధ్యమున నునిచి గణానుజ్ఞ గ్రహించి సింహాసనంబున గూర్చుండి దేశకాలములనుగ్గడించి గణాధిపతిని పూజించి స్వస్తిపుణ్యాహవాచనము జేయింపవలయును.

మూ॥ పునర్గణాన్నమస్కృత్య దేశకాలౌ ప్రకీర్త్యచ।
దేహత్రయగతానాది మలత్రయనివృత్తయే॥ ४४
లింగత్రయానుసంధాన యోగ్యతావాప్తయే పిచ।
షడధ్వశుద్ధిపూర్వేణ శాంభవేన వ్రతేనతు। ४५
దీక్షయిష్య ఇమంశిష్యం శక్తిపాతవిధానతః॥
ఇతిసంకల్ప్య తం దృష్ట్వా శిష్యమేవం వదేద్గురుః॥ ४६

తా॥ గురుడు తిరుగ గణనమస్కారము గావించి దేశకాలములు స్మరించి దేహత్రయగతములగు మూడుమలములు నివర్తించుటకును ఇష్టాదిలింగత్రయము ననుసంధానముచేసికొను యోగ్యతసిద్ధించుటకు షడధ్వశుద్ధిపూర్వకమైన శాంభవ వ్రతముచే శక్తిపాతవిధితో నీశిష్యుని దీక్షితునిగావింతునని సంకల్పము గావించియాశిష్యునిజూచి యిట్లు పలుకవలయు.

మూ॥ పరిత్యజ్య సదాచారం మాప్రవర్తస్వ సర్వదా।
ఇత్యాజ్ఞాదీక్షయాదిశ్య తతస్త్వేవం వదేత్పునః॥ ४७
పురాతనకృతాచార సదృశం కుర్విత స్ఫుటం।
ఉపమాదీక్షయాదిశ్య శిష్యపాపాపనుత్తయే॥ ४८
ప్రాణానాయమ్య విధివ త్పంచగవ్యాని సాధయేత్

తా॥ సదాచారము విడువకుమని యాజ్ఞాదీక్ష నొసంగి పురాతనులాచరించిన విధమున నాచరింపుమని యుపమాదీక్షనొసంగియు శిష్యునిపాపముల నడంచుటకై ప్రాణాయామముచేసి పంచగవ్యముల సాధింపవలయు.

మూ॥ పంచకలశసమర్చాయై ఋత్విజో వృణుయా ద్గురుః॥ ५०
చతురశ్చ తథాచార్యాన్ మధ్యమస్య స్వయం భవేత్॥

తా॥ గురుఁడు పంచకలశార్చనమునకై చుట్టునున్న నాలుగుకలశములకు నల్వురాచార్యుల వరించి మధ్యకలశార్చనమునకు తానె యుండవలయు.

మూ॥ ఆవాహయేచ్చ కలశే మధ్యే త్వీశాన మగ్రతః॥ ५१
తత్పురుషంచ పూర్వస్మి న్నఘోరం దక్షిణే తథా॥
ఉత్తరే వామదేవంచ సద్యోజాతంతు పశ్చిమే॥ ५२
తత్తన్మంత్రై స్సమావాహ్య పూజయేత్తదనంతరం॥

మూ॥ లింగనిష్ఠావిరోధేన స్వకృత్యా న్యనుపాలయేత్।
నదుష్యతే తతో నారీ భర్తృశుశ్రూషణాదిషు॥ ౨౭.

తా॥ లింగనిష్ఠకు బాధకము లేకుండ గృహకృత్యములను చేసికొనుచుండవలయు. ఇట్లు ప్రవర్తించు స్త్రీకి భర్తయొక్క సేవాదులయెడ బాధక ముండదు.

మూ॥ పతిం పరిచర న్తీచ శ్వశ్వాదీ న్పోషయ న్త్యపి।
పాలయ న్త్యపి పుత్రాదీ న్లింగనిష్ఠాం నవిస్మరేత్॥ ౨౮.

తా॥ వనిత భర్తను నుపచారము చేయుచున్నను, అత్తమామల పోషించుచున్నను పుత్రాదులను పాలించుచున్నను లింగనిష్ఠను మరువఁగూడదు.

మూ॥ యథైవ బాలాపత్యాయాః కుర్వన్త్యా భవనక్రియాః।
బాలాయత్తం యథా చిత్తం దీక్షితాయా స్తథోచితం॥ ౨౯.

తా॥ శిశువుగల కాంత గృహకృత్యములఁ జేసికొనుచున్నను నామె చిత్తము శిశువునంద యుండునట్లు దీక్షితురాలి చిత్తంబును సర్వావస్థలయందును నీశ్వరాయత్తమై యుండవలయు,

మూ॥ తతో నగృహకృత్యాని బాధన్తే మదుపాసనాం।

తా॥ కావున గృహకృత్యములు నాయుపాసనను బాధింప నేరవు.

మూ॥ లింగనిష్ఠాద్యభావేపి మన్నిష్ఠాయుక్తచేతసః।
పత్యు స్సంసేవనా ద్భర్త్రా మత్సాయుజ్యం గమిష్యతి॥ ౩౦.

తా॥ దీక్షనొందిన కాంతకు లింగనిష్ఠాదులు సంభవింపకున్నను లింగనిష్ఠగల భర్తనుసేవించుటవలన నాకాంత భర్తతోగూడ నాసాయుజ్యమును పొందగలదు.

దేవ్యువాచ॥

దేవి యిట్లడిగెను.

మూ॥ రజః ప్రభవదుష్టాయాః ప్రసవాశౌచసంగతేః॥
లింగస్పర్శనపూజాద్యాః కరణీయాః కథం ప్రభో॥ ౩౧.

తా॥ రజస్సుచేతను, ప్రసవాదులచేతను నపవిత్రురాలగు కాంత లింగస్పర్శను, లింగపూజను ఎట్లు చేయనగు?

మహాదేవ ఉవాచ।

పరమేశ్వరుఁ డిట్లు బదులు చెప్పుచున్నాడు.

మూ॥ అర్చా హ్యవసరాభిఖ్యా గృహిణీనాంతు సమ్మతా।
సమంత్రా వైదికా యోగ్యా యోషితాం తాంత్రికా
స్స్మృతాః॥ ౮౨.
దీక్షాపవిత్రితాంగత్వాత్ లింగస్పర్శో నదుష్యతే।
రజోవత్యాదికాలేషు కార్యా పూజా ప్రయత్నతః॥ ౮౩.
ప్రసవప్రముఖాపత్సు పూజాభంగో నదోషదః॥

తా॥ సంసార ధర్మముననున్న స్త్రీలు అవసరార్చనమునే చేయవలయును. పూజామలయందు తాంత్రిక మంత్రముల నుపయోగించుకొనవలయుగాని వైదిక మంత్రముల నుపయోగించుకొనఁ గూడదు. స్త్రీలు దీక్షచే పవిత్రమైన శరీరముగలవారు గాన లింగస్పర్శము వారలకు దోషప్రదము కానేరదు. కావున దీక్షనొందిన స్త్రీలకు రజోదర్శనాది సమయములయందును పూజ నిషిద్ధము కాదు. ప్రసవాదులయందు పూజాభంగము సంభవించినను దోషము లేదు.

దేవ్యువాచ॥

దేవి తిరుగ నిట్లడిగెను.

మూ॥ వైదికీ వాథవా దీక్షా తాంత్రికీ యోషితాం భవేత్।౮౪
వైదికీయది పూజాయాం మంత్రా స్స్యు స్తాంత్రికాః కథం॥
తాంత్రికీయది దంపత్యో ర్దీక్షాభేదః పరస్పరం। ౮౫
సిద్ధ స్తయోః కథంను స్యా త్సాంగత్యం సర్వకర్మసు॥
తమేనం సంశయం ఛిన్ధి కరుణావరుణాలయ॥ ౮౬.

తా॥ స్త్రీలకు వైదికదీక్ష యొసగవలయునా? లేక తాంత్రికదీక్ష యొసఁగవలయునా? వైదికదీక్ష యొసఁగఁబడునెడ వారు పూజార్థమై తాంత్రిక మంత్రములనేయేల వాడుకొనవలయు? అట్లుకాక, స్త్రీలకు తాంత్రికదీక్షయే ఇయ్యవలయునందురేని భర్తకు వైదికదీక్షయు, భార్యకు తాంత్రికదీక్షయు సంభవించుగాన దంపతులకు దీక్షాభేదము సంభవించును. పరస్పరము దీక్షాభేదముగల దంపతులకు సర్వకృత్యములయందు సాంగత్య మెట్లు సంభవించును? ఈసంశయము వారింపుము.

మహాదేవ ఉవాచ॥

పరమేశ్వరుఁ డిట్లు బదులు చెప్పుచున్నాఁడు.

మూ॥ దీక్షే హ్యుభే వికల్పేన యుజ్యేతే ద్విజయోషితాం।

తాంత్రిక్యా మధికార స్స్యా ద్ధర్తుం స్త్రీణాం స్వతంత్రతః॥
పుమాంస మగ్రతః కృత్వా వైదిక్యాం పరతంత్రతః॥ ౮౭.

తా॥ ద్విజ స్త్రీల కీరెండు దీక్షలలో నేదైన యుక్తమేయగును. తాంత్రికదీక్ష స్వాతంత్ర్యముతో గ్రహించుటకు స్త్రీల కధికారము కలదు. వైదికదీక్షనైనచో పురుషుని నెదుటనుంచుకొని గ్రహింపవలయును. వైదికదీక్షను పురుషుఁడు గ్రహించునప్పుడు గ్రహింపవలయును. కాఁబట్టి వైదిక దీక్షయందు పారతంత్ర్యమెగాని స్త్రీలకు స్వాతంత్ర్యము లేదు,

మూ॥ దీక్షాభేదస్తు దంపత్యో ర్నసాంగత్యనిరోధకః।
యథాధికారం సంప్రాప్త స్త్రీపుంసో ర్ధర్మభేదవత్॥ ౮౮
సర్వముక్తం సమాసేన కిమతః శ్రోతు మిచ్ఛసి॥

తా॥ దంపతులకుగల దీక్షాభేదము సర్వకర్మ సాంగత్యమును బాధించునది కానేరదు. ఏలన, స్త్రీ పురుషులకుగల యధికార భేదమునుబట్టి యితర ధర్మములు భేదించినట్లు దీక్షా భేదంబును బ్రాప్తించును.

నీవడిగిన యన్ని యంశములు దెలిపితిని. ఇంక నేమి వినఁదలచెదో అడుగుము.

ఇతిశ్రీకారణోత్తరతంత్రే పార్వతీ పరమేశ్వర సంవాదే
శాంభవదీక్షా మహాత్మ్య కథనం నామ ద్వితీయఃపటలః॥

———:0:———

దేవ్యువాచ॥

పార్వతీదేవి తిరుగ నిట్లడిగెను.

మూ॥ దేవ దేవ మహాదేవ జగదీశ నమోస్తుతే।
శాంభవవ్రతినాం నిత్యమాహ్నికం బ్రూహిమేఽధునా॥ ౧.

తా॥ పరమేశ్వరా, శాంభవదీక్ష నొందినవారు ప్రతిదినము నాచరింపవలసిన యాహ్నికమును దెలుపుము.

మహాదేవ ఉవాచ॥

పరమేశ్వరుఁ డిట్లని చెప్పదొడంగెను.

మూ॥ బ్రాహ్మే ముహూర్తే మద్భక్తో బుధ్యమానో నగాత్మజే।
నేత్రయో స్స్పర్శయ న్నిష్టలింగం మామను సంస్మరేత్॥ ౨
గురూపదిష్టమార్గేణ ద్వాదశాంతేఽథవాహృది।
దివ్యరూప మరూపంవా చింతయే న్మామనన్యధీః॥ 3.

ధర్మా నర్థాంశ్చ తత్క్లే శా న్దినకృత్యంచ చిన్తయేత్॥

తా॥ దేవి, నాభక్తుఁడు బ్రాహ్మ ముహూర్తమున మేల్కనువాఁడై యిష్ట లింగమును కనుల కద్దుకొనుచు నన్ను స్మరింపవలయు- గురువు ఉపదేశించిన విధమున హృదయమున నన్ను ధ్యానింపవలయు. తరువాత, ధర్మార్థములను, వానిని సాధించుటకై కలుగు కష్టములను, పవలి కృత్యములను జింతింపవలయు.

మూ॥ తదాచత్వారి కర్మాణి సంధ్యాయాం నసమాచరేత్।
భుక్తించ కామినీ సక్తిమధీతిం సుప్తిమేవచ॥ ౪.

తా॥ భోజనము, స్త్రీ సంగము, వేదాధ్యయనము, నిద్రయను నాలుగు పనులను సంధ్యాకాలమునందుఁ జేయఁగూడదు.

మూ॥ ఉదయాత్యస్తమయతి గవాసుప్యతిచేన్నరః।
ప్రాణానాయమ్యచ జపే న్మూలమష్టోత్తరంశతం॥ ౫.

తా॥ సూర్యోదయ కాలమునఁగాని, సూర్యాస్తమయ కాలమునఁగాని మనుజుఁడు నిద్రించునెడ ప్రాణాయామముచే శ్రీపంచాక్షరీ మంత్రమును నూట యెనిమిది సార్లు జపము చేయవలయు.

మూ॥ మద్భక్తం భస్మరుద్రాక్షం మాంచ బిల్వమహీరుహం।
ప్రాతః కాలేతు యఃపశ్యేత్సోభీష్టం సమవాప్నుయాత్॥ ౬.

తా॥ నాభక్తుని, భస్మను, రుద్రాక్షను, శివలింగమును, బిల్వవృక్షమును ప్రాతఃకాలమునఁ జూచినవాఁడు ఇష్టసిద్ధి నొందును.

మూ॥ పాషండం భవినం వ్రాత్యం యాచకం దేవ నిందకం।
ప్రాతః కాలేతుయః పశ్యేత్సోనిష్టం సమవాప్నుయాత్॥ ౭.

తా॥ పాషండుని, అలింగిని, వ్రాత్యుని, యాచకుని, దేవనిందకుని ప్రాతఃకాలమునఁ జూచినవాఁడు అనిష్టమును పొందును.

మూ॥ తతోగ్రామాద్బహిర్యాయా దాగ్నేయీం విదిశంనరః॥ ౮
శరక్షేపమితాంతత్ర జలపాత్రం నిధాయవై।
నివీతం శివసూత్రంచ మూర్ధ్నివిన్యస్యవాససా॥ ౯
శిరః ప్రావృత్య నోర్ధ్వంచ నాథశ్చైవ విలోకయేత్॥
సోమమగ్ని మథాదిత్యం కుర్వన్నాభి ముఖం ద్విజః॥ ౧౦
తతశ్చ విసృజే న్మూత్రం పురీషంచ సమాహితః॥

తా॥ ఇట్లు నిదురలేచి యీశ్వరుని ధ్యానించి పవలి కృత్యముల నాలోచించుకొనిన తరువాత గ్రామము వెలుపట నాగ్నేయదిక్కునకు బాణము పోయినంతదూరము

పోయి యచట జలపాత్రము నునిచి నివీతముగా ధరించిన జంధెమును, శివసూత్రమును గూడ శిరమున నునిచికొని, శిరమునకు వస్త్రమును జుట్టుకొని, పైనగాని, క్రిందగాని జూడకయు, సూర్య చంద్రాగ్నులకు, దేవతలకు, విప్రులకు నెదురుగా నుండకయు మల మూత్రముల విడువవలయు.

మూ॥ అతో మృదావారిణాచ భావశుద్ధి సమన్వితః॥ ౧౧
శౌచంతు యత్నతః కుర్యాదన్యథా నిష్ఫలాః క్రియాః॥

తా॥ భావశుద్ధి లేనివానికి పర్వతతుల్యమగు మృత్తికతోను, సమస్తమగు గంగా జలముతోనైనను శుద్ధి గలుగనేరదుగాన చిత్తశుద్ధిగలవాడై మృత్తికతోను, జలము తోను యత్నముతో శుద్ధి చేసికొనవలయు, అట్లు చేసుకొనని యెడల సకలమగు నాహ్నికకృత్యంబులును వ్యర్థములగును.

మూ॥ అపవిత్రః పవిత్రోవా సర్వావస్థాంగతోపివా॥ ౧౨
యస్స్మరేద్దైవవిరూపాక్షం సబాహ్యాభ్యంతరశ్శుచిః॥

తా॥ జనుడు పవిత్రుడుగాని, యపవిత్రుడుగాని యేవిధమగు నవస్థయం దున్నను, విరూపాక్షుడనగు నన్ను దలంచునెడ వాడులోపలను, వెలుపటను గూడ పరిశుద్ధుడే యగును.

మూ॥ శౌచంవిధాయ విధివద్ధస్తపాదం విశోధ్యచ॥ ౧౩
జలంమహ్యాం సమర్ప్యైవ గండూషాన్విసృజేత్తదా॥

తా॥ పాయువును, హస్తపాదములను శుద్ధిచేసికొని, జలము నాకర్పించి గండూషములు విడువవలయు.

మూ॥ సంబద్ధశిఖ ఆసీనో వాఙ్మనః కాయసంయతః। ౧౪
కృత్వోపవీతం సవ్యాంసే తత ఆచమనం చరేత్॥
అంతర్జానుకరో భూమిమథగ కాయంతథా స్పృశేత్॥ ౧౫
ఉదఙ్ముఖస్తుతీర్థేన బ్రాహ్మేణోపస్పృశేజ్జలం॥

తా॥ సిగ ముడివేసికొని జంధెము నుపవీతముగ ధరించి మోకాళ్లలోపల చేతుల నిడికొని, కూర్చుండి, వాఙ్మనఃకాయముల నియమించి బ్రాహ్మతీర్థముతో నాచ మనము చేయవలయు.

మూ॥ సుప్త్వాక్షుతేచ నిష్ఠీవే పరిధానే౽శ్రునిర్గమే॥ ౧౬
కృత్వామూత్రపురీషేచ శౌచార్థీ సముపస్పృశేత్॥

తా॥ నిదురించి లేచినప్పుడు, తుమ్మినపుడు, భుక్తించి వైచినప్పుడు, కన్నీరు గారినప్పుడు, మూత్రమునుగాని, పురీషమునుగాని విడిచినప్పుడును పరిశుద్ధి గోరువాడు ఆచమనము చేయవలయును.

మూ॥ ఉపస్పర్శే తథాస్నానే నియతంసర్వకర్మసు॥ ౧౭
కుశగ్రహః ప్రశస్తస్స్యాన్నశస్తః పైతృకేభవేత్॥

తా॥ ఆచమనము చేయునప్పుడు, స్నానము చేయునప్పుడును, సర్వ కర్మముల యందును దర్భలను గ్రహింపవలయునుగాని పైతృకమునందు మాత్రము గ్రహింపఁగూడదు.

మూ॥ ఆచమ్యప్రాఙ్ముఖోనిత్య మాచరే ద్దంతధావనం॥ ౧౮
మధురిత్యాది మంత్రేణ శాఖాం సమభిమంత్ర్యచ।
ఆయు ర్బలం యశో వర్చః ప్రజాః పశు వసూనిచ॥ ౧౯
బ్రహ్మ ప్రజ్ఞాంచ మేధాంచ త్వం నో ధేహి వనస్పతే॥
ఇతిసంప్రార్థ్య మంత్రేణ ధావయే చ్ఛాఖయాతథా॥ ౨౦

తా॥ తూర్పుముఖముగానుండి ఆచమనము చేసి దంతధావనము చేయవలయు. మధుః అని మొదలుగాగల మంత్రముచే శాఖను మంత్రించి ఓ వనస్పతీ, ఆయువును, బలమును, కీర్తిని, కాంతిని, ప్రజను, పశువులను, ధనమును, వేదమును, ప్రజ్ఞను, మేధను నాకిస్మని ప్రార్థించి యాపుడకచే దంతధావనము చేసికొనవలయును.

మూ॥ సర్వేకంటకినశ్శస్తాఃక్షీరిణోదంతధావనే।
నబిల్వశాఖయా కుర్యాద్దంతశుద్ధిం కదాచన॥ ౨౧

తా॥ ముండ్లుగలవియు, పాలుగలవియు నగు చెట్లపుడకలు దంతధావనమునకు ప్రశస్తములు. మారేడుపుడకతో దంతధావము చేయఁగూడదు.

మూ॥ దంతశుద్ధిం విధాయాథప్రాతస్స్నానం సమాచరేత్।
మహానద్యోదేవఖాతాస్తటాకాశ్చసరాంసిచ॥ ౨౨
గర్తప్రస్రవణాదీని శస్తాని స్నానకర్మణి॥

తా॥ దంతధావనము చేసికొని ప్రాతస్స్నానము చేయవలయు. మహానదులు, దేవఖాతములు, తటాకములు, సరస్సులు, గర్తములు, ప్రస్రవణములు మొదలైనవి స్నానమునకై ప్రశస్తములగును.

మూ॥ రూపంతేజో బలం శౌచ మాయుర్ధృతి రరోగతా॥ ౨౩
మేధా దుస్స్వప్ననాశశ్చ గుణా స్స్నానస్యకీర్తితాః॥

తా॥ రూపము, తేజము, బలము, పరిశుద్ధి, ఆయువు, ధైర్యము, ఆరోగ్యము, జ్ఞాపకశక్తి, పీడకలలు నశించుట అను నివి స్నానమువలన గలుగు ఫలములు.

మూ॥ మదాలయసమీపేతుయత్తోయం పరితిష్ఠతే॥ ౨౪
శివగంగేతివిజ్ఞేయా తత్రస్నాత్వా లభేత మాం॥

తా॥ నాయాలయము దగ్గిరనున్న జలమునకు శివగంగయనిపేరు. అందుస్నానము చేసినవాఁడు నా సాన్నిధ్యము నొందును.

మూ॥ నద్యాదికాన్సమాగమ్య స్నానంకుర్యాద్విశేషతః॥ ౨౫
మలస్నాన మిదంప్రోక్తం మంత్రస్నాన మథశ్శృణు॥

తా॥ మహా నద్యాదులయందు విశేషించి స్నానము చేయవలయు. ఇది మల స్నానమని చెప్పఁబడును. ఇఁక, మంత్రస్నానమును జెప్పెద వినుము.

మూ॥ సంకల్పసూక్త పఠనం మార్జనంచాఘమర్షణం॥ ౨౬
దేవతాతర్పణంచైవ స్నానంపంచాంగముచ్యతే॥

తా॥ సంకల్పము, వరుణసూక్తములను పఠించుట, మార్జనము, అఘమర్షణము. దేవతా తర్పణమునని మంత్రస్నానమున కైదంగములు గలవు.

మూ॥ మత్స్యమండూకసర్పాద్యై రనేకైర్జలజంతుభిః॥ ౨౭
సేవితం తు జలం నిత్యం తస్మాద్దుష్టం భవే దతః॥
తద్దోషశమనార్థంతు శివతీర్థం ప్రకల్పయేత్॥ ౨౮
హస్తమాత్రప్రమాణేన పరితశ్చతురశ్రకం॥

తా॥ చేపలు, కప్పలు, పాములు మొదలైన పెక్కు జలజంతువులచే వసింపఁబడి యుండుగాన జలము దూషితమై యుండును. కావున నాదోషము శమించుటకై, చదరముగా హస్తమాత్రప్రమాణము శివతీర్థమును కల్పింపవలయును.

మూ॥ హుంఫడంతేన చాస్త్రేణ మృదంగృహీత సాధకః॥ ౨౯
సద్యేన స్థాపయేన్మంత్రీ వామదేవేన సేచయేత్॥
అఘోరేణ పిశోధ్యైవ పురుషేణాతిభాగకం॥ 30
పూర్వస్మి న్దక్షిణేచైవ తథాచైవోత్తరే క్షిపేత్॥
ఈశానేనతు మంత్రేణ చైకైక మభిమంత్రయేత్॥ 3౧
అస్త్రం బ్రహ్మశివం జప్త్వా పూర్వాదిక్రమశోన్యసేత్॥

అస్త్రజప్తంతు యద్భాగం దశదిక్షువినిక్షిపేత్॥ 3౨
శివజప్తంతు యద్భాగం తీర్థమధ్యే వినిక్షిపేత్॥

ఫట్కారేణాస్త్రమంత్రేణ తథానారాచముద్రయా॥ 33
జలేసూక్ష్మాశ్చయే దోషా స్తేషాముచ్చాటనం భవేత్॥

బ్రహ్మజప్తస్య చార్ధేన చాత్మనోంగాని కుంఠయేత్॥ 3౪
శిరోవక్త్రించ హృదయం పాదౌగుహ్యంచభాగశః॥

శేషార్ధేనోపసంస్పృశ్య స్నాత్వాద్భిస్తు పునః పునః॥ 3౫
ఉపస్పృశ్య తథాస్నాయా చ్ఛివతీర్థస్య మధ్యతః॥

తా॥ అది యెట్లనిన, సాధకుఁడు, 'అస్త్రాయహుంఫట్' అను మంత్రముచే మృత్తికను త్రవ్వి, సద్యోజాత మంత్రముచే దానిని ఒడ్డున నునిచి, వామదేవమంత్రము పఠించుచు జలము ప్రోక్షించి, అఘోర మంత్రము పఠించుచు మృత్తికయందగు తృణమూలాదులను తొలగించి, తత్పురుష మంత్రము జపువుచు నా మృత్తికను మూడుభాగములు చేసి యా మూఁడు ముద్దలను ఎడమచేతియందు తూర్పు దక్షిణము, ఉత్తరము వను మూడు దిక్కుల నునిచి, ఈశానమంత్రముచే నా మూఁడు ముద్దలను మంత్రించి అస్త్రమంత్రముచే తూర్పుదెసనున్న ముద్దను, పంచబ్రహ్మ మంత్రములచే దక్షిణపుదెసనున్న ముద్దను శైవపంచాక్షరిచే నుత్తరముననున్న ముద్దను మంత్రించి, ఇందు అస్త్రమంత్రముచే మంత్రింపఁబడిన మృద్భాగమును హస్తమాత్ర పరిమితమగు శివతీర్థమునకు పది దిక్కులను చల్లి, పంచాక్షరిచే మంత్రింపఁబడిన మృత్తికాభాగమును అస్త్రాయఫట్ అను మంత్రము పఠించుచు, నారాచముద్రతో శివతీర్థమధ్యమున నుంచవలయు. దీనిచే జలగతములగు దోషములన్నియు తొలఁగును. తరువాత, పంచబ్రహ్మ మంత్రములచే మంత్రింపఁబడిన మృత్తికాభాగములోని సగమును శిరము, ముఖము, హృదయము, పాదములు, గుహ్యమునను నవయవములయందును కడమ సగమును తక్కుశరీరమునందును రాచికొని పలుమారు మునిఁగి, యాచమనముచేసి యిట్లు శివతీర్థము నడుమ స్నానము చేయవలయు.

మూ॥ శివబ్రహ్మాంగ విద్యాంగై స్స్నానంకృత్వావిచక్షణః 3౬
పంచబ్రహ్మశివాంగైశ్చ త్రిఃపఠే దఘమర్షణం॥

తా॥ శివాంగములు, బ్రహ్మాంగములు, విద్యాంగములు నను మంత్రములతో స్నానముచేసి, పంచబ్రహ్మ మంత్రములు, శివాంగములు నను మంత్రములతో గూడ అఘమర్షణ సూక్తమును ముమ్మారు పఠింపవలయును.

శ్రీశివాయగురవేనమః

# శైవరహస్యబోధినీవిజయము.



శైవాగ్రగణ్యులారా!

ఈ పత్రికామతల్లిక మీచే పోషింపఁబడుచు నొక వత్సరముం గడచి ద్వితీయవార్షిక జన్మ దినోత్సవము నందగలుగుటం జేసి శైవ మతముమీఁద మీకుగల పరిపూర్ణాభిమానమునకు సంతసిల్లి మీయెడ గృతజ్ఞతవహించి స్వపోషకులకు సకలసౌఖ్యముల నొసంగుమని పరమేశ్వరుఁ బ్రార్థించుట యెంతయు వింతగాదు. ఈపత్రిక కడచిన వత్సరమున నేమి ఘనకార్యముచేసెనని యడుగుదురేని ఇది చేయనిదేమి కలదు ?

ఇది శ్రీ బసవేశ్వరు మహిమము నుద్ఘోషించుచుఁ బ్రభవిల్లుటయగాక యీమ్మహాత్మునెడ కుమతులు చూపిన సకల శంకాపంకంబును తన వాగ్ధారలచే మాయించి బసవేశ్వరు సత్ప్రకాశంబు నలుదెసల వెలయించెను.

మఱియు భాష్యచర్చయం దగు వాద ప్రతివాదములను ప్రకటించి యందగు ప్రాబల్య దౌర్బల్యములను విశదీకరించెను.

ఇదిగాక పూర్వకాలమున ఉద్భటునకు దహనసంస్కారము జరిగియుండుటం జేసి దహనాద్యాచారములు శైవ పూర్వాచారములె యని కొందఱకు గలిగియున్న భ్రాంతిని తొలగించి శైవులకు దహనాద్యాచారములు కూడవని నిరూపించెను.

మఱియు పరమపురుషార్థ నిదానంబును, అనాదిసిద్ధంబును నగు షట్కాలశివపూజ శ్రుతిధర్మముల నిర్మూలీకరించుచున్నది గాన నిది కలిధర్మమని కొందఱు చేయుచున్న విపరీతవాదము నామూలాగ్రముగా ఖండించి శైవపూర్వాచారముల నిర్దోషత్వమును స్పష్టీకరించెను.

ఇదిగాక, శైవధర్మములయెడ సంభావితములగు సకల సంశయములఁ దొలగించి తద్విశేషముల దెలుపు కారణోత్తరమను శివాగమమును ప్రకటించుచు శైవధర్మముల ప్రామాణ్య సంపత్తిని ప్రఖ్యాతము చేయుచుండెను,

మఱియు, శైవమతము ప్రాచీనమైనది కాదని మొదలుగా కొందఱు చేయు విపరీతబోధను మాన్పుటకై శైవమత మాహాత్మ్యమను వ్యాసమున నీ శైవమతము కడమ మతము లన్నిటికంటె పరమ ప్రాచీనమైనదనియు లోకగురుత్వమును వహించినదనియు మతాంతర గ్రంథములనుబట్టియే సిద్ధాంతీకరించి యీ మతముయొక్క శ్రేష్ఠత్వమును తెలిపెను.

ఇట్లు, ఈ పత్రికాపుత్రిక నిజమతగౌరవము నిలుపుటంబట్టి యిహలోకమున ప్రతిష్ఠాలాభంబునకును, శైవధర్మ సంశయముల దీర్చియు తద్విశేషముల దెలిపియు ధర్మానుష్ఠానమునకును తోడ్పడుటంజేసి కైవల్యలాభమునకును మూలమగుటంజేసి యైహికాముష్మిక సౌఖ్యప్రదయనుట నిర్వివాదము.

కావున మీ రెల్లరు నీపత్రికను పోష్యవర్గములో నెల్ల ప్రధానమైనదానిగా నెంచియుందురను నెడ సంశయముండదుగదా ?

ఈ విధమున నీపత్రిక శైవధర్మరహస్యముల వెల్లడించుచుండునట్లును, మీరీ పత్రికారత్నముయొక్క రక్షణయందు జాగరూకులై సకల సౌఖ్యముల నందునట్లును నిజభక్తపాలనతత్పరుఁడగు పరమేశ్వరుఁడనుగ్రహించుగాక యని ప్రార్థించుచున్నాఁడను.

ఇట్లు,

ప॥ సం॥

---

# భూమిక.

శైవాగ్రేసరులారా,

సకలమతముల వారికి నిత్యకర్మానుష్ఠానము ముఖ్యమైయుండుట యందఱకు విదితమే.

పూర్వకాలమున పెక్కురు విద్వాంసులును శ్రద్ధాభక్తియుక్తులునైయుండుటచే నప్పుడు గ్రంథప్రచార మవసరము కాదయ్యెను.

ఇప్పుడైననో అట్టి వారలరుదైనందున నదియవసర మయ్యెను. ఎట్లన.

ఈకాలమున, అనుష్ఠాన విశేషములు తెలిసికొన యత్నించి, తెలిసినవారియొద్ద కేగి, వారిని సవినయముగఁ బ్రార్థించి తెలిసికొను నంతశ్రద్ధాతిశయముగలవారుగాని, అడిగినవారియందుఁ గృపాతిశయము వహించి వారి సంశయముల దీర్పువారుగాని, అనుష్ఠానవిశేషములు సమర్మకముగాఁ దెలిసినవారుగాని అరుదుగానుండుట తెలిసిన యంశమేగదా ?

డానంజేసి యిప్పుడట్టిగ్రంథము లవసరమయ్యెను. కావుననే తక్కుమతములవారి కిట్టిగ్రంథములు ప్రసిద్ధములైయున్నవి.

అయినను శైవుల యాహ్నిక విధానము వెల్లడిలోలేకుండుట శోచనీయము.

కాఁబట్టి దీనిం బ్రచురింప నవసరమను పెద్దల యానతింబట్టి యిది యారంభింపవలసివచ్చెను.

దీనికై ప్రాచీనములగు నాహ్నికములు గొన్ని యార్జింపంబడియెను. అయినను వానియందు చాలకొరతలు కనఁబడుచుండుటచే వాని నన్నిటి ననుసరించియే ప్రకృతకాలాను సారముగా నిది సిద్ధపరుపఁబడియెను.

ఇందగు విధులకు ప్రమాణములను చూడఁదలంచినవారు ధర్మసంగ్రహమునందలి యాహ్నికకాండమును చూడవలయును. ఆగ్రంథము చాలపెద్దదియై వేరుగాఁ బ్రకటింపఁదగియుండుటం జేసి యీప్రతికయందుఁ బ్రకటింపఁబడదయ్యెను.

ఇందగు సకలవిధులును అందు సమగ్రముగా విమర్శింపఁబడి, నిర్ణయింపఁబడియున్నవి.

ఇందగు విధానముగాంచి, యనుష్ఠించి, తన్మూలమగు పరమేశ్వరు నన్నుగ్రహమునకు భాజనులై యిహపరసౌఖ్యములం గాంచుదురు గాక యని పరమేశ్వరుని ప్రార్థించుచున్నాఁడను.

ఇట్లు భవద్విధేయుఁడు.

ముదిగొండ నాగలింగశాస్త్రి.



# నిత్యకర్మానుక్రమణిక.



## ౧. నిదురలేచుట.

ఇంక నైదు గడియలకు సూర్యోదయమగుననఁగా నిదురలేచి, పరమేశ్వరుని ప్రార్థించి ప్రాతస్స్మరణముచేసి, కడచిన దినమున తానుచేసిన పుణ్యపాపములఁదలంచి, పాపకర్మములకు పశ్చాత్తాపమునొంది, నాటి కర్తవ్యము నాలోచించి, శుభవస్తువులఁ జూడవలయు.

## ౨. బహిర్దేశ గమనము.

ఇలు వెడలి, గ్రామబహిర్భాగమునకు జని, మలమూత్రముల విడిచి, మృత్తికాజలములచే శుద్ధిచేసికొనవలయు.

## ౩. దంతధావనము

ఉత్తరేణు మొదలగు వానిపుడకతో పండ్లుతోమికొని, నాలుక గీచికొని, జలముచే ముఖముగడిగికొనవలయు.

## ౪. స్నానము.

మృత్తికను గ్రహించి, నద్యాదులకేగి, సంకల్పముచేసి, శివతీర్థము గావించి, సూక్తపఠనముచేయుచు నందుమునిగి, స్నానాంగ తర్పణములు చేయవలయు.

## ౫. వస్త్రధారణము.

ఆచమనముచేసి, శుభ్రవస్త్రములను ధరింపవలయు.

## ౬. భస్మధారణము.

దర్భాసనము మొదలగు దానియందు గూర్చుండి, యాచమనము చేసి, ఇష్టలింగమునకు మజ్జనము గావించి, భస్మమును గ్రహించి, మంత్రించి ముఖాదిస్థానములయందు ధరింపవలయు.

## ౭. సంధ్యావందనము.

మార్జనముచేసి, అర్ఘ్యమువిడిచి, తర్పణముచేయవలయు.

## ౮. అరుణోదయకాల పూజ.

అరుణోదయకాలమున అవసరార్చనముచేయవలయు.

### ౯. జపము.

గాయత్రిజపించి, సూర్యోపస్థానముచేసి, శ్రీపంచాక్షర మంత్రము జపింపవలయు.

### ౧౦. హోమము.

నిత్యోపాసనము చేయవలయు.

### ౧౧-౧౨. ప్రాతః స్సంగవపూజలు.

ప్రాతఃకాలమునను, సంగవకాలమునను అవసరార్చనములు చేయవలయు.

### ౧౩. మాధ్యాహ్నికస్నానము.

మృత్తికచే స్నానముచేయవలయు.

### ౧౪. స్వాధ్యాయము

బ్రహ్మయజ్ఞమును పితృతర్పణమును జేయవలయు.

### ౧౫. వైశ్వదేవము.

వైశ్వదేవముచేయవలయు.

### ౧౬. మాధ్యాహ్నికపూజ.

అతిథిపూజ, గురుపూజ, మహాపూజయు, చేసి భుజించి యితిహాసాదుల పఠింపవలయు.

### ౧౭. సాయంసంధ్య.

సంధ్యావందనము చేయవలయు.

### ౧౮. సాయంకాలపూజ.

సాయంకాలమున అవసరార్చనము, అగ్న్యుపాసనము వైశ్వదేవము చేయవలయు.

### ౧౯. అర్ధరాత్రపూజ.

తరువాత, రాత్రి ప్రథమయామముననే అర్ధరాత్ర మహాపూజ నారంభించి, ద్వితీయయామమున ముగించి, భుజించి, పురాణేతిహాసదుల పఠింపవలయు.

### ౨౦. పండుకొనుట.

కాలుసేతులు కడిగికొని, నిద్రాస్థానమునకుఁజని, పరమేశ్వరు ప్రార్థించి, మంత్రము [illegible] నిద్రింపవలయు.

శ్రీశివాభ్యాంనమః.

# ఆహ్నికవిధిః



శ్లో॥ సదాశివసమారంభాం శ్రీకంఠారాధ్యమధ్యమాం।
అస్మదాచార్యపర్యంతాం వందే గురుపరంపరాం॥ ౧

శ్లో॥ శివం గురూంశ్చరాన్ నత్వా విమృశ్యనిగమాగమాన్।
శాంభవాదీని సూత్రాణి సమాలోచ్యయథామతి॥ ౨

శ్లో॥ భారద్వాజకులోద్భూత శ్రీమదుద్భటవంశజః।
జ్వాలాంబికాఘోరనాథ దాంపత్యకలితోదయః॥ ౩

శ్లో॥ శ్రీమద్వీరేశ్వరారాధ్య చరణాబ్జమధువ్రతః।
త్రైలింగోనాగలింగాఖ్యోవక్ష్యాహ్నికవిధింపరం॥ ౪

శ్లో॥ ధర్మసంగ్రహ నిర్ణీత సిద్ధాంత పరినిష్ఠితం।
శైవదీక్షావతాం భాస్వదిష్టలింగభృతాం ముదే॥ ౫

## ఉత్థాన ప్రకరణం.

ఉషసి శివశివేతి ప్రబుధ్య, ఇష్టలింగం నేత్రయోః స్పర్శయన్ నేత్రే ఉన్మీల్య, ఉత్థాయ, పాదౌ, పాణీచ, ప్రక్షాళ్యాచమ్య, భస్మోద్ధూళనం కృత్వా, హృత్పద్మే, ద్వాదశాన్తేవా గురుం తదుపదిష్ట మార్గేణ శివంచధ్యాత్వా,

ఇఁక నైదుగడియలకు సూర్యోదయమగుననఁగా శివశివయనుచు మేలుకొని, ఇష్టలింగమును కనుల కద్దుకొనుచు కన్నులు తెరచి, లేచి, కాలుసేతులు కడిగికొని, ఆచమనముచేసి, భస్మోద్ధూళనముచేసికొని, హృదయమునందుగాని, ద్వాదశాంతమునఁగాని గురువు ఉపదేశించినవిధమున శివుని ధ్యానము చేసి,

శ్లో॥ ప్రాత స్స్మరామి పరమేశ్వరవక్త్రపద్మం
ఫాలాక్షకీలి పరిశోషితపంచబాణం।
భస్మత్రిపుండ్రరచితం ఫణికుండలాఢ్యం
కుందేందు చన్దనసుధారసమందహాసం॥ ౧

శ్లో॥ ప్రాత ర్భజామి పరమేశ్వర బాహుదణ్డాన్
ఖట్వాంగశూలహరిణాహిపినాకయుక్తాన్।
గౌరీకపోలకుచరంజిత పత్రరేఖాన్
సౌవర్ణకంకణమణిద్యుతి భాసమానాన్॥ ౨

శ్లో॥ ప్రాత ర్నమామి పరమేశ్వరపాదపద్మం
పద్మోద్భవామరమునీంద్ర మనోనివాసం।
పద్మాక్షనేత్ర సరసీరుహ పూజనీయం
పద్మాంకుశధ్వజ సరోరుహలాంఛనాఢ్యం॥ ౩

శ్లో॥ ప్రాత ర్భజామి శివమేక మనంత మాద్యం
వేదాన్తవేద్య మనఘంపురుషం మహాన్తం।
నామాది భేదరహితం స్థిరమద్వితీయం
షడ్భావశూన్యమతులం మహితంమహేశం॥ ౪

శ్లో॥ ప్రాత స్స్మరామి పరమేశ్వరపుణ్యనామ
శ్రేయః ప్రదం సకలదుఃఖవినాశహేతుం।
సంసారతాప శమనం కలికల్మషఘ్నం
గోకోటిదానఫలదం స్మరణేనపుంసాం॥ ౫

శ్లో॥ శ్రీపంచరత్నాని మహేశ్వరస్య
భక్త్యాపఠే ద్యస్సుగతిః ప్రభాతే।
ఆయుష్య మారోగ్య మశేషభోగాన్
ప్రాప్నోతి కైవల్యపదం దురాపం॥

ఇత్యాది శ్లోకాన్పఠిత్వా, | ఈ మొదలగు శ్లోకములఁజదివి

గతదిన కృతదుష్కర్మభ్యః పశ్చాత్తప్త్వా, ప్రకృతదిన కర్తవ్య మాలోచ్య, మాహేశ్వర చరణం మణ్యాదీంశ్చావలోక్య,

లోగడ దినమునఁ జేసిన పాప కార్యములకు పశ్చాత్తాపము నొంది, నాటి కృత్యము నాలోచించి, మాహేశ్వర చరణమును, మణి మొదలగు వానిని దర్శించి,

శ్లో॥ సముద్రవసనే దేవిపర్వత స్తనమండితే।
విష్ణుపత్ని నమస్తుభ్యం పాదస్పర్శం క్షమస్వమే॥

ఇతి భూమిం సంప్రార్థ్య,

అని భూదేవిని ప్రార్థించి,

బహిర్విహారవిధి.

దండాది సహితో గృహాన్నిర్గత్య, గ్రామాద్బహిర్దేశంగత్వా, నైఋతావనుపయుక్తప్రదేశంగత్వా, మృజ్జలే సన్నిధాప్య, దివా సంధ్యయో రుత్తరాస్యో, రాత్రౌ దక్షిణాభిముఖః ప్రాణబాధాది సమయే యథాసుఖముఖో లింగ పేటికాం శిరసినిధాయ, ఉత్తరీయేణ శిరః ప్రావృత్య, దక్షిణ కర్ణోపవీతీ, పృష్ఠతఃకంఠలంబిత శివ సూత్రయజ్ఞసూత్రయుగళోవా, మౌనీసన్ భూమిం తృణాదిభిరాచ్ఛాద్య, మూత్రపురీషేవిసృజేత్.

దండము గ్రహించి, పాదుకలు తొడిగి కొని, యిలువెడలి, గ్రామము వెలుపట నైఋతి దిశను నిరుప యుక్తమగు చోటికేగి, మృత్తికను, జలమును దగ్గిరనిడికొని పగలు, సందెవేళలను ఉత్తరముఖముగను, రాత్రియందు దక్షిణముఖముగను, ఆపత్సమయములయందు వీలగునట్లును, లింగకాయను శిరమున నిడికొని, ఉత్తరీయము శిరమునకు జుట్టుకొని, కుడిచెవిని యజ్ఞోపవీతమును జుట్టుకొనిగాని, జందెమును, శివసూత్రమును మెడ వెనుక వైపునకు వ్రేలాడవైచిగాని మాటలాడక, నేలమీద తృణాదులనునిచి యందు మూత్రపురీషములు విడువలయు.

## శౌచవిధి.

ఆర్ద్రాం మలకమాత్రయా మృదా జలేనచ పంచవారమపానం సంశోధ్య మృజ్జలై ర్ద్వివారం శేఫస్సంశోధ్య పునర్జలై రేవ యావద్గంధ లేపనివృత్తి సంశోధ్య, శుద్ధ మృత్తికయైకవారం హస్తం ప్రక్షాళ్య, తటాక దేశమాగత్య, అన్య మృజ్జలైర్దశవారం వామకరం విశోధ్య, తతఃకరద్వయం సప్తవారం మృజ్జలైః ప్రక్షాళ్య, పాదౌ ప్రత్యేకంత్రిః ప్రక్షాళ్య,అన్యజలై ర్ద్వాదశ గండూషాన్ వామభాగే కృత్వా ఉపవీతీ ద్విరాచామేత్.

పచ్చి యుసిరికాయయంత మృత్తికచేతను జలముచేతను అయిదు మార్లు గుదమును, రెండుమార్లు పురుష చిహ్నమును గడిగి మఱియు జలముచే గంధలేపములు తొలగువరకు, గడిగికొని శుద్ధ మృత్తికతో నొకమాఱు చేయి గడిగికొని, చెరువుపద్దకుఁ బోయి ఇతరమృత్తికచేతను జలముచేతను పదిసార్లు ఎడమచేతినిగడిగి తరువాత రెండుచేతుల నేడుమార్లును పాదములను ముమ్మారును గడిగి ఇతరజలముచే పండ్రెండుమార్లు పుక్కిలించివైచి జందెము నుపవీతముగా ధరించి రెండుమారు లాచమనము చేయవలయు.

మూత్రమాత్రోత్సర్గేతు పూర్వవదేకవారం శేఫః ప్రక్షాళ్య వామకరంత్రిః, ప్రక్షాళ్య కరద్వయంద్విః ప్రక్షాళ్య, ఏకైకయా మృదాపాదౌ ప్రక్షాళ్య, గండూష చతుష్టయం విధాయాచామేత్.

మూత్రమునుమాత్రము విడిచినప్పుడు ఒక్కమాఱు పురుష చిహ్నమును, ముమ్మాఱు లెడమచేతిని, రెండుమార్లు రెండుచేతులను గడిగికొని, నాలుగుమార్లు పుక్కిలించివైచి, జందెము నుపవీతముగా ధరించి యాచమనము చేయవలయును.

శౌచమేతద్గృహస్థస్య
ద్విగుణం బ్రహ్మచారిణాం
త్రిగుణంతువనస్థానాం
యతీనాంచ చతుర్గుణం॥

ఇది గృహస్థునకు విహితము. దీనికి ద్విగుణముగా బ్రహ్మచారియు, త్రిగుణముగా వనస్థుఁడును చతుర్గుణముగా యతియు నాచరించునది.

దంతధావనవిధి.

ఆయుర్బలం యశోవర్చః ప్రజాః పశువసూనిచ
బ్రహ్మప్రజ్ఞాంచ మేధాంచ త్వంనోదేహి వనస్పతే॥

ఇతి పఠిత్వా అపామార్గౌదుంబరామ్రనింబాద్యుక్తకాష్ఠేషు యథాలాభ మార్ద్రత్వగన్వితమృజుం కనిష్ఠాంగుళ స్థూలం ద్వాదశాంగుళ దైర్ఘ్యం దంతకాష్ఠం సంగృహ్య దంతాన్శోధయిత్వా జిహ్వాలేఖనం విధాయ, ద్వాదశగండూషాన్కృత్వా ముఖం క్షాళయేత్. ప్రతిపత్పర్వ షష్ఠ్యష్టమీనవమ్యేకాదశీ చతుర్దశీ వ్రతోపవాసాదిషు కాష్ఠేనదంతధావనం నకుర్యాత్. దంతకాష్ఠానామలాభే నిషిద్ధదినేషుచ పర్ణైః ప్రదేశినీ వర్జమంగుళీ భిర్వావిదధ్యాత్.

అను మంత్రమును పఠించి, ఉత్తరేణు, అత్తి, మామిడి, వేప, మొదలగు చెట్ల పుడకను చిటికెనవ్రేలి లావుగలిగి, పంౘెండు అంగుళముల పొడవును గలిగి, పై చర్మముతో గూడినదానినిగా గ్రహించి పండ్లుతోమికొని, నాలుక గీచికొని పంౘెండుమార్లు పుక్కిలించివైచి ముఖము గడిగికొనవలయు. పాడ్యమి పూర్ణిమ అమావాస్య షష్ఠి అష్టమి నవమి ఏకాదశి చతుర్దశి వ్రతోపవాసాది దినములు వీనియందు పుడకతో పండ్లు తోమికొనఁగూడదు. పుడక దొరకని సమయమునను, నిషిద్ధ దినములయందును ఆకులు మొదలగు వానితో చూపుడువ్రేలు విడిచి కడమవ్రేళ్ళతో తోమికొనవలయు. అన్నిదినములయందు తప్పక నాలుక గీచికొనవలయు.

## ఆచమనవిధిః

శ్రౌతం స్మార్తం చ పౌరాణ మితిహ్యాచమనం త్రిధా॥

శ్రౌతాచమనము, స్మృత్యాచమనము, పురాణాచమనము అని ఆచమనములు మూడువిధములు.

## శ్రౌతాచమనవిధిః

వామదేవ సంహితోక్తం
కారణోక్తం తథైవచ
ఆరణ్యకోక్తమన్యచ్చ
శ్రౌతముక్తం చతుర్విధం॥
వామదేవసంహితోక్తం యథా.

వామదేవ సంహితోక్తము, కారణాగమోక్తము, ఆరణ్యకోక్తము మున్యుక్తము నని శ్రౌతాచమనము నాలుగు విధములు. దీనికే శ్రుత్యాచమనమనియు పేరుగలదు.

౧ ఓం నమశ్శంభవేచస్వాహా
౨ ఓం మయోభవేచస్వాహా
౩ ఓం నమశ్శంకరాయచస్వాహా
ఇతి త్రిభిః పీత్వా.

ఈ మూడు మంత్రములచే మున్మూడు లాచమనము చేసి (ఆవు చెవివలెనుండు హస్తముతో మినుపగింజ మునుగునంత నీరును బ్రహ్మతీర్థముతో పుచ్చుకొనుట అన్ని యాచమనములయందు సమానము)

సర్వాంగుళ్యగ్రైః
(కుడిచేతి యన్నివ్రేళ్ళకొనలచే)

౪ మయస్కరాయచ (ఊర్ధ్వోష్ఠే) — అని పై పెదవియందును
౫ నమశ్శివాయచ (అధరోష్ఠే) — అని క్రింది పెదవియందును
౬ శివతరాయచ (చుబుకే) — అని గడ్డమునందును
స్పృశేత్. తాకవలయును.

అంగుష్ఠతర్జనీభ్యాం
(బొటనవ్రేలు చూపుడువ్రేలు ఈ రెండు వ్రేళ్ళచేతను)

౭ భవోద్భవాయనమః (దక్షిణ నాసికాయాం) — అని కుడి ముక్కునందును

౮ వామదేవాయనమః (వామ—అని యెడమముక్కునందును తాక
నాసికాయాంచ) స్పృశేత్ వలయును
అంగుష్ఠానామికాభ్యాం—(అంగుష్ఠముఅనామిక ఈ రెండు వ్రేళ్లతో)
౯ జ్యేష్ఠాయనమః (దక్షిణనేత్రే)—అని కుడికన్నును
౧౦ శ్రేష్ఠాయనమః (వామనేత్రే)—అని యెడమకన్నును
౧౧ రుద్రాయనమః (దక్షిణకర్ణే)—అని కుడిచెవిని
౧౨ కాలాయనమః (వామకర్ణే)—అని యెడమ చెవిని
కనిష్ఠాంగుష్ఠాభ్యాం—(చిటికెనవ్రేలు బొటనవ్రేలు ఈ రెండువ్రేళ్ళతో
౧౩ కలవికరణాయనమః(నాభౌ)స్పృశేత్—అనిబొడ్డును తాకవలయు॰
కరతలేన—(అరచేతితో)
౧౪ బలవికరణాయనమః(కుక్షౌ)స్పృశేత్—అనికడుపును తాకవలయును
అంగుళ్యగ్రైః—(అన్నివ్రేళ్ళకొనలచే)
౧౫ బలాయనమః (శిరసి)—అని శిరమును
౧౬ బలప్రమథనాయనమః (దక్షిణభుజే)—అని కుడిచేతిని
౧౭ సర్వభూతదమనాయనమః (వామభుజే)—అని యెడమచేతిని
౧౮ మనోన్మనాయనమః (వక్షసి)—అని రొమ్మునందును
౧౯ నమస్తే అస్తు భగవన్విశ్వేశ్వరా—అని (ఎడమచేయిఅరచేతితో)
యనమః (వామహస్తతలేన కుడిచేయి అరచేతిని
దక్షిణహస్తతలం)
౨౦ మహాదేవాయనమః(దక్షిణహస్తత—అని కుడిచేయిఅరచేతితో
లేన వామహస్తతలం) యెడమచేయి అరచేతిని
తాకవలయు
దక్షిణహస్తతలేన—(కుడిచేయి అరచేతితో)
౨౧ త్రియంబకాయనమః(దక్షిణపాదే)—అని కుడిపాదమునందును
౨౨ త్రిపురాంతకాయనమః (వామపాదే)—అని యెడమ పాదము
నందును

౨౩ త్రికాగ్ని కాలాయనమః (దక్షిణపార్శ్వే)—అని కుడిపార్శ్వము నందును

౨౪ కాలాగ్నిరుద్రాయనమః(వామపార్శ్వే)—అని యెడమపార్శ్వము నందును

౨౫ నీలకంఠాయనమః (కంఠే)—అని మెడయందును

౨౬ సర్వేశ్వరాయనమః (దక్షిణగండే)—అని కుడిచెక్కిలియందును

౨౭ సదాశివాయనమః(వామగండే)—అని యెడమచెక్కిలియందును.

౨౮ శ్రీమహాదేవాయనమః(ముఖే)—అని ముఖమునందును తాక

స్పృశేత్ — వలయు. ఈ యాచమనము సంధ్యా వందనాదుల యందును శివ పూజాదులయందును నుప యోగింపఁబడును.

౨ కారణాగమోక్తం యథా—కారణాగమోక్త మెట్లనిన

౧ ఓంహ్రీం ఆత్మతత్వాయస్వాహా—
౨ ఓంహ్రీం విద్యాతత్వాయస్వాహా—
3 ఓంహ్రీం శివ తత్వాయస్వాహా—

ఈ మూడు మంత్రములచే ముమ్మారుఆచమనముచేయ వలయు

శేషాణ్యంగాని తూష్ణీ—
మంగుళ్యగ్రైస్సంస్పృశేత్—

(వ్రేలికొనలచే) తక్కునంగముల నమంత్రకముగనే స్పృశింపవలయు ఈ యాచమనవిధి ఆబ్ధికాదుల యందు వినియోగింపఁబడును.

3 ఆరణ్యకోక్తంయథా—ఆరణ్యక శ్రుతియందుఁ జెప్పఁబడిన శ్రుత్యాచమనము ఎట్లనిన

త్రిరాచామేత్—ముమ్మారు లాచమనయు చేయవలయు.

ద్విః పరిమృజ్య—నీరిలోముంచిన యంగుష్ఠముతో రెండు పెదవులను రెండుమారులుతాకి

సకృదుపస్పృశ్య—మరల నొకసారి పెదవినితాకి

(సవ్యంపాణింపాదౌప్రోక్షతి)—ఎడమ చేతిమీదను రెండు పాదములమీదను ప్రోక్షించి

శిరశ్చక్షుషీనాసికే శ్రోత్రే—కరాగ్రముతో శిరమును, అంగుష్ఠానామికలతో కండ్లను, అంగుష్ఠతర్జనులతో రెండు ముక్కులను అంగుష్ఠానామికలతో చెవులను కరతలముతో రొమ్మును తాకవలయు.

హృదయమాలభ్య
ఇతి తై. ఆ. ౨. ౧౧.

ఈ యాచమనము బ్రహ్మయజ్ఞము చేయునప్పుడు ఆచరింపఁబడుచున్నది.

మున్యుక్తశ్రౌతాచమనం యథా—మున్యుక్తమగు శ్రుత్యాచమనము ఎట్లనిన
(దేవ్యాః పాదైస్త్రిభిఃపీత్వా)

౧ ఓంతత్సవితుర్వరేణ్యగ్గ్ స్వాహా
౨ భర్గోదేవస్యధీమహి స్వాహా
3 ధియోయోనఃప్రచోదయాత్స్వాహా
(అబ్లింగైర్నవభి స్పృశేత్)

ఈ మూడుమంత్రములచేతను ముమ్మాఱు లాచమనము చేయవలయు

౪ ఆపోహిష్ఠామయోభువః
౫ తానఊర్జేదధాతన

ఈ మంత్రములు జదువుచు చేతులు గడిగికొని

౬ మహేరణాయచక్షసే
౭ యోవశ్శివతమోరసః } ఈ మంత్రముజదువుచు అంగుష్ఠముతో నీరు గ్రహించి దానితో పెదవుల దుడుచికొనవలయు

౮ తస్యభాజయతేహనః
౯ ఉశతీరివమాతరః } అని రెండుమాఱులు శిరమున జలము చల్లుకొని

౧౦ తస్మాఅరంగమామవః— అని కుడిచేతితో నీరు తీసికొని యెడమచేతిమీద ప్రోక్షింపవలయు.

౧౧ యస్యక్షయాయజిన్వధ—అని పాదములమీద ప్రోక్షించుకొని

౧౨ ఆపోజనయథాచనః— అని శిరమున ప్రోక్షించుకొనవలయు
(సప్త వ్యాహృతి సంయుక్తా
గాయత్రీత్రిపదాశిరః)

౧౩ ఓం భూః—అని అన్నివ్రేళ్ళతో గడ్డముతాకి

౧౪ ఓం భువః
౧౫ ఓగ్ం సువః } అని అంగుష్ఠతర్జనులతో రెండు ముక్కులను తాకి

౧౬ ఓం మహః
౧౭ ఓం జనః } అని యంగుష్ఠానామికలతో రెండుకన్నులనుదాకి

౧౮ ఓం తపః
౧౯ ఓగ్ం సత్యం } అని యంగుష్ఠా నామికలతో రెండు చెవులను దాకి

౨౦ ఓం తత్సవితుర్వరేణ్యం—అని యంగుష్ఠకనిష్ఠికలతో నాభిని తాకి

౨౧ భర్గోదేవస్యధీమహి—అని కరతలముతో రొమ్మును దాకి

౨౨ ధియోయోనః ప్రచోదయాత్—అని కరాగ్రమునశిరసునుదాకి
౨౩ ఓమాపోజ్యోతీరసోమృతం—అని ముకుళహస్తముతో కుడిచేతిని
౨౪ బ్రహ్మభూర్భువస్సువరోం—అని యెడమచేతిని దాకవలయు.

ఈ యాచమనవిధి గాయత్రీ జపమునకు పూర్వమునందు పరము నందు వినియోగింపఁబడును.

## స్మృత్యాచమనము.

సూత్రోదితంస్మృతి ప్రోక్తం స్మార్త-మాచమనంద్విథా. — ఆపస్తంబ సూత్రమునఁ జెప్పఁబడినదియు శౌనకస్మృతియందు జెప్పఁబడినదియునని స్మృత్యాచ మనము రెండువిధములు.

ఆపస్తంబసూత్రోదితం యథా—సూత్రోక్తమెట్లనిన

౧ తిష్ఠన్నాచామేత్ ప్రహ్వోవా — జలమునందుదక్క తక్కచోట నిలుచుండి గాని వంగికాని యాచమనము చేయఁగూడదు.

౨ ఆసీనస్త్రిరాచామేత్ హృదయంగమాభిరద్భిః — కూర్చుండి హృదయమువఱకు పోఫునంత జలముతో "స్వాహా" యనుచు ముమ్మారు లాచమనము చేయవలయు

౩ త్రిరోష్ఠౌ పరిమృజేత్ (ద్విరిత్యేకే) — తరువాత అంగుష్ఠమూలమున ముమ్మారు పెదవులు తుడుచుకొనవలయు. రెండుమారులని కొందఱుచెప్పుదురు.

౪ సకృదుపస్పృశేత్ (ద్విరిత్యేకే) — తరువాత తర్జనిమధ్యమా నామికలను మూడు వేళ్ళతో పెదవుల నొకసారి తాకవలయు. రెండుసార్లు తాకవలయునని కొందఱందురు.

౫ దక్షిణేనపాణినా సవ్యం ప్రోక్ష్య పాదౌ శిరశ్చ | దక్షిణహస్తముచేత నెడమచేతిమీదను పాదముల మీదను శిరము మీదను ప్రోక్షించి

౬ ఇంద్రియాణ్యుపస్పృశేత్ చక్షుషీ నాసికే శ్రోత్రేచ | కన్నులను ముక్కులను చెవులను తాకవలయు

౭ అథాప ఉపస్పృశేత్—అనంతరము జలముతాకవలయు.

స్మృతిప్రోక్తం యథా—శౌనకస్మృతియందు జెప్పఁబడిన స్మృత్యాచమన మెట్లనిన,

౧ త్రిః పిబేద్బ్రహ్మతీర్థతః—బ్రహ్మతీర్థముతో స్వాహాఅని ముమ్మాఱు లాచమనము చేయవలయు.

౨ తతః ప్రక్షాళ్యహస్తౌచ—తరువాత చేతులు గడిగికొని

౩ సంకుచ్యాంగుష్ఠమూలేన ద్విర్మార్జ్య—వ్రేళ్ళుముడిచి పెదవులను ముమ్మాఱు తుడువవలయు

౪ సంహతాంగుళిమూలైశ్చ—కూర్చఁబడిన వ్రేళ్ళతో నోరు ముమ్మాఱు తుడుచుకొనవలయు
త్రిః ప్రమృజ్యాత్తతోముఖం |

౫ ప్రక్షాళ్యహస్తౌ—చేతులు గడిగికొని

౬ చాభ్యుక్ష్యపాదశీర్షౌ తథైవచ—పాదములమీదను శిరముమీదను నీరుజల్లుకొని

౭ మధ్యమాంగుళి పృష్ఠైశ్చ—నడిమివ్రేళ్ళ వెనుకభాగముతో నాసికా
త్రిః స్పృశేత్ఘ్రాణమూలకం | మూలమును ముమ్మాఱుతాకి

౮ హస్తౌ ప్రక్షాళ్య—చేతులుగడిగికొని

౯ సంస్పృశ్యాఘ్రాణాది—ముక్కు మొదలగువానిని తాకవలయు.
ద్వయోశ్శః పృథక్ | ఎట్లనిన,

౧౦ అంగుష్ఠేనప్రదేశిన్యా—అంగుష్ఠతర్జనులతో ముక్కులను దాకవలయు
ఘ్రాణౌ పశ్చాదుపస్పృశేత్ |

శ్రీ

శివాయగురవేనమః

# శైవసిద్ధాంతదీపికా.

---

అవర్ణ విగ్రహం దేవం వర్ణవిగ్రహావర్జితం ।
వర్ణవిగ్రహావక్తారం నమామిస్తౌమి సంశ్రయే ॥
చరాచరాత్మకం విశ్వమోతం ప్రోతంచ సర్వతః ।
పశుపాశ భిదాయేన సమస్తస్మై పురద్విషే ॥

ఇహతావ జ్జాతి కులాద్యభిమానాస్పదమిదం స్థూలదేహం పృథివ్యప్తేజో వాయ్వాకాశానాం సమవాయః । తత్రప్రాక్తన పుణ్య పాపానుకూలం బ్రాహ్మణాది వర్ణాంశ్చ రూపశ్రియా వింద్రియపాటవమపి బిభ్రతో నియతాయుషో నియతభోగాశ్చ భవన్తి భోక్తారఆత్మానః

---

ఈ ప్రపంచమునందు జాత్యభిమానము, కులాభిమానము మొదలగు వానికి నునికిపట్టైన యీ స్థూలదేహము భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశము నను పంచభూతములయొక్క సమవాయము.

అందు భోక్తలగుజీవులు తాము పూర్వజన్మమునఁజేసిన పుణ్యపాపములనుబట్టి బ్రాహ్మణాదివర్ణములను, రూపమును, సిరిని, ఇంద్రియపాటవమును వహించి నియతమగు నాయువు, నియతములగు భోగములను గలవారలై యున్నారు. నియతమనఁగా, పూర్వకర్మమునకు దగినంతయని యర్థము.

సృష్టి మొదలుకొని వచ్చియున్న పృథివీతత్త్వము మొదలుకొని కలాతత్త్వమువఱకుగల ముప్పది తత్త్వములు నీజీవుల భోగమునకు పరివారమై యున్నవి.

ఏతేషాం భోగపరికరీ భూతాని సృష్టిమారభ్యానీతాని పృథివీతత్త్వమారభ్య కలాతత్త్వాంతాని త్రింశత్తత్త్వాని। ఆత్మన్యాత్మని పృథక్ పృథక్ అత్యంతసూక్ష్మస్య కర్మణాప్రాప్తస్య ఆయుషోన్తే పూర్వశరీరం విహాయ తృణజలూకావ ద్వాశయిష్యన్న్యపరం శరీరం। తేనకృతానాం పుణ్యాపాపానా మాశ్రయ ఆత్మా శరీరాదన్యః జ్ఞానక్రియారూపః నిత్యః అమూర్తః వ్యాపకశ్చ ఆణవ కార్మమాయీయ బైందవరోధ శక్త్యాత్మక పాశపంచకబద్ధ స్సంసారీపురుషః।

అస్యభోగ పరికరీభూత సూక్ష్మశరీర భూతతత్త్వాని కానీతిచేత్ పృథివ్యప్తేజోవాయ్వాకాశ తత్త్వానీతి కథితానీమాని భూతానిపంచ

---

ఈ జీవులు కర్మచేప్రాప్తమగు నాయువు తుదముట్టగా పూర్వశరీరము విడిచిపెట్టి తృణజలూకా న్యాయమున వేరొకశరీరము నాశ్రయించుచుందురు.

తృణజలూక యనఁగా, గడ్డిజలగ. ఈ పురుగు ఒక గడ్డిపరక మీదనుండి పొడవుగాసాగి వేరొక గడ్డిపరకను బట్టుకొని తానున్న గడ్డిపరక వదలిపెట్టును. అటులే జీవుండును వాసనారూపమగు వేరొక శరీరమును గ్రహించి పూర్వశరీరమును విడుచునని గ్రహించునది.

ఆశరీరముచేఁ జేయఁబడు పుణ్యాపాపములు జీవుని నాశ్రయించి యుండును.

ఈ జీవుఁడు శరీరముకంటె భిన్నుఁడు, జ్ఞానక్రియా రూపుఁడు, నిత్యుఁడు, అమూర్తుఁడు, వ్యాపకుఁడునునై యుండి ఆణవము, కార్మికము, మాయీయము, బైందవము, రోధశక్తి అను నైదు పాశములచే బద్ధుఁడై సంసారియు, పురుషుఁడునని చెప్పఁబడు చుండును.

ఈజీవునకు భోగసాధనమైన సూక్ష్మశరీరముయొక్క తత్త్వము లెవ్వియన, భూమి, జలము, అగ్ని, వాయువు, ఆకాశము నను మహాభూతములైదు.

ఏతేషాంకారణం తన్మాత్రపంచకం కిమితిచేత్ గంధతత్త్వం రసతత్త్వం రూపతత్త్వం స్పర్శతత్త్వం శబ్దతత్త్వం చేతి ఏతద్దశకం కార్యమిత్యుచ్యతే వాక్పాణి పాదపాయూపస్థానీతి పంచకర్మేంద్రియాణి। ఏతేషాంగుణా వచన గమనాదాన విసర్గానందాః। శ్రోత్రత్వక్చక్షుర్జిహ్వా ఘ్రాణానీతి పంచజ్ఞానేంద్రియాణి ఏతేషాంగుణాః శబ్దస్పర్శ రూపరసగంధాః। ఏతస్యవాగాది పంచకస్య శ్రోత్రాదిపంచకస్యచ కరణమిత్యభిహితం। మనశ్చాహంకారశ్చ బుద్ధిశ్చేతి త్రితయమేతత్ శ్రోత్రాందీంద్రియ పదస్మాచ్ఛరీరాద్బహిర్నిర్గత్య వ్యాపారమకృత్వాఽస్య శరీరస్యాంతరవకాశే స్థిత్వాక్రియాప్రవర్తకత్వాత్ అంతఃకరణ మిత్యేతేషాంత్రయా

---

ఈ పంచభూతములకు కారణములైన తన్మాత్రలెవ్వియన,

గంధతత్త్వము, రసతత్త్వము, రూపతత్త్వము, స్పర్శతత్త్వము, శబ్దతత్త్వము ననునవియగును. ఈపదితత్త్వములకు కార్యమనిపేరు. వాక్కు, చేతులు, పాదములు, గుదము, ఉపస్థ అనునైదును కర్మేంద్రియములు. పలుకుట, గ్రహించుట, నడచుట, మలము విడుచుట, ఆనందము ననునవి వరుసగా కర్మేంద్రియములయొక్క గుణములు.

చెవి, చర్మము, కన్ను, నాలుక, ముక్కు అనునైదును జ్ఞానేంద్రియములు, శబ్దము, స్పర్శము, రూపము, రసము, గంధము ననునవి వరుసగా జ్ఞానేంద్రియ గుణములు.

కర్మేంద్రియములు, జ్ఞానేంద్రియములు నగు పదింటికి కరణములని పేరు.

మనస్సు, అహంకారము, బుద్ధి అను నీమూఁడింటికి నంతఃకరణమనిపేరు. వీనికీపేరేల కలిగెననఁగా,

ఇవి శ్రోత్రాదీంద్రియముల వోలె నీశరీరమునుండి వెలుపలకుఁబోయి వ్యాపారముచేయక యీశరీరములోనేయుండి కార్యముచేయుచుండునవి గావున వీనికి అంతఃకరణమని పేరు కలిగెను.

ణాం నామ। అర్థానాంసంకల్పనంచ శ్రోత్రాదీంద్రియాణాం బాహ్య విషయేషు ప్రవర్తనంచ మనసోవృత్తిః। అభిమానకల్పనంచ ప్రాణా దివాయూనాం ప్రేరణంచ అహంకారవృత్తిః। అధ్యవసాయో బుద్ధే ర్వృత్తిః। ఏతద్రజతమేవ నశుక్తిరితి నిశ్చయోఽధ్యవసాయ ఇతి। పూర్వముక్తాని త్రయోవింశతితత్త్వాని। ఏతేష్వధ్యవసాయ కారణ భూతాద్బుద్ధి తత్త్వాత్ సాత్త్విక రాజసతామస భేదేన భిన్నోఽహం కారో జాయతే. అత్రసాత్వికాహంకారా న్మనశ్చ శ్రోత్రాది పంచ జ్ఞానేంద్రియాణిచ జాయన్తే. అత్రతామ సాహంకారాద్గంధాది తన్మాత్ర కం జాతం। ఏతస్మాత్తన్మాత్ర పంచకాద్భూతాని పంచజాతాని। ధారణాచ సమూహీకరణంచ దాహకత్వంచ అవయవ ఘటన కర ణంచ ఇతరభూత చతుష్టయస్యావకాశ దానంచ పంచభూతానాం

---

వీనిలో కార్యములను సంకల్పించుటయు, ఇంద్రియములను బాహ్యవిషయములమీఁది కనుపుటయు మనస్సుయొక్క వ్యాపారము.

అభిమానమును కల్పించుటయు, ప్రాణాదివాయువులను ప్రేరణ చేయుటయు అహంకారముయొక్క వ్యాపారము.

వెండినిఁజూచి యిది వెండియా? లేక ముత్యపుచిప్పయా అని సంశయము కలిగినప్పుడు ఇది వెండియెగాని ముత్యపుచిప్పగాదు అని నిశ్చయించుట బుద్ధియొక్క వ్యాపారము.

ఇట్లు భూమి, నీరు, అగ్ని, వాయువు, ఆకాశమునను మహా భూతములైదు. గంధము, రసము, రూపము, స్పర్శము శబ్దమునను తన్మాత్రములైదు.

వాక్కు, చేతులు, పాదములు, గుదము, ఉపస్థ అను కర్మేంద్రి యములైదు.

చెవి, చర్మము, కన్ను, నాలుక, ముక్కు అను జ్ఞానేంద్రియములైదు

వృత్తయః | అత్రపృథివ్యాః శబ్దస్పర్శ రూపరసాస్సామాన్యగుణాః | గంధస్త్వసామాన్యగుణః | అపాం శబ్దస్పర్శరూపాణి సామాన్యగుణాః రసస్త్వసామాన్యగుణః | తేజసః శబ్దస్పర్శౌ సామాన్యగుణౌ రూపం చాసామాన్యగుణః | వాయోశ్శబ్ద స్సామాన్యగుణః స్పర్శస్త్వసామాన్యగుణః | ఆకాశస్యశబ్ద ఏక ఏవగుణః | అయంశబ్దః ప్రతిధ్వనిర్వర్ణాత్మకోన భవతి | ద్వావింశతేః పరస్య బుద్ధితత్వస్యకారణం గుణతత్వం | ఏతచ్చ సత్వమితిచ రజఇతిచ తమఇతిచాభిహితం | త్రిధాభూయ క్రమేణ సుఖదుఃఖ మోహానాంచ కారణం భవతి | అస్యగుణతత్వస్య కారణం ప్రకృతితత్వం | గుణతత్వం చతుర్వింశతితత్వం ప్రకృతితత్వం పంచవింశతితత్వం ఏతస్మిన్నుభయస్మిన్నపి తత్త్వే ప్రకృతితత్వస్యకార్యం గుణతత్వమితి ప్రతిపాదితం | గుణతత్వస్యకార్యం సుఖదుఃఖ మోహా

---

మనస్సు, అహంకారము, బుద్ధి అను సంతఃకరణములు మూడు నుచేరి యిరువదిమూడు తత్త్వములయ్యెను.

వీనిలో బుద్ధితత్వమువల్లనుండి సాత్వికాహంకారము, రాజసాహంకారము, తామసాహంకారము నని మూడహంకారములుగలిగెను.

ఇందు, సాత్వికాహంకారము వల్లనుండి మనస్సు జ్ఞానేంద్రియములైదును కలిగెను.

రాజసాహంకారమువల్లనుండి కర్మేంద్రియములు నైదును పుట్టెను. తామసాహంకారము వలన గంధము మొదలగు తన్మాత్రలైదును పుట్టెను.

గంధము మొదలగు తన్మాత్రలైదింటివలనను భూమిమొదలగు మహాభూతము లైదును బుట్టెను.

ఈమహాభూతములలో ధరించుట భూమియొక్క వ్యాపారము. కలుపుట జలముయొక్క వ్యాపారము. కాల్చుట అగ్నియొక్క వ్యాపారము. అవకాశములను కూర్చుట గాలియొక్క వ్యాపారము. తక్క,

హేతుత్వంచ స్వవ్యతిరిక్తాత్వాగ్బుధ్యాది త్రయో వింశతి తత్వానాం క్రమేణ కారణంచ. పృథివీతత్వమారభ్య ప్రకృతితత్వాంత పంచవింశతేః అశుద్ధాధ్వేతినామ ॥

ఇత ఊర్ధ్వం రాగతత్వం। అస్యవృత్తిః ప్రకృతి జాతవస్తూనా మాత్మనే ప్రరోచనం। అతఊర్ధ్వం నియతితత్వం అస్యవృత్తిః ఆత్మనః స్వేనస్వేనైవ కృతాని కర్మాణి ఆత్మనైవభోక్తవ్యా నీతినియమనం। ఇత ఊర్ధ్వం కాలతత్వం. అస్యవృత్తిః దీర్ఘకాలం భుజ్క్తే స్వల్పకాలం భుజ్క్తే ఇతి పురుషస్య భోగపరిచ్ఛేదః। అతఃపరం విద్యాతత్వం అస్య వృత్తిః విషయోపరక్తాంబుద్ధిం పురుషే గృహ్ణాతీతి కరణభూతత్వం। అస్మాత్పరం కలాతత్వం అస్యవృత్తిః ఆత్మనోఽనాదిభూతత్వామకాలికా వత్సహజమలశక్తే రేకదేశమపసార్య ఆత్మస్వరూపస్య ప్రకాశనం।

---

నాలుగు భూతములకు నవకాశమునిచ్చుట ఆకాశముయొక్క వ్యాపారము.

ఇందు, భూమికి శబ్దము, స్పర్శము, రూపము, రసము అను నాలుగు సామాన్యగుణములు. గంధముమాత్రము అసామాన్యగుణము.

(సామాన్యమనగా తక్కినవాటికి గూడ నుండునది యనియు అసామాన్యమనగా దీనికిమాత్రమే యుండునదియనియు నర్థము.)

జలమునకు శబ్దము, స్పర్శము, రూపముననుమూడును సామాన్యగుణములు. రసముమాత్రము అసామాన్యగుణము.

అగ్నికి శబ్దము, స్పర్శము అను రెండును సామాన్యగుణములు. రూపముమాత్రము అసామాన్యగుణము.

గాలికి శబ్దము సామాన్యగుణము, స్పర్శముమాత్రము అసామాన్యగుణము.

ఆకాశమునకు శబ్దము ఒక్కటేగుణము. ఇది ప్రతిధ్వని రూపమైనది గాని, వర్ణరూపమైనది కానేరదు.

అన్యకారణం మాయాతత్వం. పూర్వోక్త ప్రకృతితత్వ రాగతత్వ విద్యాతత్త్వానా ముత్పత్తిః కలాతత్త్వే। నియతికాల కలాతత్త్వానా ముత్పత్తిర్మాయాతత్త్వే। కలాతత్వ విద్యాతత్వ కాలతత్వ నియతితత్త్వ రాగతత్త్వాని పంచకంచుక మిత్యుచ్యతే. ఏతేనావృతస్య బోధ్యాత్మనః పుంస్త్వమితి మలస్య సద్భావాత్పురుషతత్వమితి వ్యపదేశః। రాగతత్వ మారభ్యకలా తత్వాంతాని పంచతత్త్వాని మిశ్రాధ్వేత్యుచ్యన్తే॥

ఏతాన్యేకత్రింశత్తత్త్వాని ఆత్మన్యాత్మని పార్థక్యేన సూక్ష్మదేహానిభవన్తి। ఏతేషాం కార్యాణాం భువనశరీరాణామాశ్రయిణాం

---

ఇట్లీ యిరువదిరెండు తత్త్వములకుపరమైనది బుద్ధితత్త్వము.ఇరువది మూడవదియగు బుద్ధితత్త్వమునకు గుణతత్త్వము కారణమగును.

ఈ గుణతత్త్వము సత్త్వము, రజస్సు, తమస్సు అని మూడువిధములు. ఇందు సత్త్వముసుఖమునకు, రజస్సు దుఃఖమునకు, తమస్సు మోహమునకును కారణమగును. మఱియునిది బుద్ధి మొదలగు నిరువది మూడు తత్త్వములకును క్రమముగా కారణమగును.

ఇట్లు ఇరువదినాల్గవదియగు గుణతత్త్వమునకు ప్రకృతితత్త్వము కారణమగును.

కావున ప్రకృతితత్త్వము ఇరువదియైదవది యగును.

ఈ విధమున భూమి మొదలుకొని ప్రకృతివఱకుగల యిరువదియైదు తత్త్వములకు అశుద్ధాధ్వ అనిపేరు.

దీనికిపైన రాగతత్త్వముగలదు.

ప్రకృతివలన గలిగిన వస్తువులను జీవునకురుచింపఁజేయుట రాగతత్త్వముయొక్క పని.

దీనికిపైన నియతి తత్త్వము కలదు.

ఏజీవుఁడు చేసిన కర్మములయొక్క ఫలము నాజీవుఁడే యనుభవింపవలయునని నియమించుట నియతితత్త్వముయొక్క పని.

భువనానా మాశ్రయాణాం సర్వాత్మనాం సాధారణాని త్రింశత్తత్త్వాని. ఏతేషాం సర్వేషాం కారణ మశుద్ధమాయాతత్వం । ఇదం మాయా తత్వం నిత్యం వ్యాపకం సమస్తాత్మకర్మసంబద్ధం । స్వవృత్తిద్వారేణ జ్ఞానక్రియాప్రకాశీభవదపి మోహకం । ఇతః పరం ద్వాత్రింశకం విద్యా తత్వం । ఇతః పరం త్రయస్త్రింశక మీశ్వరతత్వం । అస్మిన్ శుద్ధ విద్యాతత్త్వే సప్తకోటి మహామంత్రాః । శ్రీమత్కామికాద్యష్టా వింశతి సంహితాశ్చ నంద్యాదయోఽష్టౌ గణేశ్వరాశ్చ సిద్ధాన్తశాస్త్రేణ పూజ్యమానాః ఇన్ద్రాది లోకపాలాశ్చ ఏతేషామాయుధాని వజ్రా

---

దీనికిపైన కాలతత్త్వముకలదు. చాలసేపనుభవించుచున్నాఁడు. కొంచెముసేపనుభవించుచున్నాడు. అని జీవుని భోగమునకు తెంపుగలి గించుట కాలతత్త్వముయొక్కపని.

దీనికిపైన విద్యాతత్త్వము గలదు. బుద్ధియందు విషయాను రాగము గలిగెనని మొదలుగా జీవునకు దెలుపుట విద్యాతత్త్వము యొక్కపని.

ఇద్దానికిపైన కలాతత్త్వముగలదు. రాగియందు చిలుమువోలె జీవునియందనాదిసిద్ధమైయున్న యాణవమలమునందగు నొకభాగమును తొలగించి యాత్మస్వరూపమును దెలుపుట కలాతత్త్వము యొక్కపని.

ఈ కలాతత్త్వమునకు మాయాతత్త్వము కారణమగును.

లోగడఁ జెప్పఁబడిన ప్రకృతితత్త్వము, రాగతత్త్వము, విద్యా తత్త్వము అనునివి కలాతత్త్వమునఁ బుట్టుచున్నవి.

నియతి, కాలము, కల అను మూడుతత్త్వములు మాయాతత్త్వ మునఁ బుట్టుచున్నవి.

కల, విద్య, కాలము, నియతి, రాగము అను నైదుతత్త్వములకు పంచ కంచుకములని పేరు. ఇవియె జీవుని నావరించి బంధించుచున్నవి. రాగతత్త్వము మొదలుకొని కలాతత్త్వముదనుకనున్న యైదు తత్త్వము లకు మిశ్రాధ్వయని పేరు.

